వీరభద్రరావు, చిలుకూరి, 1872-1939

# ఆంధ్రుల చరిత్రము

చెన్నపురి, 1912

Record no. 584

Vīrabhadrarāvu, Cilukūri, 1872-1939

Āṃdhrula caritramu

Cennapuri, 1912

Record no. 584

**SUNDARAYYA VIGNANA KENDRAM**
1-8-1/B/25/A, Bagh Lingampalli
Hyderabad – 500 044, Andhra Pradesh, India

## Bibliographic Record Target

వీరభద్రరావు, చిలుకూరి, 1872-1939.

ఆంధ్రుల చరిత్రము : మధ్యయుగము / చిలుకూరి వీరభద్రరావు పంతులుగారిచే రచియింపఁబడినది.- 1. కూర్పు.- చెన్నపురి : ఆనంద ముద్రాక్షరశాల, 1912.

2 volumes. ;17 cm.

Record no. 584

Vīrabhadrarāvu, Cilukūri, 1872-1939.

Āṃdhrula caritramu : madhyayugamu / Cilukūri Vīrabhadrarāvu pantulugāricē raciyimpam̐baḍinadi.- 1. kūrpu.- Cennapuri : Ānanda Mudrākṣaraśāla, 1912.

2 volumes. ;17 cm.

Record no. 584

35 mm microfilm

Image placement: IA (IIA) IB IIB    Date filming began:



చిలుకూరి - వీరభద్రరావు.

విజ్ఞానచంద్రికాగ్రంథమాల ౮.

# ఆంధ్రుల చరిత్రము.

## ప్రథమ భాగము.

### పూర్వయుగము

---

ఇయ్యది

చిలుకూరి వీరభద్రరావుగారిచే రచియింపఁబడినది.



మొదటి కూర్పు.

చెన్నపురి:

ఆనంద ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె.

**1910.**

*Registered Copyright.*

వెల రు. ౧-౪-౦.



# Royal Patrons.

The Hon. The Maharaja of Bobbili, K.C.I.E.,

The Raja of Pithapuram,

The Raja of Munagala.

## రాజపోషకులు.

ఆనరెబల్ బొబ్బిలి మహారాజాగారు,
కే. సి. ఐ. ఇ.

శ్రీ. పిఠాపురము రాజాగారు.

శ్రీ. మునగాల రాజాగారు.

# సంపాదకీయభూమిక.

భరతఖండము యొక్క విశ్వాసార్హమైనట్టియు, సవిస్తరమైనట్టియు, చరిత్ర ప్రకటింపవలయునని విజ్ఞానచంద్రికామండలి వారు దీక్షవహించియున్నారను సంగతి యందరికిని తెలిసిన విషయమే, కాని భరతఖండ చరిత్రము సంగ్రహముగ హిందూదేశ కథాసంగ్రహ మను గ్రంథమూలమునఁ బ్రకటించినంతమాత్రమున సంతుష్టిఁజెందక, ఈ భరతఖండమందలి యొక్కొక దేశ చరిత్రమును, విపులముగ వ్రాయించి ప్రకటింపవలయునని మండలి వారు యత్నించుచున్నవారు. ఆంధ్ర దేశచరిత్రము, కళింగదేశ చరిత్రము, బంగాళాదేశ చరిత్రము, గుజరాతు దేశ చరిత్రము మహారాష్ట్ర దేశ చరిత్రము మొదలైన ఈఖండాంతర్గతములైన యన్ని దేశముల చరిత్రము తెలుఁగువారికిఁ దెలియుట యావశ్యకము. అందు ఆంధ్రులకు ఆంధ్ర దేశచరిత్ర మత్యంతావశ్యకము గదా.

* * *

ఈ యాంధ్ర దేశచరిత్రమాహాత్మ్యమును గుఱించి గ్రంథకర్తగారే పీఠికయందు వివరముగ వ్రాసియున్నారు. కావున నేనధికము వ్రాయ నవసరము లేదు. కాని యొక్క విషయమును గుఱించి యిచ్చటఁ గొంచెము వ్రాయవలసియున్నది. ఆంధ్రులు మిక్కిలిపురాతన కాలమున వైభవము లనుభవించిరి. అయినఁ జరిత్రజ్ఞానము లేనివారు కొందఱు మొదటనుండియు నాంధ్రులు వైభవ శూన్యులేయని భ్రమపడి, మహారాష్ట్రులతోఁ దమకు

సంబంధము గలుపుకొనినయెడల తమ గౌరవము హెచ్చుఁగలదని తలఁచి, మహారాష్ట్రులలోనుండి యాంధ్రులు పుట్టిరని యొక సిద్ధాంతముగల్పింపఁ జొచ్చిరి! కాని యితరులపేరు చెప్పుకొని బ్రతుకునంత హీనస్థితి మన కక్కరలేదనియు, మహారాష్ట్రుల నుండి యాంధ్రులు పుట్టుటకుమాఱుగా, ఆంధ్రులనుండియే మహారాష్ట్రులు పుట్టినఁ బుట్టియుండవచ్చుననియు, పూర్వమొకప్పుడు రాజ్యవిస్తారమునందును, ఉన్నతనాగరికతయందును, బుద్ధివైభవమందును, ఆంధ్రులుహిందూదేశమందలి యన్యరాష్ట్రముల వారికిఁ దీసిపోయినవారుకారనియు, ఈ చరిత్రవలన స్పష్టపడఁగలదు. చంద్రగుప్తుని కాలమందు హిందూదేశమునం దెచ్చట, మగధ రాజ్యముదప్ప ఆంధ్ర రాజ్యమును మించిన ప్రభుత్వము మఱియొకటి లేదు. తరువాత నాంధ్రు లుత్తరమున మగధ రాజ్యము, పశ్చిమమున మహారాష్ట్రము వఱకును, దిగ్విజయము చేసిరి. ఈ రాజులే పురాణములలోను, శిలాశాసనములలోను, ఆంధ్రులనియు, శాతవాహను లనియు, శాలివాహను లనియు, విఖ్యాతిఁ జెందియున్నవారు. శాలివాహన రాజులు ఆంధ్రదేశము నుండి మహారాష్ట్ర దేశమునకు వెళ్లినవారేకాని, మహారాష్ట్ర దేశమునుండి యాంధ్ర దేశమునకు వచ్చినవారు కారు. ఇది మహారాష్ట్రులును, విద్వద్వర్యులును, అగు డాక్టరు భాండార్కర్ గారు ఒప్పుకొన్న విషయమే.

* * * *

ఇఁకముందు మాచేఁ బ్రకటింపఁబడు గ్రంథములలో గ్రంథకర్తయొక్క పటముండవలయునని మండలి వారుతీర్మానించి యున్నారు. పూర్వపు గ్రంథకర్తల పటములుగాని చరిత్రలు



గాని దొరకనందున నిప్పటి చరిత్రకారులకుఁ గలుగు మనస్తాపమును మనము చూచుచునే యున్నాము. ఇప్పటివారి పటములైనను మనము సంగ్రహించియుంచక పోవుట భవిష్యత్కాలపువారి విషయమై మనము చేయు నన్యాయముకదా అని తలఁచి యిప్పటినుండియు గ్రంథకర్తల పటములు ప్రకటింప నిశ్చయించినారము.

సంపాదకుఁడు.

# అవతారిక.

## దేశచరిత్రము వలని ప్రయోజనము.

దేశముయొక్క పురోభివృద్ధికిఁ బ్రబలశత్రువై, జనసామాన్యము నావహించియుండిన దురభిమాన పిశాచమును బోఁద్రోలి ప్రజలను నీతివర్ధిష్ణువులనుగాను విజ్ఞానవంతులనుగాను జేసి భావికాలపరంపరాభివృద్ధిభవనమునకు మూలబంధమైయొప్పునది దేశచరిత్రమైనను దేశచరిత్రముయొక్క ప్రయోజన మెఱుంగనివారగుటచేత, మనపూర్వులు మనకొఱకు దేశచరిత్రమును వ్రాసి పెట్టియుండలేదు. దేశచరిత్రము లేక పోవుట మననాగరికతకును మన భాషకును నొకగొప్పకొఱంతగా నున్నది. ఆంగ్లేయభాషావిశారదులై బహుదేశచరిత్రములను బఠించియు, దేశచరిత్రములయొక్క ప్రయోజనమెఱింగియు, మనయాంధ్ర దేశ చరిత్రమునుగూడ వ్రాసి తమయాంధ్రసోదరుల కొసంగవలయునన్నతలంపింతవఱకు మనవారికిఁ బుట్టియుండలేదు. సర్వకలాశాలా పరీక్షలం గృతార్థులయిన మనయాంధ్రవిద్యార్థులకు గ్రీసు, రోము, ఇంగ్లాండు, అమెరికా మొదలగుదేశముల చరిత్రము దెలిసినట్లుగా మన హిందూదేశచరిత్రము తెలియదు. అందును నాంధ్రదేశ చరిత్రము బొత్తిగ నెఱుంగరు. ఇది మనభావిపురోభివృద్ధికి గొప్పయాటంకము. సామాన్యజనులకు చరిత్రమన జ్ఞానమె లేదు. వారి గురువులు వారికేమి చెప్పిన నదియె వారికి చరిత్రమగుచున్నది. అందువలన ననేకానర్థములు మూడుచున్నవి. దేశచరిత్రజ్ఞానము లేక పోవుటచేత విమర్శజ్ఞానము నశించిపోయి స్వప్రయోజనపరులై యెవ్వరేయసత్యమును బోధించినను గుణదోషపరిశీలనము చేయుశక్తిలేక తమచెవిసోకినదానినెల్ల నంధప్రాయముగా విశ్వసించి మూఢవిశ్వాసములలో మునింగి స్వతంత్రజ్ఞానములేక యెవ్వరెట్లీడ్చిన నట్లు పోవుచుండిరి. దేశచరిత్రములున్న విమర్శ జ్ఞానము లభించును. దేశచరిత్రము సమగ్రముగాఁ బఠింపని యేజాతియు నభివృద్ధిఁ బొందనేరదు. ఆంగ్లేయభాషా వాఙ్మయమున స్వదేశచరిత్రములు మాత్రమెగాక యన్యదేశ చరిత్రములను గూడ స్వభాషలో వ్రాసిపెట్టికొనియుండుటచే నింగ్లీషువారు నేటికాలమునఁ బ్రపంచములో నాగరికాగ్రగణ్యులై యిప్పటియున్నతస్థితికి వచ్చియున్నవారు కావున దేశముయొక్క పురోభివద్ధికి దేశచరిత్రమత్యావశ్యకమై యున్నది.

భరతఖండములోని యేదేశచరిత్రమయినను వ్రాయుట సులభసాధ్యమగునుగాని యాంధ్రదేశముయొక్క పూర్వచరిత్రమును వ్రాయుట బహుకష్టసాధ్యము. బహుకష్టసాధ్యంబగుటంజేసియె పట్టపరీక్షాసిద్ధులయిన యాంగ్లేయభాషాపండితులెవ్వరును దీని పొంతకు వచ్చినవారుకారు.

ఈ దేశచరిత్రము వ్రాయుటకుంగల సాధనము లత్యల్పములు; అవియు బహుగ్రంథపరిశోధనముఁ జేసినంగాని సులభసాధ్యములుగావు; వ్యయప్రయాసంబు లధికంబులు; మేదస్సునకుం గలిగెడుబాధ మెండు. ఇత్యాది కష్టముల కభ్యాసపడినవాఁడును, నిరంతర పరిశ్రమకోర్చువాడును జేయఁదగినపనికాని యెంతటిపండితుఁడయిన నన్యునకు సాధ్యము గాదు.

దీని నంతయు నెఱింగినవాఁడనైనను, ఏ యేమంచి పనులం జేసి మనపూర్వులు లాభమును సౌఖ్యమును బ్రఖ్యాతిని గాంచఁ గలిగిరో, ఏ యే కానిపనులం జేసి నష్టమును గష్టమును నప్రఖ్యాతి ననుభవించిరో యద్దములోని నిజస్వరూపమును బోలెఁ దెలిసికొనునట్లుగఁ జేసి పురోభివృద్ధికై సంస్కరణమార్గములనుజూపి సంరక్షించునవి దేశచరిత్రంబు లని మనంబున దృఢవిశ్వాసమును బూని యున్న వాఁడనగుటచేత నాశక్తిసామర్థ్యముల నాలోచింపకయె నేనీగ్రంథరచనకుం బూనుకొంటిని.

### యథార్థచరిత్రమునకుఁ బ్రతిబంధకములు.

ఇట్లు చరిత్రరచనకుం బూనుకొని ముందుగ మనప్రాచీన గ్రంథపరిశోధనకుం గడంగిన యథార్థచరిత్రమునకుఁ బ్రతిబంధకము లనేకములు గన్పట్టినవి. ప్రాచీనమైన దానియందు జనసామాన్యమునకు గౌరవబుద్ధి యత్యధికముగా నుండుటచేత తమతమ మతములును తమతమ కులములునుమిక్కిలిప్రాచీనము లయినవగుటచే ఘనమైనవనియు లోకమునకు వ్యక్తీపరింపనెంచి మతాభిమానులును, కులాభిమానులును, తమకుం గల గాఢాభిమానముచే దమదేశమును తమభాషలును మిక్కిలి పురాతనమైన వగుటచే ఘనమైనవనియు లోకమునకు వ్యక్తీకరింపనెంచి దేశాభిమానులును, దేశముయొక్క యథార్థచరిత్రమును దెలిసికొనుటకు నైతిగాకుండఁ బ్రాచీనగ్రంథములలోఁ గ్రొత్తగ నవీనవిషయములను జేర్చియు, నూత్నగ్రంథములను, నూత్నకథలను గల్పించియుఁ జిక్కులను బెక్కింటి నుత్పాదించిరి. క్షేత్రమాహాత్మ్యములను, నదీమాహాత్మ్యములను, స్థలపురాణములను బుట్టించిరి. కల్పితకథల నెన్నో యల్లిరి. వేయునేల?



క్రొత్తయుపనిషత్తులనే వినిర్మించిరి. యథార్థములగు చరిత్రములు లేకపోవుటచేత సత్యముమండి యసత్యమును విడఁదీయుటలోఁ గష్టమెక్కుడగుచున్నది. ప్రక్షిప్తభాగమును గ్రంథములందుఁ జేర్చి యుండుటచేతనే గ్రంథములం దన్యోన్యమైత్రి లేకపోవుటయెగాక యొకగ్రంథమునందే పరస్పరవిరోధము లుండుటయుఁ దటస్థమగుచున్నది. కాలనిర్ణయమునకు మనగ్రంథాదులు కలిగించు చిక్కులిన్ని యన్నియని చెప్పనలవికాదు. విమర్శజ్ఞానము నశించుటచేతఁ గాలవిషయమున మనవారు చర్చింపనేచర్చింపరు. కలియుగారంభమున భారతమును నన్నయభట్టు చెప్పినాఁడనిన మనవారు విశ్వసించిరి.

దేశచరిత్రమంతయు నిట్లవిద్యాతమంబుచేఁ జుట్టుకొనఁబడి యుండుటం జేసి చరిత్రరచనముం జేయవలయునని సంకల్పముదయించినను బహుసంవత్సరములకుఁగాని నాసంకల్పము నెఱవేఱునట్టి భాగ్యము పట్టినది కాదు.

### బ్రిటీష్పరిపాలనమునకుఁ గృతజ్ఞత.

దేశచరిత్రముయొక్క సత్యమునుగూర్చి మన గ్రంథములెంతయయోమయంబులుగా నున్నను యథార్థ చరిత్రమును దెలిసికొనుటకు వలయుసాధనములను మనపూర్వపురాజులు మనకొఱకు విడిచిపెట్టిపోక యుండలేదు. తమకాలమును, తమధర్మకార్యములను, తమమతాభిమానములను, తమప్రతాపములను తమదిగ్విజయములను దెలుపునట్టిశాసనములను వ్రాయించి ఱాళ్లపైన లోహములపైన నెక్కించి పెట్టియుండిరిగాని, కాలవశంబున నవియన్నియు శిథిలములై పోయియు, మంటిదిబ్బలలోఁ బూడ్చుకొనిపోయియు, చూచువారులేక పడియుండఁగా,

దైవానుగ్రహమువలన నిటీవల బ్రిటీష్పరిపాలనము మనకు లభించి మన దేశముయొక్క పురాతనచరిత్రమును దెలిసికొనుటకై మనయుపయోగార్థము దొరతనమువారు వానినన్నిటిని వ్యయప్రయాసములకోర్చి వెల్లగించిపెట్టినను మనవారు వానియుపయోగమును దెలిసికొని సత్యాన్వేషణము చేయఁజాలక పోయినను చరిత్రరచనయందు నిపుణులగు పాశ్చాత్యపండితులు మాత్రము వానిని బరిశోధించి మనగ్రంథము లెంత తికమకలుగానున్నను నోపికతో విమర్శించి సులభముగాఁ బ్రసవింపలేక ప్రసవవేదన ననుభవించుచుండిన గర్భవతిగర్భమునుండి బిడ్డను బైకిఁదీయునట్లుగాఁ దమబుద్ధివిశేషముచే నొక్కొక్క సత్యమునే బయలునకుఁ దీసి ప్రకటించుచు జ్ఞానతేజస్సును బఱపుచుండుటచేత దేశచరిత్రము నావరించుకొనియుండిన యవిద్యాతమంబంతయుఁ గ్రమక్రమముగాఁ దొలఁగి పోవుచున్నది. కావున దొరతనమువారికిని, సత్యాన్వేషణపరులయిన పాశ్చాత్యపండితులకును ఆంధ్రులమైన మనము ముఖ్యముగాఁ గృతజ్ఞత దెలుపవలసి యున్నది. మనప్రాచీనాంధ్రులయొక్క యౌన్నత్యము బయలుపడుటకు ముఖ్యముగా వీరుచేసిననిరంతరకృషియే కారణము. ఈ పాశ్చాత్యపండితులు చరిత్రములు వ్రాయుటలో మనగ్రంథములలోని లోపములను గనిపెట్టి గ్రమక్రమముగా వానిని ("lying gabble") అబద్ధపుకూఁతలని నిరసించివైచి (1) శాసనములను (2) పురాతనపుఁ గట్టడములను (3) మన దేశమునుగూర్చి యన్యదేశస్థులు వ్రాసియుంచిన వ్రాఁతలను (4) ప్రసంగాంతరముగల మనగ్రంథవిషయములను (5) దీనికి సంబంధించి యున్నంతవఱకుఁ లోకులచేఁ జెప్పఁబడు కథలను నా



ధారముగాఁ గొని యొకవిధముగా దేశచరిత్రమున కనుకూలములగు విషయములను వ్రాసిరి. వీనినన్నిటిని దొరతనమువారును పాశ్చాత్యపండిత సంఘములవారును బ్రకటించి యుండిరి. ఈగ్రంథములనన్నిటిని సేకరించి దొరతనమువారు తమచే స్థాపింపఁబడిన పుస్తక భాండాగారములయందుఁ బెట్టియున్నారు. అట్టివి రెండు పుస్తక భాండాగారములు చెన్నపురియందుఁ బ్రజలయుపయోగార్థము స్థాపింపఁబడి యున్నవి. అందొకటి క్యాన్నిమరా లైబ్రరీయనుపేరను (Cannemora Library) మఱియొకటి ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమనుపేరను (Qriental Manuscript Library) బరగుచుఁ జెన్నపురి వివిధవస్తుప్రదర్శనశాలాభవనమున (Museum) నెలకొల్పఁబడియున్నవి. పురాతనచరిత్రములను మఱియేగ్రంథములనైన వ్రాయువారికి పుస్తకభాండాగారములు మిక్కిలి యుపయోగకరములుగా నుండక మానవు. పాశ్చాత్యపండితు లవలంబించినమార్గము సరియైనదైనను, సత్యాన్వేషణపరులై మిక్కిలి నైపుణ్యముతోడను గూడఁ బనిచేసియున్నను వారువిదేశస్థులగుటవలనఁ గొన్నివిషయములు మనకుఁదెలిసినంత చక్కఁగా వారికిఁ దెలియరావు. గావున వారును గొన్నితావులఁ బ్రమాదములపాలగుచు వచ్చిరి. కాఁబట్టి వారును వ్రాసినదంతయును సత్యమైనచారిత్రము కాఁజాలదు. కాని వారుచూపినత్రోవనే మనమునుబోయి వారు దూషించినంత "అబద్ధపుకూఁత" లనుగా మనగ్రంథములను ద్రోసివేయక యెంతవఱకు దేశచరిత్రములకుఁ దోడ్పడఁగలవో యంతవఱకే గ్రహించి మనమువిశేషపరిశ్రమఁజేసి దేశచరిత్రములను వ్రాయుటకుఁ మొదలుపెట్టినచోఁ గొంతవఱకుఁ జరి

త్రముంగూర్చి సద్గ్రంథములు పుట్టఁగలవని నాదృఢమైన విశ్వాసము.

### విజ్ఞానచంద్రికా మండలికిఁగృతజ్ఞత.

అట్టి దృఢమైనవిశ్వాసముతో నేనీగ్రంథరచనకుం బూనుకొని పాటుపడుచుంటినిగాని యిది బహువ్యయప్రయాసములతోఁ గూడిన దగుటం జేసి యితరులసాహాయ్యమపేక్షించినఁగాని యిది నెఱవేఱదని కొందఱిమిత్రులతోఁ బ్రస్తాపించగా నొకమిత్రుఁడు దీనిహక్కును దనకిచ్చివేసినయెడలఁ దనకుందోచిన ప్రతిఫలమిచ్చెద ననియెను. దేశభాషాభివృద్ధికై యేర్పడిన యొకసంఘములోని యొకమిత్రుఁడు గ్రంథమువ్రాసి తెచ్చిన యెడలఁ దరువాత మాట్లాడవచ్చునని చెప్పెను. ఇంకొకమిత్రుఁడుగ్రంథమువ్రాసియిచ్చినయెడలఁ దాముప్రకటించిగ్రంథవిక్రయమువలన వచ్చిన సొమ్ములోఁ దమకయిన ముద్రాభృతిమొదలగు వ్యయమును మొదటఁ దీసివేసి యేమైన మిగిలినయెడలఁ జెరిసగము పాలుగొంద మనిచెప్పిరి. ఈగ్రంథరచనయందలి కష్టము వారెఱింగియుండకపోవుటచేతను, మనభాషాగ్రంథములయందు మనవారికుండు నలక్ష్యస్వభావముచేతను నామిత్రు లట్లుచెప్పిరిగాని వారికి నాయెడంగల దుర్భావముచేతఁ గాదని నేనెఱుంగుదును. అయిననుఁ "దమకుఁదాము తోడ్పడు వారికి దైవమును దోడ్పడు" నని 'స్మైల్సు' అనుగ్రంథకర్త చెప్పినవాక్యమును స్మరణకుఁ దెచ్చుకొని నిరుత్సాహుఁడనుగాక యొరులవలన సాహాయ్యమపేక్షింపరాదని దృఢమనస్కుఁడనై యొక్కొక్కరాజవంశమును గైకొని చిన్నచిన్నభాగములుగాఁ జరిత్రమంతయుఁ బ్రకటింప నిశ్చయించుకొని యన్నిపనులను మానుకొని చెన్నపురికివచ్చి



యేకదీక్షతోఁ బనిచేయ నారంభించితిని. ఇదివఱకే చరిత్రగ్రంథములను ప్రకృతిశాస్త్రగ్రంథముల నాంధ్రభాషలోఁ బ్రకటించి యాంధ్రదేశమునం దంతట విజ్ఞానమును బ్రసరింపఁజేసి దేశమునకును భాషకును మహోపకారమును జేసి ఖ్యాతిఁగాంచుచుండిన విజ్ఞానచంద్రికా మండలివారు. ఈ కాలముననే తమ కార్యాలయమును చెన్నపట్టణమునకు మార్చుట సంభవించెను. అందలిసభాసదులు కొందఱు నాయుద్యమమును నా దీక్షను గాంచి సంతసించి తా మీగ్రంథస్వాతంత్ర్యము నపేక్షింపకయె తమ గ్రంథమాలలో నొకపుష్పముగా నంగీకరింతు మనిచెప్పి ప్రోత్సాహము కలుగఁ జేసిరి. అందువలన గ్రంథమచ్చు పడినతోడనే 2000 ప్రతులమ్ముడు వోవునన్న ధైర్యము గలిగెనుగాని యంతమాత్రముచేత నాకష్టములన్నియు నివారింపఁ బడునవి కావు. గ్రంథమువలన వచ్చెడు నాదాయము ముద్రాభృతికిని చెన్నపురిలోనాకగు వ్యయమునకును సరిపోవునుగాని యంతకన్నవిశేషలాభమేమియుఁ గానుపింపక పోవుటటుండ ముందు వహింప వలసిన ధనభార మధికమయ్యెను. లాభముండినను లేక పోయినను మొదలుపెట్టినపని విడనాడుట కిష్టములేక పనిచేయుచుంటిని. విజ్ఞానచంద్రికామండలివారు నాకీగ్రంథము నుచితముగా ముద్రింపించి యిచ్చుటకు నౌదార్యము గలవారైనను వారిగ్రంథములపై వచ్చు నాదాయమంతయు వారిగ్రంథముల ముద్రాభృతికే సరిపోవుచున్నందున నంతకన్న నెక్కువ సాహాయ్యమును జేయంజాల కుండిరి. కానిమండలివారే యొకానొక విద్యాప్రియుఁడగు శ్రీమంతునకుఁ జెప్పి ముద్రాభృతియు నాకు నిప్పించిరి. చరిత్రాసక్తియు నౌదార్యమును గల యీ

శ్రీమంతుఁడు నా ప్రయాసమును స్వయముగా వీక్షించు చుండిన మండలిసభాసదుఁడగు లక్ష్మణరావుపంతులుగారిచే నా చేయుచున్న పనినంతయు విని దయార్ద్రహృదయుఁడై నాగ్రంథముయొక్క యీ ప్రథమభాగమునకగు ముద్రాభృతినంతయుఁ దామువహింతుమని తెలియఁజేయుటయె గాక వాగ్దత్తము ప్రకారము నెఱవేర్చి నాకష్టముల నన్నిటిని తుదముట్టించి నాకు మహోపకారము చేసిరి. నిష్కామకర్మమును గుప్తదానమును చేయుటయె శ్రేష్ఠమనితలఁచి తమనామమును సయితము నుదాహరింపవలదని యీ యుదారపురుషుఁడు కోరినందున, ఈ గ్రంథము తన్నామాంకితముచేసి నాకృతజ్ఞతను జూపలేక పోతినిగదా యనిచింతించుచున్నాఁడను. రాజభక్తియు దేశభక్తియుఁ గలిగి వఱలుచుండిన యీశ్రీమంతునిచేతిలో నాంధ్రభాషామతల్లి యింకను వర్ధిల్లవలెనని కోరుచు వారికి నాయురారోగ్యైశ్వర్యములనిచ్చి చిరకాలముఁ బోషించుగాతమని భగవంతునిఁ బ్రార్థించుచు వట్టిమాటలచేతనే నాకృతజ్ఞతను దెలుపుచున్నాను.

ఇట్లు విజ్ఞానచంద్రికామండలి వారి సాహాయ్యముచేతను ప్రోత్సాహముచేతను సఫలీకృతమనోరథుండనైతినిగావున నే నెప్పుడును వారికిఁగృతజ్ఞుఁడనై యుండవలసినవాఁడ నగుచున్నాఁడను.

## కృతజ్ఞతా వందనములు.

నాసదుద్యమమును నాకష్టముల నొకానొక మిత్రునిచే విని శ్రీ పిఠాపుర సంస్థానాధీశ్వరులయిన మ-రా-శ్రా-శ్రీ శ్రీరాజా రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు బహదరు జమీాందారుగారు నాగ్రంథము యొక్క ముద్రాభృతికై నూఱురూపా



యలు పారితోషికముగ నొసంగి తమకుంగల భాషాభిమానముం జూపినందుకు వారికెంతయు నాకృతజ్ఞతావందనముల నిందుమూలమునఁ దెలుపుకొనుచున్నాను. మఱియును శ్రీరాజాగారి ప్రయివేటు సెక్రటరీగారగు బ్రహ్మశ్రీ మొక్కపాటి సుబ్బరాయఁడు పంతులు బి. ఏ. గారు చూపిన యభిమానమునకుఁగూడ నా కృతజ్ఞతావందనములును దెలుపుకొనుచున్నాఁడను.

మఱియును దేశభాషాభిమానులయిన మిత్రులనేకులు తోడ్పడి నాకు విశేషధనసహాయమును జేసిరి. అందుముఖ్యముగా తెలుఁగు జనానాపత్రికాధిపతులు గుంటూరు కాలేజిలోప్రథమసహాయోపాధ్యాయులునునైన నా చిరకాలమిత్రులగు బ్రహ్మశ్రీ రాయసము వేంకటశివుఁడు పంతులు బి. ఏ. ఎల్. టి. గారు నా కష్ట సుఖముల మొదటినుండియు నెఱింగినవారుగావున సర్వవిధములచేతను నాకు ప్రోత్సాహమును కలిగించుచువచ్చుటయెగాక నే నెన్నఁడును మఱువంగూడని సాహాయ్యమును జేసిరని చెప్పినఁజాలును. వీరును, గుంటూరువాసులును హైకోర్టువకీలు నగుబ్రహ్మశ్రీ కొండా వేంకటప్పయ్యపంతులు బి. ఏ. బి.ఎల్. గారును, ప్లీడరగు బ్రహ్మశ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణపంతులుగారును గలిసి చెన్నపురిలోనా కగువ్యయమునకుఁగా నూటయేఁబది రూపాయలొసంగి సాహాయ్యముచేసినందుకు నాకృతజ్ఞతావందనములను దెలుపుకొనుచున్నాను.

అందఱికంటెను ముఖ్యముగాఁ గంటికి ఱెప్పవలెదగ్గఱనుండి నిరుత్సాహపడుచుండినప్పుడు ధైర్యమును చెప్పుచు సర్వవిధములఁదోడ్పడి మఱువంగూడని సాహాయ్యమొనర్చి నాచే నీకార్యమును నిర్వహింపఁజేసిన బ్రహ్మశ్రీ కొమఱ్ఱాజు వేంకట

లక్ష్మణరావుపంతులు. ఎమ్. ఏ. గారికిని, మఱియు నీకార్యము నందుఁ బ్రోత్సాహమును గలిగించుటయెగాక నేను నాకుటుంబముతోఁ జెన్నపట్టణమున నున్నకాలమున నవసరమువచ్చినప్పుడెల్లను మాగృహమునకుఁ వచ్చి మందులుద్రావకులునిచ్చి యాదరముతోఁ జూచినవిజ్ఞానచంద్రికామండలిమేనేజరు మ-రా-రా-శ్రీ. ఆచంటలక్ష్మీపతి. బి. ఏ. ఎమ్. బి. సి. ఎమ్. గారికిని, మఱియును విజ్ఞానచంద్రికామండలికిఁ గార్యదర్శిగానుండి సుహృద్భావముతో నాయుద్యమము నామోదించి ప్రోత్సాహము కలుగఁజేసిన బ్రహ్మశ్రీ రావిచెట్టు రంగరావుపంతులుగారికిని, నాకృతజ్ఞతావందనములను దెలుపుకొనుచున్నాను. దేశభాషాభిమాను లయిన యిట్టిమిత్రవర్గముయొక్క తోడ్పాటుతో నొక సంవత్సరకాలమహోరాత్రములు కృషిచేసి యేదోయొక్క విధముగా నాంధ్ర దేశ చరిత్రముయొక్క యీప్రథమభాగమును రచించి ప్రకటింపఁ గలిగితిని.

## గ్రంథనామము

ఆంధ్రదేశ కథాసంగ్రహమని మొట్టమొదట నామకరణముఁ జేసితిని, గాని యందువలన నాంధ్రదేశమునకు వెలుపల నుండిన యాంధ్రులయొక్క చరిత్రము విడిచిపెట్టవలసివచ్చినందున నదియుక్తముగాఁదోఁపక గ్రంథములోపలి పత్రములలో "ఆంధ్రదేశ కథాసంగ్రహ" మని ముద్రింపఁబడినను ఆంధ్రుల చరిత్ర మనుటయె సముచితముగా నుండునని తరువాతఁదలంచుటచేత నట్లనే గ్రంథము మొదటఁ బేర్కొనఁబడియెను గావునఁ జదువరు లీద్వినామకరణమునకు నాక్షేపింపకుందు రనినమ్ముచున్నాఁడను.



## చరిత్రవిభాగములు.

ఆంధ్రులయొక్క రెండువేలయేనూఱుసంవత్సరముల చరిత్రమును సవిస్తరముగా వ్రాయ నుద్యమించినవాఁడను గావున నంతయు నేకసంపుటమున నిమిడ్చిన నంతమనోహరముగా నుండదనియు, ప్రథమగ్రంథమగుటంజేసి యట్లుచేయుట సులభసాధ్యముగాదనియు భావించి చరిత్రకాలమునంతయుఁ బూర్వయుగము, మధ్యయుగము, నవీనయుగము ననిమూఁడుభాగములుగా విభాగించి యైతరేయ బ్రాహ్మణము మొదలుకొని క్రీస్తుశకము ౧౨౦౦ సంవత్సరమువఱకును బూర్వయుగముగాగ్రహించి యాపూర్వయుగచారిత్రమునే ప్రథమభాగముగా నేర్పఱచుకొంటిని. ఇందుప్రాచీనాంధ్రదేశస్థితియు, ఆంధ్రవంశము, పల్లవవంశము, చాళుక్యవంశము, చాళుక్యచోడవంశము, వెలనాటిచోడవంశము, ఆంధ్రచోడవంశము, బాణవంశము, వైదుంబవంశము, హైహయవంశము, బేటవిజయాదిత్యవంశము, కళింగగాంగవంశము, విష్ణుకుండినవంశము, మొదలగునవి సంగ్రహముగా నిందుఁ జేర్పఁబడినవి.

మధ్యయుగమునందు కాకతీయగణపతివంశము, ఆంధ్రకలికాల చోడవంశము (మనుమసిద్ధిరాజువంశము),కోటవంశము, రెడ్లవంశములు, యాదవవంశము,సాళువవంశము, మొదలగురాజవంశములచరిత్రములు చేర్పఁబడును. ఇందలికాకతీయ గణపతుల చరిత్రను, మనుమసిద్ధి రాజవంశమును పూర్వయుగమునందుఁ బ్రారంభింపఁబడవలసినవైనను మధ్యయుగమునందుఁగూడ వారి వంశములుండుటచేతను, వారలచరిత్రమువిపులముగ వ్రాయవలసియుండుటచేతను వానినిమధ్యయుగమునందుఁ జేర్చితిని.

మూఁడవయుగమయిన నవీనయుగమునందు నరపతులయొక్కయు, నశ్వపతులయొక్కయు, ద్రావిడదేశమును బాలించిన తెలుగునాయకులయొక్కయు, ఇప్పటి జమీందారులపూర్వులయొక్కయుఁ జరిత్రములు మొదలగునవి యుండును. ఈకడపటి రెండుయుగములచరిత్రములును వీలుననుసరించి యేర్పాటుచేసికొనఁబడును గావున నివియె స్థిరములయిన విభాగములుగాఁ జదువరులు తలంపరాదు.

చరిత్రసాధనములు.

ఈ యాంధ్రదేశచరిత్రమును వ్రాయుటలో నాకు సాధనభూతంబులగు గ్రంథములయొక్కయు, తద్గ్రంథకర్తలయొక్కయు నామములను ముఖ్యావశ్యకములయిన స్థానములం దెల్లను బేర్కొనియుంటిని. ఆ గ్రంథములనన్నిటిని ఆ గ్రంథకర్తల నందఱిని మరలఁ బేర్కొనుట యనావశ్యకమయినను నాకెక్కువ సహాయమును గలుగఁజేసిన వారినామములను వారిగ్రంథములను మాత్రము నిటఁ బేర్కొనుచున్నాఁడను. హుల్ట్జ్ (Hultzsch), ఫర్గ్యూసన్ (Fergusson), బర్గెస్ (Burgess), జనరల్ కన్నిహ్యామ్ (General Cunningham), సి. కన్నిహ్యామ్ (C. Cunningham), బూలర్ (Buhler), విన్సెంటుస్మిథ్ (Vincent Smith), సర్ వాల్టర్ ఎలియాట్ (Sir Walter Elliot), స్యూయల్ (Sewell), బర్నెల్ (Burnell), కర్నల్ మెకంజి (Colonal Mackengie), విల్ఫర్డు, (Wilford), క్యాంబెల్ (Campbell), సి. పి. బ్రౌన్ (C. P. Brown) కాల్డ్వెల్ (Caldwell), విల్సన్ (Wilson), టేలర్, (Taylor), రాప్సన్ (Rapson), ఫ్లీట్ (Fleet), ఫౌల్కస్ (Foulkes) థామస్ (Thomas), ఓల్డెన్బర్గు



(Oldenberg), మార్షల్ (Marshall), మార్సడన్ Marsden, బీల్ (Beal) కీల్హారన్ (Kielhorn), ప్రిన్సెప్ (Prinsep), రైస్ (Rice), రీ (Rea), మెక్ క్రిండిల్ (Mc. Crindle), గ్రీర్సన్ (Grierson), మొదలగు పాశ్చాత్యపండితులును భాండార్కర్ (Bhandarkar), భావుదాజీ (Bhau Daji), భగవన్లాల్ ఇంద్రాజీ (Bhagavanlal), రావు బహదరు వెంకయ్య, (Rao Bahadur Venkayya, Government Epigraphist), కృష్ణశాస్త్రి (Assistant Epigraphist), జయంతి రామయ్యపంతులు (Deputy Collector of Russulkonda) మొదలగు స్వదేశపండితులును వ్రాసినగ్రంథములును వ్యాసములును వారుచేసిన చర్చలును నాకీగ్రంథరచనయందు విశేషముగాఁ దోడ్పడినవి. ఇంగ్లీషుగ్రంథములలో ముఖ్యముగా డాక్టరు ఫర్గ్యూసన్ గారిచే రచింపఁబడిన ట్రీ అండ్ సర్పెంటు వర్‌షిప్" (Tree and Serpent Worship), అనుగ్రంథమును, డాక్టరు బర్గెస్ గారిచే రచింపంబడిన బుద్ధిస్టిక్ స్తూపాస్ ఆఫ్ అమరావతి అండ్ జగ్గయ్యపేట Buddhistic Stupas of Amaravati and Jaggayyapeta) అనుగ్రంథమును, ఈ యుభయులచేతను రచింపఁబడిన కేవుటెంపిల్సు ఆఫ్ ఇండియా (Cave Temples of India) అనుగ్రంథమును, డాక్టరు బర్నెల్ గారిచే రచింపఁబడిన సౌత్ ఇండియన్ పాలియోగ్రఫీ (South Indian Paleo graphy) అనుగ్రంథమును, సర్ వాల్టర్ ఎలియాట్ గారిచే రచింపఁబడిన న్యూమిస్మిటా ఓరియంటాలియా (Numismita Orientalia) అనుగ్రంథమును, జనరల్ కన్నిహ్యామ్ గారిచే రచింపఁబడిన ఏన్సెంటు జాగ్రఫీ ఆఫ్ ఇండియా (Ancient Geography of India), అనుగ్రంథమును విన్సెంటు స్మిథ్ గారి అర్లి హిష్టరీ ఆఫ్ ఇండియా

(Early History of India), అను గ్రంథమును, డాక్టరు భాండార్కర్ గారి అర్లి హిష్టరీ ఆఫ్ డక్కన్ (Early History of Deccan), అను గ్రంథమును, కనకసభాపిళ్ళగారి టమిల్సు ఎయిటీన్ హండ్రెడ్ ఇయర్సు ఎగో (Tamils : Eighteen Hundred years Ago), అను గ్రంథమును నాకుఁ జాలసహాయమును జేసినవి.

ఇవిగాక చెన్నపురిలోని క్యాన్నిమరా లైబ్రరీలో నున్న "ఇండియన్ అంటిక్వేరీ" (Indian Antiquary) లోను, "ఎపిగ్రాపియా (Epigraphia) ఇండికా" (Indica), లోను ఎపిగ్రాపియా కర్నాటికా"(Epigraphia Kkarnatica), లోను డాక్టర్ హాల్ట్జ్ గారిచేఁ బ్రకటింపఁబడిన సంస్కృత ద్రావిడ శాసనముల సంపుటముల (South Indian Inscriptions) బ్రకటింపఁబడిన పురాతనశాసనములును చరిత్ర శోధనములో నింతింత యనరాని తోడ్పాటును జూపినవి. "డిస్ట్రిక్టు గెజిటీర్సు"(District Gazetteers), 'డిస్ట్రిక్టు మ్యాన్యుయల్సు' (District Manuals), అను గ్రంథములును గొంతవఱకుఁ దోడ్పడినవి.

ఇంతియగాక ఏషియాటిక్ రీసర్చెస్ (Asiatic Researches) అను పత్రికా సంపుటములును, మెడ్రాస్ జర్నల్ ఆఫ్ లిటరేచర్ అండు సైన్సు(Madras Journal of Literature and Science), అను పత్రికా సంపుటములును, రాయల్ ఏషియాటిక్ సొసైటీ వారిచేఁ బ్రకటింపఁబడు పత్రికా సంపుటములలోఁ బ్రకటింపఁబడిన కొందఱి లేఖలును చర్చలును నాకు విశేషసహాయ మొనర్చినవి.

మఱియును ఆర్క్వియో లాజికల్ సర్వేడిపార్టుమెంటు వారిచేఁ బ్రకటింపఁబడుచుండిన యెపిగ్రాఫిని గూర్చినరిపోర్టులును



(Annual Reports on Epigraphy) గూడ నెక్కువగాఁ దోడ్పడినవి.

ఈ పైఁ జెప్పినవిగాక బ్రహ్మశ్రీ పాడివేంకటనారాయణ పాఠీగారిచే విరచింపఁబడిన యాంధ్రధాతురతత్త్వమును, బ్రహ్మశ్రీ రావు బహదరు వీరేశలింగముపంతులుగారిచే రచియింపఁబడిన యాంధ్రకవుల చరిత్రమును, బ్రహ్మశ్రీ వేదము వేంకట, రాయశాస్త్రిగారిచే విరచింపఁబడిన కథాసరిత్సాగరమును, బ్రహ్మశ్రీ కొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావుపంతులుగారిచే రచింపఁబడిన హిందూదేశకథాసంగ్రహమును గూడ నాకుఁ గొంచము తోడ్పడినవిగావున వారికిని నావందనము లర్పించుచున్నాఁడను.

చెన్నపట్టణము.
15-3-10. } చిలుకూరి వీరభద్రరావు.



## ఆంధ్రమహాజనులకు విజ్ఞప్తి.

సోదరులారా !

ఈ గ్రంథరచనయందుఁ బడినశ్రమయంతయు మీకుఁ దెలుపుట యనావశ్యకము. ఇదియే యాంధ్రదేశ చరిత్రమును దెలిపెడి ప్రథమగ్రంథమని భావించెదను. అదివఱకు దేశచరిత్రమునుగూర్చిన గ్రంథములేక యిదియె ప్రథమగ్రంథ మగుట చేత నంతనిర్దుష్టమైయుండఁజాలదు. గీర్వాణాంగ్లేయ భాషలయందుమహాపండితులై బహుసంవత్సరములు పరిశోధనముచేసిన డాక్టరు భాండార్కర్ మొదలగు పండితులువ్రాసిన ప్రాచీనచరిత్రములె నిర్దుష్టములుగా నుండ సాధ్యముకాకయున్నప్పుడు నావంటి యల్పజ్ఞుఁడువ్రాసిన యాంధ్రదేశచరిత్రముయొక్క ప్రథమగ్రంథమునిర్దుష్టముగ నెట్లుండఁగలదు? అయిన నాకు దొరకిన సాధనములతో నొకరీతిగఁ జరిత్రమును వ్రాసిపెట్టితిని.

ఎవ్వరైనను గ్రంథమును సాంతముగాఁ జదువకయె విమర్శనమునకుఁ బూనుకొనక గ్రంథము నామూలాలముగఁ బరిశోధించినతరువాత వారికిం దోఁచెడు దోషములను సహేతుకముగా నాకుం దెలిపినచో ద్వితీయముద్రణమునందు సవరించుకొనని యంతటి దురభిమానిని గానని మీకుఁ దెలుపుచున్నాఁడను.

మఱియును గ్రంథరచన చేయుచున్నకాలముననే యీ చరిత్ర మచ్చుపడినదిత్తుప్రతులను నేనే దిద్దుకొనవలసి వచ్చినందున భ్రమప్రమాద జనితములయిన యచ్చుతప్పులందందుఁ బెక్కులుపడినవి గావునఁ జదువరులు మన్నించివానిసవరించుకొని చదువుకొనవలయునని వేడుచు నింతటితో విరమించుచున్నాఁడను.

గ్రంథకర్త.

# విషయసూచిక.

### మొదటిప్రకరణము.



### రెండవప్రకరణము.



### మూడవప్రకరణము.

## నాలుగవ ప్రకరణము.



## ఐదవ ప్రకరణము.





## ఆఱవప్రకరణము.



## ఏడవప్రకరణము.

## ఎనిమిదవప్రకరణము.







## తొమ్మిదవ ప్రకరణము.



## పదవ ప్రకరణము.

## పదునొకొండవ ప్రకరణము,



## పండ్రెండవప్రకరణము.

పదుమూడవప్రకరణము.







పదునాలుగవప్రకరణము.

పదునైదవ ప్రకరణము.







పదునాఱవ ప్రకరణము.





# ఆంధ్ర దేశ కథాసంగ్రహము.

## ఆంధ్రభృత్యవంశము.

---

### మొదటిప్రకరణము.

### ఆంధ్రదేశము.

ఆంధ్రదేశచరిత్రమును దెలిసికొనుటకుఁ బూర్వము "ఆంధ్రదేశ" మన నెట్టిదియో, దానికెల్ల లెవ్వియో, విస్తీర్ణ మెంతయో, అందలి జనులవేషభాషామతంబు లెట్టివో, ఎట్టి నాగరికతవహించి యుండిరో, కొంచెముగానైనఁ దెలిసికొనుట యావశ్యకము.

హిందూదేశముయొక్క మధ్యప్రదేశము నలంకరించి యుండిన వింధ్యపర్వతమునకు పైభాగ మార్యావర్తము లేక ఉత్తర హిందూస్థానమనియు క్రింది భాగము దక్షిణాపథములేక దక్షిణ హిందూస్థానమనియు వ్యవహరింపఁబడుచున్నవి.

భరతఖండమునందలి దక్షిణాపథ దేశములలో నాంధ్రదేశము సుప్రసిద్ధమయినదిగ నున్నది. (అంధ+రన్ = అంధ = దృష్ట్యుపఘాతే యనిధాతువు) మనుష్యులు వసియింప శక్యముకాని యంధకారము కలది యగుటచే నుత్తరాహు లీదేశము నాంధ్రదేశమని వాడుచు వచ్చిరని కొందఱు పండితులు చెప్పుచున్నారు. [1] ఆంధ్రులు నివసించుచుండు దేశముగాన దీనికి నాంధ్రదేశమను పేరు గలిగినదని మఱికొందఱు పండితులు తలంచుచున్నారు. ప్రాచీనకాలము నందు నాగరికులు వసియింప శక్యముకాని యంధకారబంధురమయిన మహారణ్యమధ్యమునందు మొదట వీరు నివసించియుండిన వారగుటచేసి యా [illegible]

1 ఆంధ్రాక్షర తత్త్వము, పుట ౪౯.

హులయిన యార్యులు వీరిదేశము నాంధ్రదేశమనియు, వీరి నాంధ్రులనియుఁ బిలిచిరని చెప్పుమాట యుక్తియుక్తమయినదిగానే యుండును.

## ఎల్లలు.

ఈదేశమున కుత్తరమున నుత్కలమహారాష్ట్ర దేశములును, తూర్పునఁ దూర్పుసముద్రమనియెడి బంగాళాఖాతమును, దక్షిణమున ద్రావిడకర్ణాటక దేశములును, పశ్చిమంబున కర్ణాటక మహారాష్ట్ర దేశములును గలవు.

## విస్తీర్ణము.

ప్రస్తుతము హిందూదేశమును బరిపాలించుచుండిన బ్రిటీషు పరిపాలకులు పరిపాలనమున కనుకూలమగునటుల దేశము ననేక భాగములుగ విభాగించి యుండుటనుబట్టి యాంధ్రదేశముయొక్క విస్తీర్ణమును సరిగా నిర్వచించుటకు సాధ్యముగాదు. అయిన నొకరీతిగా నిర్ధారణము సేయవచ్చును. చెన్నపురిరాజధానిలో నుత్తరమువనుండు గంజాము మండలములోని శ్రీకాకుళమునుండి బయలుదేఱి తూర్పుసముద్రపుతీరము పొడవునను చెన్నపట్టణమున కుత్తరమున నున్న పాలయవేర్కాడు (ప్రళయకావేరి) వఱకునుబోయి యటనుండి బెంగుళూరునకును, అచ్చటనుండి తిన్నఁగా బల్లారికిని, పిమ్మట నుత్తరముగా హైదరాబాదునకును, తరువాత నాగపురప్రాంతము వఱకును జుట్టి వచ్చిన నీనడుమఁగల యావద్దేశ మాంధ్రదేశముగాఁ బరిగణింపఁబడుచున్నది. అనఁగా గంజామును, విశాఖపట్టణమును, గోదావరియు, కృష్ణయు, గుంటూరును, నెల్లూరు మండలములును, చెంగలుపట్టుమండలములోఁ గొంచెముభాగమును, చిత్తూరు లేక ఉత్తరార్కాడు మండలములో సగము భాగమును, అనంతపురము, కడప, కర్నూలు (కందనోలు) మండలములును, బల్లారిమండలములో కొంతభాగమును, నైజామురాజ్యములో విశేషభాగము (అనఁగా నల్గొండ, ఓరంగల్లు, ఖరీమ్‌నగరు, మహబూబునగరము, మెతుకు, ఎల్గందలజిల్లాలును, ఇందూరు, బీదరుజిల్లాలలో కొంతభాగమును) నాగపుర గోండ్వానాదేశములలో నొక కొంచెము భాగమును జేర్చిన నాంధ్రదేశమేర్పడి కొంచెమించుమించుగ లక్షయుఁ బదునేడువేల మైళ్లవైశాల్యముగలిగి యొప్పుచున్నది.



## నైసర్గికస్వరూపము.

ఈదేశమునకు తూర్పుదెసను పర్వతపంక్తులుగలవు. వానిని తూర్పుకనుము లందురు. ఇవి పడమటికనుములవలె నంతయున్నతములయినవి కావు. ఈదేశముయొక్క మధ్యభాగము మిక్కిలియెత్తుగనుండి తూర్పునకుఁబోయినకొలఁది నేటవాలుగనుండును. తూర్పుకనుములకును సముద్రమునకును నడుమమిక్కిలి సారవంతములయిన బయళ్లుకలవు. పురాణప్రసిద్ధమయినమహేంద్రపర్వత మీదేశమున కుత్తరమున నున్నది. వానినే గంజాముజిల్లాలో మలయకొండ లనుచున్నారు ఈతూర్పుకనుమలె మలయకొండలని, నిమ్నగిరులని, పాలకొండలని, గోలకొండలని, పాపికొండలని, వెలికొండలని, ఆయాజిల్లాలయందు వేర్వేఱు పేరులం బిలువఁబడుచున్నయవి. ఇవిగాక నగరికొండలు, జవ్వాదికొండలు, శేషాచలపుకొండలు, నల్లమలకొండలు, ఎఱ్ఱమలకొండలు మొదలగునవి పెక్కులుగలవు. ఈదేశముయొక్క యుత్తరభాగము ఋషికుల్య, వంశధార, నాగావళి, శారదా మొదలగునదులచేతను, దక్షిణభాగము గుండ్లకమ్మ, ఉత్తరపినాకిని, చిత్రావతి, పాపఘ్ని మొదలగునదులచేతను, మధ్యభాగము కృష్ణా గోదావరీ మహానదులచేతను, ఇంద్రావతి, ప్రాణహిత, వరద, మంజీర, భీమరథి, తుంగభద్రా మొదలగు నుపనదులచేతను బ్రవహింపఁబడుచు దేశమంతయు సారవంతమై యొప్పుచున్నది. ఈనదులన్నియుఁ బడమటఁబుట్టి తూర్పుగాఁబ్రవహించి సముద్రమునం గలియుచున్నవి. పీఠభూములు ప్రత్తిపండునట్టి నల్లమట్టినేలలు గానున్నవి. ఈపీఠభూములయం దచ్చటచ్చట ఱాళ్లగుట్టలును కాఱడవులునుగలవు. ఈదేశమునందు జలసమృద్ధములయిన చెఱువు లనేకములుగలవు.

## శీతోష్ణస్థితులు.

ఈదేశమునం దుష్ణకాలమున నుష్ణమును, శీతకాలమున శీతమును నధికముగానుండును గాని యుష్ణదేశమనియె చెప్పఁదగియున్నది. తూర్పుభాగమునకంటె నడుమను, బడమటను వర్షములు తక్కువగాఁ గురియును. పీఠభూములు మిక్కిలిపొడిగానుండును. అరణ్యప్రదేశములుదక్క తక్కినతావు లారోగ్యప్రదములై యొప్పుచున్నవి.

## ఖనిజములు.

సమస్తలోహపదార్థము లీదేశమునం దుత్పత్తియగుచున్నవి. కోలారులోను, హైదరాబాదులోను బంగారుగనులుగలవు. మంచియినుము పెక్కుచోట్లదొరకును. నేలబొగ్గు హైదరాబాదురాజ్యమునందు విశేషముగాఁ జిక్కుచున్నది. అభ్రకపుగనులుకూడ పెక్కులు గన్పెట్టఁబడినవి. ప్రశస్తములయిన వజ్రముల కీదేశము ప్రసిద్ధికెక్కియున్నది.

## జనసంఖ్యయు ; భాషయును.

ఈమహాదేశమిప్పుడు రెండుకోట్ల పదిలక్షలమహాజనులచే నిబిడీకృతమైయున్నది. వీరికిమాతృభాషయగు నాంధ్రము హిందూస్థానమునందలి దేశభాషలతో మూడవదియై మాధుర్యమునందు "ఇటాలియనుభాషను" బోలియున్నదని ఖండాంతరపండితులచే సహితము గొనియాడఁబడుచు దినదినాభివృద్ధిగాంచుచున్నది. ఇట్లాంధ్రదేశమునందు మాత్రమేగాక ద్రావిడ కర్ణాటకదేశములందును నాంధ్రము మాటలాడువార లనేకులున్నారు. చెన్నపట్టణమునందుండెడిజనులలో నాల్గవవంతుకుఁబైగా జనులాంధ్రులుగానున్నారు. ద్రావిడదేశమునందలి జమీందారులనేకు లాంధ్రభాష మాటలాడు నాంధ్రులుగ నున్నారు. ఈ యాంధ్రులు పదునైదవ పదునాఱవ పదునేడవ శతాబ్దములయందు విజయనగరపురాజులు దక్షిణదేశమునకుదండెత్తిపోయి పాండ్య చోళ కేరళ దేశముల నాక్రమించుకొని పరిపాలించినకాలమున ద్రావిడదేశమునకుఁబోయి నాఁటనుండియు నచ్చటనే నివసించుచున్నారు. ఇంతియగాక బొంబాయి పట్టణమునందును కాశీపట్టణమునందును బర్మాలోని రంగము మోల్మేను (Moulmein) పట్టణములయందును నివాసము లేర్పఱచుకొని వసించునట్టి యాంధ్రు లనేకులున్నారు. వీరికందఱికి నాంధ్రము మాతృభాషగానున్నను వీరందఱు నుచ్చారణమునందును నడవడులయందును స్థలభేదములను బట్టి భేదించియున్నారు. ఉత్కలదేశప్రాంతములవా రొకరీతిగను, ద్రావిడదేశప్రాంతములవారు వేఱొకరీతిగను, కర్ణాటదేశప్రాంతములవారు మఱొకరీతిగను, మహారాష్ట్రదేశప్రాంతముల వా రింకొకరీతిగను వేషభాషలయందు వేఱుపడి ఆయాదేశ



సాంప్రదాయములను విశేషముగాఁ గలిగియుండి భిన్నజాతులట్లు గన్పడెదరు గాని నిక్కమాలోచింప వీరెల్లరు నాంధ్రులే గాన వేఱుగ భావింపరాదు.

## నాగరికత.

నదుల కానకట్టలు గట్టఁబడి కాలువలు త్రవ్వఁబడి దేశమునందంతట నదీజలములు ప్రవహింపఁ జేయఁబడి యూషరక్షేత్రములు సహితము వరిపండునట్టి దివ్యక్షేత్రములుగ మార్పఁబడి నానావిధములయిన పంటలు పండింపఁబడుచున్నవి. ఇట్లు దేశము జలపూరితమై సర్వసస్యఫలప్రదం బగుటంజేసి జనాభివృద్ధిగలిగి వానితోఁబాటు పట్టణములు పల్లెలు ద్విగుణముగా త్రిగుణముగా నధికముకాఁగా వాణిజ్యము హెచ్చినది. వాణిజ్యము హెచ్చినకొలఁది సౌకర్యము లెక్కువగ సమకూర్పఁబడినవి. మహానదులకు వంతెనలు గట్టఁబడి, పర్వతములు దొలువఁబడి, అయోమార్గములు నిర్మింపఁబడి పొగబండ్లు నడుపఁబడుచున్నవి. ప్రతి పెద్దపల్లెయందును లేఖావహన కార్యస్థానము(Post Office) నెలకొల్పఁబడినది. ప్రతిపట్టణమునందును తంత్రులమూలముగా వార్తలను బంపు కార్యస్థానములు (Telegraph Offices) నెలకొల్పఁబడినవి. బ్రిటీషుపాలనమున నాంధ్రులు విద్యాపరిజ్ఞానసంపన్నులై నానాట నాగరికతాభివృద్ధులను గాంచి వర్ధిలుచున్నారు. అభివృద్ధిఁ బడయుట కనుపయుక్తములగు సుగుణముల ననేకములఁ గలిగియుండి యాత్మస్వాతంత్ర్యమునం దభిలాషగలిగియుండియు నుద్రేకులుగాక ధైర్యము చూపవలసిన సత్కార్యసమయముల వెనుకంజవేయక శాంతమతులై నాగరికతయందు హిందూదేశమునందలి యేజాతివారికిని దీసిపోక సదా సంస్కరణాభిరతులయి మెలంగుచున్నారు. బ్రిటీషు పరిపాలనమునందింకను సత్యున్నతస్థితి కాంధ్రులు వత్తురని విశ్వసించుటకుఁ బ్రబలహేతువు లనేకములు గలవు.

ఏదేశమిట్లు రమ్యహర్మ్యములతో నొప్పెడి పట్టణరాజములచేతను, పుష్పఫల భరితములగు నుద్యాన వనారామములచే సొబగుమీఱెడి పల్లెలచేతను, భూమిని సర్వసస్యాఢ్యగఁ జేయునట్టి మహానదీనదంబులచేతను, సారవంతములై సర్వసస్యాఢ్యములయిన సుక్షేత్రములచేతను, తామర తంపరయై

నిరంతరము వర్ధిల్లుచుండెడి జనపరంపరచేతను, దివ్యక్షేత్రమాహాత్మ్యముల బోధించెడి స్థలపురాణాద్యుద్గ్రంథసముదాయముచేతను, అలంకరింపఁబడి దేవతల యుద్యానవనమో, పాలకుల ముంగొంగుబంగారమో, గృహస్థుల భూతల స్వర్గమో యన నాగరికతాభివృద్ధులఁ బెల్లుగ నతిశయిల్లుచు నాంధ్రనామముచే వ్యవహరింపఁ బడుచున్నదో అట్టి యీదేశము మూడువేలేండ్లకు పూర్వ మొకప్పుడు ఘోరకిరాతావృత దండకారణ్య మధ్యగతమైన చీమలేని చిట్టడవిగను, కాకిలేని కాఱడవిగను నుండినట్లు మన పూర్వగ్రంథములు చాటుచున్నవి.



## రెండవప్రకరణము.

---

### దండకారణ్యప్రశంస.

మనపురాతనగ్రంథములలో శ్రీమద్రామాయణ మహాభారతములు మన పూర్వుల చరిత్రములను గొంతవఱకుఁ దెలుపుటకు సాధనములుగా నున్నవి. తన తండ్రియగు దశరథుఁడు కేకయ రాజపుత్త్రికొసంగినవరములఁదీర్చి తండ్రి యాడినపలుకు దబ్బర గాకుండ నిలుపుటకై దేశములందును గ్రామములందును బ్రవేశింప నొల్లక పదునాలుగు సంవత్సరములు వట్టి యరణ్యమునందే నివసింప దీక్ష వహించి శ్రీరాముఁడు సీతాలక్ష్మణ సమేతముగా వచ్చి యిప్పటి యీ యాంధ్రదేశప్రాంతములయందు సంచరించినట్లును, అప్పుడీప్రాంతము ఘోరారణ్య ప్రదేశముగా నున్నట్లును శ్రీమద్రామాయణమునందుఁ దెల్పఁబడినది. అదియునుం గాక యీ మహారణ్యప్రదేశమునకు దిగువను కిష్కింధారాజ్య మున్నట్లుగూడఁ జెప్పఁబడినది. మఱియును రావణుఁడు సీత నెత్తికొనిపోయినప్పుడామె మొఱ్ఱనాలకించి యాసాధ్వీమణిని రక్షింపవచ్చుటకుఁ గాని యామె యిచ్చెడు నాన వాలును భద్రపఱచుటకుఁ గాని గోదావరి మొదలుకొని పంపానది[1] వఱకు నామెకెవ్వరును గాన్పించి యుండలేదనియుఁ గూడఁ దెల్పఁబడి యుండెను. పంపానది కావలమాత్రము సుగ్రీవాదులు గాన్పించిరి. దీనిం బట్టి రామాయణమునాటికి హిందూదేశము యొక్క యుత్తరపుకొనయును,దక్షిణపుకొనయును నాగరికులయిన జనులచే నివసింపఁబడుచుండినవనియును, ఈ మహారణ్యమునం దనాగరికులయిన జాతులవా రచ్చటచ్చట నివాసము లేర్పఱచు

---

1. పంపానదియె తుంగభద్రానది. రామాయణమునందు పంపా పంపా సరమని వర్ణింపఁబడినవి. బల్లారిజిల్లాలో హంపీ, హంపీసాగరమను పేరఁ బరగుచున్నవి. హిందూదేశకథాసంగ్రహము. ప్రథమభాగము ౫౮ వ పుట.

కొని యున్నను అధికభాగము నిర్జనారణ్యముగానె యుండెడిదని యూహింపవచ్చును.

## దండకారణ్యగాథ.

ఈయరణ్యప్రదేశమునకే దండకారణ్యమని పేరుగలిగినది. "పూర్వము వింధ్యాద్రిమొదలుకొని యంతటను నూఱుయోజనములు ప్రమాణముగాఁగలదేశమునంతను గిరాతులచేఁ జుట్టుకొనఁబడి యున్న దానిని దండుఁడను రాజు పరిపాలనము సేయుచు నుండి యొకనాఁడు వేటకుం జని యరణ్యసంచారము సలుపుచు తన కులగురుఁడగు శుక్రునికూఁతు నరజ యనుదానిఁ గాంచి మోహవివశుఁడై యామెను జెఱఁబట్టి యామె యిచ్చకు వ్యతిరేకముగా బలాత్కరించెను. దాని నంతయును శుక్రుఁడు కొమార్తెవలనం దెలిసికొని యాగ్రహించి వాని దేశమున నేడుదినములు మట్టివాన గురియు నని శపించెను. ఆశాపకారణమున నీప్రదేశమంతయు నిర్మానుష్యమగు దండకారణ్యమైనదని యుత్తరరామాయణమునఁ జెప్పఁబడినది. మఱియు నీదేశము కిరాతజాతులచే నివసింపఁబడుచుండియుఁ బూర్వకాలమునందే భార్గవనామక బాడబగోత్రజాత (అగ్నిపర్వతముల) ముఖంబుననుండి వెడలఁగ్రక్కఁబడిన బురద వానచే నిర్మూలము చేయఁబడినదనిగూడఁ జెప్పఁబడినది. పూర్వ మెప్పుడో యొకానొకప్పుడీ దేశమగ్నిపర్వతములచేత నాశము చేయఁబడినదని పై గాథవలన మనకు సులభముగా బోధపడుచున్నది.

## కొల్లేరుసరస్సు.

ఈ దండకారణ్యమధ్యమున యోజనాయతమైన (100 చతురపు మైళ్ల వైశాల్యముగల) మహాసరస్సొకటి కలదనియు, అది జలవిహంగమములతో నత్యంతరమణీయమై యొప్పుచున్నదనియు, దానియొడ్డున నొక యాశ్రమము కలదుగాని యందెవరును లేరనియు, సమీపమునఁ బడియున్న శవమును దినుట కేజంతువును లేదనియు, ఆప్రదేశమంత నిర్జంతుకముగా నున్నదనియు, నగస్త్యుఁడు శ్రీరామచంద్రునితోఁ జెప్పినట్లుగనుత్తర రామాయణమునఁ జెప్పఁ



బడి యున్నది.[1] ఉత్తరరామాయణమునందు దండకారణ్యములోని దనిషేర్కొనఁబడిన యీసరస్సెక్కడనున్నదని విచారింపఁగా నయ్యది యాంధ్రదేశములోనిదిగాఁ జూపట్టుచున్నది. ఏమన గొప్పదైదండకారణ్య మధ్యగతమై కొంగలకాకరమై యుండు తియ్యనీటికొలను మన యాంధ్రదేశముననే కాని మఱియెచ్చటను గానరాదు. మఱియు దండియను మహాకవి తన దశకుమారచరిత్రములో నీయాంధ్రదేశము నభివర్ణింపుచు నిందొక మహాసరస్సుగలదనియు నది పారసనిలయమనియు నది యాంధ్రనగరికి[2] ననతిదూరముగానున్నదనియుఁ జేర్కొని యుండుటచేత నట్లభివర్ణింపఁబడిన కొలను కొల్లేరుకాక మఱియొక్కటి కానేరదు.[3]

"కొల్లేటికొంగ"లను లోకోక్తియె కొల్లేరు కొంగలకుఁ బ్రసిద్ధమను విషయమును వేనోళ్లఁ జాటుచున్నది. దక్షిణ హిందూస్థానమున నెన్నందగిన పెద్దతియ్య నీటికొలను "కొల్లేరు" మాత్రమే యై దండిచెప్పినట్లుగా సలిలరాశి

---

(1) "ఏనం త్రేతాయుగే రామ బభూవ బహువిస్తరం । సమంతాద్యోజనశతం మృగపక్షివివర్జితం । తస్మిన్నిర్మానుషేరణ్యే కుర్వాణ స్తప ఉత్తమం అహ మాక్రమితం సౌమ్య మధారణ్య ముపాగమం ॥ తస్యరూప మరణ్యస్య నిర్దేష్టుం నైవ శక్నుమః॥ * * * * తస్యారణ్యస్య మధ్యేతు సరోయోజన మాయతం । హంసకారండవాకీర్ణం చక్రవాకోపశోభితం। * * * సమీపేతస్య సరసో మహ దద్భుత మాశ్రమమ్। పురాణం పుణ్య మత్యర్థంతపస్విజన వర్జితమ్ ॥"

(2) "అయానివంచదినైః కైశ్చిదంధ్రనగరం । తస్యనాత్యాసన్నే సలిలరాశినదృశస్య కలహంసగణదళితనళినదళసంహతిగళిత కింజల్క శకలశారస్య సారసశ్రేణి శేఖరస్య సరసస్తీరకాననే కృతనికేతనస్థితః ॥"

(3) ఆంధ్రనగరియనునది యోరుగల్లు పట్టణమనియు, అందభివర్ణింపఁబడిన సరస్సు సమీపమున నెచ్చటనో యున్నదనియు కొందఱు చెప్పుచున్నారు.

సదృశమై యాంధ్రనగరియగు వేంగీపురమునకు నాత్యాసన్నమై యున్నదనుటకు సందియములేదు. ఇది యిప్పుడు ౨౫ మైళ్ల పొడవును ౧౦ మైళ్లవెడల్పును గలిగియున్నది. కాఁబట్టి యిప్పటి యాంధ్రదేశము దండకారణ్యములో నొకభాగముగా నుండెనని తేటపడుచున్నది.

## పంచవటి.

అయినను ఆంధ్రదేశమును దండకారణ్యమునుండి తొలగించి దక్షిణాపథమన మహారాష్ట్రదేశమనియు, ఇప్పటి మహారాష్ట్రదేశమె పూర్వము దండకారణ్యముగా నుండెననియు, అగస్త్యాశ్రమమునకు యోజన దూరమున గోదావరీతీరమున నుండిన పంచవటియందు శ్రీరాముఁడుకొంతకాలమునివసించెననియు, హిందూమత కర్మ కాండ ప్రకారము నేమతకార్య మాచరించినను తమదేశము పేరు చెప్పుకొనుట నాచారముగావున సంకల్పము చెప్పునప్పుడు మహారాష్ట్ర దేశస్థులు మహారాష్ట్ర దేశము పేరు చెప్పుకొనక “దండకారణ్యదేశే” యని దండకారణ్యము పేరు మాత్రమె చెప్పుచున్నారనియు గోదావరి తీరమునందలి నాసికపట్టణమే పంచవటి యని చెప్పుకొనఁబడుచున్నదనియు, గోదావరి ప్రవహించెడి సహ్యాద్రియొక్క యుత్తరభాగమైన గోవర్ధనము పురాణములయందభి వర్ణింపఁబడినదనియు, భారద్వాజుఁడు తన భార్యను సంతోషపెట్టుటకై గోవర్ధనమున నొక యా రామమును నిర్మించెననియు, గోవర్ధనము పురాణములయందు పట్టణముగాను పర్వతముగాను గూడఁ దెల్పఁబడుట చేతను గోవర్ధనము గ్రామమొకటి నాసికపట్టణ సమాపమున నుండుటచేతను నాసికపట్టణమె పంచవటియని పురాణములు సమర్థించుచున్నవిగా గ్రహింపవలసినదనియు డాక్టరు భాండార్‌కర్‌గారు తమ దక్షిణాపథ దేశ పూర్వచరిత్రమునందుఁ జర్చించియున్నారు. [1] మహారాష్ట్రము దండకారణ్యములోనిది కాదని మేమిప్పుడు చెప్పఁబూను కొనలేదు గాని దండకారణ్య దేశమునుండి యాంధ్రదేశమును దొలఁగించుటకును, పంచవటి యన నాసికపట్టణమే యని

1 Dr. Bhandarkar's Early History of Deckhan. sec.1-2-3.



నిర్దేశించుటకును సాహసింపరాదని నిస్సంశయముగఁ జెప్పఁగలము. సంకల్పము చెప్పునప్పుడు, “దండకారణ్యదేశే” యని చెప్పుకొనునది యొక్క మహారాష్ట్ర దేశస్థులు మాత్రమెగాదు; ఆంధ్ర దేశస్థులు, అందు ముఖ్యముగా కృష్ణా గోదావరీ మధ్యఖండమున నుండువారుసహితముఁ జెప్పుకొనుచున్నారు. ఇట్టి యాచార ముండుటచేతను పై గ్రంథములలో నుదాహరింపఁబడిన దండకారణ్య వర్ణనలచేతను, ఆంధ్రదేశముకూడ దండకారణ్యములోనిదే యని విస్పష్టమగుచున్నది. ఇంతియగాక పంచవటి కొందఱుచెప్పినట్లు మహారాష్ట్ర దేశమునందుగాక యిప్పటి యాంధ్రదేశమునందే కలదని యాంధ్రుల యభిప్రాయమై యున్నది. శ్రీమద్రామాయణము నాసికపంచవటి యను వారివాదము నెంతమాత్రమును సమర్థించుచుండలేదు. రామాయణమునందును భవభూతికృతమగు నుత్తరరామచరిత్రమునందును పంచవటికడ గోదావరి వెడల్పుగానున్నట్లు చెప్పఁబడియున్నదని వారే యొప్పుకొనుచున్నారు. జనస్థానమునకు సమీపమునందున్న నాసికయం దట్లుకాదని జగద్విదితమైన విషయముగాన వేఱ నుడువఁబనిలేదు. ప్రస్తుతము గోదావరిమండలములోని భద్రాచలమునకు సమీపమున నున్న పర్ణశాలయె పంచవటియని యాంధ్రులు విశ్వసించు చున్నారు. వాల్మీకి రామాయణములోని వర్ణనను బట్టియు, ఆధునిక విద్వాంసుల యభిప్రాయమును బట్టియు, చూడఁగా వీరినమ్మికయె నిజమైనదని తోఁచుచున్నది. రామాయణములోని పంచవటియె నాసికపట్టణమగు నేని రాముఁడు చిత్రకూటమునుండి నాసికకువచ్చునప్పుడు మధ్యను వింధ్యపర్వతమును నర్మదానదియును దగులకమానవు. ఈనదియును పర్వతమునుగూడ రాముని మార్గమున నున్నట్లు వాల్మీకి రామాయణమునందు వ్రాసియుండలేదు. రామాయణమునందు వర్ణింపఁబడినదిశలను జూచినపక్షమున పర్ణశాల హిందూదేశమునకుఁ దూర్పుప్రక్కను నుండవలసినట్లూహింపవలసియున్నది. శ్రీరాముని దండకారణ్య మార్గ మీక్రిందిరీతిగ నున్నది.

## శ్రీరాముని దండకారణ్య మార్గము.

“సీతాలక్ష్మణ సమేతముగా శ్రీరాముఁ డయోధ్యనుండి బయలుదేఱి భరద్వాజాశ్రమమునకు వచ్చియుండెను. భరద్వాజాశ్రమము ప్రయాగలోను

న్నది.[1] అచ్చట నొకరాత్రముగడపి వారు చిత్రకూటమునకు వెళ్లిరి. చిత్రకూటము ప్రయాగకుఁ బదిక్రోశములమీఁద నుండెను.[2] ఇప్పటిలెక్క ననుసరించి ప్రయాగకుఁ జిత్రకూటము డెబ్బదియైదు మైళ్లదూరమున నున్నది. ఇందువలన రామాయణములోని క్రోశమునకు నేఁడున్నర మైళ్లు సరిగానుండునని మనమూహింపవలసియున్నది. ఈ చిత్రకూటము సమీపమున మందాకిని యనునది యున్నట్లుగఁ జెప్పఁబడినది. ఇప్పుడును నా పేరుగలనదియే యాపర్వతముకడనున్నది. కనుకఁ బ్రస్తుతము ప్రయాగపట్టణమునకుఁ బశ్చిమమున డెబ్బదియైదు మైళ్లదూరముననున్న చిత్రకూటమను పర్వతమే రామాయణములోని చిత్రకూటమని నిశ్చయించుటకు సంశయింపంబనిలేదు. అచ్చటనుండి వారుమూవురు నాగ్నేయదిక్కునకుఁబోయి "అత్రిమహర్షి" యొక్క యాశ్రమములోఁ బ్రవేశించిరి. ఆశ్రమమనఁగా కొన్నిమునిపల్లెల సమూహముగాని యొకపర్ణ శాలకాదు.

ఆకాలమునం దొకానొకమహర్షి నాశ్రయించి యనేకశిష్యులు సమీపప్రదేశములఁజుట్టును గుటీరముల నిర్మించుకొని నివసించుచుండెడివారు. అట్టి మునిపల్లెలన్నియు మహర్షియొక్క యాశ్రమమని పిలువఁబడు చుండినవి. అత్రిమహర్షియొక్క యాశ్రమము మిక్కిలి విశాలమైనదిగనుండెను. ఇయ్యది ప్రస్తుతపురీవాప్రాంతముయొక్క దక్షిణసీమవఱకు వ్యాపించెనని చెప్పవచ్చును. అత్రిమహాముని భార్య యనసూయ యను నామె. అనసూయకును సీతకును జరిగినసంవాదము మిక్కిలి జ్ఞానప్రదమైనదిగనున్నది. వీరిచ్చట నున్నకాలమున ఋషులు గొందఱువచ్చి తమకు రాక్షసులవలనఁ గలిగెడిబాధలను మాన్పుమని కోరఁగా రాముఁ డొకమహారణ్యమును బ్రవేశించెనని తెల్పఁబడినది.[3] ఈయరణ్యమే దండకారణ్యముగానున్నది. ఇది మిక్కిలి విస్తీర్ణమైన యరణ్యము. అసంఖ్యాబు

1 వాల్మీకిరామాయణము, అయోధ్యాకాండము ౪౫ సర్గము మొదలు ౫౪ వఱకు.

2 (అయోధ్యా ౫౪—౭) 3 (అయో ౯౫)

౨ (౭౧ అధ్యా ౧౬—౨౨)



ష్యాశ్రమములును, అనేక రాక్షసనివాసస్థలంబులు నిండుండెను. ఈదండకారణ్యమునకు నుత్తరమున గంగానదియొక్క దక్షిణపుతీరమును, వింధ్యపర్వతమును; పశ్చిమమున నుత్తరవింధ్యము, అత్ర్యాశ్రమము దక్షిణకోసలము, మలయాద్రియు; దక్షిణమున కిష్కింధారాజ్యమును ద్రవిడపాండ్యదేశములును; తూర్పున నుత్కలకళింగాంధ్రచోళదేశములు నుండెను. ఈదండకారణ్యములో రామునికిఁ ద్రోవఁజూపుటకు ఋషులు గొందఱు వెంటనడచిరి.[1] రామునికి మార్గమున ననేక ఋష్యాశ్రమములు దగిలెను. కొంతదూర మరిగినతరువాత విరాధునివనము గానిపించెను. ఇది దండకాంతర్గతము ఇది మధ్యపరగణాలలోని "బిలాస్పూరు" జిల్లాలో నీశాన్యపుదిక్కుననున్నది.

ఇచ్చటనుండి యర్ధయోజనముమీఁదననఁగాఁ బదునైదు మైళ్లదూరమున శరభంగాశ్రమముండెను.[2] ఈ యాశ్రమము విరాధుని వనమునకు దక్షిణమున నాజిల్లాలోనే యుత్తర భాగమున నీశాన్యపు మూలనుండినట్లు గానవచ్చుచున్నది. రాముని దర్శనమైన తరువాత శరభంగుఁ డగ్నిప్రవేశముఁ జేసెను. అచ్చట రామునిఁ జూడ మును లనేకులువచ్చి రాక్షసులచేఁ జంపఁబడిన ఋషుల యస్థిపుంజముల ప్రోవులనుజూపిరి. వారలనందఱిని రక్షించెదనని రాముఁ డభయహస్తమునొసంగి యచ్చటనుండి సుతీక్ష్ణాశ్రమమునకుఁ బోయెను.[3] ఆయాశ్రమమున నొకరాత్రముండి తరువాత నక్కడనుండి బయలుదేఱి త్రోవలో నాశ్రమములఁ బెక్కింటిని గనుగొనుచుఁ బోయెను. కొంతదూరము పోవునప్పటికి నొక గొప్పసరోవరముఁ గానిపించెను. దానికే పంచాప్సరసమని పేరు. రామునకు దారిచూపుచున్న ధర్మభృతుఁ డనుఋషి యాసరోవరమును గూర్చిన యితిహాసములఁ గొన్నిఁటిని వానికిఁజెప్పెను. మాండకర్ణి ఋషియొక్క తపస్సుచే నీసరోవరము నిర్మింపఁబడెనఁట.[4] ఈపంచాప్సరస్సరోవరము బిలాస్పూరు జిల్లాలోనిదని కొన్ని హేతువులం గనంబఱచి జనరల్ కన్నింహ్యాం దొరగారు నిశ్చయించి

1 (అరణ్య ౧ సర్గము) 2 (౨-౩-౪ సర్గములు). 3 (౭ సర్గము). 4 (౧౧ సర్గ ౧-౨౦).

యున్నారు.[1] మఱియును కాళిదాసునిచే మేఘసందేశమునందు వర్ణింపఁబడిన యక్షుని నివాసస్థలమగు రామగిరి.[2] యీ యాశ్రమ ప్రాంతముననే యుండెనని కొందఱు విద్వాంసుల యభిప్రాయమై యున్నది.

సుతీక్ష్ణాశ్రమమునకు దక్షిణమున నాలుగుయోజనములమీఁదనఁగా ౧౨౦ మైళ్లమీఁదనగస్త్యమహాముని భ్రాతయొక్క యాశ్రమముండెను. ఈయాశ్రమము రాయపూరు జిల్లాయొక్క దక్షిణభాగమును బస్తరుసంస్థానము యొక్క యుత్తరభాగమును వ్యాపించి యుండెనని రామాయణములోని వర్ణనవలన మన మూహింపవలసియున్నది. ఈ యాశ్రమమునకు దక్షిణమున నొకయోజనము (30 మైళ్లు) మీఁద నగస్త్యాశ్రమముండెను. ఈ యాశ్రమము బస్తరు సంస్థానమునకు దక్షిణభాగమునం దుండెను. అగస్త్యాశ్రమమునకు దక్షిణమున రెండామడల దూరమున నఁగా నలువది మైళ్లదూరమునఁ బంచవటీప్రదేశమును గోదావరియు నున్నవి. పంచవటి కొంతవఱకు నరణ్యప్రదేశమగుటం జేసి గోదావరికి సమీపమునఁ బర్ణశాల నిర్మించుకొని సీతారామ లక్ష్మణులు కొన్ని దినములు నివసించియుండిరి. ప్రస్తుతపు గోదావరిమండలములోని భద్రాచలమునకు సమీపమున నున్న పర్ణశాలయను గ్రామములో శ్రీరాముని పర్ణశాలయుండెనని యాంధ్రుల యభిప్రాయమై యున్నది. రాముఁడు పంచవటిలో నుండఁగ శూర్పణఖవచ్చి యాతని మోహించుటయు, లక్ష్మణుఁడు దాని ముక్కుచెవులు గోయుటయు, ఖరాదిరాక్షసులను జంపుటయు మొదలుగాఁగల కథ యంతయు నడచినది ఈ ఖరాదులందఱును జనస్థానమం దుండిరి.

కావున నీజనస్థానమనునది యెద్దియోమనము దెలిసికోవలసి యున్నది. మధ్యపరగణాలలోని రాయపూర్ (రాయపురము) జిల్లాయొక్కయు, బస్తరు సంస్థానము యొక్కయుఁ బూర్వభాగమును, సంబల్పూరు (సంబళపురము)

1 (Agcheological Reports vol XI) 2. (మేఘసందేశము ౧వ శ్లోకము).



జిల్లాలోని చాలభాగమును, చెన్నరాజధానిలోని జయపురసంస్థానాంతర్గతమై గోదావరికి నుత్తరముననున్న కొంతభాగమును, గోదావరికి దక్షిణముననున్న నైజాము రాజ్యములోని చాలభాగమును ఈజనస్థానము లోనివిగాఁ గానవచ్చుచున్నవి. రావణుని తమ్ముఁడగు ఖరుఁ డీజనస్థానమున కధిపతిగా నుండెను. వీని రాజధాని ఖరాలయము. రాయపూరు జిల్లాలోని "ఖరియా" లనునదియె ఖరాలయమని చెప్పఁబడుచున్నది. సంబలపూరనునదియె వాల్మీకిచే వర్ణింపఁబడిన శంబరపురమని చెప్పఁబడుచున్నది. పంచవటీ ప్రదేశముగూడ జనస్థానాంతర్గతమైనదిగఁ గానంబడియెడు. పర్ణశాలనుండి రావణుఁడు సీతనెత్తికొనిపోయిన కథ సర్వజన విదితమైనదే. గోదావరికి నుత్తరమునఁ బంచవటీ ప్రదేశమునందును జనస్థానమునందును సీతను వెదకివెదకి గోదావరియొడ్డునఁ గొంతదూరమరిగి పర్ణశాలకుఁ దూర్పున భద్రాచలముకడ రామలక్ష్మణులు గోదావరినదినిదాఁటిరి. నదికి దక్షిణముగా జనస్థానమునఁ గొంతదూరము ప్రయాణముచేసిన తరువాత జటాయువు గలిసికొనియెను. అప్పటనుండి పశ్చిమదిశను నైఋతిదిశను గొంతనడచి[2] జనస్థానారణ్యమును దాటిన తరువాత సూటిగ దక్షిణదిశకు బోయిరి.[3] జనస్థానానంతరమున మూఁడు క్రోశములమీఁదఁ గ్రౌంచారణ్యము దగిలెను. ఇది నైజాము రాజ్యమునకు నైఋతిమూలనుండెను. ఈ యరణ్యమును విడుచుటకుఁ బూర్వము మూఁడుక్రోశములు తూర్పుదిక్కునకుఁ బోయిరి. ఇచ్చటనే వీరికిఁ గబంధుఁడడ్డుపడెను. వాఁడు చెప్పినందున నచ్చటనుండి వారిరువురు పశ్చిమదిశను బంపకుఁ బోయిరి. పంచవటినుండి పంపానదివఱకు వాల్మీకి రామాయణములో నిచ్చిన యీదిశలను బట్టి చూచినను నవి భద్రాచలమునకు సమీపమునందలి పర్ణశాలకు ననుకూలములుగా నున్నవే కాని నాసికపట్టణము పంచవటియని గాని జనస్థానమని కాని యను కొనుటకు ననుకూలములుగాలేవు. ఋశ్యమూకము, మాల్యవంతము, కిష్కింధము మొదలయిన ప్రదేశములన్నియు హాంపీ విరూపాక్షము సమీపమునందలి పర్వతాదులని యందఱి యభిప్రా

1 (౬-౨-౮-౪౬). 2 (౬౭-౧-౨). 3. (౬-౮

యమై యున్నది.[1] కాఁబట్టి యాంధ్రదేశము దండకారణ్యములోనిదని పైఁ జేర్కొనఁబడిన శ్రీరాముని మార్గమువలననే తేటపడుచున్నది. ఇంక నాంధ్ర దేశమెట్లు నాగరికతఁగాంచి యెప్పటినుండి ప్రఖ్యాతికి వచ్చినదో వీనిం గూర్చి మనము విశేషముగాఁ జర్చించి దెలిసికోవలసి యున్నది.



1 హిందూదేశకథాసంగ్రహము, ప్రథమభాగము. పొరట. ౪౩-౪౫.

## మూఁడవ ప్రకరణము.

---

### ఆంధ్రదేశప్రశంస.

ఇప్పుడు మన మేభూభాగము నాంధ్రదేశమని పిలుచుచున్నారమో యాభూభాగము పూర్వము దండకారణ్యములోనిదని చెప్పఁబడినంతమాత్రమున నాకాలమున నాంధ్రదేశముగాని యాంధ్రులుగాని యిచ్చట లేరని యూహింపరాదు. ఆంధ్రులు ప్రాచీనులేగాని నవీనులుగారు. వేదములలో మిక్కిలి ప్రాచీనమైనదగు ఋగ్వేదమునందలి యైతరేయ బ్రాహ్మణమునందు నాంధ్రుల ప్రశంసగలదు. అం దాంధ్రు లనాగరికారణ్యకజాతులలోఁ జేర్పఁబడియుండిరని యీక్రిందివాక్యమువలన బోధపడగలదు. "శ్రు. తస్యహవిశ్వామిత్రస్యైకశతం పుత్రా ఆసుః - పంచాశదేవజ్యాయాంసో మధుచంవసః.. పంచాశత్కనీయాంస్తస్త్యేజ్యాయాంసో నతే కుశలంమేనిరే. తాననువ్యాజహారాంతాన్వః ప్రజా భక్షీష్టేతి-తఏతేంధ్రాః పుండ్రాః శబరాః, పులిందామూతిబా ఇత్యుదంత్యా ఒహవోభవంతి."[1] విశ్వామిత్రఋషి తనపుత్త్రులలో నేబదుండ్రయొక్క సంతతిని ఆర్యాశ్రమములయొక్క సరిహద్దులలో నివసించునట్లుగా శపించెననియు, వారలే ఆంధ్రులనియు, పుండ్రులనియు, శబరులనియు, పులిందులనియు, మూతిబాలనియు, పిలువఁబడుచున్నారనియు,విశ్వామిత్రుని సంతతివారలే దస్యులలో నధికభాగముగా నేర్పడిరని తెలుపఁబడినది. వీరెల్లరును దక్షిణమున నివసించుచుండిన వారని చెప్పఁబడుచున్నారు పులిందులును శబరులును వింధ్యపర్వత ప్రాంతభూములయందు నివసించియుండినవారని నవీనగ్రంథములవలనఁ దెలియుచున్నది. వింధ్యపర్వతారణ్యములలో శబరులున్నారని బాణకవి తన కాదంబరియందు వ్రాసియున్నాఁడు.

1 ఐతరేయబ్రాహ్మణము; సంచిక ౭ అధ్యాయము 3; కండిక ౧౫.

ఆంధ్రులు కృష్ణా గోదావరులనడుమనుండెడి యరణ్యప్రదేశమునఁ దూర్పుభాగమున ననఁగా నిప్పటి కృష్ణామండలమున నివసించుచుండెడి వారని చరిత్రకారు లనేకు లభిప్రాయపడియున్నారు. కృష్ణా గోదావరుల నడుమనుండెడు నరణ్యప్రదేశమె యాకాలమునం దాంధ్రదేశముగా నుండెను. రామాయణ మహాభారతములనాఁటికి దక్షిణాపథమున నాంధ్రదేశము లేదనియు, ఇప్పటి యాంధ్రదేశము బహునవీనమైనదనియు, ఆంధ్రులు మగధదేశ సమీపమున గంగాతీరము నందుండి నాగరికులై క్రమక్రమముగా దక్షిణమునకు వచ్చి యీదేశమును జయించి యాక్రమించుకొనిరనియు, అప్పటినుండియు నీదేశమున కాంధ్రదేశమని పేరు వచ్చినదనియు కొందఱు పాశ్చాత్యులు మాత్రమె గాక మనవారు గూడ కొందఱు తలంచుచుండిరి. మఱియును రామాయణమునం దీప్రదేశము దండకారణ్యముగాఁ జెప్పఁబడుటచేతను శ్రీరాముని మార్గమునం దీదేశముఁ జేర్కొనఁబడ కుండుటచేతను, రామాయణములోని కిష్కింధాకాండములో నాంధ్రాదిదేశముల ప్రశంస దేశములఁ దెల్పుచోట గలిగియున్నను నది ప్రక్షిప్తముగా గ్రహింపవలసి యున్నదనియు, ఇఁక మహాభారతమును బట్టి చూచినను నీప్రదేశ మరణ్యమయమనియె తోఁచుచున్నదనియు, అర్జునుఁడు తీర్థయాత్రకు బయలుదేఱి మహేంద్రపర్వతము [1] వఱకును తీర్థములను దేశములను, ఆయతనములను జూచుచు వచ్చి దాని దాఁటిన తరువాత మణిపూరము [2] వఱకును సముద్రతీరమునఁ బడిపోయి మరల మణిపూరము మొదలు పట్టణములను, మేడలను, మిద్దెలను తీర్థములను జూచినట్లు చెప్పఁబడినది గాని యాంధ్రదేశము చెప్పఁబడలేదనియు, ఇందును దేశములఁ దెల్పుచోట నాంధ్రాదిదేశముల ప్రశంసకలదుగాని యదియును ప్రక్షిప్తమని పై విషయమువలననే బోధపడగలదనియు, కావున మహేంద్రపర్వతమునకును పాండ్యదేశమునకును నడుమ దేశములేదని కొందఱు తలంచుచున్నారు [3] గాని

1 ఇది గంజాముజిల్లాలో నుత్తరభాగమున నున్నది.

2 ఇది పాండ్యదేశమునకు ముఖ్యపట్టణము.

3 నన్నయభట్టారక చరిత్రము. పుటలు ౩౬—౪౨.



యది విశ్వసనీయముగాదు. పైనుదాహరింపఁబడిన యైతరేయ బ్రాహ్మణ వచనమునుబట్టి యాంధ్రు లను నవాగరికారణ్యకజాతివారొకరుకలరని తేటపడినది. ఆ యనాగరికాంధ్రులు నివసించుదేశమె యాంధ్రదేశ మనంబడుచున్నది. నాగరికులు వసియింప శక్యముకాని యంధకార బంధురమైన మహారణ్య ప్రదేశమునందు నివసించెడువారగుటచేతనే యార్యులు వీరిదేశము నాంధ్రదేశమనియు వీరిని నాంధ్రులనియు వాడుచువచ్చిరి. అనాగరికులయిన యాంధ్రులు నివసించు దేశమునమిద్దెలు, మేడలు నెట్లుగాననగును? అనాగరిక దేశమునందుఁ బుణ్యతీర్థము లెట్లుగాననగును? అర్జునుఁడు ప్రశంసింపక పోయినంతమాత్రముచేత నప్పటియనాగరికాంధ్రదేశము లేదనుకోవచ్చునా ? మహాభారతము సభాపర్వమునందును, రామాయణము కిష్కింధాకాండములోను నాంధ్రులు దక్షిణాపథముననున్నవారని తెల్పఁబడియుండలేదా [1] ? కాఁబట్టి రామాయణ మహాభారతములనాటికి దక్షిణాపథమున నాంధ్రులులేరని ఆంధ్రదేశములేదని చెప్పుటసాహసము. ఆంధ్రులున్నారని యొప్పుకొనుచు నాంధ్రదేశములేదనుట మహాసాహసము. ఆంధ్రదేశము లేదనరాదుగాని అప్పటికప్రసిద్ధమై అనార్యమై అరణ్యప్రదేశమున నున్నదని యొప్పుకొనక తప్పదు.

ఈభాగమునం దాంధ్రదేశము లేకుండుటచేతనే కాళిదాసు తన రఘువంశమునందు కళింగదేశమును పాండ్యదేశమును వర్ణించి నడుమనున్న యాంధ్రదేశమును వర్ణింపకుండెనని చెప్పుదురు కాని కొంచె మించుమించుగఁ గాళిదాసుని కాలమునందే యుండిన వరాహమిహిరాచార్యులు తన బృహత్సంహిత కూర్మ విభాగమునందు నాంధ్రదేశమును ప్రశంసించియే యున్నాఁడు. [2] అశోకుని

1 "శ్లో. పాండ్రాంశ్చద్రవిడాంశ్చైవ సహితాం శ్చోడ్రకేరళైః । ఆంధ్రాం స్తాలవనాంశ్చైవ కళింగా నుష్ట్రికర్ణికాన్" మహాభారతము, సభాపర్వము.

2 ఆగ్నేయాందిశి వర్ణితః. తథా, ఆగ్నేయాందిశి-కౌశలకళింగ వంగోపవంగ జఠరాంగాః కౌణిక విదర్భవత్సాంధ్ర చేదికాశ్చో ర్ధ్వకంఠాశ్చ. అని బృహత్సంహితాకూర్మవిభాగము. వాచస్పత్యము.

శాసనములలో నెచ్చటను ఆంధ్రరాష్ట్రముల ప్రస్తావము లేశమును లేదనియు "బహుశః" అప్పటికా హిందూభూభాగము బొత్తుగా నాగరికతలేక కొండకోయలకు నివాసస్థానమై యుండనోపు నని డాక్టరు బర్నెలుగారు తమ ప్రాచీనలిపి శాస్త్రములో వ్రాసియున్నారు.[1] ఈ బర్నెలుగారి లేఖనమును జూచి భ్రమపడియె కాఁబోలు "అశోకుని శాసనములలోఁ బలుతావుల పాండ్యచోళాదుల ప్రశంసకలదు; అప్పటి కాంధ్రదేశమే యున్నయెడల దీని ప్రశంస లేకయుండదు; అశోకుని కాలము క్రీస్తుశకమునకుఁ బూర్వము సం|| ౨౬౦ అయియున్నది; అప్పటికీ భూభాగము పట్టి యరణ్యప్రదేశమె గాని జననివాసయోగ్యంబగు దేశముగాదు; ఈసంగతినే మనగ్రంథములును దెలుపుచున్నవి." అని యొకరు వ్రాసియున్నారు.[2]

అశోకుని కాలము నాటికె నాంధ్రులు నాగరికులై పల్లెలు పట్టణములు దుర్గములు నిర్మించుకొని రాజ్యములు స్థాపించి ప్రభుత్వములు సేయుచుండిరనుటకు నశోకుని శాసనములే సాక్ష్యమిచ్చుచున్నవి. అశోకునిశాసనములలో నాంధ్రుల ప్రశంస లేదనుకొనుట పొరబాటు. తనరాష్ట్రములోని వారల వలెనె యవనులును, కాంభోజులును, నాభకులును, భోజులును, పైతాణికులును, ఆంధ్రులును, పుళిందులును, తనచేఁ బ్రకటింపఁబడిన బుద్ధధర్మమును నవలంబించిరని ౧౩వ శిలాశాసనమున నశోకుఁడు వ్రాయించెను. ఇంతియగాక యశోకుని పితామహుఁడును మౌర్యవంశ స్థాపకుఁడును నగు చంద్రగుప్తుని యాస్థానమునం దున్న మెగాస్తనీసను రాయబారి యాంధ్రరాజ్యము మహోన్నతదశయం దున్నట్టును ఆంధ్రరాజ్యమునందప్పుడు ముప్పదిదుర్గములును, లక్షకాల్బలమును రెండువేల యాశ్వికులును వేయియేనుంగుల బలమునుం డెనని వ్రాసియున్నాఁడు. ఈవిషయ

1. There is not the least mention of any Telugu kingdoms in the Asoka Inscriptions. Probably that part of India was not then civilized at all, but inhabited by wild tribes. Dr. Burnell's South Indian Paeleography.

2. నన్నయభట్టారక చరిత్రము పొరట 3౫.



మునే ప్లీని మొదలగు విదేశీయులయిన చరిత్రకారులు వక్కాణించి యున్నారు.' కాఁబట్టి యశోకునికాలమునాటికి నాంధ్రులు నాగరికు లయియుండిరనుటకు సందియములేదు.

ఆంధ్రరాజులు మగధరాజ్యమును బాలించుచుండిన కాణ్వవంశజులను జయించి తద్రాజ్యము నాక్రమించుకొని నాలుగువందల యేఁబదియాఱు సంవత్సరములు నిరంకుశముగాఁ బరిపాలనము చేసిరని పురాణములయందుఁ జెప్పఁబడి యుండుటచేతఁ బాశ్చాత్యపండితులు కొందఱాంధ్రులను గంగాతీరవాసులనుగాఁ బరిగణించి వాదోపవాదములను సలిపి గ్రంథసామగ్రిని పెంపుచేసి క్రొత్తచిక్కులను గల్పించిరి. "ఆంధ్రులు, ఆంధ్రజాతీయులు, ఆంధ్రభృత్యులు" అనిపరుసగా వేర్వేఱు వంశనామములతో గంగాతీరమున నెనిమిదిశతాబ్దములు నిరాతంకముగా రాజ్యపాలనము చేసి క్రమక్రమముగాఁ దూర్పుతీరమునంతయు నాక్రమించుకొని తుదకు కృష్ణాగోదావరుల నడుమ ధాన్యకటకదేశమును స్థాపించి పాలించిరనియు, వారుపోయినవిధముగాని కాలముగాని సరిగాఁ దెలియరాదని విల్ఫర్డుగా రాంధ్రులనుగూర్చిన వ్యాసములో వ్రాసియున్నారు.[1] దక్షిణహిందూస్థాన నాణెములచరిత్రమును వ్రాసినసర్ వాల్టరు ఎల్లియాట్ దొరగారుకూడ క్రీస్తుశకమునకుఁ బూర్వము మూడవ శతాబ్దమునఁ గడపటసారి వచ్చిన ద్రావిడులు మగధరాజ్యమునకుఁ దూర్పున గంగానదీ ప్రాంతభూముల యందుఁ గొంతకాలము నివసించి పెక్కుతెగలుగ నేర్పడిరనియు, వారిలో

1. And likewise here, in the king's dominions, among the yonas and kambhojas, in (?) Nabhaka of the Nabhitis, among the Bhojas and Pitinikas, among the Andhras and Pulindas, everywhere men follow the law of Piety as proclaimed by his Majesty" (Rock Edict XIII)

2. Pliny, Hist, Nat, book Vi, 21, 22, 23, from information probably supplied by Magesthenes.

1. Asiatic Researches Vol IX page 101.

ముఖ్యులయిన యాంధ్రులును కాళింగులును ప్రభుత్వములు చేసి శకనులతోఁ బోరుపడలేక తూర్పుతీరమునకు వచ్చిరనియు, వారిలోఁ గాళింగులు గోదావరికి నుత్తరముననను, ఆంధ్రులు కృష్ణా గోదావరులనడుమను స్థిరవాసము లేర్పఱచుకొనిరనియుఁ దరువాతఁ గృష్ణాతీరమునందలి ధాన్యకటకమును రాజధానిగఁ జేసికొని యాంధ్రులు పశ్చిమ సముద్రమువఱకు నాక్రమించి జగద్విఖ్యాత పరిపాలనము చేసిరని వ్రాసియుండిరి.[1] వీరు తమవాదమునకు బలముగా నంశుటకై ప్లినీ వ్రాసినదానిని ప్రమాణముగాఁ జూపుచున్నారు అయినను గంగానదికి దూరముగా నాంధ్రులుండిరని ప్లినీ వ్రాయుచున్నాఁడు. సముద్రమునకు మగధ రాజ్యమునకు నడుమ నాంధ్రరాజ్యముండుట యసంభవము. ఆకాలమునందలి భరతఖండమునందలి రాజ్యములలో చంద్రగుప్తుని మగధరాజ్యము మేటియని చెప్పఁదగియున్నది. ఆఱులక్షల కాల్బలముతోను ముప్పదివేల యాశ్వికబలముతోను నొప్పియుండిన యీరాజ్యము ప్రక్కను లక్షకాల్బలమును, రెండువే లాశ్వికబలమును మాత్రము గలిగియుండిన యాంధ్రరాజ్య ముండుట పొసఁగనేరదు. ఈ యభిప్రాయమునే జనరల్ కన్నింహ్యాం దొరగారు కూడఁ దెలిపియున్నారు.[2] ఇంతియగాక యశోకుని ౧౩ వ శిలాశాసనమునందు "ఆంధ్రపుళిందేషు" అని యాంధ్రులు దక్షిణముననున్న పుళిందులతోఁ జేర్పఁబడియున్నారు. ఆంధ్రులు గంగాతీరమునం దుండిరని యూహించుటకాధారము మగధరాజ్యము నాంధ్రరాజులు పాలించిరని పురాణములయందుఁ జేర్కొనఁబడుట తప్పవేఱొండు ప్రమాణముగానరాదు. మఱియును క్రీస్తుశకము మొదటి శతాబ్దమున కనిష్కుఁడను శకరాజు మగధరాజ్యమును జయించినట్లును వాని సంతతి వారు కొంతకాలము దానిని పరిపాలించినట్లును నిటీవల నూతనముగాఁ గనుఁగొనఁబడిన మధురలోని యొకశాసనమునుబట్టి దెలియవచ్చుచున్నది. నాణెములనుబట్టియు, శిలాశాసనములనుబట్టియుఁ జిరకాలమునుండి యాంధ్రులు దక్షిణదేశమున

1. Sir Walter Elliot's Coins of Southern India
2. Coins of Ancient India by Major. General Sir. A Cunningham ; page 108.



నున్నవారని నిశ్శంకముగా నుడువవచ్చును. కృష్ణాగోదావరి నదీప్రాంతములందు వారు నెలకొల్పిన బౌద్ధసంఘారామములును, స్థూపములును శిథిలములయ్యును నేటికిని గన్పట్టుచు నాంధ్రులయునికిని వేనోళ్లఁ జాటుచున్నవి. ఐతరేయబ్రాహ్మణకాలము నాటనుండి యాంధ్రులు దక్షిణాపథదేశమునందలి ప్రాగ్దిశనున్న యరణ్యప్రదేశములో నివసించుచు నవాగరికులుగానుండి క్రమక్రమముగాఁ గాలము గడచినకొలది నాగరికులయిన ద్రావిడులయొక్కయు, నార్యులయొక్కయు, సహవాసము గలిగి వారలసంపర్కంబునఁ దామును నాగరికులై పల్లెలు పట్టణములు నిర్మించుకొని తొలుదొల్తఁ బ్రజాస్థాపక సంఘముల మూలమున దొరతనము సేయుచుఁ దరువాత నిరంకుశులై రాజ్యములు స్థాపించి తొల్లింటిరీతులను విడచి నిరంకుశాధికారు లయిన నాయకులకుఁ దలయొగ్గి దొరతనము విడిచిపెట్ట వారలు విజృంభించి పశ్చిమమున మహారాష్ట్ర ఘూర్జరమాళ్వకరూశకోశలాది దేశములను నుత్తరమున కళింగమాగధములనుజయించి యాంధ్రరాజ్యమును నానాదిశల వ్యాపింపజేసి విఖ్యాతయశులైరి. వీరికిఁ దొలుత గృష్ణాతీరమునందలి శ్రీకాకుళమును[1] దరువాత ధాన్యకటకము[2]ను రాజధానులుగనుండెను. రాజులు ధాన్యకటకమునఁ బరిపాలనము సేయుచుండ యువరాజులు మహారాష్ట్రమునందు గోదావరీ తీరమునందుండిన ప్రతిష్ఠాన పురమునందుండి ప్రభుత్వము సేయుచుండిరి. ఆంధ్రభృత్యవంశములో నొకతెగవారు శ్రీశైలమునకు సమీపమునఁ జంద్రగుప్తపట్టణము రాజధానిగఁ జేసికొని పరిపాలనము చేసినట్లు గన్పట్టుచున్నది.

ఆంధ్రులు గంగాతీరవాసులని ప్రబలప్రమాణములు గాన్పించువఱకు వారు దక్షిణాపథవాసులనియును, వారిదేశము దక్షిణాపథదేశమనియును, అదియు కృష్ణాగోదావరీ నదీగర్భదేశమనియును మనము విశ్వసింతము. ఈయాంధ్రదేశ

1. కృష్ణామండలములోని చల్లపల్లి జమీందారీలో నున్నది. 2 గుంటూరు మండలములోని సత్తెనపల్లి తాలూకాలోని అమరావతి ధరణికోట యనునవే ధాన్యకటకముగా నున్నవి. 3 గోదావరినది మీఁదనుండు పైఠని యనుగ్రామము.

మై తరువాత కళింగ త్రికళింగ[1] త్రిలింగ వేంగీ నామములచే వ్యవహరింపఁబడుచు వచ్చినను ఆంధ్ర త్రిలింగ నామములు మాత్రము నిలిచినవి.

## కళింగ దేశము.

గంజాము మండలములోని మహేంద్రగిరి మొదలుకొని గోదావరివఱకును గల దేశమునకుఁ గళింగమను పేరుగలదు. చంద్రవంశపు రాజగు కళింగుఁ డనువాఁ డీ దేశమును బాలించుటచేత నప్పటినుండి యీదేశము కళింగదేశమని వ్యవహరింపఁ బడుచున్నది. ఇది పూర్వము మిక్కిలి ప్రఖ్యాతిఁ గాంచినట్టి దేశము. బుద్ధుని కాలమునందు దీనికి దంతిపురము రాజధానిగనుండెను. లాంగూల్యనదిమీఁదనుండు సింహపురము పూర్వ మొకప్పుడు రాజధానిగ నుండెనని బౌద్ధులచరిత్ర గ్రంథమగు మహావంశమునందుఁ జెప్పఁబడినది. శ్రీకాకుళ మొకప్పుడును, కళింగపట్టణ మొకప్పుడును, పూర్వము రాజధానులుగ నుండుచు వచ్చెను. క్రీస్తుశకము, మూడు నాలుగవశతాబ్దములయందు పిష్టపురము రాజధానిగనుండెను. దీనినే యిప్పుడు పిఠాపురమనుచున్నారు. ఇది చాళుక్యుల కాలమునందుఁ బీఠికాపుర మను పేరం బరఁగినది. తరువాత కురంగేశ్వర పురమని యెడి కోరంగి యేడవశతాబ్దమునందుఁ గళింగదేశములోఁ బ్రఖ్యాతి కెక్కిన పట్టణముగా నుండెను.

ఒకప్పు డీ కళింగము త్తరమున గంగాతీరము వఱకును మఱొకప్పుడు దక్షిణమున కాంచీపురమువఱకును వ్యాపించినది. వేంగీదేశమును పాలించిన పల్లవులును చాళుక్యులు నీకళింగదేశమును జయించి తమరాజ్యములోఁ గలుపుకొనుటచేత నాంధ్ర కళింగములు రెండును మిశ్రములగుచువచ్చి యేకదేశ మైనవి. అయినను మహేంద్రగిరి మొదలుకొని రాజమహేంద్రవరము వఱకును గలదేశము పదునాఱవశతాబ్దాంతము దనుకఁ గృష్ణాతీరప్రాంత ప్రదేశములవారిచేఁ గళింగదేశమనియె వ్యవహరింపఁబడుచు వచ్చినది. పదునాఱవ శతాబ్దములోని

1. తృతీయ కళింగమని యర్థముకాని యైరోపీయ పండితులు తలంచినట్లు మూడు కళింగములు కాదు.



వాఁడై మూరురాయరగండఁ డని ప్రఖ్యాత బిరుదముగాంచిన మహావిక్రమశాలి యగు కృష్ణదేవరాయలు తన యాముక్తమాల్యదయందు కళింగదేశవిజిగీషా మనీషం దండెత్తిపోయి'' అని వ్రాసికొనియున్నాఁడు. ఆశతాబ్దములోని వాఁడే యైన తెనాలి రామకృష్ణకవి తనపాండురంగమాహాత్మ్యమున ''అతండు కళింగదేశాభరణంబగు పీఠికాపురం బధిష్ఠించి'' అని వ్రాసియున్నాఁడు. ఏదియెట్లున్నను నాంధ్రదేశములోని సముద్రతీరప్రదేశము కొంతభాగము కళింగదేశముగా వ్యవహరింపఁబడుచు వచ్చెననుట నిర్వివాదాంశమనుటకు సందియము లేదు.

## త్రికళింగ దేశము.

ఇఁకను త్రికళింగ దేశమని వ్యవహరింపఁబడినదా లేదా యని దెలిసికొనవలసి యున్నది. అందుకు నిదర్శనములు గాన రావని కొందఱిచేఁ దలపఁబడుచున్నది.[1]

మహాభారతమున మూఁడుతావులను కళింగదేశము వర్ణింపఁ బడినది. మార్కండేయ పురాణములో నుత్తరదేశమునందును, మధ్యదేశమునందును, దక్షిణదేశమునందును మూడుతావులను కళింగదేశమున్నట్లు వర్ణింపఁబడినది.[2]

1. ఆంధ్రాక్షరతత్త్వము, పొరట ౮౩

(2) ''శ్లో. మత్స్యాశ్వకూటాః కుల్యాశ్చ కున్తలాః కాశి కోసలాః
అథర్వాశ్చ కళింగాశ్చ మశకాశ్చవృకైస్సహ
మధ్యదేశ్యా జనపదాః ప్రాయశోమీప్రకీర్తితాః''
* * * * * * *
''శ్లో. గాన్ధారాయవనాశ్చైవ సిన్ధుసౌవీరమద్రకాః
శతద్రుజాః కలింగాశ్చ పరదాహారభూషికాః
* * * * * *
చలికాహుహుకాశ్చైవ ఊర్ణాదార్ణాస్తథైవచ
ఏతేదేశాహ్యుదీచ్యాశ్చ ప్రాచ్యాన్ దేశాన్ నిబోధమే.''
* * * *
అథాపరేజనపదా దక్షిణాపథవాసినః
మహారాష్ట్రామాహిషకాః కళింగాశ్చైవసర్వశః

మన గ్రంథములయందు మాత్రమె కాక క్రీస్తుశకమునకుఁ బూర్వము రెండవశతాబ్దమున కళింగదేశమును జయించి యొరిస్సాలోని (ఉత్కలము) యుదయగిరి (ఖండగిరి) యందు ఖారవేలుఁడు వ్రాయించిన శాసనమునందును మూడు తావుల కళింగము పేర్కొనఁబడినది. ఇదియునుంగాక విదేశీయులైన "ప్లినీ, టాలెమీ" అను చరిత్రకారులిరువురును ఉత్తరకళింగమును, మధ్యకళింగమును, మూడవకళింగమును (త్రికలింగమును) బేర్కొనియుండుటచేత మేగాస్తనీసు కాలమున సహితము నీ మూఁడుకళింగములున్నట్లు గన్పట్టుచున్నది.[1] అయిన నశోకుని శాసనములయం దొక్క కళింగమే పేర్కొనఁబడినది.

గంగానది మొదలుకొని కటకపురి వఱకును గలదేశము త్తరకళింగ మనంబడుచున్నది. ఉత్తర కళింగమే యుత్కలమనఁబడుచున్నది. కటకపురి మొదలుకొని మహేంద్రగిరి పర్యంతముగలదేశము మధ్య కళింగము. ఇదియే కన్యోధదేశ మనఁబడుచున్నది. మహేంద్రగిరి మొదలుకొని గోదావరివఱకును గలదేశము కళింగము లేక త్రికళింగ మనఁబడుచున్నది. ఆంధ్రరాజ్యము ప్రభ యడంగిపోయిన తరువాత నీత్రికళింగదేశము వేంగిరాజులచే జయింపఁబడి వేంగికి కూడ వ్యాపించియుండును. ఈదేశమునకుఁ ద్రికళింగసంజ్ఞ యున్నటుల గ్రంథ నిదర్శనములు గానరావని కొందఱు తలంచుచున్నారు.[2] ఈదేశము త్రికళింగమని వ్యవహరింపఁ బడుచు వచ్చినదనుటకు గ్రంథస్థములగు నిదర్శనములు లేకపోలేదు. క్రీస్తుశకము ౯౪౦ వవ సంవత్సరములోని యుద్ధమల్లుని శాసనములం దొకదానిలో "వేంగీభువః పతిరభూ త్త్రికళింగగోప్తః" అని త్రికళింగము వాడఁబడియున్నది. ఇంతియుగాక క్రీస్తుశకము పండ్రెండవ శతాబ్దమున చేదిదేశపురాజును కాళచూరి వంశజుఁడునగు శ్రీమ ద్విజయసింహదేవుని వంశములోని వాఁడగు శ్రీకర్ణదేవుఁడు త్రికళింగదేశమును జయించి త్రికళింగాధిపుఁడ

(1) A. Cunningham's Ancient Geography of India 519

2. ఆంధ్రాక్షర తత్త్వము ౮౪ పొరటలు ౮౪, ౮౬.



నని బిరుదువహించినట్లుగఁ గాశికాపురిలోని యొక తామ్రశాసనమునన్నది.[1]

పై నుదాహరించినప్రమాణములను బట్టి త్రికళింగమను పేరు కొంతకాలము వ్యవహారము నందుండినదని స్పష్టముగఁ జెప్పవచ్చును.

## త్రిలింగదేశము.

త్రిలింగసంజ్ఞ దేశమున కెప్పటినుండి యేరీతిఁ గలిగినదని పరిశీలింపఁ బూనితిమా మనము నమ్మ నర్హముకాని పురాణగాథలనే శరణ్యములుగాఁ జేసికోవలయునుగాని విశ్వాసపాత్రములయిన చరిత్రాంశములేవియు మనకుఁ గానరావు. నిన్న మొన్న జరిగినవిషయములను బహుయుగములకుఁ బూర్వమునఁ బెట్టెడు పురాణములీ చరిత్రమున నిజముఁ దెలిసికొనుట కెట్లు తోడ్పడఁగలవు? అయినను సాధ్యమగునంతవఱకు నిజముఁ దెలిసికొనుటకుఁ బ్రయత్నించిచూతము. ఆంధ్రదేశమును పాలించెడి వేంగిరాజులు (పల్లవులును చాళుక్యులును) త్రిలింగరాజునుగూడ జయించి పాలించుచుండినవారగుటచేతనీదేశముకూడ వ్యవహారమునఁ ద్రికళింగమని వాడఁబడుచు వచ్చెననుటకు సందియము పడవలసిన పనిలేదు. ఈత్రికళింగము జనసామాన్యముచే నుచ్చరింపఁ బడునప్పుడు కొంతకాలము జరుగునప్పటికి 'క' లోపించి త్రిలింగ పదమే వ్యవహారములోనికి వచ్చియుండును. విదేశస్థులును త్రిలింగమనియే వ్యవహరించియుందురు. త్రిలింగపదము వ్యవహారములోనికి వచ్చి యభ్యాసపడి దేశమున నాటుకొన్న తరువాత త్రికళింగపదము జనులనుడులనుండి తొలఁగిపోయి శాసనములయందు మాత్రమె నిలిచియుండును. తరువాత నీ దేశమును బాలించినవారిలో శైవమతస్థులయిన కడపటి పల్లవులకాలముననో, కాకతీయులకాలముననో, మొదటి చాళుక్యుల కాలముననో త్రిలింగదేశ నామము మిక్కిలి ప్రాచీనమైనదైనట్లుగఁ జేయుటకుఁ బ్రయత్నములు చేయఁబడియుండును. అయినను క్రీస్తుశకము రెండవశతాబ్దమునందుండిన టాలెమీయనునాతఁడు త్రిలింగమని పేర్కొని

1. See P. 11, C. F. Cunningham's Arch-Repts IX; J.A.S.B. VIII. 485; As, Res IX 108 Sir, Walter Elliot's Coins in Southern India.

యున్నాఁడు. త్రికళింగమనుటకు త్రిలింగమని యుండవచ్చును. దీనినంతయును బట్టిచూడఁగా కళింగమునుబట్టియె యాంధ్రదేశమునకు త్రిలింగమను పేరు వచ్చినదనియే తలంచుట సముచితమని దోఁచుచున్నది. అయినను కళింగమునుండి త్రిలింగముపుట్టినదని మనపండితులొప్పుకొనక త్రి+లింగశబ్దములనుండి పుట్టినదనియు నీదేశమున మూడుప్రసిద్ధలింగములు గలవనియు నందుమూలమున నీదేశమునకుఁ ద్రిలింగసంజ్ఞ కలిగినదనియుఁ జెప్పుదురు. సుచంద్రునికొడు కాంధ్రవిష్ణువనువాఁడు శ్రీశైలము[1] భీమేశ్వరము[2] కాళేశ్వరము[3] ను మహేంద్రపర్వతముతోఁ గూడ, గలియునట్లుగా ప్రాకారములునిర్మించి యామూటినిద్వారములనుగాఁ జేసెననియు, ఈద్వారములయం దీశ్వరుఁడు శూలపాణియై ప్రమథగణములతోఁ గొలువఁబడుచు లింగరూపములనుదాల్చి యిందుండెననియు, ఆంధ్రవిష్ణువు సురలసహాయమును బొంది దానవాగ్రేసరుఁడగునిశంభునితోఁ బదమూఁడు యుగములు యుద్ధముచేసి వానిని హతముగావించి గోదావరితటమునందలి ఋష్యాశ్రమములతోసహా వానినివాసము నాక్రమించుకొనెననియు, అప్పటినుండియు నీదేశము త్రిలింగమనుపేరఁ బఱగుచున్నదని బ్రహ్మాండ పురాణము నందుఁ జెప్పఁబడినది.[4]

1. కర్నూలుమండలము మార్కాపురము తాలూకాలోనున్నది.

2. గోదావరి మండలములోని రామచంద్రపురము తాలూకాలోని దాక్షారామమను గ్రామము.

3. కాళేశ్వరము హైదరాబాదురాజ్యములో నెలగందల మండలమున గోదావరి నదితో నింద్రావతి సంగమించెడు స్థలము చెంత మంథని యను గ్రామమునొద్ద శివక్షేత్రము కాళేశ్వరము కలదు.

4. శ్రీశైల భీమకాళేశ మహేంద్రగిరి సంయుతం। ప్రాకారంతుమహత్కృత్వా త్రీణి ద్వారానుచాకరోత్॥ త్రిలోచనోమహేశస్స త్రిశూలంచకరే వహన్। త్రిలింగరూపీన్యవసత్ త్రిద్వారేషుగణైర్వృతః॥ ఆంధ్రవిష్ణుస్సురయుతో దనుజేననిశంభునా। యుద్ధ్వాత్రయోదశయుగాన్ హత్వాతుంరాక్షసోత్తమం అవసత్తత్రఋషిభిర్యుతో గోదావరీతటే॥తత్కాల ప్రభృతి క్షేత్రం త్రిలింగ మితి విశ్రుతం॥



గంజాము మండలములో నుత్తరభాగముననున్న మహేంద్రగిరిని నీత్రిక్షేత్రములను గలిపెడి ప్రాకారములమధ్య కెట్లుకొనిరాఁగలిగెనో బోధపడకున్నయది. ఈయాంధ్రవిష్ణు వెచ్చటివాఁడని విచారింపఁగా నితఁడు శ్రీకాకుళమును బాలించిన సుచంద్రునికొడుకనియు,అతడు కలియుగంబున స్వాయంభువుమనువుకాలమున నున్నాఁడనియు ఆంధ్రకౌముదియందుఁ దెలుపఁబడినది.[1] బ్రహ్మాండపురాణము పదునొకండవ శతాబ్దమున వ్రాయఁబడినదని కొందఱుపండితులూహించుచున్నారు. ఎప్పుడు రచింపఁబడినను బహునవీనమయిన దనుటకు సందియములేదు. బ్రహ్మాండపురాణములోని యీవాక్యమే మఱికొన్ని గ్రంథములయందును జేర్పఁబడి యుండెను. బ్రహ్మాండపురాణమునందు మాత్రమెగాక స్కాందపురాణమునందును "త్రైలింగులు" అని యాంధ్రదేశస్థులు పిలువంబడిరి.[2] ఇంతియగాక త్రిలింగ శబ్దానుశాసనమను వ్యాకరణమున నధర్వణాచార్యులు త్రిలింగశబ్దములకు వ్యాకరణము రచించెదనని చెప్పియున్నాఁడు.[3]

1. ఆంధ్రనాథో మహావిష్ణు ర్నిశంభుదనుజాపహః।
పురాస్వాయంభువమనోః కాలేకలియుగేహరిః।
శ్రీకాకులేరాజవర్యస్య సుచంద్రస్యతనూభవః।
అభవత్సర్వదేవైశ్చ వేష్టితోలోకపూజితః.''

ఆంధ్రకౌముది.

2. శ్లో. కర్ణాటాశ్చైవత్రైలింగ గూర్జరారాష్ట్రవాసినః।
ద్రావిడాద్రావిడాఃపంచ వింధ్యదక్షిణవాసినః॥

(స్కాందపురాణము వాచస్పత్యము)

3. శ్లో. జయతిప్రసిద్ధంలోకే సర్వలక్షణలక్షితం।
శబ్దంత్రిలింగశబ్దానా మధర్వణకవేఃకృతిః॥
కరోమిశబ్దంశబ్దానాం త్రిలింగానాంసలక్షణం।
బార్హస్పత్యానిసూత్రాణి కాణ్వంవ్యాకరణంవిదన్.

అథర్వణాచార్యకృత త్రిలింగశబ్దానుశాసనము.

ద్వితీయాచార్యుఁడ[1]ని బిరుదుగాంచిన యీయధర్వణాచార్యుఁడు పదునొకండవశతాబ్దాంతముననో పండ్రెండవశతాబ్దారంభముననో నున్నవాఁడు. మఱియును పదమూఁడవశతాబ్ద ప్రాంతముననున్న విద్యానాథకవి తనప్రతాపరుద్రీయమునఁ ద్రిలింగములం బేర్కొని త్రిలింగదేశప్రశంస సలిపియున్నాఁడు.[2] మఱియు నా శతాబ్దముననందే యుండిన విన్నకోట పెద్దనామాత్యుఁడు తనకావ్యాలంకారచూడామణియందు "క॥ ధర శ్రీపర్వత కాళే। శ్వర దాక్షారామసంజ్ఞవిలసల్లింగా। కరమగుటనంధ్రదేశం। బరుదారఁ ద్రిలింగదేశమనఁజనుఁగృతులన్॥" గీ. తత్త్రిలింగపదము తద్భవంబగుటచేఁ। దెలుఁగుదేశమనఁగఁ దేటపడియె। వెనుకఁ దెనుఁగుదేశమునునంద్రుగొందఱు। బ్బాషపంచగతులఁ బరగుచుండు." నని వ్రాసియున్నాఁడు. పదునేడవశతాబ్దప్రాంతమునను౦డిన కాకునూర్యప్పకవియుఁ దనవ్యాకరణములో:—

"క॥ శ్రీక్షితిధర కాళేశ్వర, దాక్షారామంబులనఁగఁ దనరారెడునీ
త్రిక్షేత్రంబులలింగము, లీక్షితిని ద్రిలింగసంజ్ఞ కెన్నిక కెక్కెన్.

తే-గీ. తత్త్రిలింగనివాసమై తనరుకతన
నాంధ్రదేశంబు దాఁ ద్రిలింగాఖ్యమయ్యె
దెలుఁగగుచుఁ దద్భవముదానివలనఁబొడమె
వెనుక కొందఱు దానినె తెనుఁగునంద్రు.

అని శ్రీశైలము, దాక్షారామము, కాళేశ్వరము, ఈమూఁడు క్షేత్రముల లింగములను త్రిలింగములనియు, వానిచే నొప్పునీదేశము త్రిలింగదేశమనియు వ్రాసియున్నాఁడు.

1. ప్రథమాచార్యుఁడని నన్నయభట్టునకు బిరుదముగలదు గావున నథర్వణాచార్యుని ద్వితీయాచార్యుఁడందురు.

2 "యైర్దేశస్త్రిభిరేష యాతి మహతీం ఖ్యాతింత్రిలింగాఖ్యయా యేషాం కాకతిరాజకీర్తివిభవైః కైలాసశైలాకృతాః తే దేవాః ప్రసరత్ప్రసాదమధురాః శ్రీశైలకాళేశ్వరః దాక్షారామనివాసినః ప్రతిదినంత్వచ్ఛ్రియే జాగ్రతు" ప్రతాపరుద్రీయం, నాటక ప్రకరణే పంచమాంకమ్. ౨౨.



ఈ పై ప్రమాణవచనములనుబట్టి "శ్రీశైలము, భీమేశ్వరము లేక దాక్షారామము, కాళేశ్వరము" అను త్రిక్షేత్రముల లింగముల మధ్యనుండు దేశము త్రిలింగదేశమనియు, త్రిలింగశబ్దభవము తెలుఁగగుటం జేసి తెలుఁగుదేశమయినదనియు మనపండితుల యభిప్రాయమని తేఁటపడుచున్నది. ఈ తెలుఁగు దేశమునే తరువాతి వారు తెనుఁగుదేశమని కూడ వాడుచు వచ్చిరనుటకు సందియములేదు. పదునొకండవ శతాబ్దారంభమున నుండిన నన్నయభట్టారకుఁడు భారతముం దెనిగించుచు, కం. జననుత కృష్ణద్వైపా, యనమునివృషభాభిహిత మహాభారతబ। ద్ధనిరూపితార్థమేర్పడఁ, దెనుఁగునరచియింపుమధికధీయుక్తి మెయిన్. అనియు, ఉ. సారమతిం గవీంద్రులు ప్రసన్నకథావివిధార్థయుక్తితో। నారసి మేలునా నితరు లక్షరరమ్యత నాదరింపనా। నారుచిరార్థసూక్తినిధి నన్నయభట్టు తెలుంగు[1]న న్మహాభారతసంహితా రచన బంధురుఁడయ్యె జగద్ధితంబుగన్" అనియువ్రాసి "తెనుఁగు; తెలుఁగు"ననుపదములు రెండును ప్రయోగించెను. అనఁగా నన్నయకాలమునాటికి నీ తెలుఁగుశబ్దము త్రిలింగశబ్దభవముగా వాడఁబడుచుండెను. త్రిలింగపదము త్రికళింగపద వికారమయినను, సంస్కృతమైనను త్రిలింగమునుండి తెలుఁగుపదము పుట్టినదనుటకు సందియములేదు. పాలకభేదమును బట్టి యీ యాంధ్రదేశమనేకనామములచే వ్యవహరింపఁబడుచు వచ్చి నిజమైన యాంధ్రదేశమునకు హద్దు తెలియక పోఁగా నాంధ్రదేశ వ్యాప్తి నిరూపణమునకై యొకవేళ శ్రీశైలాది త్రిక్షేత్రముల లింగములను హద్దులనుగా తదనంతరులు గ్రహించి యుండుటంజేసి యాంధ్రదేశమునకుఁ ద్రిలింగ సంజ్ఞ గలిగినం గలుగవచ్చును.[1]

## వేఁగి దేశము.

ఆంధ్రదేశమునకు వేఁగిదేశమను పేరుగూడ వాడఁబడియుండెను. చోళమండలమునకు రాజధానియగు కాంచీపురమునకు నైఋతిభాగమున వేంగియను నొక చిన్నగ్రామమిప్పటికిని గలదు. ఆప్రదేశము మొదట నిర్జనంబయి

1. ఇది వేంగిరాజుల చరిత్రమునఁ జర్చింపఁబడవలసిన విషయము గావున గ్రంథవిస్తరభీతిచే నీచర్చ నిచ్చట విరమించుచున్నాఁడను.

పులులు సంచరించెడు ప్రదేశ మగుటంజేసి యక్కడివారు దానిని వెంగి యని పిలుచుచువచ్చిరి. వెంగియనఁగా నఱవములో పులియని యర్థము. దీనినే కన్నడములో వేంగియందురు. వేఁగియనఁగాఁ దెలుఁగులో పులియని యర్థము. ఈ మూఁడు భాషలయందు నీపద మించుక భేదముతో వ్యాఘ్ర పర్యాయమున మొదటి నుండియు వాడఁబడుచున్నది. వెంగికిఁ జుట్టుప్రక్కలనుండు ప్రదేశమంతయు వేఁగినాడని వ్యవహరింపఁబడుచుండెను. వేఁగినాటి బ్రాహ్మణులు మొదట నీప్రదేశములోనివారే యని తోఁచుచున్నది. తొలుత నీవేఁగినాటి బ్రాహ్మణులు ద్రావిడాచారమునే కలవారై క్రమక్రమముగా నిప్పుడిప్పుడు కొంతయాంధ్రాచారము నవలంబించుచున్నారు. ద్రావిడులలో వలెనే వేఁగినాటి స్త్రీలలో గొందఱికిఁ గుడిపైఁటలుంగలవు. కావుననే తెలుఁగునాడులకు వేఁగినాడులకు భేద మేర్పడినది.

వేఁగిదేశము కన్నడదేశ ప్రాంతమని కొందఱు చెప్పుచున్నారు. "ఈ భూమి (వేఁగిదేశము) ద్రావిడజాతులలో నొకరగు పల్లవులచేఁ బరిపాలింపఁబడుచుండెను. వారిరాజ్యమును వేఁగిరాష్ట్రమనియు, వారిరాజధానిని వేఁగిపురము లేక కళింగ నగరమనియుఁ బిలువసాగిరి. జైనపాలకుల సంస్కృతనామంబులకు వర్మయను విశేషణముఁ జేర్పఁబడుచుండెను. (నాగవర్మ) క్రీ. శ. 777 సంవత్సర ప్రాంతమువఱకు వారివంశము వ్యాప్తమునముండినది. ఆకాలమునఁ బల్లవరాజ పుత్త్రియగు కుందేవి (కుందితల్లి) శ్రీపురమున కుత్తరమున నొక జైనదేవాలయమును గట్టించెను. క్రీ శ 680 సంవత్సరమునకుఁ దరువాతఁ దుంగభద్రాతీరముననున్న కళ్యాణపురపుఁ జాళుక్యరాజును బరిమార్చెను. క్రీశ 1000 సంవత్సర ప్రాంతమున వేఁగిరాజ్యమును శైవుఁడును, నప్పటికి దక్షిణ హిందూస్థానపుఁ బ్రబలరాజునునగు రాజేంద్ర చోళునకుం జెందెను"[1] కాంచీపురమునకుఁ బైనుండు వేఁగిదేశము గోదావరివఱకును వ్యాపించినది. అట్లువ్యాపించుటకుఁ

1 (నాగవర్మ విరచితకన్నడ ఛందము, 1875 సం॥ వ రెండుఎఫ్ కిటిక్కు దొరగారి పీఠిక. పే. 21 (శ్రీపురము. తెన్నూరుడిస్ట్రిక్టు కళ్యాణపురము. సౌతుకనరా). ఆంధ్రాక్షర తత్త్వము పొరట ర౯.



గారణము లేకపోలేదు. క్రీస్తుశకము మూఁడవశతాబ్దము మొదలుకొని యేడవశతాబ్దముదనుకను పల్లవరాజులు, నటుపిమ్మటఁ బండ్రెండవ శతాబ్దాంతము వఱకును బూర్వచాళుక్యులును బరిపాలనము చేసిరి. వారికాలమున నీదేశము వేంగిదేశమనియె విశేషముగా వాడఁబడుచువచ్చెను. రాజనరేంద్రుని యాస్థానకవియుఁ బండితుఁడునగు నన్నపార్యుఁడు రాజమహేంద్రవరమును వేఁగిదేశమునకు నాయకరత్నమని చెప్పియున్నాఁడు. పల్లవరాజు లిప్పటి యేలూరునకు సమీపమునను౦డెడి వేంగీపురమును రాజధానిగాఁ జేసికొని యీదేశమును బరిపాలించిరి. ఏడవ శతాబ్దాదిని రెండవ పులకేశివల్లభుఁడను చాళుక్యరాజు పల్లవరాజును జయించి తనతమ్ముని కుబ్జవిష్ణువర్ధనుని వేఁగీదేశమునకుఁ బాలకునిగా నియమించెను. అమ్మరాజవిష్ణువర్ధనుని కాలమున ననఁగాఁ దొమ్మిదవశతాబ్దాదిని రాజధాని రాజమహేంద్రవరమునకు మార్పఁబడినది. పల్లవచాళుక్యులకాలమున నిదియంతయు వేఁగిదేశముగా వ్యవహరింపఁబడినను మొదటి వేఁగిదేశము చోళదేశ ప్రాంతమునందలిదియే యైయుండును.

"సీ. దక్షిణగంగనాఁ దద్దయు నొప్పిన గోదావరియు జగదాదియైన
భీమేశ్వరంబును బెడఁగగుచున్న శ్రీపర్వతంబును జూచి యుర్విలోన
ననఘమై శిష్టాగ్రహారభూయిష్టమై ధరణీసురోత్తమాధ్వరవిధాన
పుణ్యసమృద్ధమై పొలుచు వేఁగీదేశ విభవంబుఁ జూచుచు విభుఁడు దక్షి
ణాంబురాశితీరంబున కరిగి దురిత । హారియైన కావేరి మహాసముద్ర
సంగమంబునభూసురేశ్వరులకభిమ। తార్థదానంబుచేసికృతార్థుఁడగుచు"

అని నన్నయభట్టు భారతాదిపర్వమున నర్జునతీర్థయాత్రాసందర్భమున కళింగదేశమును, పురుషోత్తమ క్షేత్రమును, మహేంద్ర పర్వతమును జెప్పినతరువాత నీపద్యములో గోదావరిని భీమేశ్వరమును శ్రీశైలమును జూచినతరువాత "అనఘమై శిష్టాగ్రహారభూయిష్టమై ధరణీసురోత్తమాధ్వరవిధాన పుణ్యసమృద్ధమై పొలుచు వేఁగీదేశవిభవంబుఁ జూచుచు"నని వేఁగిదేశము నెక్కువగా వర్ణించియుండుటచేత శ్రీశైలమునకు దిగువనుండుదేశమె మొదటి వేఁగిదేశమని

గన్పట్టుచున్నది. ఇంతియగాక కేతనకవి తనదశకుమార చరిత్రమునందు
"సీ. వేఁగివిషయమున వెత్త్రిరాలను పేర నభిరామమగు నగ్రహారమునకు। నగ్రణి యగువాని నభినవదండినా బొలుపుమీఱినవాని * * * * * గేతనార్యుని నన్ను విఖ్యాతయశుని॥" అనియును, ఎఱ్ఱాప్రెగ్గడకవియుఁ దన నృసింహపురాణమున:-

సీ. "ప్రజ్ఞాపవిత్రుఁ డాపస్తంబసూత్రుండు శ్రీవత్సగోత్రుఁ డూర్జితచరిత్రుఁ
డగుబొల్లనకుఁ బ్రోలమాంబకుఁ బుత్రుండు వెలనాటిచోడునివలన మిగుల
మన్ననగన్న భీమనమంత్రిపౌత్రుండు పేకమాంబామనఃప్రియుఁడు పోత
మాంబికావిభుసూరనార్యుమజ్జనకుని బొల్ల ధీనిధికిని బ్రోలమకును
జన్ననకు ననుజన్ముని గన్నతండ్రి। వేఁగినాటఁ గరాపర్తివృత్తిమంతుఁ
డనఘుఁ డెఱ్ఱపోతసూరికంసారిచరణ।కమలమధుకరపతిసారవిమలయశుఁడు"

అనియు నెల్లూరిమండలనివాసులగు వీరిరువురును దాము వేఁగిదేశములోనివారమని చెప్పికొనుటచే వేఁగిదేశము శ్రీశైలమునకు దక్షిణభాగమె యని తోఁచుచున్నది. పదునాఱవశతాబ్దమునందుండిన తెనాలిరామకృష్ణకవి తనపాండురంగమాహాత్మ్యమున:-

"సీ. నలుదెఱంగులఁ గావ్యనవసుధాధారలఘనుఁడ వాశువునందు గరము మేటి
వఖిలభూమీపాలకాస్థానకమలాకరోచ్చయతరుణసూర్యోదయుఁడవు
శైవవైష్ణవపురాణావళి నానార్థరచనాపటిష్ఠైకరమ్యమతివి
లౌకికవైదికలక్షణచాతుర్యధైర్యప్రభారూఢ కార్యచణుఁడ
వాంధ్రభూమికుచాగ్రహారాభమైన
శ్రీతెనాల్యగ్రహారనిర్ణేతవగ్ర
శాఖికాకోకిలమ వీవు సరసకవివి
రమ్యగుణకృష్ణరామయరామకృష్ణ."

అని తానాంధ్రదేశములోనివాఁడనని చెప్పికొని యుండుటంజేసి శ్రీశైలము మొదలు గోదావరిపర్యంతముగలదేశ మాంధ్రదేశము లేక తెలుఁగునాడ



నియుం దోఁచుచున్నది.[1] ఈపైఁగనఁబఱచిన ప్రమాణములనుబట్టి యాంధ్రదేశమునకుఁ గళింగదేశము వేఁగిదేశము నను నామములు పాలకభేదమున తటస్థించిన యాపాతనామములుగాని నియతనామములుగావని స్పష్టముగాఁ జెప్పఁదగును.



1. ఈ నాడీభేదము లనేకములు గలవు. ద్రావిడులలో 1 పాకనాడు. 2 పాలకనాడు. 3 బెడగనాడు. 4 వావనాడు. 5 సిర్నాడు. 6 ఉలచనాడు. 7 కళింగనాడు. 8 కానలనాడు. 9 తెలుఁగునాడు=తెలగాణ్యులు. 10 మురికినాడు. 11 వెలనాడు. 12 వేంగినాడు. 13 వేఁగినాడు. 14 కమ్మనాడు. 15 ఇంగనాడు. 16. ఇన్నుంబర్నాడు. 17 తిరుమనాడు. 18 తిరువలినాడు. 19 తిరునారాయణర్నాడు. 20 పల్నాడు. 21 చేగల్నాడు. 22 పోల్నాడు మొదలుగ నింకను ననేకములుగలవు. అవి యన్నియు ద్వితీయాది సంపుటములఁ జర్చింపఁబడును.

# నాలుగవప్రకరణము.

## ఆదిమనివాసులు.

ఆంధ్రదేశము పూర్వకాలమున నొకప్పుడు దండకారణ్యముగా నుండెననియు, ఆకాలమునఁ గిరాతజాతులవారుమాత్రమె నివసించుచుండిరనియు మనము దెలిసికొనియుంటిమి. ఆకిరాతజాతులవారెవ్వరో, వారివెనుక నెవ్వరెవ్వరీ దేశమునకు వచ్చియుండిరో, వారెట్లు నాగరికులైరో మనము దెలిసికొనవలసియున్నది. ఈదండకారణ్యదేశమునందు ప్రప్రథమమున నివసించిన ప్రజలెట్టివారో వారెందుండివచ్చిరో సత్యమెవ్వరికిని దెలియరాదు. ఇట్లని యూహించి చెప్పుటయు సులభసాధ్యముగాదు. వారెచ్చటివారయినను మిక్కిలి మృగప్రాయులుగా నుండియుందురనుటకు సందియములేదు. ఇప్పటి అండమానుదీవులలోనుండిన యనాగరికులను బోలియుందురని కొందఱూహించుచున్నారుగాని వారియూహ సరియైనదికాదు. అండమానుదీవులలోని యనాగరికులు మిక్కిలిపొట్టివారుగనున్నారు. వీరిలోఁ బురుషులు మూడుమూళ్ల మూడంగుళములును ఆడువాండ్రు మూడుమూళ్లును పొడవుమాత్రమె గలిగియున్నారు. వీరుబట్టకట్టుటనైన నెఱుంగనిస్థితియందున్నవారు. ఆకులను మొలకుధరింతురు. చేఁపలను పీతలను పట్టుకొని తిని జీవింతురు. వట్టిమృగప్రాయులుగనున్నారు. వీరిపూర్వులే మొదట నీదేశమున నివసించియుండిరని కొందఱువ్రాసియున్నారుగాని అదియెంతమాత్రమును విశ్వాసార్హమైనదికాదు. ఇప్పటి కృష్ణా గుంటూరుమండలములలోని నందిగామ, సత్తెనపల్లి, పల్నాడుతాలూకాలలోఁ బెక్కుచోట్లను గుండ్రముగా మలఁచఁబడిన శిలలును, శిలలతోఁ జేయఁబడిన గృహోపకరణములు, అందములేని మట్టిపాత్రములు గాన్పించినందున నీయాంధ్రభూమి కొందఱు తలంచునట్లు నిర్జనప్రదేశముగానుండక ప్రాచీనజననివాసభూమిగా నుండెనని మెకంజీ, బిషప్ కాల్డువెల్లు మొదలగు పాశ్చాత్యులు తలంచుచున్నారు. రాబర్టుస్యూ



యలుగారుమాత్ర మీఱాతిగుండ్లను ధాన్యకటకములోని బౌద్ధస్తూపమును నిర్మించుటకుముందు నభ్యాసమునకుఁగా శిల్పకారులు చేసియుందురుగాన వీరలు బౌద్ధులసంతతివారయియుందురుగాని పైవారు తలంచునట్లు ప్రాచీనులుగారనిరి గాని డాక్టరు కార్నిషుగారుమాత్రము వారివాదము నంగీకరింపక వారు బౌద్ధులకంటెను బూర్వికులనియు వాకొనియున్నారు.[1] ఇప్పటియెఱుకు, చెంచు, కోయ, యానాది మొదలగు తెగలవారియొక్క ప్రాథమికులయిన పితరులే యాదిమనివాసులై యుందురని మెకంజీదొరగా రభిప్రాయపడియున్నారు. వీరిని టాలెమీ చెప్పినసవరులు, కోదులు, గోండులు, శబరులు మొదలగు తెగలవారితోఁ జేర్పఁదగినవారని కార్మికేలుగారు వ్రాసియున్నారు.[2] ఇప్పటికి నాలుగు వేల సంవత్సరములకుఁ బూర్వమున నార్యులీదేశమునందలి సింధునదీతీరమునకు వచ్చునప్పటికి వీరికంటెను నాగరికులయిన జాతులవారు నివసించుచుండెడివారుగఁ గన్పట్టుచున్నారు.

## అనార్యులు—దస్యులు.

ఆకాలమునం దనార్యజాతులవారెంత యనాగరికులు
యులుగాను వర్ణింపఁబడినను వీర లచ్చటచ్చట గ్రామము లేర్పఱచుకొని పట్టణములు దుర్గములు నిర్మించుకొని రాజ్యములు స్థాపించుకొని సేనలనుగలిగి యార్యులతో సమానముగాఁ బోరాడినట్లు ఋగ్వేదాదిగ్రంథములవలన స్పష్టముగాఁ గన్పట్టుచున్నది. అయినను ఆర్యాచారములకు విరుద్ధములయిన యాచారములను గొన్నిటిని గలిగియుండుటచేత ననాగరికులుగ భావించి యార్యులు వీరిపట్ల శత్రుత్వమును వహించిరి. వీరికృష్ణవర్ణమును, వికృతరూపములును, పొట్టితనమును వారికసహ్యముగాఁ గన్పట్టి వీరిని దిరస్కారభావముతోఁ జూచుచు "అనార్యులని పిలువసాగిరి. ఇంతియగాదు; అనార్యులు తమత్రోవ కడ్డమువచ్చి తమ్ము

1 Mr G. Mekengie's' District Manual of Kistna.

2 Mr D. F. Cormikael's District Manual of Vizagapatam.

ననేకవిధముల బాధింప నారంభించినందున శత్రువులనుగ భావించి దస్యులని కూడ పిలుచుచుండిరి.

ఆర్యులకు వీరిభాష తెలియనందున వీరికి భాష లేదని చెప్పిరి. యజ్ఞాదికర్మలు వీరు చేయనందున వీరి కీశ్వరుఁడు లేఁడనిరి. ఆర్యులకును దస్యులకును జరిగిన యుద్ధములు వేదములయందు వర్ణింపఁబడినవి. అనార్యు లాదిమనివాసులగుటచేతను ఆర్యులు క్రొత్తగవచ్చి తమభూము లాక్రమించుకొనుచుండుటచేతను ఆర్యులకు ననార్యులకు నన్యోన్యకలహము లేర్పడి యుద్ధములు జరుగుటలో వింతయేమియును లేదు. ఆర్యులు బలవంతులగుటచేత ననార్యులను వారిసుక్షేత్రభూములనుండి వెడలఁగొట్టి వాని నాక్రమించుకొనుచుండిరి. అనార్యు లార్యులయెదుట ముఖాముఖిని నిలువంబడి పోరాడలేక ఆర్యుల భుజబలంబునకుఁ దాళఁగఁజాలక యరణ్యములలోను పర్వతగుహలలోను డాగియుండి రాత్రులందు నార్యుల నివాసస్థలంబులపైఁబడి పశువులను ధాన్యాదులను దోఁచుకొనుచుఁ ద్రోవలఁగొట్టుచు, యజ్ఞాదికర్మల ధ్వంసము చేయుచు స్త్రీల నెత్తికొనిపోవుచు నానావిధములబాధ పెట్టియుండిరి. మఱియు నదుల చేతను సెలయేళ్ల చేతను సురక్షితములయిన స్థానములందు నివాసములేర్పఱచుకొని నగరవాసులయినయార్యుల కుపద్రవము సలుపుచుండిరి. అయినను ననార్యులు సులభముగా లోఁబడక బహుకాల మార్యులతో యుద్ధము సేయుచునే యుండిరి. ఋగ్వేదమునం దనార్యుల కీకటదేశము వర్ణింపఁబడినది. ప్రమగందుఁడను రాజు కీకటదేశమును బాలించుచుండెనని చెప్పఁబడి యున్నది. "కీకటో నామ దేశోఽనార్యనివాసః" అని యాస్కాచార్యులవారు నిరుక్తమునందు వ్రాసియున్నారు. "మాగధాః కీకటాః మతాః" యని త్రికాండశేషమను కోశములో వ్రాయఁబడియున్నది. కనుక వైదికకాలములో గంగానదికిఁ దూర్పువైపునఁ గీకటమను ననార్యజననివాసం బొండుగలదని తేటపడుచున్నది. ఆకాలమునందలి సింధునదీప్రాంతదేశమునందలి యనార్యులకు కుయవుఁడనువాఁడును, కృష్ణుఁడనువాఁడును నాయకులుగానుండి బహుసైన్యములం జేర్చుకొని యార్యులతో ఘోరయుద్ధము చేసి సంహారింపఁబడిరని ఋగ్వేదమునందుఁ జెప్పఁబడియెను. ఆర్యులు బహుకాలము



దనుక దస్యులతోఁ బోరాడి వారిని నరణ్యప్రదేశములకుఁ దోలుచు క్రమముగా సింధునదీప్రాంతప్రదేశ మంతయు నాక్రమించుకొనిన తరువాత నుత్తరకురుదేశము, నుత్తరమాద్రదేశము, సప్తసింధుదేశము ననునవి యేర్పడినవి. ఋగ్వేదమును జదివినవారికి నార్యులయొక్కయు, దస్యులయొక్కయు చరిత్రము సంపూర్ణముగా బోధపడఁగలదు.

## లంకాద్వీపవాసులు.

దండకారణ్యమునందు భిల్లులు, గోండులు, శబరులు మొదలగు కిరాతజాతులవారు నివసించియుండఁగాఁ దరువాత వచ్చి యీదేశము మొదట నాక్రమించినవారు లంకాద్వీపవాసులయిన యనార్యులని రామాయణమును బట్టి గన్పట్టుచున్నది. లంకాద్వీపమును బాలించెడి రావణసంబంధు లయినవారు దండకారణ్యమునం బ్రవేశించిరి. ఈలంకాద్వీపవాసులచే నాక్రమించుకొనఁబడిన ప్రదేశమంతయు జనస్థానముగాఁ బరిగణింపఁబడుచు వచ్చినది. అయోధ్యనుండి శ్రీరాముఁడు దక్షిణమునకు వచ్చి యీదండకారణ్యముఁ బ్రవేశించినప్పుడు లంకాద్వీపవాసులయిన యనార్యులచే నాక్రమింపఁబడి యుండెను. రావణుని తమ్ముఁడగు ఖరుఁడనువాడు జనస్థానమును బరిపాలించుచుండెను. వీనికి దూషణుఁడు త్రిశిరుఁడు ననువారలు మంత్రులుగ నుండిరి. ఇచ్చటనే వీరి సోదరియగు శూర్పణఖ యనునామె రామలక్ష్మణులను మోహించి సీత కుపద్రవము చేయఁబూనఁగా లక్ష్మణుఁడు దాని ముక్కు చెవులను గోసివేసెను. అది తన సోదరుఁడగు ఖరునితోఁ దనదురవస్థను జెప్పుకొనఁగా వాఁడు వీరలపై దండెత్తివచ్చెను. రామలక్ష్మణు లియువురు వారలతో యుద్ధము చేసి వారలను సంహరించిరి. తరువాత రావణుఁడు వచ్చి సీత నెత్తికొనిపోవుటయు మొదలగు వృత్తాంతమంతయు రామాయణమునందుఁ జదివి యున్నారము. ఈ రామాయణకథ సుప్రసిద్ధము. ఆబాలగోపాలము దీని నెఱింగి యున్నవారు గాన నాకథ నిచ్చటఁ దెలుపఁ బనిలేదు. ఆర్యులు వీరిని రాక్షసులనుగా వర్ణించియుండిరి. ఇట్లు రామాయణమునందు మాత్రమె గాక పురాణాదులయందును ఆర్యులకు ననార్యు

లకు జరిగినయుద్ధములను దేవదానవయుద్ధములుగా మిక్కిలి చమత్కారముగా వర్ణించియుండిరి. ఆర్యులను దేవతలనియు సురలనియును, దస్యుల నసురలనియు దైత్యులనియు, దానవులనియు, రాక్షసులనియు పేర్లుపెట్టి వాడియుండిరి.

## ద్రావిడులు, ద్రావిడదేశము.

ఆర్యులకంటెను బెక్కువేలేండ్లకు ముందే మధ్యాసియా ఖండమునుండి బయలుదేఱి హిమాలయమునుదాటి యీదేశమునఁ బ్రవేశించి సింధునదీ ప్రాంతమునఁ గొంతకాలముండి తరువాత గంగానది ప్రవహించెడి పల్లపునేలదారిని తూర్పునకుఁబోయి యటనుండి వింధ్యపర్వతము ప్రాగ్భాగమువఱకు వచ్చి అనంతరము తూర్పు కనమలకు సముద్రమునకు నడుమనుండెడి సమభూమిమార్గమునం దూర్పుతీరము వెంబడిని దక్షిణముగాఁ గన్యాకుమారివఱకును బోయిరని కొందఱిచే మార్గము నిశ్చయింపఁబడినదిగాని యీదేశమునకు రాక పూర్వము ద్రావిడు లెందుండెడివారో, ఏకాలమున నీదేశమునకు వచ్చియుండిరో సహేతుకముగా నిర్ణయించి చెప్పుట కష్టసాధ్యమైన విషయముగాని యూహాలపై నూహాలనల్లి చెప్పుటకు సులభసాధ్యమైన సామాన్యవిషయముగాదు. మనవారు ద్రవిడులనఁగా (ద్రు=గతౌ) తరుమఁబడిన వారని యర్థము చెప్పి యీదేశము మెట్టమెంపట స్వభావమునుబట్టి కోఁదులనఁబడెడి కోఁతులచేగాని వికల్పనరులని యౌత్తరాహులచేఁ బిలువంబడెడి వానరులచేఁగాని [1]నిండియుండెడిదనియు, ఈవికల్పనరులచే నాక్రాంతమై యుండినకాలమునఁ బరశురామునిచే నుత్తరదేశపు రాజులెల్లరు నిహతులై హతశేషు లయినవారు దక్షిణపుఁగొననున్న మలయాద్రిచాటునకుఁ బాఱిపోయి వచ్చియుండఁగాఁ గ్రమక్రమముగా వారి బంధులును వారిపోష్యులు నగు నన్యవర్ణములవారును వచ్చి చేరి యుండుటచేత వీరందఱు నౌత్తరాహులచే ద్రవిడులు లేక ద్రమిళులు ననునామంబునఁ బిలువం

1. నరసదృశా వానరా యని లేక వికల్పానరా వానరా యని వ్యుత్పత్తి (అనఁగాఁ గొండవాండ్రు, కోఁదువాండ్రు మొదలగు ననాగరికజాతులవారిచే నిండియుండునది.)



బడుచుండిరనియు నార్యగ్రంథములయందుఁ గానంబడుచున్నది. ఈకథ మహాభారతములోని యశ్వమేధపర్వమునఁ జెప్పఁబడియున్నది.[1] ఆదిమనివాసులయిన యనార్యులను రాక్షసులనుగాను, ద్రావిడులను వానరులనుగానుగూడ నార్యులు తమకావ్యములయందు వర్ణించినట్లుగఁ గన్పట్టుచున్నది. మనకాలమునందు అఱవము, మళయాళము, కన్నడము, తెలుఁగు మొదలగు భాషలను మాటలాడు వారిని ద్రావిడులనుగా నెంచుచున్నారుగాని వీరు కేవలము ద్రావిడులని చెప్పుట యెంతమాత్రము సరికాదు. వీరిభాషలు ద్రావిడములో మిశ్రములయిపోయి వీరు ద్రావిడభాషావలంబనముఁజేసి యుండుటచేత భాషనుబట్టి వీరినందఱిని ద్రావిడులనుగాఁ దలంచుచున్నారు. ద్రావిడులచేత నివసింపఁబడిన దేశమునకు ద్రావిడదేశమని పేరువచ్చినది. వింధ్యకుదక్షిణమునఁ గన్యాకుమారివఱకునుండు దేశము ద్రావిడదేశమని చెప్పంబడుచున్నది. ఆర్యులు ద్రావిడదేశమును మ్లేచ్ఛదేశముగాను ద్రావిడులను మ్లేచ్ఛులనుగానుభావించిరి. ఇందుకుఁ బ్రమాణములు మహాభారతమునందును మన్వాది స్మృతిగ్రంథములయందును గానంబడుచున్నవి.[2]

1. శ్లో. తతస్తు క్షత్రియాః కేచి జ్జామదగ్నిభయార్దితాః
వివిశుర్గిరిదుర్గాణి మృగాస్సింహార్దితా ఇవ
తేషాం స్వస్వహితం కర్మ తద్భయాన్నానుతిష్ఠతామ్
ప్రజా వృషలతాం ప్రాప్తా బ్రాహ్మణానామదర్శనాత్
ఏవం తే ద్రావిడాభీరాః పుండ్రాంశ్చ శబరైస్సహ
వృషలత్వం పరిగతా వ్యుత్థా నాక్షత్రధర్మిణః.

2. శ్లో. చాతుర్వర్ణ్యవ్యవస్థానం యస్మిన్ దేశే నవిద్యతే
తం మ్లేచ్ఛవిషయంప్రాహు రార్యావర్తాదనంతరమ్. అని
బోధాయనస్మృతి, మనుధర్మశాస్త్రము అధ్యాయము ౧౦ శ్లో. ౪౩.
"పౌండ్రకాశ్చౌఢ్ర "ద్రవిడాః" కాంభోజాయవనాశ్శకాః
పారదాపహ్లవాశ్చీనాః కిరాతాదరదాఃఖశాః"
మనుధర్మశాస్త్రము, అధ్యాయము. ౧౦ శ్లో. ౪౪.

పౌండ్రకులు, ఓఢ్రులు, ద్రావిడులు, కాంభోజులు, యవనులు, శాకులు, పారదులు, పహ్లవులు, చీనులు, కిరాతులు, దరదులు, ఖశులు మొదలగు క్షత్రియులు పుణ్యకర్మలను విడిచిపెట్టి బ్రాహ్మణులను జూడనందున శూద్రులయిరని మనువు వ్రాసియుండెను. ఈ ద్రావిడులు క్రమముగా దక్షిణమునకుఁ జేరి నాగరికులై జనసంఖ్య యెక్కువయిన కొలఁది నుత్తరభూముల నాక్రమించుకొనుచుఁ దుదకు దండకారణ్యమునం బ్రవేశించి పల్లెలఁ బట్టణముల నేర్పఱుపసాగిరి. ఈ ద్రావిడులమూలముననే దండకారణ్యములో నివసించెడి యనాగరిక జాతులన్నియు నాగరికతను గాంచి ద్రావిడులలోఁ గలిసిపోయిరి. వీరి తరువాత దండకారణ్య దేశమునకు వచ్చినవారు మంగోలియాజాతుల వారుగా నున్నారు.

## యక్షులు - తమిళులు - తమిళికము.

ఆర్యులు దృషద్వతీ సరస్వతీ నదులనడుమఁ బ్రవేశించి స్థిరనివాసము లేర్పఱచుకొన్న తరువాత, ఆసియాఖండ మధ్యముననుండెడి పీఠభూమి యందు నివసించుచుండిన పసిమిరంగుగల జాతులవారు త్రివిష్టపము (Tibet) నేపాళము (Nepal) నడుమంగల పర్వత మార్గములగుండ దక్షిణమునకు వచ్చి గంగానదీ ప్రాంతభూమిని నాక్రమించుకొని యుండిరి. ఈ పసిమి వర్ణముగల జాతులవారు సంస్కృతగ్రంథములయందు యక్షులుగాఁ బరిగణింపఁబడి యభివర్ణింపఁబడి యున్నారు. పాళీభాషయందు యక్కసనం బడిరి. చీనాదేశస్థులు వీరిని యూచీలనిరి. ఈ పసిమి రంగుగల జాతులవారు ప్రపంచమునందలి యున్నతభూమియందు నివసించియుండినవారగుటచేత లోకమునందలి జాతులలో నెల్లఁ దామే పూజ్యులమని యధికులమని భావించుకొనుచు "దైవపుత్రుల"మని చెప్పుకొనుచుండెడివారు. వీరు వివేకజ్ఞానసంపన్నులయిన నాగరికులగుటచేతఁ గ్రమముగా బంగాళము (వంగము) నంతయు నాక్రమించుకొని తరువాత నక్కడనుండి సముద్రముమీఁదుగా సింహళమునకును దక్షిణహిందూదేశమునకును వచ్చి యుండిరి. రామాయణము రచింపఁబడునప్పటికి యక్షులు హిందూ



దేశముయొక్క దక్షిణపుఁగోననుండిరి. ఆ కావ్యమునందు లంకాద్వీపమున కెదుట నుండు సముద్రతీరమున నివసించుచుండిరని చెప్పఁబడి యుండెను. క్రీస్తుశకమునకుఁ బూర్వమయిదవశతాబ్దమున విజయుఁ డనురాజు లంకాద్వీపముపై దండెత్తివచ్చినప్పు డా ద్వీపము యక్షులపరిపాలనమునం దుండెను. ఆ విజయుఁడు మొదట కువేణియను యక్షరాజకన్యను వివాహమాడెను. ఈ మంగోలియాజాతివారిలోఁ బెక్కండ్రు బంగాళములోని గంగానదీ తటముననుండెడి తామ్రలిప్తి యను నగరమునుండి మొదట దక్షిణ హిందూదేశమునకు వచ్చి యుండిరి. ఈ తామ్రలిప్తియె పాళీభాషయందు "తమలిట్టిసు" (Tamalittis) అని పిలువంబడినది. దీనినుండియె తమిళమనుశబ్దము పుట్టి యచ్చటినుండి వచ్చినవారిని తమిళు లనుచున్నారు. ఈ తమిళశబ్దమె యాంగ్లేయభాషలో "టమిల్" అనఁబడుచున్నది. తామ్రలిప్తులను, కోసలులతోను, ఉత్కళులతోను జేర్చి వంగదేశవాసులనుగాను, సముద్రతీరస్థులనుగాను విష్ణుపురాణము వాకొనుచున్నది. ఈ మంగోలియాజాతులవారేక కాలమున నందఱు నొక్కమాఱుగ వచ్చినవారు కారు. వీరిలో వేర్వేఱు తెగలవారు వేర్వేఱు కాలములయందు వచ్చియున్నవారు.

మొదటి తెగవారు "పలయాన్ మారన్" అనువారు. వీరికిఁ గన్యాకుమారికడనుండు మోహూరనునది రాజధానిగనుండెను. పాండ్యరాజొకఁడు తానీతెగలోనివాఁడనని చెప్పుకొనియున్నాఁడు. క్రీస్తుశకమునకుఁ బూర్వమె బర్మాదేశమును జయించిన "మ్రాన్మర్" అనుజాతియును ఈమారన్ జాతియు నొక్కటియె యని యూహింపఁబడుచున్నది. పాళీభాషయందు వ్రాయఁబడిన బర్మాదేశచరిత్రములందు మారమ్మదేశమని వ్రాయఁబడి యుండెను. అయినను మ్రాన్మయనఁగా బ్రహ్మయనియు, మ్రాన్మదేశమనఁగా బ్రహ్మదేశమనియు, అదియే బర్మాదేశమైనదనియు, కొందఱు నుడువుచున్నారు.[1]

1. Taw Sein Ko in the Indian Antiquary, Vol. xxiii. p. 8.

తరువాతవచ్చినవారు రెండవ తెగవారు "తిరయార్" అనుసాగరకులులు. వీరు సముద్రముమీఁద బ్రహ్మదేశము(బర్మాకును) నకును, కొచ్చిన్ చీనాకును, సింహళమునకును (లంకాద్వీపము) దక్షిణహిందూదేశమునకును వచ్చియుండిరి. ఈ తెగలోఁ జేరిన తిరయాన్ అను రాజొకఁడు కరికాలచోడునితో సమకాలికుఁడై కాంచీపురమనియెడి కంచిని పాలించెను. ఈతఁడు తాను విష్ణ్వంశాసంభూతుఁడ నని చెప్పుకొనియుండెను. ఇందుచేతనే కాఁబోలు నా తెగలోఁ జేరిన చోళరాజులు తాము సూర్యవంశజులమని గర్వముతోఁ జెప్పుకొనియుండిరి. ముచ్చుకుంటుఁడనునతఁడు చోళరాజులలో ప్రాథమికుఁడుగా తమిళకావ్యములయందుఁ జేర్కొనఁబడియెను. అసురలింద్రుని రాజధాని యగు నమరావతిని ముట్టడించినప్పుడీతఁడసురల నిర్జించి యమరావతిని సంరక్షించెను. తనకుఁ జేసిన యుపకారమునకుఁ బ్రత్యుపకారముగా నింద్రుఁడయిదుగురు రాక్షసులను బంపఁగా వారలు కావీరిపట్టినములోని (కావేరపట్టణము) నాగులను సంహరించి పట్టణమును చోళరాజునకు వశపఱచిరి. తమిళు లాపట్టణమునకు చంపాపతి యని పేరు పెట్టిరి. వంగదేశమునకు చంపానగరము రాజధానిగ నుండెను. ఆపేరునే వీరిచ్చటిపట్టణమునకుఁ బెట్టిరని యూహింపఁబడుచున్నది. తొండైమండలమును బాలించిన పూర్వరాజులు సాగరకులులకు సంబంధించినవారుగ నుండిరి. కాని యిటీవలి పల్లవులు తాము భారద్వాజులమని చెప్పుకొనుచుండిరి. ఇప్పటి చెంగలుపట్టు, ఉత్తరార్కాడుమండలములే తొండైమండలముగా నాకాలమునఁ బ్రసిద్ధివహించి యుండినవి. ఈతిరయార్ తెగలోనికుటుంబములయిదు వేర్వేఱు నామములతోఁ బిలువంబడుచుండినవి. వంగదేశపు తిరయారులు పాంగలతిరయారులనియు, చీనాదేశపు తిరయారులు చీనాతిరయారులనియు, కడరం (బర్మా) తిరయారులు కడరతిరయారులనియు, సింహళద్వీపతిరయారులు సింగలతిరయారులనియు, పల్లవము తిరయారులు పల్లవతిరయారులనియు పదునాఱవ శతాబ్దమువఱకుఁ బిలువంబడుచుండిరి. తిరయారులకు వెనుకవచ్చినవారు వనవారు లనెడి తెగవారు. వీరిని స్వర్గమునుండి వచ్చినవారనియెదరు. వీరు వంగదేశమునందలి యుత్తరపర్వత



ప్రాంతభూముల నివసించుచుండెడివారు. వీరు దక్షిణ హిందూదేశమునకు వచ్చినప్పుడు సేలముజిల్లాలోని కొల్లికొండలకడను, నీలగిరులకడను, పడమటికనములకడను నివాసముల నేర్పఱచుకొనిరి. చేరరాజు లీతెగలోనివారుగా నుండిరి. హిమాలయమునందలి వనవారులతోఁ జేరినవారమని చెప్పుకొనుచు నీతెగలోని రాజులు "వనవర్మన్, ఇమయవర్మన్" అను బిరుదుపేరులను వహించుచుండిరి. ఈరాజులు మాత్ర మెగాక పర్వతనాయకులగు నన్నన్, అలంబిల్వేలు మొదలగువారు కూడ వనవాసనాయకు లని యర్థమిచ్చెడు "వనవీరల్వేలు" లని పిలుచుకొనుచుండెడివారు. లంకాద్వీపమేలెడి గజబాహునకు (క్రీ. శ. ౧౧౩-౧౦౫) సమకాలికుఁడైన "చెంకుట్టువాన్" అనియెడు చేరరాజొకఁడు మగధదేశమును బాలించు చక్రవర్తియగు కర్ణునితో (ఆంధ్రరాజగు శాతకర్ణునితో) సఖ్యముఁ జేసికొని హిమాలయమునకు సామీప్యమున నార్యులతో యుద్ధము చేసెనని చిల్లప్పదికారమను తమిళకావ్యమునందుఁ జెప్పఁబడినది. ఈచరిత్రము నాంధ్రరాజులఁగూర్చి వ్రాయుప్రకరణమునందు సంపూర్ణముగాఁ దెలుపఁబడును.

కాఁబట్టి తమిళజాతులగు మ్రాన్తరులు, తిరయారులు, వనవారు లనియెడు మూడు తెగలవారును దక్షిణహిందూదేశమున పాండ్య చోళ చేర రాజ్యములను స్థాపించిరి. ఇందలి చేరరాజ్యమునే కేరళరాజ్యమందురు. అశోకుని కాలమునాటికే యీరాజ్యము లేర్పడి యశోకవర్ధనచక్రవర్తికి లోఁబడక స్వతంత్రతను వహించి యుండినవి.[1]

అయినను పౌరాణిక గ్రంథకర్తలు పాండ్య చోళ కేరళ రాజ్యముల స్థాపించిన జాతులవారి యుత్పత్తిని మఱుగుపఱచి వీరల నార్యరాజుల సంతతివారినిగాఁ జెప్పియుండిరి. పాండ్య చోళ కేరళ కోలు లనియెడువారు పురువంశజుఁడయిన దుష్యంతుని మునిమనుమలనుగా నగ్నిపురాణ హరివంశములలో వ్రాసియుండిరి. వీరలే పాండ్యచోళకేరళకోల రాజ్యములను స్థాపించి తద్వంశములకు మూలపురుషులయిరనికూడ వ్రాసిరి. కాని విష్ణుపురాణమునందు దుష్యం

1. Indian Antiquary, Vol. xx, p. 242.

తునిసంతతిలో వీరిని జేర్చియుండలేదు. మఱియును పాండ్యచోళులను భ్రష్టతనొందిన క్షత్రియులని హరివంశము నుడువుచున్నది.[1] మఱికొన్ని పురాణములయందు దక్షిణాపథముయొక్క కొట్టకొన "అక్రీడుఁ"డనురాజు తొల్లి పరిపాలించుచుండెననియు, అతనికి పాండ్య, కేరళ, కోల, చోళు లను నల్వురు పుత్రులు కలరనియు, వారిలోఁ బెద్దవాఁడగు పాండ్యుఁడు స్వస్థానముననే రాజయ్యె ననియు, తక్కినమువ్వురును స్వదేశమును దాటి పైకిఁ బోయి చోళ, కేరళ, కోలరాజ్యములను స్థాపించుకొని రనియును మఱికొన్ని పురాణములు చెప్పుచున్నవి.

ఈ మూడు తెగలవారికిఁ బిమ్మట కోసరు లనియెడు మఱియొక తెగవారు వచ్చి కొంతకాలమువఱకుఁ బాండ్యులకులోఁబడి తరువాత కొంగదేశమునకు (ఇప్పటి కోయంబత్తూరు జిల్లా) నధిపతులైరి.

తమిళులచే నివసింపఁబడు దేశము తమిళక మైనది.[2] ఈతమిళకమున కుత్తరపుహద్దు వేంగడము. ఈవేంగడమె వేంకటాచల(తిరుపతి)మనఁబడుచున్నది. దక్షిణపుహద్దు కన్యాకుమార్యగ్రము (Cape Comorin) తూర్పున బంగాళాఖాతమును, పశ్చిమమున నరాబియాసముద్రమును గలవు. ఈహద్దులకు నడుమనుండెడి దేశమునకు తమిళికమని పేరు. తమిళులు దక్షిణాపథముయొక్క దక్షిణపుఁగొనకు రాక పూర్వము నాగులును ద్రావిడులును నివసించుచుండిరి. వీరికంటె సంఖ్యయందుఁ గొఱవడియుండుటచేత తమిళులు ప్రాచీనద్రావిడభాష నవలంబింపవలసివచ్చినది. వీరు ద్రావిడులలోఁ గలిసిపోయి కొంతకాలమునకు నాప్రాచీనద్రావిడభాషను సంస్కరించిరి. వీరిభాష తమిళభాష. ఇదియె యింగ్లీషున "టమిల్"అనఁబడుచున్నది. వీరార్యులుగారు. ఆర్యులకు ప్రతిస్పర్థులుగ నుండుచువచ్చిరి. వీరిని మ్లేచ్ఛులని, పెఱవారని యార్యగ్రంథములు పేర్కొనియున్న

1. Prof. H. H. Wilson's Historical Sketch of the Pandyan Kingdom. Journal of the Royal Asiatic Society Vol. ii Act. ix p. 199.

2 The Tamils: eighteen hundred years ago pp. 10-12.



వి.[1] ఈద్రావిడులు తమిళులుగూడ నార్యులకంటెను విలక్షణమయిన నాగరికతను గలిగియున్నట్లు గన్పట్టుచున్నది. ఈసంఘములవారే యిటీవల మనయాంధ్రదేశమునఁ బ్రవేశించి యాంధ్రులలోఁ గలిసిపోయినట్లుగఁ గన్పట్టెడిని.

## ఆర్యులు - ఆర్యావర్తము.

అనేకసహస్రసంవత్సరములకుఁ బూర్వమె యార్యులనెడివారు హిమాచలమున కుత్తరభాగమున మిక్కిలిదూరమున మధ్యాసియా ఖండమునందు నివసించుచుండెడివారని బహుగ్రంథపరిశోధకులగు చరిత్రకారు లనేకు లభిప్రాయపడియున్నారు. అయినను ఉత్తరధ్రువమండలమే యార్యులజన్మస్థానమని ఋగ్వేదమునుండి కొన్నిప్రమాణవచనముల నెత్తిచూపి బాల గంగాధర తిలకుగారు "ఆర్కిటిక్ హోమ్"అనుగ్రంథమున విశేషముగాఁ జర్చించి నిశ్చయించియున్నారు. ఆర్యులు మొట్టమొదట మధ్యాసియాఖండమునం దుండినను, ఉత్తరధ్రువమండలమందుండినను మఱియెచ్చటనుండినను క్రమముగా జనసంఖ్య పెఱిఁగినకొలఁది జన్మస్థానమున నివసించుటకుఁ దావును, ఉదరపోషణమున కాహారపదార్థములును జాలక తమజన్మస్థానమును విడిచిపెట్టి దక్షిణదిగ్భాగమునకుఁ గొందఱును పశ్చిమదిగ్భాగమునకుఁ గొందఱును, వెడలిపోయిరి. వారిలో దక్షిణదిగ్భాగమునకు వచ్చినయార్యులు హిందూదేశమునకు వాయువ్యదిశనున్న పర్వతమార్గములలోనుండి సింధునదీతీరమునకువచ్చి యామహానదని దాటి దానికిఁ దూర్పుననుండుదేశము నాక్రమించుకొనిరి. ఈప్రదేశము సరస్వతీ దృషద్వతీనదులకు నడుమనుండునది. ఈభూమి మిక్కిలి పవిత్రమైనదిగ నెంచఁబడుచు వచ్చినది.

1 In early times all Dravidians were regarded as outcasts and even a Brahmin who came to the Dravida country was held to be a Mlecha (census report 1891. Vol. xiii para 332.)

1 శ్లో. సరస్వతీదృషద్వత్యో ర్దేవనద్యోర్యదంతరం।
తందేవనిర్మితందేశం బ్రహ్మావర్తం ప్రచక్షతే॥"అని మనుస్మృతి అ-౨-౧౭.

దీనినే బ్రహ్మావర్తదేశమని దేవదేశమని పిలుచుచుండిరని మనుస్మృతియందు వ్రాయఁబడినది. ఇచ్చటనే చాతుర్వర్ణ్యవిభాగమును యజ్ఞాదిక్రతుకర్మలును ఆచరణములోనికిఁ దేఁబడి పెంపొందినవి. ఇచ్చటనుండియే యార్యులు తూర్పునకును దక్షిణమునకునుబోయి క్రమముగా హిమాలయమునకును వింధ్యకు నడుమనుండెడి యావద్దేశము నాక్రమించుకొనిరి. దీనికే యార్యావర్తమని పేరు.

ఇట్లని మనుస్మృతి[1] వలనమాత్రమె గాక పతంజలికృత మహాభాష్యమువలనను వింధ్యోత్తరభాగం బార్యావర్తంబనియు, దేవదేశంబనియు, గౌడదేశంబుననియు వ్యవహరింపంబడియె నని తెలియుచున్నది. తద్దక్షిణభాగము మ్లేచ్ఛదేశంబనియు, ద్రావిడదేశంబనియు, దక్షిణాపథమనియు వ్యవహరింపం బడియెను.

## దక్షిణాపథము.

నర్మదానదికి దిగువభాగము దక్షిణాపథమని పూర్వసంస్కృతగ్రంథములయందు వ్రాయఁబడినది. దక్షిణశబ్దములోనుండి దక్కనము పుట్టినది. అదియె హిందీభాషలో “దఖ్ఖన్” అని చెప్పఁబడుచున్నది. అదియె “డెక్కన్” అని యింగ్లీషున వాడంబడుచున్నది. డెక్కన్ అనుపదము దక్షిణశబ్దముయొక్క వికృతరూపమని కొందఱిచే భావింపఁబడుచున్నది. డెక్కన్ దేశమన దక్షిణాపథదేశమె యని కొందఱు చెప్పుచున్నారు. ఆర్యులు త్తరమునుండి దక్షిణమునకువచ్చిన మార్గమునకు దక్షిణాపథమని పేరువచ్చినది. ఈదక్షిణాపథమునను ండెడి దేశములకే దక్షిణాపథదేశములని పేర్లు వచ్చినవి.

దక్షిణాపథదేశమునే ప్రాకృతభాషలో దఖ్ఖిణాబదేశమని వ్యవహరించుచుండిరఁట! [2]దక్షిణాపథమున చోళులయొక్కయు, పాండ్యులయొక్కయు, కేరళులయొక్కయు, దేశములుకలవని మార్కండేయ వాయుమత్స్య

1. శ్లో. ఆసముద్రాత్తువై పూర్వా దాసముద్రాత్తుపశ్చిమాత్
తయోరేవాంతరంగిర్యో ర్యార్యావర్తంవిదుర్బుధాః అని మనుస్మృతి.

2 Ind. Ant, Vol. viii. p. 143.



పురాణములలోఁ దెల్పఁబడియెను.[1] సహదేవుఁడు తన దక్షిణదిగ్విజయమునుగూర్చి చెప్పుసందర్భమునఁ దాను పాండ్యులను జయించినతరువాత దక్షిణాపథమునకుఁ బోయియుంటినని చెప్పినట్లుగ మహాభారతమునఁ జెప్పఁబడినది.[2] సహ్యగిరియందు జనించు గోదావరి మొదలగునదులు దక్షిణాపథదేశములోనివని వాయుపురాణము దెల్పియుండియు నర్మదాతాపీనదులనట్లు పేర్కొని యుండకపోవుటచేత నా రెండునదులు ప్రవహించెడు దేశములు దక్షిణాపథములోనివి కావని చెప్పవలసియున్నది.[3] ఆంధ్రదేశము దక్షిణాపథములోనిదని యిదివఱకే దెలిపియుంటిమి. దక్షిణాపథము వేర్వేఱు గ్రంథకర్తలచే వేర్వేఱు విధములుగా నిరూపింపఁబడుచువచ్చెనుగాని సామాన్యముగా వింధ్యకు దక్షిణభాగమంతయు దక్షిణాపథముగానే వ్యవహరింపఁబడుచు వచ్చెననుటకు సందియములేదు.

## ఆర్యులు దక్షిణమునకు వచ్చుట.

ఉత్తరముననుండి యార్యులు దక్షిణమునకు వచ్చుటకు బహుకాలము పట్టియుండును. ఆర్యాశ్రమములకు దక్షిణపుహద్దుగా వింధ్యపర్వతముండెనని మనువు పతంజలి మొదలగువారు చెప్పియుండిరి. ప్రచండభాస్కరుని మార్గము నరికట్టి వింధ్యపర్వత మాకాశమంటుకొని విజృంభించి లోకమునంతయు నంధకారబంధురముగావించి గర్వించి యుండెనని పురాణకవులభాషలోఁ జెప్పఁబడినది. ఆర్యుల దక్షిణాపథము నవరోధించి గర్వించి యుండిన వింధ్యముయొక్క గర్వము నడంచు మహావీరుఁడు బయల్పడునంతవఱకు నార్యులకు మార్గావరోధము గలిగియుండెను. అట్టి మహావీరుఁ డగస్త్యమహర్షి. ఇతఁడు

1 మార్కండేయపురాణము; అధ్యాయము ౫౭, శ్లోకము ౪౫; పాఠము రెండవపంక్తి తప్పుగనున్నది; “పాండ్యాశ్చ కేరళాశ్చైవ చోళాఃకుల్యాస్తథైవచ” అని యుండవలయును. వాయుపురాణము; అధ్యాయము ౪౫ శ్లోకము ౧౭౪. మత్స్యపురాణము; అధ్యాయము ౧౧౭ శ్లోకము ౪౩.

2 మహాభారతము; సభాపర్వము; అధ్యాయము ౩౧ శ్లోకము ౧౭.

3 వాయుపురాణము: అధ్యాయము ౪౫ శ్లోకము ౧౦౪.

వింధ్యమును బాదాగ్రతలముచేఁ ద్రొక్కిపట్టి గర్వాపహరణముఁ గావించి మరల సూర్యరశ్మిని బ్రసరింపఁగఁజేసి లోకము నుద్ధరించెనని పురాణములయం దభివర్ణింపఁబడియెను. ఆర్యులలో మొదట నగస్త్యుఁడే వింధ్యపర్వతమును దాటి దక్షిణమునకు వచ్చినవాఁడని పై పురాణగాథను బట్టి స్పష్టమగుచున్నది. వింధ్యపర్వతముయొక్క పశ్చిమోత్తరభాగమునకుఁ బారియాత్రమను పేరుగలదు. ఇచ్చటనే వేత్రవతి మొదలగు నదులు జనించియున్నవి. ఆర్యులు దక్షిణయాత్రకు బయలుదేఱి యీపర్వత పంక్తి పార్శ్వముననే పోయియుండుటచేత దీనికిఁ బారియాత్రమని పేరువచ్చియుండు నేమో యని భాండార్కర్ గారూహించుచున్నారు.

అగస్త్యుఁడు వింధ్యము కడవఱకు దూర్పుగఁ బోయి యటనుండి దక్షిణముగావచ్చి గోదావరికి సమీపమున నొక యాశ్రమమును నిర్మించుకొని యుండెను. శ్రీరాముఁ డీయాశ్రమమునకు వచ్చినట్లు రామాయణమునందుఁ జెప్పఁబడియుండుటంజేసి యప్పటికే యీదండకారణ్యమునం బ్రవేశించి యార్యు లాశ్రమాదుల నెలకొల్పుచుండిరని ధ్రువపడుచున్నది. ఈ యగస్త్యాశ్రమము ప్రస్తుతపు గోదావరి మండలములోని భద్రాచలమునకు సమీపమున నుత్తరదిశనున్నదని రెండవ ప్రకరణమున నుదాహరించియుంటిమి. మొట్టమొదట నార్యులు దక్షిణాపథమునఁ ద్రొక్కినప్రదేశ మాంధ్రభూమిగానే గన్పట్టుచున్నను కొందఱార్యులు కొంకణదేశమునుండి సింహళద్వీపమునకును, అచ్చటినుండి దక్షిణ ద్రావిడమునకును బోయినట్లుగూడ గన్పట్టుచున్నది.

## కర్ణాటార్యులు.

కడపట నీ యాంధ్రదేశమునకు వచ్చినవారు కర్ణాటార్యులు. కర్ణమనఁగా కొండలోయ. వానియందు సంచరించువారు కర్ణాటులని చెప్పఁబడుచున్నారు. కొందఱు ద్రావిడులు దక్షిణదేశముననుండి పశ్చిమోత్తరమునకుఁ గ్రమముగా వ్యాపించి మలయపర్వత ప్రాంతములయందున్న లోయలలో నివసించుమనుష్యులతోఁ గలసి తమ ద్రావిడమును లోయలోని వారి స్వభాషయగు కన్నడమును జేర్చి కొంతకాలమువఱకు వాడుకొనుచుండఁగా నుత్తరదేశమునుండి కొంతకాలమున కార్యులు కొందఱు వచ్చి యీకర్ణాటులతోఁ గలసి తమ ప్రాకృత సంస్కృతములను వారి కర్ణాట ద్రావిడములను గలిపి రూపభేదములతో వ్యవహరించుకొనుటంజేసి వారి భాషయంతయుఁ గర్ణాటంబనియె వ్యవహరింపఁబడుచుండెను. ఈ కర్ణాటార్యులె క్రమక్రమముగాఁ గొంద ఱాంధ్రదేశమునకు వచ్చి యాంధ్రులలోఁ గలిసిపోయిరి.



## ఆంధ్రు లార్యులా, అనార్యులా, ద్రావిడులా?

ఆంధ్రు లాదిమనివాసులో ద్రావిడులో ఆర్యులో మనము నిశ్చయముగాఁ జెప్పఁజాలము కాని యైతరేయ బ్రాహ్మణమునందు నాంధ్రులు విశ్వామిత్రుని సంతతివారనియు, వానిచే శపింపఁబడి యార్యాశ్రమములయొక్క సరిహద్దుల నివసించుచుండెడి వారనియుఁ జెప్పఁబడియుండుటంజేసి యీ యాంధ్రు లుత్తరదేశములోని యార్యులతోఁ బోరాడి లేచి వచ్చి దండకారణ్యములోని యనార్యజనమధ్యమున నివసించెడి యొక తెగవారయిన యార్యులనుగాఁ గొందఱు తలంచుచున్నారు. ఆంధ్రులను పుళిందులతోడను శబరులతోడను జేర్చియుండుటచేత వీరాదిమనివాసులయిన యనార్యులేమో యని కొందఱు తలంచుచున్నారు. అనేకవిధముల ద్రావిడులతో విశేష సంబంధము గన్పట్టుచుండుటచేత వీరలు ద్రావిడులని మఱికొందఱు తలంచుచున్నారు. ఆంధ్రశబ్దముయొక్క వ్యుత్పత్తినిబట్టి చూచిన మొదటి యభిప్రాయము సరియైనదేమో యని తోఁచుచున్నది. మనుష్యులు నివసించుటకు సాధ్యముకాక యంధకారబంధురముగా నుండు మహారణ్య ప్రదేశమున కంధ్రమని యార్యులు పేరిడియుందురు. ఈప్రదేశమునందు మొదట ననార్యులే నివసించుచుండిరి. తమ తెగవారొకరు తమతోఁ బోరాడి వెడలివచ్చి యీ యరణ్యప్రదేశమున ననార్యజన మధ్యమున నివసించియుండుటచేత నార్యులు వీరికి నాంధ్రులని పేరుపెట్టియుండవచ్చును. ఆంధ్రు లార్యులయినను ననార్యులయినను పేరుమాత్ర మార్యులచే నీయఁబడినదనుట స్పష్టము. ఈయార్యాంధ్రులు తమతోఁ బోరాడి

1 Dr. Bhandarkar's Early History of Deckhan p. 2.

వేఱుపడి వచ్చి దస్యులతోఁ గలిసి వర్తించుచుండుటచేత నార్యులు వీరినిగూడ దస్యులనుగానే భావించి వారినెట్లు చూచుచుండిరో వీరినిగూడ నట్లే చూచియుండవచ్చును. ఆర్యాంధ్రు లాకాలమున నీయరణ్యప్రదేశములయందు నాశ్రమముల నేర్పఱచుకొని యందందు నివసించుచుండిరిగాని వీరిప్రదేశ మార్యప్రదేశముగా నెన్నఁబడక యనార్యప్రదేశముగానే భావింపఁబడుచుండెను. ఆర్యాంధ్రులు మాట్లాడు భాష యసంస్కృతముగాని సంస్కృతభాష గాదు. అనార్యాంధ్రులు మాట్లాడుభాష పైశాచీభాషగా నుండెను. ఆర్యాంధ్రులు మహారణ్య ప్రదేశమున ననార్యాంధ్రజన మధ్యమున నివసించుచుండుటం జేసి వీర లార్యభాషకు నార్యాచారములకు దూరగులై తుదకు ననార్యసంబంధ మెక్కుడుగాఁ గలిగియుండిరి. ఆర్యాంధ్రులయొక్కయు, అనార్యాంధ్రులయొక్కయు రక్తమిచ్చట సమ్మేళనమయ్యెను. ఆర్యాంధ్రుల యసంస్కృతంబును, అనార్యాంధ్రుల పైశాచీభాషయు నిచ్చట మిశ్రములగుచువచ్చెను. ఇట్లు కొంతకాలము జరుగునప్పటికి వీరెల్లరు నాంధ్రులయిరి. వీరు మాట్లాడు భాష యాంధ్రమయ్యెను. ఇదియొక ప్రాకృతభేదముగా నుండెను. ఐతరేయ బ్రాహ్మణకాలమునాటికి వింధ్యోత్తర ప్రదేశము మాత్రమె గాక యీ యాంధ్రదేశముగూడ కలదని యార్యులకుఁ దెలిసియుండెను. మహాభారతము కురుపాండవులచారిత్రం బగుటం జేసియుఁ గురుపాంచాలాదులును, దుష్యంత భరత పరీక్షిజ్జనమేజయాదులును నైతరేయ బ్రాహ్మణంబునఁ బేర్కొనంబడియుండుటం జేసియు, నైతరేయ బ్రాహ్మణ మైతరేయుండను మహీదాస ఋషిచే మహాభారత యుద్ధానంతరమె దెలుపఁబడినదని తేటపడుటం జేసియు నాంధ్రులుగూడ మూడువే లేండ్లనుండి యున్నారని మనకు నిశ్చయముగాఁ దెలియుచున్నదిగాని యాకాలము మొదలుకొని యేఁడెనిమిది శతాబ్దముల వఱకు ననఁగాఁ గ్రీస్తుశకమునకుఁ బూర్వము మున్నూఱు సంవత్సరముల క్రిందట నుండి యేకచ్ఛత్రాధిపత్యమువహించి పాటలీపుత్రము రాజధానిగా భరతఖండము విశేషభాగముఁ బరిపాలించిన చంద్రగుప్తచక్రవర్తికాలమునాఁటి వఱకు మఱల నాంధ్రుల ప్రశంస యేగ్రంథమునందును గానంబడదు.

---

## ఐదవప్రకరణము.

---

### నాగులు – నాగకులులు.

ప్రాథమికార్యులు సింధునదిని దాటివచ్చి యామహానదికిఁ దూర్పుప్రక్కను సరస్వతీ దృషద్వతీనదులకు మధ్యను స్థిరవాసము లేర్పఱచుకొనిన తరువాత వేయేండ్లకుఁ బిమ్మట నార్యులలో మఱియొక శాఖవారు బయలుదేఱి గంగాతీరమువఱకు వచ్చి, కురుపాంచాల దేశములందు వసియించియుండిన కాలమున, హిమాలయ పర్వతము మొదలుకొని వింధ్యపర్వతమువఱకును గలదేశమునంతను నాగులనియెడి యొకజాతివారు పరిపాలనము చేయుచుండినవారని మనకావ్యపురాణేతిహాస గ్రంథములవలనను, బౌద్ధమతస్థుల గ్రంథములవలనను గానంబడుచున్నదిగాని, మనదేశచరిత్రములను వ్రాసిన పాశ్చాత్యులేమి, హైందవచరిత్రకారులేమి తాము వ్రాసినగ్రంథములయందు నీనాగుల చరిత్రమును విశదీకరింపక యేమి కారణముచేతనో విస్మరించియున్నవారు. నాఁచుచేఁ గప్పఁబడిన శుద్ధజలమువలెనే వీరిచరిత్రమంతయుఁ బురాణగాథలచేఁ గప్పఁబడి చరిత్రకారుల నేత్రములకు గోచరముగాకయుండెను. ప్రాథమికార్యులు దస్యులతోఁ బోరాడినట్లుగ ఋగ్వేదాదులయందుఁ దఱచుగాఁ గానంబడుచుండినను తరువాత వచ్చినయార్యు లీనాగులతోడను నాగకులులతోడను బోరాడినట్లుగ మహాభారతాది గ్రంథములయందుఁ గానంబడుచున్నది. ఆంధ్రులు దండకారణ్యమునం దాంధ్రరాజ్యమును స్థాపించి పరిపాలనముచేసి వాసికెక్కుటకుఁ బూర్వ మీనాగులీ దండకారణ్యము నాక్రమించి కిరాతజాతులనన్నిటిని జయించి రాజ్యమును స్థాపించి పరిపాలనముచేసినట్లుగఁ గాన్పించుచున్నది. మన పురాణాదులయం దభివర్ణింపఁబడిన నాగలోకమనునది యీనాగులదేశమె గాని పాతాళముగాదు. మనపురాణగాథలలో నభివర్ణింపఁబడిననాగకన్య లీనాగజాతికన్యలేగాని యన్యులుగారు. నగమనఁగాఁ గొండ. నాగమ

నఁగాఁ బాము. నగములోనుండి పుట్టినది నాగము. ఈనాగులనియెడి జాతివారు నాగములను బూజించువారగుటచేతనో నాగమును ధ్వజమునందు ధరియించెడు నాగధ్వజులగుటచేతనో, లేక నగములయందు సంచరించెడు జాతివారగుటచేతనో, మఱియేమి కారణముచేతనో యీజాతివారికి నాగులనియెడి పేరువచ్చినది. మన పూర్వగ్రంథము లీనాగులకథలతో నిండియున్నవి. ఈ నాగుల యనార్యాచారములనే పెక్కింటినిప్పటికిని మనవా రవలంబించియే యున్నారు. ఈనాగులు పాములను బూజించువారగనుకనే నేఁటికిని మనవారు పాములను బూజించుచున్నారు. ఈనాగులు వృక్షములను బూజించువారుగనుకనే మనవారు నేటికిని వృక్షములను బూజించుచున్నారు. పూర్వకాలమునం దీదేశము నాగులకు లోఁబడి నాగులచేఁ బరిపాలింపఁబడి నాగసాంప్రదాయములనే యవలంబించి నాగుల యనార్యాచారములలోమునింగి యుండినదగుటచేతనే కాఁబోలు మనదేశమునం దెచ్చటవిన్నను నాగశబ్దమే వినంబడుచున్నది. మనదేశమునందు నాగూరు, నాగవరము, నాగపురము, నాగపట్టణము, నాగేశ్వరము, నాగులపాడు, నాగిమూడి, నాగరము మొదలగు గ్రామనామములు వినంబడుచున్నవి. ఇంతియగాక నాగి, నాగఁడు, నాగులు, నాగయ్య, నాగన్న, నాగప్ప, నాగిరెడ్డి, నాగినీఁడు, నాగరాజు, నాగవర్మ, నాగలింగము, నాగరత్నము, నాగోజీరావు, నాగేశ్వరరావు, అనునామములు మనుష్యులలో వినంబడుచున్నవి. మఱియును మనదేశమునందు నాగములను బూజించుటకు కార్తికశుద్ధచతుర్థి "నాగులచవితి" యనుపేరుతోఁ బర్వదినముగా నొప్పుచున్నది. ఈపర్వదినము బ్రాహ్మణులకంటెను బ్రాహ్మణేతరులచే మిక్కిలి భక్తిపూర్వకముగఁ బూజింపఁబడుచున్నది. పూర్వకాలమునందలి యార్యులీనాగములనుగొల్చెడి నాగులను సాధారణముగా గౌరవముతోఁ జూచెడివారుగారు. ఆకారణముచేతనే గాఁబోలు నెవ్వడైన నొకానొకప్పుడే దిగ్గైన నొక తెలివితక్కువ పనిచేసినప్పుడుగాని హానికరమైనపని చేసినప్పుడుగాని మనవారు "ఓరినాగులూ, ఓసినాగమ్మా" యని నిందాగర్భముగఁ బలుకుచుండుటను నేఁడును మనము చూచుచున్నాము. మనదేశమునందు కార్తికశుద్ధచతుర్థి (నాగులచవితి)వలెనె మహారాష్ట్రాదిదేశములయందు నాగపంచమి యను పేరను కార్తికశుద్ధపంచమి పర్వదినముగాఁ బరిగణింపఁ బడుచున్నది. దీనినంతయును బరికించిచూడఁగా నీయాచారములన్నియు నాగులనుబట్టి మనకు సంక్రమించినవిగాని యివినిజముగా నార్యాచారములుగావు. ఈ యనార్యాచారములు విశేషముగా దక్షిణాపథమునందే గానంబడుచున్నవిగాని యుత్తర హిందూస్థానమునందుఁ గానంబడకుండుటకుఁ గారణము దక్షిణాపథవాసులు సంపూర్ణముగా నార్యాచారములకుఁ దలయొగ్గి వానిలోమునింగిపోయిన వారు గాకుండుటయె గారణముగాని వేఱొండు గారణముగానరాదని చెప్పవచ్చును.



## నాగోత్పత్తికథనము.

మహాభారతమునందు నుపోద్ఘాతము ముగింపఁబడిన వెనుక నీనాగులచరిత్రమె మొదట చెప్పఁబడినది. కశ్యపుఁడను నార్యునకు కద్రువ, వినత యను నిరువురు భార్యలు గలరు. వీరిరువురును తోఁబుట్టువులు. వీరికింగల యభిమతంబులచొప్పునఁ గద్రువకు సహస్రనాగములు జనించినవి. వినతకు గరుఁడుండు జనించెను. కద్రువకు జనించిన సహస్రనాగములకుఁ బుట్టినసంతతియే లోకమునందలి నాగకులముగానున్నది. ఈనాగులలోఁ బ్రముఖులుగా నుండినవారు శేషుఁడు, వాసుకి,ఇరావంతుఁడు, తక్షకుఁడు, కర్కోటకుఁడు, కాళీయుఁడు, ఐలుఁడు, ఇలాపాత్రుఁడు, నీలుఁడు, అనీలుఁడు, నహుషుఁడు మొదలగువారు. (అనంతుఁడు, వాసుకి, తక్షకుఁడు, శంఖపాలుఁడు, కుళికుఁడు, పద్ముఁడు, మహాపద్ముఁడు, కర్కోటకుఁడు వీరినే అష్టనాగములని మనగ్రంథములు పేర్కొనుచున్నవి.) కద్రువ వినతకుఁజేసిన యపకారమునుబట్టి వినతకుఁ బుట్టిన గరుత్మంతుఁడు నాగకులమునకెల్లను వైరియయ్యెను. 'దీనికిఁ దోడు మాతృశాపముగూడ నాగులకు సంభవించెను. ఈ నాగులచరిత్రము మహాభారతమునందు నివురుగప్పిన నిప్పువలెనున్నది. గులకఱాళ్లలో మాటుపడియుండిన రత్నమువలెఁ బ్రకాశింపకయున్నది. ఈగులకఱాళ్లను దొలఁగించిన నాగులచారిత్రమనియెడి రత్నము శోభింపకమానదు. ఈనివురును దొలఁగించిన నాగులచరిత్రమనియెడి నిప్పు

తేజోవంతముగఁ గన్పట్టకమానదు. ప్రాథమికార్యులు సూర్యకులులును బరిశుద్ధులునైయుండిరి. వీరితరువాత వేయేండ్లకువచ్చినవారు చంద్రకులులు. వీరుసూర్యకులులవలె నంతగాఁ బరిశుద్ధులు కారు. అన్యజాతిరక్త మీచంద్రకులుల నాడులయందుఁ బ్రవహింపుచుండెను. ఈ రెండవతెగవారు పాంచాలముగుండపోయి గంగా యమునానదులకు నడుమనుండెడి హస్తినాపురమునందు వసించియుండిరి. వీరలే భారతవీరులనిపించుకొనిన యుధిష్ఠిరాదులుగా నుండిరి. వీరు క్రీస్తుశకమునకుఁ బూర్వము పదమూడవ శతాబ్దప్రాంతమున హస్తినాపురమునందుండిరి. అచ్చటనున్న కాలమున వీరి కుటుంబము వృద్ధియై హస్తినాపురముచాలక మఱియొకపురము కావలసివచ్చెను.

## ఖాండవవనదహనము.

ఇప్పుడు ఢిల్లీనగరముండిన ప్రదేశ మాకాలమున ఖాండవవనముగానుండి నాగులచే నాక్రమింపఁబడియుండెను. వారలను జయించినఁగాని వనము స్వాధీనముగాదు. అయ్యదిస్వాధీనమైన వెనుకఁగాని యరణ్యమును ఛేదించి పురమునుగట్టుట సాధ్యముగాదు. అప్పుడర్జునుఁడు కృష్ణునిసహాయముతో ఖాండవవనమునుదహించి నాగులం దఱిమివేసెను. బౌద్ధులదేవతయగు నింద్రుఁడు నాగులను సంరక్షించెను. ఆర్యుల వైదికదేవుఁడగు నగ్ని వనమునంతయును దహించి నాగరాజయిన తక్షకుని దక్క తక్కిన నాగకులమును నిర్మూలముచేసెనని చెప్పఁబడియెను. ఈప్రదేశమునందే పాండవులు "ఇంద్రప్రస్థ" మను పురమును నిర్మించిరి.

## అర్జునుఁడు నాగకన్యల వివాహమాడుట.

ఈఖాండవవనదహనానంతరము నార్యులకును నాగులకును మైత్రికలిగి యున్నటులనే చెప్పఁబడియెను. అర్జునుఁడు సమయభంగకారణమునఁ దీర్థయాత్రకు బయలువెడలినప్పుడు నాగకన్యకయగు నులూపిని వివాహమాడినట్లుగఁ జెప్పఁబడియుండెను, మఱియు మణిపురాధీశ్వరుండును నాగరాజును



నగుచిత్రవాహనునియొక్క కూఁతురు చిత్రాంగదయను నామెనుగూడ వివాహమైనట్లుగఁ జెప్పఁబడినది. అర్జునునివలన నులూపికి జనించినవాఁ డిరావంతుఁడను పేరుగలవాఁడు. ఇతఁడు భారతయుద్ధములోఁ జనిపోయెను. అర్జునునివలనఁ జిత్రాంగదకు జనించినవాఁడు బభ్రువాహనుఁడను పేరుగలవాఁడు. ఇతఁడు బహు పరాక్రమవంతుఁడై భారతయుద్ధానంతరము ధర్మజుఁడు చేయఁబూనిన యశ్వమేధ యాగమును నిర్విఘ్నముగా నెఱవేర్పఁ బూని యర్జునుఁడు సవనాశ్వముతో బభ్రువాహనుని దేశమునకు వచ్చినప్పుడా సవనాశ్వమును బట్టుకొని తండ్రితో నత్యద్భుతముగఁ బోరి యోడించెనుగాని తరువాత నులూపి మొదలగు వారిచేఁ బ్రబోధితుఁడై యర్జునునకు సహాయముఁ జేసెను. ఈకథలను బట్టి కొంతకాలమువఱకు నార్యులును నాగులును స్నేహభావముతోనే గడపుచుండిరని తేటపడుచున్నది. పాండవులకుఁ దరువాత సింహాసనమునకు వచ్చిన పరిక్షిత్తుకాలమున నార్యులకు నాగులకు వైరము పొసంగినది. అందులకుఁ గారణ మీక్రింది విషయముగఁ గన్పట్టుచున్నది.

## పరిక్షిత్తు తక్షకునిచేఁ జంపఁబడుట.

అర్జునునిమనుమఁడైన పరీక్షిన్నరేంద్రుఁడు రాజ్యపరిపాలనము చేయుకాలమునం దొకనాఁడు మృగయావినోదార్థము నరణ్యమునకుంజని యాఖేటఖేలనమున నలసివచ్చుచుండఁగా మార్గమధ్యమున నొక్కఋషి తపస్సుచేసికొనుచు నడిగినప్పుడు దాహమునైనఁదీర్పక మాటాడకపోవుటయేగాక కన్నులనైనఁదెఱచి చూడకపోయెను. అంతట నారాజకుంజరుఁ డాగ్రహించి యొక నాగమునుజంపి వానిమెడపై వైచిపోయెను. తరువాత నాసంయమివరేణ్యుని కుమారుఁడీ వృత్తాంతమునంతయుఁ దెలిసికొని సర్పదష్టుఁడై చనిపోవును గాకయని యారాజును శపించి వానిని జంప నాగరాజయిన తక్షకునిఁ బ్రేరేపించెను. ఆశాపకారణమునే నేడవనాఁడే తక్షకునిచేఁ గఱవఁబడి పరిక్షిత్తు మృతినొందెనని చెప్పఁబడియెను. నాగరాజయినతక్షకుఁడు తక్షశిలానగరమున కధిపతిగ నుండెనని గ్రంథములయందుఁ జేర్కొనఁబడుచు వచ్చెను.

## జనమేజయుఁడు సర్పయాగముచేయుట.

తక్షకుఁడు తనతండ్రిని జంపినందున కాగ్రహమహోదగ్రుఁడై జనమేజయమహారాజు నాగకులమునంతయు సంహరించుటకై యార్యఋషులనందఱిని బ్రేరేపించి సర్పయాగమును జేయసమకట్టెను. ఆమహాయాగమునందు నాగులనేకులు పశువులుగఁబట్టుకొనఁబడి సంహరింపఁబడిరి. నాగకులమంతయు నిర్మూలమగు కాలమువచ్చెను. అప్పుడు వాసుకితోఁబుట్టువుకొడుకగు అస్తికుఁడను బ్రాహ్మణునిమూలమున తక్షకుఁడు మరణింపక జీవింపఁగలిగెను. ఈ యస్తికుఁడు నాగకులుఁడయినను అనార్యాచారములను వదలిపెట్టి యార్యాచారముల నవలంబించి యార్యుఁడైనవాఁడు. ఇట్లేనాగకులు లనేకు లార్యాచారమునవలంబించి యార్యులలోఁ గలిసిపోయెదమని వాగ్దత్తముచేయుటచేతనైన నేమి మఱియేమి కారణముచేతనైననేమి యాసర్పయాగము నిలిచిపోయినది. నాఁడు మొదలుకొని మరల నాలుగుశతాబ్దముల కనఁగా క్రీస్తుశకమునకుఁ బూర్వము ౬౦౦గవ సంవత్సరమువఱకు వీరలచరిత్రము వినరాక[1] యుండెను. అప్పటికి నాగవంశజులయిన రాజులు మగధరాజ్యాధిపత్యమును వహించిరి. ఈనాగవంశమె శిశునాగవంశ మనుపేరుతో మాగధమును బాలించినట్లు చరిత్రము లుద్ఘోషించుచున్నవి. ఈశిశునాగవంశములో నాఱవవాఁడైన యజాతశత్రుని కాలముననే బుద్ధుఁడు జనించి యనార్యజాతుల కన్నిటికిఁ బురోవృద్ధికారకుఁడయ్యెను.

## శిశునాగవంశము.

శిశునాగుఁడనువాఁడే శిశునాగవంశమునకు మూలపురుషుఁడు. ఈశిశునాగుని జన్మమునుగూర్చి బౌద్ధు లొకవింతకథను గల్పించియున్నారు. లిచ్ఛవిరాజులయొక్క యుంపుడుకత్తెలలో నొక్కతె యొక్క శిశువును గాంచెను. ఆశిశువు స్వరూప మేర్పడక పూర్వమె ప్రసవించుటచేత నమ్మాంసపిండము నొకతట్టలో నుంచఁబడి రాత్రివేళ నొకపేడకుప్పలోఁ వేయఁబడెనఁట! నగరపాలకుఁడయిన యొకనాగరాజు దానింగని పెట్టి చుట్టును జుట్టుకొని తన పడగతోఁ



బొదుగుచుండెను. దానిని ప్రజలుచూచి చుట్టును మూగికొని "స్సు స్సు" యని చప్పట్లు చఱచి కేకలు వేయఁగా నాగరా జదృశ్యుఁడయ్యెను. అంతట వార లాతట్టను బరీక్షింపఁగా నొక పురుషశిశు వుండెనఁట! ఆకారణమున నాతఁడు శిశునాగుఁడని పేరుపెట్టఁబడియెనఁట! కొంతకాలమున కాతఁడు మగధసింహాసన మధిష్ఠించెను! ఈవంశమునందుఁ గడపటివారయిన తొమ్మండ్రుగురు నందులతోఁగూడ చంద్రగుప్తుఁడు సింహాసనమునకు వచ్చువఱకుఁ బాలించినరాజు లెల్లరును నాగులేకాని యార్య క్షత్రియులు కారు. వీరందఱును సర్పములను బూజించెడి నాగులుగాని యార్యమతస్థులుగారు. ఆకారణముచేత బ్రాహ్మణులయిన యార్యులు వీరిపట్ల ప్రబల ద్వేషము గలిగియుండిరి. బౌద్ధమతస్థులు వీరినిఁ బ్రేమింపకుండిరి. వీరుభయులచేతను గూడ గౌరవింపఁబడక నీచముగఁ జూడఁబడుచుండిరి.

## మఱికొన్నిగాథలు.

సుగ్రీవుఁడు సీతను వెదకుటకై వానరులను బంపుచు భోగవతీపురమును వర్ణించెను. ఈభోగవతీపురమును వాసుకి యనువాఁడు పరిపాలించుచుండెనని చెప్పియుండెను. ఇతఁడు నాగరాజు. ఈభోగవతీపురము దక్షిణాపథమునందున్నది. అనఁగా దండకారణ్యములో దూర్పుభాగముననో పశ్చిమభాగముననో యుండియుండును. ఇంతకన్న రామాయణమునందు నాగులనుగూర్చి యేమియును గానరాదు. శ్రీకృష్ణుఁడు కాళీయుఁడను నాగరాజును మర్దించి కాళిందీకన్యల వివాహమాడినట్లుగ విష్ణుపురాణాదులవలనఁ గన్పట్టుచున్నది. అమృతమును బడయుటకై దేవతలు మందరపర్వతమును గవ్వముగను వాసుకిని త్రాఁడుగఁ జేసికొని క్షీరసాగరమును మథించినట్లుగ భాగవతాది పురాణములయందుఁ జెప్పఁబడినది. దేవతలు దానవులను మోసముచేసి వాసుకియను నాగరాజుయొక్క సహాయముతో దేశమునో దుర్గమునో యొకదానిఁ బడసియుందురని

1 Turnour's introduction to the Mahavanso, XXXViii. See also Bigandet, Life of Goudama, p 362 et. Seq.

యూహింపవచ్చును. ఇట్లు నాగులనుగూర్చిన లెక్కలేని గాథలు మన పురాణాది గ్రంథములయందు వెదజల్లఁబడియున్నవి. ఒక్క పురాణాది పూర్వగ్రంథములయందుమాత్రమే గాక యిటీవలి చారిత్రములయందును కావ్యాదులయందును గూడ నాగులయొక్కయు నాగరాజులయొక్కయుఁ జరిత్రము లభివర్ణింపఁబడియున్నవి.

## చరిత్రాంశములు.

క్రీస్తుశకము నాలుగవ శతాబ్దమధ్యమున సముద్రగుప్తుఁడను గుప్తచక్రవర్తి దక్షిణదిగ్విజయయాత్రకు బయలుదేఱి గణపతినాగుఁడను నొకనాగరాజును జయించినట్లుగఁ జెప్పబడియెను. సింహళద్వీపమునందలి నాగులను బుద్ధుఁ డేవిధముగాఁ దనమతములోనికిఁ జేర్చుకొనియెనో యవ్విధమునంతయు బౌద్ధచరిత్రగ్రంథములగు మహావంశము, రత్నాకరి, రాజావళి మొదలగు గ్రంథములయందు వివరముగ వ్రాయఁబడియుండెను. సిద్ధార్థుఁడు బౌద్ధుఁడైనపిమ్మట నైదవయేట మహోదరుఁడు, చూళోదరుఁడను నాగులిరువురు వజ్రసింహాసనమునకై పోరాడుచుండుటను గాంచి నాగులయందలి ప్రేమచేత నాగద్వీపమునకుఁ జూడఁబోయెను. ఆకాలమునందుపంచశతయోజనములు విస్తీర్ణముగలిగి చుట్టును సముద్రముచేఁ జుట్టుకొనఁబడియున్న నాగద్వీపమును మహోదరుఁడను నాగరాజు పరిపాలనము సేయుచుండెను. వానితోఁబుట్టువు కందమాదనమనుకొండను నేలెడి నాగరాజునకీయఁబడి వివాహము చేయఁబడియెను. ఆదంపతులకు జనించినకుమారుఁ డొకఁడు వజ్రసింహాసనముఁ దనకురావలయునని తగవుపెట్టెను. ఈమహాత్ముఁడు వారలకు సంధిచేయుటకై ప్రయత్నించి మంచి హితోపదేశమును గావించెను. వారలాసింహాసనమును బుద్ధునికర్పించి వానికూడిగముఁ జేయఁబూనిరి. బుద్ధుఁడా సింహాసనమునగూరుచుండి ధర్మము నుపదేశించి యెనుబదికోట్ల నాగులను బౌద్ధమతావలంబకులనుగాఁ జేసెను.

మహోదరుని మేనమామయును కళ్యాణిపురాధీశ్వరుండును, నగునాగరాజును గూడ తనమతములోనికిఁ జేర్చుకొని కొంతకాలమునకు వారలను విడిచిపెట్టిపోవుచు వజ్రసింహాసన మానాగరాజున కిచ్చి రాజాయతనవృక్షమచ్చటనాటి వారలనుద్దేశించి "యో నాగరాజులారా! పవిత్రమైన నాయీవృక్షమును బూజింపుఁడు; నాప్రియులారా! మీకిది సౌఖ్యమును మనశ్శాంతిని గలుగఁజేయును" అని పలికి వెడలిపోయెను. క్రీస్తుశకము రెండవశతాబ్దమున సింహళద్వీపమును బాలించిన మల్లగనాగుఁడు, చండనాగుఁడు, కూడనాగుఁడు, శ్రీనాగుఁడు అను వారలు నాగరాజులుగఁ గన్పట్టుచున్నారు. ప్రప్రథమమున చోళదేశమునకు రాజధానిగ నుండిన కావీరి పద్దినము (కావేరిపట్టణము) సనాతనకాలమునందు నాగులకు నివాసమై నాగవాటికి ముఖ్యపట్టణమై యుండెనని చిల్లప్పదికార మను తమిళకావ్యమునందు వర్ణింపఁబడియెను. పురాతన తమిళ కావ్యములయందు నాగుల చరిత్రము విశేషముగా నభివర్ణింపఁబడియున్నది. కిల్లివలివానను చోళరాజు నాగజాతికన్యను వివాహమాడియుండగా నొక కవి మణిమేకలై (మణిమేఖల)యను తమిళకావ్యమునందా వివాహమును బూసగ్రుచ్చినయట్లుగా వివరించి వర్ణించి యున్నాఁడు. ద్రావిడదేశమునందలి పరవలు, అయినారులు, ఒలియారులు, ఒవియారులు, ఆఱవలారులు, పరదవారులు మొదలగు తెగలవారెల్లరును నాగజాతులవారనియె చెప్పఁబడుచున్నారు. పదునొకండవ శతాబ్దమునందు ఒలియర్లను నాగజాతివారు పరాక్రమవంతులుగనున్నట్లొక శాసనమువలనఁ గన్పట్టుచున్నది. కరికాల చోడుఁడనురాజు వీరలను జయించెనని యొకతమిళ కావ్యమునందుఁ జెప్పఁబడినది. పదునొకండవ శతాబ్దమునందు కొప్పరకేసరి వర్మయను చోళరాజు కొప్పయనుప్రదేశమున, బశ్చిమచాళుక్య రాజగు నాహవమల్లుని నోడించి మామల్లపురము (మహాబలిపురము) లోని వరాహస్వామి దేవాలయమునకుఁ గొంతభూదానముచేసి శాసనము వ్రాయించెను. ఆశాసనములో రాజకీయోద్యోగస్థులుకూడ కొందఱు చేవ్రాళ్లు చేసియుండిరి. దానిలో "ఒలినాగన్ మదైయాన్ అలగీయచోళ, అమరనడ్డు మువెందవేలన్, ఒలినాగన్ చంద్రశేఖరన్, ఒలినాగన్ నారాయనన్, ఇందు పరవాన్ సంగనాగన్, ఉచనకిలవాన్ ముగలినాగన్," అను నాగనాయకులు గూడ చేవ్రాళ్లు చేసియుండిరి. పదునొకండవ శతాబ్దమునందు ఒలినాగులు మాత్రమె గాక సంగనాగులు, ముగలినాగులు మొదలగు తెగలనాగు

లుగూడగలరని తెలియుచున్నది. [1] ఇంతియగాక నెల్లూరుమండలములోని దర్శివంశపురాజులుకూడ నాగజాతి వారని తెలియుచున్నది. పదునేనవ శతాబ్ద ప్రారంభమున దర్శిపట్టణపు రాజగు ఆసనదేవమహారాజు తనతల్లి అర్యమదేవి పేరట నొకచెఱువు త్రవ్వించి శాలివాహనశకము ౧౩౫౭ వ సంవత్సరమునం గా క్రీస్తుశకము ౧౪౩౫-౩౬ వ సంవత్సరమున నొకశాసనమును వ్రాయించెను.

దానిలో గొంకరాజు మొదలుకొని తనవంశమును వర్ణించుకొనియుండెను. ఆశాసనమునందు గొంకరాజును ఫణీంద్రవంశజుండనియు, నాగవంశోద్భవుండనియు నభివర్ణించెను. ఈగొంకరాజుయొక్క పౌత్రుండయిన నాగరాజును కాకతీయగణపతిరాజులకు సామంతుండుగనుండిన నాగదేవుండును నిరువురు నొక్కరేయై యుందురేమో యింకను విచారింపవలసియున్నది. ఈపైన వ్రాసిన యంశములనుబట్టి నాగులనియెడి యొకజాతివారు పూర్వకాలమున నుండిరనియు, ఒకప్పుడు వారలీ భరతఖండమునంతయు నాక్రమించి పాలించియుండిరనియుం దేటపడకమానదు. ఇంకను వారలకును నాంధ్రదేశమునకును గల సంబంధమును దెలిపెడిగాథలను దెలిసికొన్నచో నాగులను గూర్చినయభిప్రాయము మఱికొంత బలపడకమానదు.

## బౌద్ధులగాథలు.

సింహళద్వీపమునందును సయామునుదేశమునందును జెప్పుకొనంబడు బౌద్ధులగాథలలో నాంధ్రదేశము నాగులదేశముగాం జెప్పుకొనంబడినట్లుగం గన్పట్టుచున్నది. గంగానదీ ముఖద్వారమునకును సింహళద్వీపమునకును నడుమ నాగులచే నివసింపంబడు దేశముకలదు. ఈనాగులు బుద్ధునియొక్క బొమికల

1 Madras journal of Literature and Science, Vol Xiii part 2. Collection of Nellore Inscriptions II (Darsi Dynasty) by Mr Butterworth and Venugopala Chetty 3. Vols.



ను రెండుద్రోణములను సంపాదించి వానిని వజ్రాలదిన్నెకడ (Diamonds Sands) బాతిపెట్టి పైననందమైనట్టియు, అమూల్యమైనట్టియు స్తూపమునొకదాని నిర్మించిరనిచెప్పంబడినది. ఈబొమికలభాగము మొట్టమొదట కపిలవస్తునగర సమీపమునందలి రామగ్రామములోనిది. రామగ్రామములోని స్తూపము వఱదకుం గొట్టుకొని పోబడినప్పుడీ బొమికలపెట్టె గంగానదిలోంబడి కొట్టుకొనిపోయి సముద్రములోంబడంగా నాగులుదానిబట్టుకొని మంజీరికాయను తమదేశమునకుం గొనిపోయిరి. ఈమంజీరికాదేశము [1] కళింగదేశమునకు రాజధానియగు దంతపురమునకు దక్షిణముననున్నది. ఎందుకన రాజపుత్త్రుండగు దంత కుమారుడును రాజపుత్త్రికయగు హేమాచలయు బుద్ధుని దంతముతో నోడనెక్కి దంతపురమునుండి సింహళద్వీపమునకుం బాఱిపోవునపుడు వజ్రాలదిన్నె (Dianonds Sands) కడనోడ మట్టయెక్కెనని చెప్పంబడినది. ధరణికోటకును త్తరమున వజ్రములకుం బురాతనకాలమునుండి ప్రసిద్ధివహించిన దగుటచేత వజ్రాలదిన్నె (Dianonds Sands) యనునది యీప్రదేశమె యగుననియూహింపంబడుచున్నది. [2] ఈదంతపురకథనము క్రీస్తుశకము నాలుగవ శతాబ్దప్రారంభమున జరిగియుండెనని సయాము దేశగ్రంథములవలనం గన్పట్టుచున్నది గాని మహావంశమునందు క్రీస్తునకుం బూర్వము నూటయేబదియేండ్లక్రిందట జరిగినట్లుగం జెప్పంబడుచున్నద. తరువాత సింహళరాజు మంజీరికాదేశమునకుంబోయి యీబొమికలపెట్టెను దెమ్మని పరిశుద్ధుండైన మతాచార్యుని నొక్కనిం బంపెను. ఇయ్యది నాగులకంతగా నిష్టములేకపోయినను నత్యద్భుతముగా నదియెట్లోయీ మతాచార్యుని వశమయ్యెను. ఈనాగరాజునకు సింహళరాజు మిత్త్రుండగుటవలన సింహళరాజు నాగరాజునకు నొకకొన్ని బొమికలనిచ్చి సంతోషపెట్టెను.

1 ఈ మంజీరికాదేశమె మంజీరదేశమని బౌద్ధులచేతను, ఆంధ్రదేశమని యార్యులచేతను ఆకాలమునం బిలువంబడుచువచ్చెను. మంజీరయను పేరుగల యుపనదియొక్కటి గోదావరిలోం గలియుచున్నది.

2 Major General. A. Cunningham's Ancient Geography of India p. 584.

## బుద్ధుని దంతకథనము.

బుద్ధుని దంతమును గూర్చినకథలు పెక్కులుగలవుగాని వానిలో రెండు కథలు ముఖ్యములయినవిగాఁ గన్పట్టుచున్నవి.[1] అందు మొదటిగాథ యిట్లు చెప్పఁబడుచున్నది. బుద్ధుని యెడమపార్శ్వము నందలి దంతము కళింగదేశమునకు రాజధానియగు దంతపురమునందు(బహుశః)నిప్పటి జగన్నాథాలయమునఁ బడు ప్రదేశమున నెనిమిదివందల సంవత్సరముల వఱకు సురక్షితముగ నుంచఁబడియెను. క్రీస్తుశకము నాలుగవశతాబ్ద ప్రారంభమునందు గుహశివుఁడను రాజు తానప్పటివఱకు నవలంబించియుండిన బ్రాహ్మణ మతమును విడిచిపెట్టి బౌద్ధమతము నవలంబించెను. క్రొత్తమత మవలంబించిన పట్టుదలచేత నాతఁడు తన్నాశ్రయించుకొనియున్న బ్రాహ్మణులను దొలఁగించి వారలను బాధపెట్ట నారంభించెను. వారలు పాటలీపుత్రమునకుఁబోయి రాజాధిరాజగు పాండు[2] నకుఁ జెప్పి మొఱపెట్టుకొనఁగా నాతఁడు గుహశివుని దంతముతోఁగూడఁ దన కొల్వుకూటమునకు రావలసినదిగ నుత్తరవుచేసెను. ఆయుత్తరవు ప్రకారము వచ్చినమీఁదట దంతమును సర్వవిధముల భగ్నముచేయుటకుఁ బ్రయత్నము జరుపఁబడి తుదకు దంతమునకే విజయముకలిగెను. అంతటా పాండురాజు దంతమాహాత్మ్యమున కచ్చెరువంది తుట్టతుదకుఁదానే బుద్ధధర్మ మవలంబించెను.

1. The first is contained in *Daladavamsa* partially translated by the Honourable G. Turnour and published in the Journal of Asiatic Society of Bengal Vol VI. p 856 et. Seq ; the other is abstracted by Colonal Low from the Siamese phra Pal'hom, and published in the Same Journal Vol XVII. part II. p. 82, et, seq.

2. ఇతఁడే గోతమిపుత్త్రియజ్ఞశ్రీ శాతకర్ణికావచ్చునని డాక్టరు ఫెర్గ్యూసనుగారు తలంచుచున్నారుగాని వారి యభిప్రాయము సరియైనది కాదని తోఁచుచున్నది.



ఇదంతయు జరుగుచుండగా క్షీరధరుఁడను నుత్తరదేశపురాజొకఁ డామహిమగలదంతమును బడయుటకై పాటలీపుత్త్రముపైదండెత్తివచ్చెనుగాని యచ్చట జరిగినయుద్ధములో నాతఁడు మృతిఁజెందెను. అంతట గుహశివుఁడు దంతముతోఁ దనరాజధానికి మరలివచ్చెను. కొంతకాలమునకు క్షీరధరునిసోదరపుత్రులు మఱికొందఱు రాజులను దోడుచేసికొని గుహశివునిపైకి దాడి వెడలివచ్చిరి. వారల నెదుర్కొనుట సాధ్యముకాక గుహశివుఁ డాత్మరక్షణమునకై చూచుకొనసాగెను. యుద్ధముచేయుటకు ముందు తన కొమార్తెయగు హేమాచలను, ఉజ్జయినీ పురాధీశ్వరుని కుమారుఁడును తనకల్లుఁడు నగు దంతకుమారుని నుభయులను రప్పించి తానోడిపోయినయెడల నాదంతమును దీసికొని తప్పించుకొనిపోయి సముద్రమార్గమున సింహళద్వీపమునకుఁ బోయి యాద్వీపము నేలుచుండి యాదంతమును గొనవలయునని కోరికగలిగి యుండిన మహాసేనునకు నిచ్చివేయవలసినదని చెప్పెను. అట్లు దంతపురము శత్రువుల వశమగుటకుఁ బూర్వమె దంతకుమారుఁడును హేమాచలయు నాదంతమును నిసుకలోఁ బూడ్చిపెట్టి పట్టణము విడిచి పాఱిపోయి తరువాత మరలివచ్చి హేమాచల యాదంతమును వేణియందు దాచుకొని భర్తతోఁగూడ తామ్రలిప్తీనగరమునకుఁబోయి యచ్చట నారాజదంపతు లిరువురునోడనెక్కి సింహళద్వీపమునకుఁ బ్రయాణముఁజేసిరి. ఓడనెక్కిన ప్రదేశమునకును సింహళమునకును నడుమ వజ్రాలదిన్నె (Diamonds Sands) సమీపమున వారెక్కినయోడ మెట్టయెక్కెను. ఈవజ్రాలదిన్నె (Diamonds Sands) నడుమనున్నదని చెప్పుటచేతను, తీరమునకు సమీపముగా వజ్రములుండు ప్రదేశమిదయే యగుటచేతను, ఇంతియగాక నాగరాజునకు నివాసమని తరువాయికథవలన బోధపడుచుండుటచేతను కృష్ణానదీతటమె(ధాన్యకటకప్రదేశతీరమె)యోడ మెట్టపట్టిన స్థలమని డాక్టరు ఫెర్గూసనుగారు దృఢముగా విశ్వసించుచున్నారు.[1] రాజకుమారికయగు హేమాచల నిద్రఁబోవుచుండఁగా నాగరాజు దంతమును తస్కరించెనుగాని హిమాలయమునుండి వచ్చిన యొకదేవతయొక్క మాంత్రికశక్తిచేత

1. Dr. Fergusson's Tree & Serpent worship p. 157. 9.

నాగరాజు దానిని మరల నారాజదంపతులకే యీయవలసినవాఁడయ్యెను. ఆరాజదంపతులు తరువాత నోడనెక్కి సింహళమునకుఁబోయిరి. ఇది క్రీ. శ. ౩౧౨ వ సంవత్సరమున జరిగినది. వీరు సింహళముఁ జేరునప్పటికిఁ దొమ్మిది సంవత్సరములకుఁ బూర్వమె మహాసేనుఁడు మృతినొందియుండెను. అయిన నప్పుడు రాజ్యము చేయుచుండిన మేఘవర్ణుఁడు వారలను సగౌరవముగా నాదరించి యాదంతముపైన నిటుకతోను సున్నముతోను నొక చైత్యమును నిర్మించి మహోత్సవమును సలిపెను.[2] మూఁడుసంవత్సరములు గడచినతరువాత నాలంకాధిపతి నాఁడు మొదలుకొని యేడుసంవత్సరములలో వజ్రాలదిన్నె మీఁద (Diamonds Sands) ధర్మాశోకుఁడను రాజు దేవాలయమును నిర్మించునని పూర్వమొక జ్యోస్యుఁడు చెప్పినదానిం జూచెను. మఱియును బుద్ధుని బొమికలు రెండు ద్రోణములింకను నాగరాజుదేశములో దాఁచఁబడియున్నవను సంగతి నిజ్ఞప్తికిఁ దెచ్చుకొనియెను. వానిం దెచ్చుటకై పరిశుద్ధవర్తనముగల యొకగురువునంపెను. నాగరాజు సోదరుఁడొకఁడు బొమికలపెట్టెను సంగ్రహించుకొని మేరుపర్వతమునకుఁ బాఱిపోయెనుగాని బొమికలు వానినుండి గైకొనఁబడి మరలఁ దీసికొనిరాఁబడినవి. అంతట నాగరాజు మనోహరయావనాంగుఁడై సింహళమునకు వచ్చి మేఘవర్ణునికిఁ బ్రత్యక్షముకాఁగా నాతఁడు కొన్ని బొమికల నాగరాజున కొసంగెను. తక్కిన బొమికల నొక్కసువర్ణపాత్రమునందుంచి, ఒకమూరెడు పొడవును జేనెడు వెడల్పునుగల యొకబంగారుపడవను నిర్మించి యాసువర్ణపాత్రము నందుంచెను. అటుపిమ్మట నేడుమూళ్లదూలము వెడల్పు మాత్రమె గలిగియుండు కొయ్యపడవ నొకదాని నిర్మించి యాబంగారు పడవనందుంచి కొందఱు రాయబారులతో దంతకుమారుని హేమాచలను వారి కోరికను మన్నించి వారిదేశమునకుఁ బంపించెను. వీరుబయలుదేఱి యైదుమాసములకు వజ్రాలదిన్నెను (Diamonds Sands) జేరి యచ్చట దిగి బొమికలుండు ప్రదేశమును దేవాలయముఁ జూచుకొని మరలఁ బడవనెక్కి మూఁడుమాసములకు దంతపురమునకుఁ బోయిరి. దంతపురమునందు మేఘవర్ణుని రాయబారులర్హవిధానమున సన్మానింపఁబడిరి.

2. Colonal Low p. 86.



మూఁడవగాథ మఱియొక్కటికలదు. కర్నలులోగా రది మఱియొక్క రాజునుగూర్చి"దనియు వేఱువిషయములను గూర్చినదనియును దలంచుచుండిరిగాని కథాసందర్భమును బట్టి యొక్కనిగూర్చియె యని గన్పట్టుచున్నది. ధర్మాశోకుఁడనురాజు మిక్కిలి న్యాయబుద్ధితో నరవాడిదేశమును (అవంతికావలయును) బాలించుచుండి క్షామోపద్రవమువలన ముప్పదియొక్కవేలమంది దార్ఢ్యవంతులయిన మనుజులతో దక్షిణదిశకు నేడునెలలు ప్రయాణముచేసి తుదకు జలమును మత్స్యములును సమృద్ధముగానున్న దేశమునకువచ్చిరి. మఱుచటినాటివేకువను నశ్వారూఢుఁడై రాజు వజ్రాలదిన్నెను (Diamonds-sands) బ్రవేశించి యచ్చట నాగరాజును గలిసికొనియెను. ఆప్రదేశమునందొక చైత్యమునునిర్మించి యొకనగరమునుగట్టించెను. ధర్మాశోకుఁడు నెమ్మదిగ నిచ్చటనేడేండ్లు రాజ్యపాలనము చేసెనుగాని బుద్ధునిబొమికలు దొరకనందున సౌఖ్యములేనివాఁడై వానింగనిపెట్టి తెచ్చినవారికి గొప్పబహుమానము చేసెదనని ప్రకటించెనుగాని యేమియు ప్రయోజనకారి గాకపోయెను. ఇంతలో రోమురాజు పుత్రుఁడు కాకభాషియను వాఁడొకఁడు తక్షశిలానగరమునకు వర్తకమునకై యోడనెక్కి యైదువందల పరివారముతోవచ్చుచుఁ దుపానుపట్టియు దైవానుగ్రహమువలన నపాయమునుండి విడివడి తుదకుఁ గష్టముతో వజ్రాలదిన్నె సమీపమునకువచ్చి జనులుండెడు సూచనలు గనిపెట్టి చూడవలెనను తలంపుతో నచ్చట నోడనిలిపి లంగరుడించెను.

## గాథలసారాంశము.

నాలుగవశతాబ్ద ప్రారంభమున బుద్ధుని దంతమునుగూర్చి యిండియాలోఁబుట్టిన కల్లోలములను దెలిపెడి బౌద్ధులగాథల నిట్టివెన్నియైనం దెలుపవచ్చును. బౌద్ధులగాథలు (Diamonds sands) వజ్రాలదిన్నెలనుగూర్చి ముచ్చటించుచున్నవి. కృష్ణాతీరమునందు దేవాలయము గట్టఁబడుచుండెను. నిశ్చ

యముగా నాగరాజచ్చట నివసించియుండెను. ఎన్ని విధముల చేతఁ జూచినను ఆప్రదేశ మిప్పటి యమరావతి ధరణికోట గావలయునుగాని మఱియొకప్రదేశము కాఁజాలదు. వీనినన్నిటినిబట్టి చూడఁగా నాగాథలలో నుదాహరింపఁబడిన కట్టడము "అమరావతి స్తూపము" అని నిశ్చయముగాఁ జెప్పవచ్చును.

అమరావతీ స్తూపమును మనము చక్కఁగాఁ బరిశోధించితిమేని అందు చిత్రింపఁబడిన చిత్రపుఁబొమ్మలను జూచితిమేని నాగులు నాగరాజులెట్లు ప్రదర్శింపఁబడిరో, ఈపైగాథలలోనివృత్తాంతములఁ జిత్తరువుల మూలమున నెట్లు దెలుపఁబడియెనో మనకు గోచరము గాకమానదు. వానింబట్టియే పూర్వమీప్రదేశము నాగుల కాటపట్టయి నాగరాజులచేఁ బరిపాలింపఁబడెనని స్పష్టముగఁ జెప్పవచ్చును. ఇద్దఱు మనుష్యులు బుద్ధుని బొమికలుపట్టుకొని పడవటాపుమీఁద నిలుచుండి యొడ్డునకు వచ్చుచుండఁగా నాగరాజొకఁడు వారలకు స్వాగతమీయ వచ్చుచున్నట్లును నొకచిత్తరువు చిత్రింపఁబడియున్నది. ఇంకను నాగరాజులకును రాజకుమారికతోనుండిన రాజకుమారునకును కలిగిన సమావేశములను దెలిపెడు రీతులుగల చిత్తరువు లనేకములు చిత్రింపఁబడియున్నవి. అమరావతి ధరణికోట (ధాన్యకటకము) నాగరాజునకు రాజధానిగ నుండెననియాచిత్తరువులు ముఖ్యముగాఁ దెలుపుచున్నవి. ఈచిత్తరువులలోని నాగరాజుల కేడేసిపడగలుగల పాములు శిరమునకు వెనుకప్రక్క నుండియున్నవి. ఇల్లేరాణులకు మూడేసి పడగలుగల పాములుండియున్నవి. ఇతరనాగులకు నొక్కపడగమాత్రమెగల పాములుండియున్నవి. వీనినంతయునుబట్టి చూడగ బౌద్ధమతమునకుఁ బూర్వము మనదేశమున సర్పపూజవిశేషముగనున్నట్లు గన్పట్టుచున్నది.

## నాగులే ద్రావిడులు.

ద్రావిడులాసియాఖండమధ్యమునుండి యార్యులకంటెఁ బూర్వమెన్నఁడో యీదేశమునకుఁ బశ్చిమోత్తర మార్గమునవచ్చి దక్షిణాపథముయొక్క దక్షిణపుగొనవఱకుఁ బోయిరనియు, ఆర్యులు రాకపూర్వమె కొంతవఱకు నాగరికతగలిగి యున్నారనియుఁ జెప్పఁబడుటయెగాని వారిచరిత్ర మిట్టిదని చె



ప్పవారెవ్వరును గానరాకపోయినకతమున వారిచారిత్ర మింతవఱకుఁ దేటపడక యంధకారముననే పడియున్నది. ఎవ్వరిని ద్రావిడులని చరిత్రకారు లుద్ఘోషించుచున్నారో వారిపూర్వులే నాగులు. పూర్వము వారికి నాగులనియె పేరుగలిగియుండెనుగాని ద్రావిడులనిపేరుగలిగి యున్నట్టు గన్పట్టదు. ద్రావిడులను పేరిటివలి సంస్కృతగ్రంథకారులు స్మృతికర్తలు మొదలగువారిచేఁ బెట్టఁబడినది గాని యనాదిసిద్ధమైనది కాదని తోఁచుచున్నది. నాగులేద్రావిడులనియెడుమాయభిప్రాయము సరియైనదయినయెడల దక్షిణాపథవాసులను ద్రావిడులనుటకు మేమంగీకరింతుము. అట్లుగాక ద్రావిడులు వేఱుగా నున్నవారని సిద్ధాంతమేర్పడినయెడల నిప్పటియఱవము, మళయాళము, తెలుఁగు, కన్నడము మొదలగుభాషలు మాటలాడువారు కేవలము ద్రావిడులుగారని చెప్పఁగలుగుదుము. ఈనాగులు కొంతవఱకు నాగరికతగలవారుగా నున్నారుగాని కేవలము నాగరికులని చెప్పరాదు. వీరెచ్చటనుండి వచ్చిరని చెప్పినను వీరి మొదటినివాసము తక్షశిలానగరప్రాంతదేశమని మేమునిశ్చయించుచున్నారము. అచ్చటనుండియె వీరలుహిందూదేశము నలుప్రక్కలకుఁబోయి యరణ్యభూములాక్రమించి జనాకీర్ణములయిన దేశములుగాఁ జేసిరనిమాయభిప్రాయము. ఈవిషయమునఁ జాలవఱకు డాక్టరు ఫెర్గూసనుగారి యభిప్రాయముతో నేకీభవించుచున్నారము.

## ఆంధ్రులకు నాగులకుఁ గలసంబంధము.

ఆంధ్రదేశము నాగనివాసమని బౌద్ధులగాథలవలనను, అమరావతీ స్తూపములోని నాగులయొక్కయు, నాగరాజులయొక్కయుఁ జిత్తరువులవలనను మఱికొన్ని చరిత్రాంశములవలనను, ఆర్యులకుఁ బూర్వమీ దేశమున నివసించుచుండి పాలించినవారు నాగులని స్పష్టపడినందున మొదటియాంధ్రులు నాగులనియే దోఁచుచున్నది. మేము పూర్వప్రకరణమునందుఁ జెప్పినట్లుగ ననార్యాంధ్రులు తప్పక నాగులనియె మాయభిప్రాయము. ఆర్యులుకొందఱు నాగులపక్షమవలంబించి నాగులమతమునే కొంతవఱకు స్వీకరించి యార్యాచారములఁ గొంతవఱకు నాగులచే నవలంబింపఁజేసినవా రార్యాంధ్రులు. ఆకారణము

చేతనే యైతరేయ బ్రాహ్మణమునం దాంధ్రులు కిరాతజాతులతోఁ జేర్పఁబడియున్నారు. అటుపిమ్మట నాగరాజులు కొందఱుత్తరదేశమున నార్యులతోఁ బోరాడి దక్షిణమునకువచ్చి దండకారణ్యప్రదేశమున సురక్షితములయిన స్థానముల నేర్పఱచుకొని తమరాజ్యమును విస్తరింపఁ జేసియుందురు. వీరినే మన్వాదిస్మృతికర్తలు యవనులు చీనులు పహ్లావులు కిరాతులు మొదలగువారితోఁ జేర్చి తఱుమఁబడిన క్షత్రియు (ద్రావిడులు)లని పేర్కొనియుందురు. ఈ యభిప్రాయమే సరియైనదైన పక్షమున నాంధ్రులను ద్రావిడులనుట యొప్పును. కాఁబట్టి మొదట దండకారణ్యమును ప్రవేశించినవా రాంధ్రద్రావిడులనుటకు సందియములేదు. వీరలిప్పటికి రెండువేల యేనూఱుసంవత్సరములనాఁ డాంధ్ర రాజ్యమును స్థాపించిరనుటకును సంకోచింప నక్కఱలేదు.





బౌద్ధులు నాగులపటము లిట్లు వ్రాసియుండిరి కాని యివి నిజముగా నాగుల రూపములు కావు.

## ఆఱవప్రకరణము.

---

### బుద్ధునికాలము.

(క్రీ. పూ. ౫౫౭ మొదలుకొని ౪౭౭ వఱకు.)

క్రీస్తుపుట్టుటకు మున్నాఱవశతాబ్దమున భరతఖండమునకు శిరోభూషణముగానుండిన మగధరాజ్యమును శిశునాగవంశజుఁడయిన యజాతశత్రువు పరిపాలించుచుండెననియు శిశునాగవంశజు లనార్యులయిన నాగకులులుగాని యార్యులుగారనియు పూర్వప్రకరణమునఁ జెప్పియుంటిమి. ఈతనికాలమున రాజగృహమనియెడి పట్టణము మగధదేశమునకు రాజధానిగనుండెను. ఈయజాతశత్రునితండ్రియగు బింబిసారుని కాలమున గౌతమబుద్ధుఁడు జనించెను. మహాత్ముఁడును విరాగియునైన యితఁడాకాలమునందలి మతసంస్కర్తలలోనే గాక భరతఖండమున నేఁటివఱకు జనించినమత సంస్కర్తలందఱిలోను నగ్రగణ్యుఁడనుటకు సందియములేదు. తత్త్వవిచారము జనసామాన్యమునకు బోధపడనందున నీతివర్తనమే యందఱికిముఖ్యమనియు, పరిశుద్ధములయిన మనోవాక్కాయకర్మములు నిర్వాణమునకు ముఖ్యసాధనములనియు, పరోపకారమును భూతదయయు ధర్మముయొక్క ముఖ్యాంగములనియు, ఇవిజాతిభేదములేక యందఱకును సాధ్యములనియు, బ్రాహ్మణునికాధిక్యమును శూద్రునికి నీచత్వమునులేక సత్ప్రవర్తనగలవారెల్లరును బూజనీయులేయనియు, ధర్మనీతితత్త్వమును బోధించెను. ఈబుద్ధధర్మము బహుశీఘ్రకాలములోనే దేశదేశములవ్యాపించెను. భగవంతుఁడనార్యజాతుల నుద్ధరించుటకై యీరూపమున నవతరించెనని ప్రజలు విశ్వసించి బుద్ధునిమతము నవలంబించుచుండిరి. ఈబుద్ధధర్మ మార్యులకంటెను అనార్యులచే నెక్కుడుగ నాదరింపఁబడుచు వచ్చెను. ఈబుద్ధభగవానుఁడు క్రీ. పూ. ౫౫౭వ సంవత్సరమున జనించి యెనుబదిసంవత్సరములుజీవింపఁగలిగి ౪౭౭వ సంవత్సరమున నిర్వాణముం జెందెను. ఈకాలమున మనయాంధ్రదేశ మనార్యులయిన



నాగరాజులవశమునందుండెను. వీరలార్యులవలె నంతగా నాగరికులు గాకపోయినను గొంతవఱకు నాగరికత వహించినవా రగుటవలన నార్యులరాకకుఁ బూర్వమె దండకారణ్యమున రాజ్యమును స్థాపింపఁగలిగిరి. ఆర్యులీకాలముననే యనార్యాంధ్రదేశమునఁ బ్రవేశించి తమనాగరికత ననార్యాంధ్రులకుఁ జవిచూపుచుండిరి. అయిన నార్యావర్తమునందువలె నీయనార్యాంధ్రు లార్యమతమును సంపూర్ణముగ నవలంబించి యుండలేదు. అప్పుడీదేశమాంధ్రదేశమని యార్యులచేతను మంజీరదేశమనియు, వజ్రభూమియనియు, బౌద్ధులచేతను, నాగులదేశమని యనార్యులచేతను బిలువంబడుచుండెను. ఆకాలమునం దనార్యాంధ్రులు బౌద్ధమతమును సంపూర్ణముగ నవలంబించినవారు గాకపోయినను బుద్ధభగవానునియెడ భక్తివిశ్వాసములను గలిగియుండిరి. అనార్యాంధ్రులయిన నాగరాజులకు నార్యమతముకంటెను బౌద్ధమతమునందుఁ బ్రేమయెక్కుడుగనుండుచు వచ్చెను. ఈదేశమును బాలించెడి నాగరాజొకఁడు గౌతమబుద్ధుని సందర్శించెనని బౌద్ధులగాథలయందుఁ దెల్పఁబడుటయే యీయంశము ధ్రువపడుచున్నది. ఆకాలమునందు నీయాంధ్రదేశమును బాలించెడి నాగరాజులకును నాగద్వీపమును బాలించెడి నాగరాజులకును విశేషమైత్రిగలిగి యుండెను. రాక్షసనివాస భూమిగనుండిన లంకాద్వీప మాకాలమున నాగద్వీపమనియు, రత్నద్వీపమనియుఁ బిలువంబడుచుండెను. అదియెయిటీవలసింహళద్వీపమనిగూడ పిలువంబడుచుండెను. ఈనాగద్వీపమునకు నాగనివాస భూమియైన యీమంజీర దేశమునకును సముద్రమార్గమున వర్తకవ్యాపారము విశేషముగ జరుగుచుండెను. ఆకాలమునందు కృష్ణానదీ ముఖద్వారమునం దొకముఖ్యమయిన రేవుపట్టణమున్నట్లుగ నాకాలపు చర్యలను దెలిపెడిబౌద్ధులగాథలవలనఁ దేటపడుచున్నది. ఇప్పుడు మహానదికిని గోదావరికినడుమనుండు నాంధ్రదేశభాగమాకాలమునఁ గళింగదేశముగా వ్యవహరింపఁబడుచుండెను, ఆకాలమునందు నెల్లూరు గుత్తి, కడప, కందనోలు మండలములును కృష్ణానదికి దిగువనుండు దేశమును కృష్ణాగోదావరులకు నడుమనుండు దేశమును వజ్రభూమిగ (Diamond fields) వ్యవహారమునందుండెను. ఆకాలమునందు నాంధ్రదేశమునందలి జనులును, కళిఁ

గదేశమునందలి జనులును నొక్కతెగలోనివారుగఁ గన్పట్టుచున్నారు. కళింగదేశమునందు ప్రసిద్ధములయిన రెండురేవుపట్టణములుగలవని చీనాబర్మాదేశస్థులు వ్రాసినచరిత్రములవలనఁ దెలియుచున్నది. మఱియును త్తరపినాకినీ నదీముఖద్వారముననొకరేవు పట్టణముండినట్లుగ బౌద్ధులగాథలయందుఁ దెల్పఁబడియున్నది. బుద్ధునిశిష్యుఁడగు పూర్ణుఁడను బ్రాహ్మణుని సోదరుఁడొకఁడు మూడువందలజనులతో సూర్పరాక పట్టణమునుండి (పశ్చిమతీరమునందలి కొంకణదేశములోనిది) యోడనెక్కి లంకాద్వీపమును జుట్టివచ్చి పైఁజెప్పిన యుత్తరపినాకినీ ముఖద్వారమునందలి రేవుపట్టణముకడ దిగెనని బౌద్ధులగాథలవలనఁ దెలియుచున్నది. బుద్ధునికాలమునం దాంధ్రదేశమిట్టినాగరికతాచిహ్నములను వహించియుండినను దేశము విశేషభాగ మరణ్యభూమిగానే యుండెనని చెప్పవలసియున్నది. ఇంతకన్న బుద్ధునికాలమునం దాంధ్రదేశమును గూర్చిన చారిత్రము సవిస్తరముగాఁ దెలియరాదు.

## బోధాయనాపస్తంబుల కాలము.

(క్రీ॥ పూ॥ ౮౨౨ మొదలుకొని ౩౨౩ వఱకు)

సూత్రమనగా విశేషార్థమును సంక్షేపముగాఁ జెప్పెడి చిన్నవాక్యము. ఈకల్పసూత్రములు శ్రౌతసూత్రములనియును, గృహ్యసూత్రములనియును, ధర్మసూత్రములనియును మూడువిధములుగానున్నవి. ఒక్కొక్కవేదమునకు బ్రాహ్మణములు పెక్కులున్నట్లుగా నొక్కొక్కవేదమునకు సూత్రములుగూడ పెక్కులుగలవు. ఆర్యులొకదేశమునుండి మఱియొకదేశమునకుఁ బోవుచువచ్చిన కొలఁది నాయాదేశస్థితులనుబట్టి యార్యాచారములుగూడ మాఱుచువచ్చెను. ఇందువలన భిన్నసూత్రములును భిన్నశాఖలునుగలిగెను. యజ్ఞయాగాదిక శ్రౌతకర్మలఁజేయువిధానము శ్రౌతసూత్రములయందును గృహస్థులాచరింపవలసిన షోడశకర్మాదులను జేయవలసినవిధానము గృహ్యసూత్రములయందును వ్యవహార ధర్మాచరణవిధానము ధర్మసూత్రములయందును జెప్పఁబడినవి. ప్రాచీనసూత్రకారులలో బోధాయనాపస్తంబు లిరువురును దక్షిణాపథము లోనివారుగఁ గన్పట్టుచున్నారు. వారిలో ముఖ్యముగా నాపస్తంబుఁడాంధ్రదేశములోనివాఁ డగుటచేతఁ గాఁబోలు నాంధ్రదేశములోనివారికి నాపస్తంబ సూత్రములు విశేషగౌరవనీయములు. ఈయాంధ్ర దేశములోని నియోగివైదికబ్రాహ్మణులలో మూడువంతు లాపస్తంబసూత్రులుగా నున్నారు. ఇతఁడాంధ్రదేశములోనివాఁడనుటకు లేశమాత్రమును సందియములేదు. ఇతఁడు బోధాయనునకుఁ దరువాతికాలమున నున్నవాఁడు. ఆపస్తంబ ధర్మసూత్రములను జక్కగాఁ బరిశోధించి యాంగ్లేయభాషలోనికి భాషాంతరీకరించిన డాక్టరు బూలరుదొరగారీసూత్రకారుఁ డాంధ్రదేశములోనివాఁ డనియు, క్రీస్తునకుఁ బూర్వము నాలుగవశతాబ్దమునఁగాని యైదవశతాబ్దమునఁగాని యుండియుండుననియు వ్రాసియున్నారు.[1] బోధాయనునికాలమున సందిగ్ధములుగను అపరిశుద్ధములుగ నుండిన ధర్మశాస్త్రవిషయములఁ బెక్కింటిని ఆపస్తంబుఁడు సంస్కరించి విస్పష్టముగ దెలియఁజెప్పెను. ఆపస్తంబునకుఁ బూర్వమార్యసంఘమునందలి యాచారములంతగానియమబద్ధములుగాక యుండెను. సంఘసాంకర్యమున కవకాశమిచ్చియుండెను. అట్టిసాంకర్యమును నిరోధించునిబంధనల నాపస్తంబుఁడు విరచించెను. అవంతి, (మాళవము), అంగము (తూర్పుబేహారము), మాగధము దక్షిణబేహారము), సౌరాష్ట్రము (గుజరాత్), దక్షిణాపథము (డెక్కన్), ఉపవ్రీతము, సింధు, సౌవీరము (దక్షిణపంజాబు లేక పాంచాలము), దేశములలోనిజనులు సంకరులనియును, పంజాబులోనిఆరట్టులను, సౌవీరులను, దక్షిణాపథములోనికారస్కరులను, ఉత్తరబంగాళములోని పుండ్రులను, తూర్పు బంగాళములోని వంగీయులను, ఉత్కలదేశములోని కాళింగులను సందర్శించినవాఁడు పునస్తోమమను యజ్ఞమును చేయవలయునని బోధాయనుఁడు వచించెను.

బోధాయనాపస్తంబుల కాలమునాఁటికార్యులు పెక్కండ్రు దక్షిణాపథమునకువచ్చి యాంధ్రదేశమున నివాసము లేర్పఱచుకొనుచుండిరి. అప్పటికీ యార్యబ్రాహ్మణులు పృథివ్యాపస్తేజోవాయురాకాశములను బూజించుటను విడిచిపెట్టి యుండలేదు. వీరిలోఁ గొందఱు వైదికకాలమునందువలె త్రేతా

[1] See the introduction to the Sacred Laws, Vol II of the Sacred Books of the East edited by F. Max Muller.

గ్నులను దమతమగృహములలో నెలకొల్పుచునేయుండిరి. వీరలు యజ్ఞయాగాదికర్మల నాచరించుటయం దత్యంతోత్సాహాభినివేశములఁ జూపుచుండిరి. మంత్రవిధులప్రకారము హయమేధములను గోమేధములను జేయుచుండిరి. ఈ పశుహింసాకృత్యమంతయుఁ బరమరహస్యముగా విశాలములయిన గృహావరణములలోనే జరుపఁబడుచు వానిమాంసమును బ్రాహ్మణులు భక్షించుచుండిరి. వేదవేత్తలయిన యధ్వర్యులచేత నీయజ్ఞములు నెఱవేర్పఁబడుచుండినవి. యజ్ఞాచరణకాలమున ననార్యులవలన నేయాపత్తునుగలుగకుండ రాజరక్షణము గలిగియుండిరి. అయినను బ్రాహ్మణులు వేదములన్యులకుబోధపడకుండఁ బరమగోప్యముగా నుంచుకొనుచువచ్చిరి. ఆహేతువుచేత వేదములలోఁ జెప్పఁబడిన పృథివ్యాపస్తేజోవాయురాకాశముల పూజ అనార్యజాతులచే నంగీకరింపఁబడకయుండెను. అప్పటికే యార్యులలో నౌత్తరాహులకును దాక్షిణాత్యులకు నాచారభేదము లేర్పడినవి. ఆర్యమతమునందుఁ బ్రవేశపెట్టఁబడనివారితోఁ గలిసి భుజించుటయు, భార్యతోఁగూడఁ గలిసిభుజించుటయు, చప్పనిఅన్నము (చల్ది)భుజించుటయు మేనమామయొక్కయు, మేనత్తయొక్కయుకూతురిని బెండ్లాడుటయు దక్షిణమున మాత్రమే తప్పనియాచారములుగ నుండెను. గొఱ్ఱె మొదలగు కొన్ని జంతువుల రోమములతోఁ (బొచ్చు) వ్యాపారము చేయుటయు, బెల్లపుసారాయి త్రాగుటయు, పైదౌడలను క్రింది దౌడలను పల్లుగలిగిన జంతువులను మాత్రమె విక్రయించుటయు, ఆయుధవ్యాపారమవలంబించుటయు నావికాయాత్రచేయుటయు నుత్తరమునమాత్రమె దప్పనియాచారములుగ నుండెను. ఔత్తరాహులు దాక్షిణాత్యుల యాచారములనుగాని దాక్షిణాత్యులౌత్తరాహుల యాచారములనుగాని యవలంబించుట పాపముచేయుటగా శాసింపఁబడుచుండెను. ఏదేశముననేది యాచారముగానుండెనో అయ్యది యాదేశవిధులనతిక్రమింపరాదు. అయినను గౌతముఁడు దీనినంగీకరింపలేదు. ఆపస్తంబునికిఁ బూర్వమునందుండిన బోధాయనాది సూత్రకారులు శాస్త్రీయసంతానమునకును అశాస్త్రీయసంతానమునకును భేదమునెంచక ద్వాదశవిధపుత్త్రులను నంగీకరించి జ్యేష్ఠపుత్రునకు జ్యేష్ఠభాగమును విధించి యుండఁగా నాపస్తంబుఁడు దానినాక్షేపించి అశాస్త్రీయసంతానమునకు శాస్త్రీయసంతా



నముతో సమానముగా భాగమిచ్చుట కూడదనియును, జ్యేష్ఠునకుఁ దక్కినవారికంటె నధికభాగమీయరాదనియును జెప్పియున్నాఁడు. మఱియు నీతనికిఁ బూర్వమునందు నౌరసకుమారునితో సమానముగా క్షేత్రజునకును (స్వభార్యయం దితరునకు జనించినవాఁడు), గూఢజునకును (తన కుటుంబములోని స్త్రీకిజనించియు నెవ్వనికి జనించెనో తెలియఁబడక యుండువాఁడు), కానీనునకును (పెండ్లి కాకపూర్వము కన్యకు జనించినవాఁడు), సహోఢునకును (తెలిసియో తెలియకయో గర్భవతి గానున్న దానిని వివాహము చేసికొన్నప్పుడా గర్భవతియైన పెండ్లికూఁతునకు జనించినవాఁడు) యౌరసపుత్రునితో సమానముగానెంచి భాగమిచ్చునాచారమున్నప్పు డప్పటి యార్యసంఘము పరిశుద్ధముగానున్నదని యెవ్వరుచెప్పఁగలరు? బ్రాహ్మణునకు శూద్రస్త్రీయందు జనించినవాఁడు నిషాదుఁడని చెప్పినను వానినిగూడ నౌరసకుమారునితోఁ బాటు చూచుచుండిరి. ఈ సంకరసంతానమాపస్తంబునిచే నంగీకరింపఁబడలేదు. మఱియును నాకాలమునందాచరణములోనున్న నియోగమును (భర్తసమ్మతినిబడసి సంతానముకొఱకు నన్యపురుషునితోఁ గలియుట) గూడనీతఁ డంగీకరింపలేదు. వివాహప్రతిజ్ఞను ధిక్కరించి వివాహబంధమును ద్రెంచి స్వేచ్ఛగ వర్తించుభర్తగాని భార్యగాని నరకమునకుఁబోవుదురని యాపస్తంబుఁడు కంఠోక్తిగఁ జెప్పెను. ఈరీతిగ నాపస్తంబుఁ డెన్నియో సంస్కరణములను గావించెనుగాని యనాంధ్రజాతుల బాధించెడిక్రూరములయిన నిబంధనల నెన్నిటినో గల్పించెను. శూద్రుఁడు వేదము పఠించినయెడల నాలుక కోయవలసినదనియు, వేదము విన్నయెడల సీసము కరిగించి చెవిలోఁబోయ వలసినదనియు, వాఁడు వేదము జ్ఞాపకముంచుకొన్నయెడల వానిదేహమును రెండుతునకలు చేయవలసినదనియు ననేకసూత్రకారులు శాసించిరి. దీనింబట్టి యాకాలమున ననార్యజాతులయం దెట్టికరుణాశూన్యత్వముఁ జూపఁగలిగియుండిరో విస్పష్టముగఁ దెలియకపోదు.

ఈసూత్రకారుల యభిప్రాయము లనార్యుల విషయమున నెంతక్రూరములుగాఁ గన్పట్టినను ఆ కాలమునందు మన యాంధ్రదేశమునఁగాని దక్షిణాపథదేశములలో మఱియెచ్చటగాని యీ యార్యుల ప్రభావమంతగా విజృం

భించి యుండలేదు. సాంకర్యమును నిరోధించు నిబంధనలు వీరి సూత్రములలో నే యుండెను గాని యాచరణమునకుఁ దేఁబడి సాంకర్యమును నిలుపునట్లు చేయఁబడలేదు. దీనికిఁ గారణ మార్యులల్ప సంఖ్యాకులుగను, అనార్యులు బహుసంఖ్యాకులుగ నుండుటయు, ప్రభుత్వాధికారముఁ జాలవఱకు మిశ్రజాతుల వశమునం దుండుటయే గాని వేఱొండు గాదు. ఆర్యసంఘ మనార్యసంఘముల వాతఁబడి హతము నొందకుండఁ గాపాడినది యీ మిశ్రజాతి సంఘమె గాని మఱియొకటి గాదు.

## అనార్యాంధ్రుల మతము.

ఆ కాలమునందలి యనార్యాంధ్రుల మతము శ్రేష్ఠమైనది కాదు. అనార్యాంధ్రులలో వేర్వేఱు తెగల వారు వేర్వేఱు మతములను గలిగి యుండిరి. లేశమాత్రమును నాగరిత లేక మృగప్రాయులుగ నుండినవారాదిమనివాసులు. వారికిఁ గొలుచుటకు దేవతలు లేరు. వీరు దయ్యములను పిశాచములను నమ్మి వానిం గొలుచుచుండిరి. ఆర్యులు వీరిని రాక్షసులుగను పిశాచులుగను జూచుచుండిరి. మొదట వీరిని జయించినవారు నాగులు, ఆదిమనివాసులకంటె వీరు కొంచెము నాగరికత గలవారయినను వీరిమతము మాత్రము శ్రేష్ఠమైనది కాదు. వీరు వృక్షములను, సర్పములను బూజించుటయే గాక తాము వీరాగ్రేసరులగుటచేత వీరత్వమునకుఁ బ్రసిద్ధిఁ గాంచిన "కాళి" యను భయంకరమైన దేవతను బూజించుచుండిరి. ఆమెకు దున్నపోతులను బలిపెట్టుచుండిరి. కాళియొక్క విగ్రహము మిక్కిలి భయంకరముగా శృంగారింపఁబడుచుండెను. ప్రకాశమానమైనయొక చిన్నత్రాఁచుపాముయొక్క చర్మముతోఁ గప్పఁబడి యల్లిక వేయఁబడిన వెంట్రుకలజడ శిరస్సుపైనఁ గిరీటమువలెఁ గట్టఁబడుచుండెను. అడవిపందియొక్క వంకరకోఱను చందురువంకవలె (అర్ధచంద్రాకృతిగ) నుండునట్లు తలకట్టునకుఁ గట్టఁబడుచుండెను. పెద్దపులి దంతములతోఁ గూర్పఁబడిన సరము కంఠమునం దలంకరింపఁబడుచుండెను. వ్యాఘ్రచర్మము వస్త్రమువలె నడుమునకుఁ జుట్టఁబడుచుండెను. వంచఁబడిన బలమైన విల్లొకటి చేత నుంచఁబడుచుండెను. చిలువలు పలువలు గలిగిన దుప్పికొమ్ములతో పొడవుగల మగకణితిమీద నెక్కింపఁబడు



చుండెను. ఇట్టి విగ్రహము నెదుట డోళ్లు మ్రోగుచుండగా బూరలూదఁబడుచుండఁగా భయంకరులయిన నాగులు కాళికి దున్నపోతులను బలిపెట్టుచుండిరి. దున్నపోతులు నఱుకఁబడి రక్తము స్రవించుచుండఁగా గుడుపూరాలు (గణాచారిణి సిగమెత్తగా లేచి వణకుచు వికృతముగా నాట్యమాడుచు కాళి పూనినయట్లుగా "మీరు మీ దేవతకు బలియొసంగరేని ఆమె మీ విల్లులకు జయము కలుగునట్లు దీవెన లీయదు' అని హెచ్చరించును. ఈ కాళిపూజ మొదట అనార్యులయిన నాగులలో జనించి కాలక్రమమున నార్యులచే గూడ నిటీవల నాచరింపఁబడుచుండెను. ఇది అనార్యాచారము గాని యార్యాచారము గాదని స్పష్టముగఁ జెప్పవచ్చును. ఈ కాళిపూజను మాత్రమె గాక నాగులును తదితరులును ఱాళ్లను బుగ్గలను (చెలమల గూడ పూజించుచుండిరి. చెవిటివారును, మూఁగవారును గూనుకలవారును కుష్ఠరోగులును మహిమగల బుగ్గలలో మునింగి యా ఱాళ్ళ చుట్టును దిరిగి పూజించినయెడల స్వస్థులగుదురని విశ్వసించుచుండిరి.

## ఆంధ్రరాజ్యస్థాపనము.

ఆర్యులనార్యాంధ్రదేశమునకు వచ్చి యించుమించుగా రెండుశతాబ్దముల కాలము వారినడుమ నివసించియుండుటచేత స్వభావసిద్ధముగా నేర్పడిన సమ్మేళన సాంకర్యమువలన మిశ్రజాతియొకటి జనించి నానాటనభివృద్ధిఁ గాఁ జొచ్చెను. మేమిదివఱకీ చరిత్రమున నుదాహరించిన యార్యాంధ్రసంఘమె యీ మిశ్రజాతిగ నున్నది. ఈ యార్యాంధ్రులనార్యాంధ్రులకంటె నెక్కుడు నాగరికతయు, విజ్ఞానమును, పరాక్రమమును గలిగినవారయి యుండుటచేత దేశమున వీరి యధికారములు నాగాంధ్రులనుండి గైకొనఁబడినవి. కావున క్రీస్తుశకమునకుఁ బూర్వము నాలుగవశతాబ్దమునందే యాంధ్రరాజ్యము స్థాపింపబడినదని స్పష్టముగాఁ జెప్పవచ్చును. లేనియెడల నాలుగవ శతాబ్దప్రారంభమున మగధరాజ్యాధిపత్యము నువహించిన చంద్రగుప్త చక్రవర్తి యాస్థానమునందుండిన యవనదేశపు రాయబారియగు మేగాస్తనీసను వాఁడీ యాంధ్రరాజ్యమును ప్రశంసింప వలసినపనియె లేకయుండును. అతఁడీ యాంధ్రజాతి మిక్కిలి పరాక్రమముగల జాతియనియు, చంద్రగుప్తుని మగధరాజ్యముతప్ప యాంధ్రరాజ్యము నుమించిన రాజ్యము

మఱియొకటి లేదనియు, ఆంధ్రరాజ్యమునం దప్పుడు ముప్పదిదుర్గములును లక్ష కాల్బలమును, రెండువేల యాశ్వికసైన్యములు సహస్రదంతావళములు నుండెననియు నుడివియున్నాడు.[1]

## ఆంధ్రవిష్ణువు.

మౌర్యవంశస్థాపకుఁడయిన చంద్రగుప్తునికిఁ బూర్వముననే యీయాంధ్రరాజ్యముండెనని మేగాస్తనీసు వాక్యమువలన ధ్రువపడుచున్నదిగాని యీరాజ్యమును మొదట స్థాపించిన పరాక్రమశాలి నామమాత్రము చరిత్రమునందు గానరాకయున్నది. అయిన నొకగాథ పురాణాదులయందుఁ జేర్పఁబడుటయేగాక నేఁటికిని జనపరంపరచే వాడుకొనంబడుచు సుప్రసిద్ధివ్యాప్తి గాంచియున్నది. కాకులమునందు రాజ్యపరిపాలనము సేయుచుండిన సుచంద్రుఁడనువాని కుమారుఁడు "ఆంధ్రవిష్ణువు" అనువాఁడు నిశంభుఁడను దానవునితోఁ బదమూఁడు మహాయుగములు యుద్ధముచేసి వానిని హతముగావించి శ్రీశైలము; భీమేశ్వరము, కాలేశ్వరములకడను ప్రాకారములు నిర్మించి కోటగట్టి యాత్రిక్షేత్రములను త్రిద్వారములుగఁ జేసి త్రిశూలధారియైన యీశ్వరునిఁ గాపువెట్టి ఋషులతోఁగూడ గోదావరీతీరమునందు నివసించెననియు నప్పటినుండియు నీదేశము త్రిలింగదేశమని వ్యవహరింపఁబడుచున్నదనియుఁ జెప్పెడిగాథ మూలముననేసత్యమునులేక కల్పింపఁబడినదని మాయభిప్రాయము గాదు. ఈగాథలోఁ జేర్పఁబడిన శ్రీకాకులము కృష్ణామండలములో మచిలీపట్టణమునకుఁ బడమట ౧౯ మైళ్లదూరమునఁ గృష్ణవేణీతటముననుండిన శ్రీకాకులమేగాని వేఱొండుగాదు.[1] సుచంద్రుఁడను నార్యాంధ్రుఁ డొకఁడు కాకులమును రాజధానిగఁ జేసికొని పరిపాలనము చేసియుండవచ్చును. ఈసుచంద్రుఁడనువాఁడు జైనమతావలంబకుఁడై యుండవలయును. ఆంధ్రవిష్ణు వీతని కుమారుఁడు. ఇతఁడు బహుపరాక్రమశాలియై నిశంభుఁడను నాగాంధ్రుని జయించి యాంధ్రరాజ్యమును స్థాపించి విజృంభింపఁజేసి మిక్కిలి ప్రఖ్యాతికెక్కి యుండును. బహుకాల మీతనినామమును గీర్తిని ప్రజలు జ్ఞాపకముంచుకొనియుందురు. ఇటీవల శైవమతము ప్రబలి బౌద్ధక్షేత్రములుగానుండిన శ్రీశైలము, భీమేశ్వరము, కాలేశ్వరములను త్రిక్షేత్రములును శైవక్షేత్రము లయినతరువాత, ఈదేశమునకు త్రిలింగమను నామము వ్యవహారములోనికి వచ్చినతరువాత, సుప్రసిద్ధిగాంచిన యీయాంధ్రవిష్ణువును శైవులయిన రాజులును పండితులును పైగాథను ముడిపెట్టియుందురుగాని మనము వివేకదృష్టితో నీగాథలోనిసంగతిసందర్భములను జక్కఁగఁ బరిశీలించితిమేని నీతఁడే తప్పక యాంధ్రరాజ్యసంస్థాపకుఁడైయుండునని తెలిసికొనఁగలుగుదుము. ఈయాంధ్రరాజుల పాలనమునందు శ్రీకాకులమే రాజధానిగనుండెను. ఆకాలమునందలి శ్రీకాకులము కృష్ణానది వెల్లువలచేఁ గొట్టుకొనిపోవుటచేత నేఁడుగానరాకున్నయది.[2] ఆప్రదేశమునకుఁ జెంతను నాపేరితో మఱియొకగ్రామము వెలసినది. అయినను ఆంధ్రవిష్ణువును మాత్రము మఱువక తరువాతి వారాతని దైవమునుగా భావించి దేవాలయమును గట్టి యాతనిం బూజించుచున్నారు. శ్రీకాకులాంధ్రదేవుఁ డీయాంధ్రవిష్ణువేగాని

1 Next come the Andrae a stili more powerful race which possesses numerous villages and thirty towns defended by walls and towers, and which supplies its king with an army of 100000 infantry, 2000 cavalry and 1000 elephants. Mc. Crindle's Magesthenes p. 138.



1. Dr. Burgess, "The Stupas of Amaravaty and Jaggayyapeta," A. S. S. I, p. 3 referring to Wilson, Mackenzie Mss, Vol I intron p. c. xvi.

The Godavary District Gazetteer ch. 2. p. 18,—

Mr. A. D. Campbell's Telugu Grammar, intro. p. ii.

Mr. V. A. Smith's Early History of India, p. 195.

2 The site of the ancient town (N. lat. 20. 28, E. long. 85 55) has been cut away by the river (Rea proc. Govt. Madras, Public, No. 423, dated June 19, 1892.)

మఱియొకవిష్ణువుగాఁడు. మధుసూదనదేవుఁడైన యీయాంధ్రవిష్ణువునే సందర్శించుటకై పదునాఱవ శతాబ్దారంభమునందు నాంధ్రభోజుఁడు మూరురాయరగండఁడు విజయనగరాధీశ్వరుండు విద్యాచక్రవర్తి శ్రీకృష్ణదేవరాయచక్రవర్తి పూర్వదిగ్విజయయాత్రకాలమునవచ్చి కానుక లర్పించిపోయి తనవిష్ణుచిత్తీయమునం దభివర్ణించియున్నాఁడు. పూర్వకాలమున జైనులో బౌద్ధులో పరిపాలనము చేసిరని తెలుపు చిహ్నము లిప్పటికి నాసమీప ప్రాంతభూములయందుఁ గానవచ్చుచున్నవి. ఈమొదటి యాంధ్రరాజులు రెండుమూడు శతాబ్దములు పరిపాలనము చేసినట్లుగఁ గన్పట్టుచున్నను ఆంధ్రజాతీయులయిన శాలివాహనవంశజులు రాజ్యాధిపత్యము వహించువఱకు వీరి చారిత్రముగాని వీరి నామములుగాని దెలియరాకున్నవి.

## శైవమత వ్యాపనము.

ఈకాలమునందే యాంధ్రరాజ్యమున శైవమతము ప్రవేశించి వ్యాపించినట్లుగఁ గాన్పించుచున్నది. ఈశైవమతము మొదట యక్షులలో (తమిళజాతులలో) వ్యాపించి వారిమూలమున నాంధ్రదేశమున వ్యాపించినది. ఈమతమనార్యులనుండి వచ్చినది కాని కొందఱు తలంచునట్లార్యులనుండి వచ్చినది కాదని తోఁచుచున్నది. మొట్టమొదట శైవమత మెట్లుత్పత్తిగాంచినదియుఁ దెలిసికొనుట చదువరుల కావశ్యకమనుటకు సందియములేదు. అదియునుంగాక యీవిషయము మనోహరముగా నుండకమానదు. హిమవత్పర్వతమున నుత్తరమునందలి యున్నతభూములనుండి యక్షులు క్రమముగా గంగానది ప్రవహించెడి పల్లపు భూములకువచ్చి యచ్చట కొంతకాలము నివసించియుండి మఱి కొంతకాలమైన తరువాత నచ్చటి రేవుపట్టణమగు తామ్రలిప్తి నగరమునుండి సింహళమునకును సింహళమునుండి దక్షిణాపథముయొక్క దక్షిణపు కొనకువచ్చి కాలక్రమమున నచ్చట పాండ్యచోళచేరరాజ్యములు స్థాపించిరనియు ఈయక్షులే తామ్రలిప్తినుండి(Tamalittis)వచ్చిన వారగుటచేత తమిళు(Tamils) లనఁబడుచున్నారని నాలుగవ ప్రకరణమున వ్రాసినవిషయములను మాచదువరులవగాహము చేసికొనియేయుందురు. ఈయక్షులలోఁ బైతరగతులవారికి శివుఁడు ప్రధానదైవతముగా నుండెను. శివుఁడు స్ఫురద్రూపమునుదాల్చి రాగివర్ణపు వెంట్రుకలతోడి జటాజూటము కలవాఁడై పులితోలుగప్పుకొని శూలపాణియై వృషభవాహనారూఢుఁడై త్రినేత్రములను గలిగి సంచరించునని యక్షులభివర్ణించియుండిరి. త్రినేత్రములు దక్క తక్కిన రూపమంతయు హిమవత్పర్వత ప్రాంతభూమిని నివసించు నాదిమనివాసుని రూపమును బోలియుండుననుటకు లేశమాత్రమును సంశయములేదు. ఆయున్నత భూములందుండు పార్వతీయులు స్ఫురద్రూపులుగాను రాగివర్ణపు వెంట్రుకలు గలవారుగను ఎద్దులనెక్కి సంచరించువారుగనుందురు. హిమాలయపర్వతమునందుత్తర భాగమున గంగాసింధు బ్రహ్మపుత్రానదుల జన్మస్థానమునకు సామీప్యమునుండి వెండికొండవలె మంచుగడ్డలతోఁ జేర్చఁబడియున్న కైలాసశిఖర మీతని నివాసముగానుండెను. స్వర్గభూమియందుండెడి దేవతలకు (the inhabitants of the highest table land of the earth, ie, Tibet. (భూమండలమునందలి యున్నతభూములలో నున్నతమైనది అనఁగా త్రివిష్టపదేశము (Tibet) బాధకలుగఁజేయుచుండిన యసురుల సంహరించి వారి త్రిపురములను భస్మముచేసి త్రిపురాసుర సంహారకుఁడని బిరుదుగాంచుట యీతఁడు చేసినఘనకార్యములలో నొక్కటిగానున్నది. ఈతఁడు హిమవంతుని కూఁతురగుపార్వతిని వివాహముచేసికొనెను. యక్షులలో వీరులకును వేటకాండ్రకును, "మురుగ" యను మఱియొక దేవత(స్కందుఁడులేక కుమారస్వామి)కలఁడు. స్కందున కాఱుమొగములును * పండ్రెండుచేతులును గలవు. ఈదేవునిదేవాలయము లరణ్యములనడుమను, పర్వతశిఖరములమీఁదను సాధారణముగా నిర్మింపఁబడుచుండెను. వేటకాండ్రయొక్క యీవీరదేవునకు బల్లెము ప్రధానాయుధముగా నుండెను. ఈదేవతకు బలులర్పింపఁబడునప్పు డొకపాక వేయఁబడి పూలసరములతో నలంకరింపఁబడును. అచ్చట వేటకాండ్రయొక్క గురువు మంత్రోచ్చారణసలుపుచు, పుష్పములను, అక్షతలను వెదఁజల్లుచు నొకయెద్దును బలియిచ్చును. ఆయెద్దు రక్తములో వేడియన్నమునుగలిపి తప్పెటలును డోళ్లును మ్రోగుచుండగా చేగంటలువాయించుచుండఁగా, కొమ్ములూదుచుండఁగా ఆప్రసాదమును దేవునకు నైవేద్యమిడును. తరువాత వారందఱు నచ్చటకొంతసేపు సివములాడి మఱిపోవుదురు. దీనినంతయును విచారించిచూడఁగ నితఁడుకల్పితపురుషుఁడని చెప్పరాదు. ఈ

దేవునికారోపింపఁబడు గాథలనన్నిటిని పరిశోధించిచూచినయెడల నీతఁడొక శూరాగ్రేసరుఁడయిన రాజనియు, మరణానంతర మొకదేవుఁడుగా భావింపఁబడి శూరులచేఁ గొలువఁబడుచుండెనని తేటపడకమానదు. ఇతఁడు గంగానదిపుట్టినచోట శారవనమునందు జనించి యార్గురుతల్లుల చేఁ బెంపఁబడియెనని యుఁ జెప్పుదురు. అసురులతోఁ బోరాడునపుడితఁడు దేవతలకు సేనాధిపతి గనుండెను.

ఆకాలమున బ్రాహ్మణార్యులమతమును, వారినిత్యనైమిత్తిక కామ్యకర్మలును అనార్యులచే సేవగింపఁబడుచుండినయవి. వారి గ్రంథ విజ్ఞానమును వీరికి లభింపకపోయెను. తుదకు బ్రాహ్మణార్యులే యనార్యులను వశపఱచుకొనుటకై యనార్యులదేవతలను గ్రహించి యాదరించి పూజింపసాగిరి. నాగుల దేవతయగు కాళిని శివునిభార్యయగు పార్వతియొక్క యంశమనిరి. వేటకాండ్ర దేవతయగు "మురుగ" ను స్కందకుమారుఁడనియుఁ షణ్ముఖుఁడనియు, కుమారస్వామియనియు, పేరువెట్టి శివునికుమారునిఁ జేసిరి. దేశవీరులయిన బలరామకృష్ణులుగొల్లవాండ్రచేఁ బూజింపఁబడుచుండిరి. వీరిని విష్ణుని యవతారములని గ్రహించిరి. అనార్యులను సంతోషపెట్టుటకై మొదటనార్యులీ దేవతలకు దేవాలయములు గట్టి ముఖ్యముగా నాకాలమున శివుని, షణ్ముఖుని, బలరామ కృష్ణులను బూజింపసాగిరి. ఆకాలమునందలి ప్రధానదైవతములలోఁ శివుఁడేప్రధాన దేవుఁడుగానుండెను. [1] ఈశైవమత మార్యజాతులలోఁ గంటె ననార్యజాతులలో సంపూర్ణముగా వ్యాపించియుండెను. ఆంధ్రరాజ్యమునకు సింహళమునకును యక్షరాజ్యములగు పాండ్యచోళచేరరాజ్యములకును వరకవ్యాపా

1. శైవమతమును గూర్చినపై యంశములు క్రీస్తుశకము రెండవశతాబ్దారంభమునను మధ్యమునను రచింపఁబడిన చీలప్పదికారము, తిరుమురుకర్రుపడై యనుతమిళకావ్యములయందుఁ జెప్పఁబడినవిగాని నాస్వకపోలకల్పితములుగావు.

See "The Tamils, Eighteen Hundred Years Ago" by Mr. V. Kanakasabhai. pp. 227—233.



రమధికమై రాకపోకలు కలిగినతరువాత నీశైవమత మాంధ్రులలోఁ గూడ వ్యాపించెను.

## మౌర్యులకాలము.

(క్రీ. పూ. ౩౨౧ మొదలుకొని ౧౮౪ వఱకు.)

క్రీస్తునకుఁ బూర్వము నాలుగవశతాబ్ద ప్రారంభమున యవనులీ భరతఖండముపై దండెత్తివచ్చి పాంచాలము నాక్రమించుకొని మూఁడుసంవత్సరములు పాలించినతరువాత చంద్రగుప్తుఁడను మౌర్యుఁడొకఁడు యవనులను బాఱఁదోలి చాణక్యుఁడను బ్రాహ్మణ మంత్రి సహాయమున మగధరాజ్యమును బాలించుచుండిన నందుని వాని పుత్త్రులను జంపి తాను సింహాసన మెక్కి హిమాలయవింధ్యములకు నడుమనుండు యావద్దేశమునే కచ్ఛత్రముగ నేలెను. ఈతని యాస్థానమునందే యుండిన మేగాస్తనీసను యవన రాయబారి యాంధ్రరాజ్యమును గూర్చి ప్రశంసించినవాఁడుగాని యాకాలమున నీయాంధ్రరాజ్యము చంద్రగుప్తునికి లోఁబడియుండెనో లేక స్వతంత్రత వహించియుండెనో దెల్పినవాఁడు కాఁడు. చంద్రగుప్తునికుమారుఁడగు బిందుసారుని కాలమునందయినను ఆంధ్రరాజ్యము మగధరాజ్యమునకు సామంతరాజ్యముగ నుండెనేమో స్పష్టముగా బోధపడదు. కుంతలదేశమును మౌర్యులు పరిపాలనము చేసినట్లు మైసూరుమండలములోని పండ్రెండవశతాబ్దమునాఁటి శాసన మొకదానివలనఁ గన్పట్టుచున్నదని రైసుదొరగారు వ్రాసియున్నారుగాని [1] యామౌర్యులకును ఈమౌర్యులకును నెట్టిసంబంధముగలదో స్పష్టముగా బోధపడదు. బిందుసారుఁడు కుంతలమువఱకు జయించినయెడల నాంధ్రరాజ్య మీతనికాలమున మగధరాజ్యమునకు సామంతరాజ్యముగఁ జేయఁబడియుండవలయును. ఇతఁడు . యుద్ధముచేసి యాంధ్రదేశమును జయించినట్లెక్కడను గానరాదు. ఈతని శాసనములయిన నీదేశమున నెక్కడను గానరావు. వీనికొమారుఁ డశోకవర్ధనుని కాలమునందు నాంధ్రరాజ్యము వానికిలోఁబడి యుండినట్లు గన్పట్టుచున్నదిగాని యతఁడైనను యుద్ధముచేసి జయించినటు గన్పట్టదు. ఈ యశోకవర్ధన చక్రవర్తి ప్రేరే

1. Mr. V. A. Smith's Early History of India. p. 139.

పణము చేతనే యాంధ్రులు బౌద్ధమతమవలంబించిరని యతఁడు వ్రాయించిన పదమూడవ శిలాశాసనము వలనఁ గన్పట్టుచున్నదని మూడవప్రకరణమునందే యాశాసనములోని వాక్యములను దెలిపియుంటిమి. ఆంధ్రరాజ్య మీచక్రవర్తి కాలమున నిప్పటి బ్రిటీషు ప్రభుత్వమునకు లోఁబడియున్న హైదరాబాదు, మైసూరు, బరోడారాజ్యములవలె నొకసంరక్షక రాజ్యముగ నుండియుండవలయును.[1] ఇప్పటి యాంధ్రదేశభాగమగు కళింగము (గోదావరి, విశాఖపట్టణము, గంజాము జిల్లాలు)పై దండెత్తివచ్చి స్వాధీనము చేసికొని యుద్ధమునందు లక్షమంది కాళింగులు మడియుటయును, ప్రజలకు గలిగిన సంక్షోభమును గన్నులారఁ గాంచి పశ్చాత్తప్తుఁడై యంతటినుండి యుద్ధముల మానివేసి బుద్ధధర్మము నవలంబించి బోధకుల నానాదేశములకుఁ బంపించి బౌద్ధమతమును నానాముఖముల విస్తరింపఁ జేసిన వాఁడశోకుఁడు. ఇతని మరణానంతర మాంధ్రులు స్వతంత్రులయి పరిపాలనము చేసినట్లుఁ గన్పట్టుచున్నది. అశోకవర్ధనుని తరువాత పాలించిన మౌర్యవంశపురాజులలో నశోకుని మనమఁడు దశరథుఁడను వాఁడు తక్క తక్కినవారెల్లరును పట్టి బలహీనులగుటవలన సామంతులుగనున్న వారనేకులు స్వతంత్రులయిరి.

ఆంధ్రరాజ్యమును స్వతంత్రతవహించుటయే గాక భరతఖండముయొక్క మధ్యభాగమునంతయు నాక్రమించుకొని తనయధికారమును నలుప్రక్కల విజృంభింపఁజేయుచుండెను. మౌర్యవంశపు రాజులలోఁ గడపటివాఁడయిన బృహద్రథుని కాలమున వానిసైన్యాధిపతియు, శుంగవంశ సంజాతుఁడునగు పుష్యమిత్రుఁడనువాఁడు వానింజంపి క్రీ. పూ. ౧౮౪ గవ సంవత్సరమున రాజ్యమాక్రమించుకొనెను. ఇతఁడు బహుపరాక్రమవంతుఁడై యశ్వమేధాది యాగములఁ బెక్కింటిని జేసెనుగాని యాంధ్రులును కాళింగులు నీతనికి లోఁబడియున్నట్లు గానరాదు.

1 Ind. Ant. Vol xx. 247. Mr. V. A. Smith's Early History of India p. 151. The Godavary Dist. Gazetteer.p. 17.



## ఖారవేలుని శాసనము.

పుష్యమిత్రుఁడు బౌద్ధుఁడు కాకపోవుటవలన రాజ్యమునకువచ్చిన వెంటనే బౌద్ధమతస్థులను బాధింప నారంభించెను. ఇతఁడశ్వమేధాది యాగములఁ బెక్కింటినాచరించి బ్రాహ్మణుల నాదరించుచువచ్చెను. వీనికాలమున నవఁగా క్రీ. పూ. ౧౫౭ వ సంవత్సరమున కళింగదేశమును బాలించెడి జైనరాజగు ఖారవేలుఁడు మాగధముపై దండెత్తివచ్చి మగధరాజగు పుష్యమిత్రునికి గర్వభంగము గావించెను. ఈయుద్ధమునందు శాతకర్ణియను నాంధ్రరాజొకఁడు బహుసేనలనుబంపి ఖారవేలునకుఁ దోడ్పడినటుల నత్కాలదేశములోని కటకమునకు దక్షిణమున ౧౯ మైళ్ల దూరముననుండు నుదయగిరిపైన హాతిగంఫా గుహాలోని యొకశిలపై మౌర్యరాజకాలము ౧౬౫వ సంవత్సరమున ఖారవేలునిచేఁ వ్రాయించఁబడిన శాసనమునందుఁ బేర్కొనఁబడినది.[1] మొదటి మౌర్యరాజగు చంద్రగుప్తుఁడు ౩౨౧ వ సంవత్సరమున రాజ్యాభిషేకముఁ బొందినవాఁడుగావున ఖారవేలుని శాసనము క్రీ. పూ. ౧౫౬ వ సంవత్సరమున వ్రాయఁబడియుండును. కనుక నాకాలమున నాంధ్రరాజ్యము మగధరాజ్యమునకు లోఁబడియుండలేదనియు స్వతంత్రతనుగాంచి యున్నదనియు, మీఁదుమిక్కిలి మగధరాజ్యమునకు ప్రత్యర్థిగ నున్నదనియు గూడస్పష్టమగుచున్నది.

## ఆంధ్రులు మగధరాజ్యమును జయించుట.

శ్రీముఖుఁడను[2] నాంధ్రభృత్యవంశపు రాజొకఁడు మగధరాజ్యమును బాలించెడి సుశర్మయను కాణ్వవంశ జాతీయుని సంహరించి ఆ రాజ్యము స్వాధీనముఁ జేసికొనియె నని వాయుమత్స్య విష్ణుభాగవతాది పురాణములలోఁ జెప్పఁబడియెను. శాతకర్ణియను నాంధ్రరాజు పుష్యమిత్రునితో ఖారవేలునకైన యుద్ధమునందు ఖారవేలుని పక్షముననుండి యుద్ధముచేసినవాఁడు మొదలుకొని

1 Hathigumpha inscr in Actes, Sixieme cougre's or. tome iii, p. 174, Leide 1885.

2 శ్రీముఖుని పేరు పురాణములలో దప్పుగాఁ బేర్కొనఁబడినది.

శ్రీముఖుఁడను నాంధ్రరాజు మగధదేశమును బాలించెడి కాణ్వవంశజుఁడగు సుశర్మను జంపి మగధరాజ్యము నాక్రమించుకొను నాఁటివఱకు నాంధ్రులను నాంధ్రరాజులను గూర్చి చరిత్రాంశము లేవియు వినరావు.

## పురాణములలోని రాజవంశములు.

మగధరాజ్యమును శిశునాగవంశమునకుఁ దరువాత మౌర్యులు పదిమంది నూటముప్పదియేఁడు సంవత్సరములు పరిపాలింతు రనియు, వారితరువాత శుంగవంశజులు పదుండ్రు నూటపండ్రెండు సంవత్సరములు పరిపాలింతురనియు, తరువాత కాణ్వవంశీయులు రాజులై నలువదియైదు సంవత్సరములుమాత్రమె పాలింతురనియు, వారివెనుక నాంధ్రరాజులు రాజ్యమాక్రమించుకొని నాలుగువందల యేఁబది యాఱుసంవత్సరముల వఱకుఁ బరిపాలన సేయుదురనియును పైఁజెప్పిన పురాణములలో వ్రాయఁబడియుండెను. కాఁబట్టి చంద్రగుప్తుఁడు ౩౨౧ వ సంవత్సరమున రాజ్యమునకు వచ్చినవాఁడు కావున మౌర్యులాకాలము మొదలుకొని ౧౩౭ సంవత్సరముల కాలమనఁగా ౧౮౫ వ సంవత్సరము వఱకును బరిపాలనచేసియుందురు. తరువాత రాజ్యమునకు శుంగవంశజులు ౧౮౫ గవ సంవత్సరము మొదలుకొని ౧౧౨ సంవత్సరములనఁగా ౭౩ వ సంవత్సరము వఱకును బరిపాలనముఁ జేసియుందురు. వారివెనుకవచ్చిన కాణ్వులు నలువురును నలువదియైదు సంవత్సరములనఁగా ౨౮ వ సంవత్సరమువఱకును బరిపాలించియుందురు. అటుపిమ్మట నాంధ్రభృత్యవంశ మారంభమై యుండును. ఆంధ్రభృత్యులనఁగా నొకప్పుడు భృత్యులుగానుండిన యాంధ్రులనియర్థము. ఈపురాణములోనీ రాజవంశములు పేర్కొనఁబడుటయేగాక యావంశములలోని రాజుల నామములును వారలు పరిపాలనము చేసిన సంవత్సరములును గూడ పేర్కొనఁబడియున్నవి. కాణ్వాయనీయులను పదభ్రష్టులను జేసిన యాంధ్రుఁడు సింధుకుఁడని వాయుపురాణమును, శ్రీప్రకుఁడని విష్ణుపురాణమును, శ్రీశుకుఁడని మత్స్యపురాణమును, పేరుచెప్పక వృషలుండనిమాత్రము భాగవతపురాణమును బేర్కొనుచున్నవి. ఆంధ్రభృత్యవంశములోని రెండవవాఁడు కృష్ణుఁడని పురాణములన్నియుఁ బేర్కొనుచున్నవి. శ్రీశాతకర్ణిని వాయువిష్ణుపురాణములు మూడవవానిగఁ జెప్పియుండ భాగవతపురాణము శాతకర్ణియనుపేరు మార్చి శాంతకర్ణుఁడని పేర్కొనుచున్నది. మత్స్యపురాణము కృష్ణునికి శాతకర్ణికినడుమ మఱి ముగ్గురురాజుల నెక్కువగఁ జేర్కొనుచున్నది.



ఇంతియగాక విష్ణుపురాణము మత్స్యపురాణములోని శాతకర్ణికనుగుణముగానుండు మఱియొక శాతకర్ణిని పేర్కొనుచున్నది. వాయుపురాణముప్రకారము గోతమిపుత్త్రుఁడు పదమూడవ రాజకుమారుఁడుగను, భాగవతపురాణము ప్రకారము పదునేనవవాఁడుగను, విష్ణుపురాణము ప్రకారము పదునేడవవాఁడుగను, మత్స్యపురాణము ప్రకారమిరువదిరెండవవాఁడుగనునుండెను. విష్ణుభాగవతమత్స్యపురాణముల ప్రకారము పులోమముఁడు గోతమిపుత్త్రునితరువాతివాఁడుగనుండెను. వాయుపురాణము వీనిపేరు పూర్తిగ విడిచిపెట్టుచున్నది విష్ణుమత్స్యపురాణముల ప్రకారము వానివెనుకవచ్చినవాఁడు శివశ్రీయనువాఁడై యున్నను భాగవతపురాణము వేదశ్రీయనువాఁడని పేర్కొనుచున్నది. వాయుపురాణము వీనిపేరెత్తక మౌనమువహించినది. శివశ్రీ తరువాత వచ్చినవాఁడు శివస్కందుఁడని యొక్క వాయుపురాణము తక్క తక్కినవన్నియు నంగీకరించినవి. వీని తరువాతవచ్చిన యజ్ఞశ్రీయనువానిని పురాణములన్నియు నొప్పుకొనుచున్నవిగాని వాయుపురాణము వానిగోతమిపుత్రునికి వెనుకఁ బేర్కొనుచున్నది.

## ఆంధ్రభృత్యవంశమే శాతవాహనవంశము.

పురాణములలోఁ బేర్కొనఁబడిన యాంధ్రభృత్యరాజులలోని కొందఱి శాసనములు దక్షిణాపథమునఁ గానవచ్చుచున్నవి. శాసనములుమాత్రమెగాక వేనవేలు నాణెములుకూడ గానంబడినవి. అయ్యవి నాసిక, జనగడ, కార్లి, ఠాణా మొదలగు మహారాష్ట్రదేశములోని స్థలములయందును, ధరణికోట, జగ్గయ్యపేట, గుడివాడ, భట్టిప్రోలు, ఘంటశాల, చినగంజాము మొదలగు నాంధ్రదేశములోని స్థలములయందును విశేషముగాఁ గానవచ్చినవి. పురాణములలోఁ బైనఁబేర్కొనంబడిన కృష్ణుఁడు, శాతకర్ణి, పులమాయి, గోతమిపుత్త్రుఁడు, శివశ్రీ, యజ్ఞశ్రీ మొదలగు నాంధ్రరాజులీశాసనములలోను నాణెములలోను బే

ర్కొనఁబడుటచేతను, శాసనములలోఁ దాముశాతవాహనవంశజుల మనిపేర్కొనుటచేతను, వారిముఖ్యరాజధాని యాంధ్రదేశములోని ధాన్యకటకనగరమగుటచేతను, పురాణములలోని యాంధ్రభృత్యవంశమును శాసనములలోని శాతవాహనవంశమును నొక్కటియే యని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును ఆంధ్రభృత్యవంశ మనియెడు నీశాతవాహనవంశమునకు శాతవాహనుఁడు వంశకర్త యని చెప్పకయ చెప్పుచున్నది.

## శాతవాహనుఁడే శాలివాహనుఁడు.

శాతవాహనునే ప్రాకృత భాషలో శాలివాహనుఁడందురు. ఈశాతవాహనుని చరిత్రము పురాణములలోఁగాని శాసనాదులలోఁగాని యెచ్చటను గానరాదు. ఈతనిం గూర్చిన విశ్వాసపాత్రమయిన చరిత్ర మింతవఱకును గాన్పింపలేదుగాని యీతని పేరిట నద్భుతము లయిన గాథలుమాత్రము వేనవేలు దేశమున లోకవిధముగా బహుదేశములయందు భరతఖండమునంతట వ్యాపించియున్నవి. ఆగాథలు శాతవాహనుని కాలమును నిర్ణయించుట కెంతమాత్రమును బనికిరావు. కేవలము కల్పితములయిన గాథ లనేకములు వీరాగ్రగణ్యుఁడైన శాతవాహనుని మెడకు ముడిపెట్టఁబడినవి, ఈతనియొక్క ప్రఖ్యాతినిబట్టి యిటీవలిరాజులెందఱో యీశాతవాహనునితోఁ దమకేమియు సంబంధములేకపోయినను తామీతనిసంతతివారమని గొప్పగాఁ జెప్పుకొనుచుండిరి. ఇతఁ డాంధ్రజాతీయుఁ డని యాంధ్రదేశమును బాలించిన యాంధ్రభృత్యవంశ మనియెడు శాతవాహనవంశమునకు మూలపురుషుఁడని ఆంధ్రమహారాష్ట్రదేశములలోని శాసనాదులవలనను పురాణాదులవలనను స్పష్టముగాఁ దెలియుచుండఁగాఁ దదితరదేశరాజన్యులకెట్లు వంశకర్తయయ్యెనో దెలియరాకున్నయది. ఇతఁడు కుమ్మరవాఁడని చెప్పెడికథలును, మాళవదేశాధిపతియైన విక్రమార్కుని నీతఁడు చంపెనని చెప్పెడికథలును గల్పితములుగాని సత్యములుగావనియును, అవి యెట్లుగల్పింపఁబడినవియును ఈ చరిత్రమును సాంతముగఁ జదివి యవగాహముఁ జేసికొనువారికి బోధపడకమానవు, ఇతనిచరిత్రము మనకుస్పష్టముగఁ దెలియకపోయినను మగధరాజ్యమును పుష్యమిత్రుఁ డాక్రమించుటకుఁ బూర్వముననే యీవీరవరాగ్రగణ్యుఁ డాంధ్రరాజ్యా



ధిపత్యమునువహించి పశ్చిమోత్తరభాగమున బహుదేశములనుజయించి యాంధ్రరాజ్యమును నానాముఖముల విస్తరింపఁజేసి రాజధానిని శ్రీకాకుళమునుండి విజయవాటికకు (Bezwada) బడమట ౧౮ మైళ్లదూరమునఁ గృష్ణానదికి దక్షిణముననుండు ధాన్యకటకమునకు మార్చుటయేగాక మహారాష్ట్రదేశము నందలి గోదావరితీరముననుండెడి ప్రతిష్ఠానపురమును యువరాజులకునికిపట్టుగఁ జేసినట్లు గన్పట్టుచున్నది. అట్టియీ యాంధ్రవీరునిగూర్చి బహుదేశములలో వ్యాపించిన కల్పితకథలకెల్లను మూలకారణము కథాసరిత్సాగరము నందలి మహాగాథయె గాని వేఱొండుగాదనితోఁచుచున్నది. కశ్మీరదేశపురాజయిన యనంతుని పట్టమహిషియగు సూర్యవతీదేవి చిత్తవినోదార్థము నానాకథామృతమయమైన యీ బృహత్కథాసారసంగ్రహమును బ్రాహ్మణోత్తముఁ డయిన రామదేవుని కుమారుఁడు సోమదేవుఁడనువాఁడు కథాసరిత్సాగరమను నీ యుద్గ్రంథమును సంస్కృతభాషలో విరచించెను. [1] ఈకథాసరిత్సాగరమును రచించిన సోమదేవుఁడును సంస్కృతభాషలో బృహత్కథనురచించిన క్షేమేంద్రుఁడును పైశాచీభాషలో వ్రాయఁబడిన మొదటి బృహత్కథనుండి తమ కథల సంగ్రహించితి మని చెప్పుకొనియున్నారు.

## బృహత్కథ.

ఈబృహత్కథను మొట్టమొదట శివుఁడు పార్వతికిం జెప్పెను. అట్లు చెప్పుచుండఁగా శివుని ప్రమథగణములలోనివాఁడగు పుష్పదంతుఁడు వినెను. ఈసంగతి పార్వతి తెలిసికొని భూమిమీఁద మనుష్యుడవై పుట్టుమని పుష్పదంతుని శపించెను. పుష్పదంతుఁడే వరరుచియను బ్రాహ్మణుఁడై పుట్టి మగధదేశమును బాలించెడు యోగనందునకు మంత్రియయ్యెను. ఈవరరుచియె కాత్యాయనుఁడను పేరిటఁబరగుచుండెను ఇతఁడు వింధ్యారణ్యమునంగలి కా

1 దీనినే చెన్నపురి క్రిస్టియన్ కాలేజిలో సంస్కృతప్రధానోపాధ్యాయులుగానుండిన బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయశాస్త్రి గారాంధ్రములోనికిఁ జక్కని శైలిని భాషాంతరీకరించినారు.

రణభూతియనుపిశాచరాజునకు బృహత్కథను వినుపించి శాపవిముక్తుఁడయ్యెను. ఈబృహత్కథ లక్షలక్షపరిమితిగల యేడుమహాకథలను గలిగియున్నదఁట ! పుష్పదంతునిమిత్రుఁడగు మాల్యవంతుఁడు శాపవశముచేత గుణాఢ్యుఁడుగాజనించి సాతవాహన మహారాజునకు మంత్రియయ్యెను. వరరుచికాణభూతికి బృహత్కథనుజెప్పిన సంగతివిని గుణాఢ్యుఁడు వింధ్యారణ్యమునకుఁ బోయి తనకాకథచెప్పి శాపవిముక్తుని చేయవలయునని కాణభూతినడిగెను. గుణాఢ్యునివంటి పండితుఁడు తనకు దర్శనమిచ్చినందుకు సంతసించి కాణభూతి వాని జన్మవృత్తాంతమును దెలుపవలసినదని యడిగెను. గుణాఢ్యపండితుఁడిటు చెప్పెను.

## గుణాఢ్యపండితునిచరిత్రము.

ప్రతిష్ఠానమునందు సుప్రతిష్ఠితమను పట్టణమున సోమశర్మయను బ్రాహ్మణోత్తముఁడు గలఁడు. వానికి వత్సుఁడనియు గుల్మకుఁడనియు నిరువురు పుత్త్రులును శ్రుతార్థయను నొకపుత్త్రికయునుగలరు. కాలక్రమమున నాబ్రాహ్మణుఁడు భార్యతోఁగూడ పరలోకగతుఁడయ్యెను. అతనికొమారులు చెల్లెలిని సంరక్షించుకొనుచు కాలముగడపుచుండిరి. ఆమె కాకస్మికముగా గర్భముగలిగెను. అన్యపురుషులెవ్వరువచ్చుట లేమింజేసి వత్సగుల్మకులలో నొకరిమీఁద నొకరికి ననుమానము గలిగియుండఁగాఁ గనిపెట్టి సోదరులను సమీపించి శ్రుతార్థ ''అన్నలారా, నావిషయమై మీకుపాపశంకవలదు; నాగరాజు వాసుకితమ్మునికి కీర్తిసేనుఁడని కుమారుఁడు గలఁడు; అతఁడొకనాఁడు నేనుస్నానమునకుఁ బోవుచుండఁగా చూచిమదన పరవశుఁడై తనకులగోత్రములు తెలిపి గాంధర్వవిధిచేతనన్ను వివాహమాడెనుకనుక నాకీగర్భముకలిగినది'' అనిచెప్పెను. అందునకేమి దృష్టాంతమని సోదరులు ప్రశ్నించిరి. అంతనామె యేకాంతమున నాగకుమారుని తలఁచుకొనెను. అతఁడునువచ్చి వారలతో మీచెల్లెలు పూర్వజన్మమున నొకయప్సరస; శాపవశముననిట్టి జన్మమెత్తినది; మీరునుశాపముచేత భూలోకమున జనించితిరి; ఈమెకుపుత్త్రుఁడుగలుగును; అంతటితో మీముఫ్వురకు శాపవిముక్తికలుగును, అనిచెప్పిపోయెను. పిమ్మట కొన్నిదినములకు



నామెకు పుత్త్రుఁడుగలిగెను. ఆవెంటనే ఆకాశవాణి ''వీఁడొక ప్రమథునియవతారము, బ్రాహ్మణుఁడు; వీనిపేరు గుణాఢ్యుఁడు'' అనిపలికెను. నేనే ఆగుణాఢ్యుఁడను. పిమ్మట కొంతకాలమునకు నాతల్లియు మామలును శాపవిముక్తులై దేహత్యాగముచేసిరి.తరువాత నేను బాల్యావస్థలోనుండియు ధైర్యము తెచ్చుకొని విద్యార్థినై దక్షిణాపథమునకుపోయి క్రమముగానచ్చట సర్వవిద్యలనుసేర్చికొని ప్రసిద్ధినిగాంచి స్వదేశమునకువచ్చితిని. ఒకనాఁడు నేను దేవేంద్రభవనము వంటిదైన రాజభవనమునకు పోయితిని. శిష్యులచేత ముందు వర్తమానము పంపియనుజ్ఞఁబడసి లోపలికిఁబోయి ఆస్థానమునందు దేవతలచేత నింద్రుడునుంబోలె శర్వవర్మాదులచే పరివృతుఁడై రత్నసింహాసనాసీనుఁడైయున్న సాతవాహనమహారాజును దర్శించితిని. వానిన్నాశీర్వదించి యుచితాసనమునఁగూరుచుంటిని.అర్ఘ్యవిధానమున రాజును నన్ను గౌరవించెను. అప్పుడుశర్వవర్మాదులు సాతవాహనునితో ''దేవా! ఈతఁడు సకలవిద్యా విశారదుఁడు; లోకమంతట ప్రసిద్ధికెక్కినవాఁడు, అందుచేతనే యీమహాత్మునికి గుణాఢ్యుఁడను పేరు సార్థకమైనది'' అని విన్నవించి నన్ను పొగడిరి. అంతట సాతవాహనుఁడు ప్రీతుఁడై అప్పుడేనన్ను సత్కరించి మంత్రినిగా నియమించెను. అదిమొదలుకొని నేను రాచకార్యములు విచారించుచు శిష్యులకు పాఠములుచెప్పుచు వివాహముచేసికొని సుఖముగానుంటిని. అనిచెప్పగా కాణభూతిసాతవాహనుని కాపేరెట్లుగలిగెనో చెప్పుమనియడిగెను. గుణాఢ్యుఁడిట్లు చెప్పఁదొడంగెను.

## సాతవాహనుని వృత్తాంతము.

దీపకర్ణి యనురాజు దక్షిణాపథమును పాలించుచుండెను. వానికి ప్రాణప్రియయై శక్తిమతియని భార్యయుండెను. ఆమె యొకరాత్రి సుఖశయ్యను నిద్రించియుండఁగా పాముకఱచెను. అందుచేత నామె మరణమునొందెను. అంతట దీపకర్ణి శోకముచేత నపుత్త్రకుఁడయ్యును బ్రహ్మచర్యవ్రత మవలంబిం

1 శాతవాహనుఁడని శాసనములలో వ్రాయబడియుండఁగా సాతవాహనుఁడని కథా సరిత్సాగరమున వ్రాయఁబడినది.

చెను. ఒకనాఁడు దీపకర్ణి మహారాజు తనవెనుక రాజ్యమేలుటకు తగినపుత్త్రుడు లేకపోయెనుగదాయని విచారించుచు నిద్రపోవఁగా స్వప్నములో నీశ్వరుఁడు ప్రత్యక్షమై "ఓరాజా! నీవు వేటకుఁబోయినప్పుడా యడవిలో సింహముమీఁద సవారిచేయుచు నొకబాలుఁడు కన్పడును; వానినింటికిఁ దెచ్చికొనుము. వాఁడే నీకుపుత్త్రుఁడగును" అనిచెప్పి యదృశ్యుఁడయ్యెను. అంతట రాజుమేల్కాని యాస్వప్నమును స్మరించుకొనుచు నమితానందమును బొందుచుండెను. ఒకనాఁడు రాజు మృగయావినోదార్థము మహారణ్యమునందు విహరించుచుండఁగా మధ్యాహ్నకాలమునందు సింహారూఢుఁడై బాలసూర్యునింబోలెఁ బ్రకాశించుచున్న యొకబాలుని నొకతామరకొలని యొడ్డునఁ జూచెను. వానింజూచినతోడనే రాజునకు స్వప్నము సంగతి జ్ఞప్తికివచ్చెను. సింహము బాలునిదించి నీళ్ళుత్రాఁగుటకై సరస్సులోనికిఁ బోవుచుండగా దీపకర్ణి యొకబాణమును ప్రయోగించి సింహమును బడవైచెను. వెంటనే సింహము మనుష్యుఁడయ్యెను. (?) అంతటా మనుష్యుఁడు "రాజా; నేను కుబేరుని మిత్రుఁడను,యక్షుఁడను; నాపేరు సాతుఁడు; నేనుపూర్వము గంగలోస్నానము చేయుచుండిన యొకముని కన్యకనుజూచి మదనబాణములకు గురియై యామునుగాంధర్వవిధిచేత వివాహమైతిని;మాదాంపత్యమునుజూచి ముని లోర్వంజాలక సింహములరగుదురుగాకయని శపింపఁగా మేమిరువురమును సింహదంపతులముగా జనించినారము; కాలక్రమమున నాభార్యగర్భిణియై యీపుత్త్రునికని కాలధర్మము నొందినది; నేనే వీని నితరసింహికలపాలఁతో బెంచితిని; నీబాణము తగులఁగానే నాశాపము తీఱినది; ఈమహాసత్త్వుని నీకిచ్చెదను; వీనిని పుత్త్రునిగా గ్రహింపుము; ఈప్రకారమే జరుగునని ఆర్యఋషులు విధించియున్నారు" అనిచెప్పి సాతుఁడంతర్హితుఁడయ్యెను. దీపకర్ణి యీబాలుని నింటికిఁ గొనివచ్చి సాతుఁడతనికి వాహనమైనందున సాతవాహనుఁడని పేరుపెట్టి కాలక్రమమునఁ బట్టాభిషిక్తునిఁజేసి తపస్సుకై యరణ్యమునకుఁ బోయెను. అదిమొదలుకొని సాతవాహనుఁడు భూమి నేలుచున్నాఁడు.



## రాణి శాతవాహనుని మూర్ఖుఁడని యవమానించుట.

సాతవాహనుఁడొకనాఁడు దేవీకృతోద్యానమునకు రాణులతోఁగూడ పోయి యచ్చటనందనవనమునందు కొంతసేపువిహరించి జలక్రీడార్థమై పద్మసరస్సులోఁబ్రవేశించెను. ఇట్లు రాజును రాణులును పద్మసరోవరముసొచ్చి యిచ్ఛావిలాసముగా నొండొరులమీఁద నీళ్లుచల్లుకొనుచుండగా శిరీషకుసుమసుకుమారాంగియగు నొకదేవి జలక్రీడచేబడలినదై తనపై రాజునీళ్లుచల్లుచుండనోపలేక ఆయనను సంస్కృతభాషలో "రాజన్ మాం మోదకైస్తాడయ" అనివేడికొనెను. దానినివిని వెంటనేరాజు విస్తారముగా మోదకములు (మిఠాయి) తెప్పించెను; అంతట రాణినవ్వి "రాజా నీళ్లలో మోదకములకు ప్రసక్తియేమి? "మా ఉదకైః, తాడయ" అనఁగా "నీళ్లతో కొట్టకుము" అనిగదా వేఁడితిని. "మాశబ్దోదకశబ్దముల సంధినిగూడ నెఱుంగకున్నాఁడవు; నీవేమి యింతమూర్ఖుండవుగానున్నాఁడవు" అని శబ్దశాస్త్రమునందు నిపుణరాలయిన యారాణిపలికిన పలుకులనువిని పరిజనులందఱును పక్కునవ్వసాగిరి. అంతట సాతవాహనుఁడు మనస్సులోమిగుల లజ్జాక్రాంతుఁడై జలక్రీడనువెంటనేమాని యుత్సాహములేక తన బ్రతుకునను విసుగుకొనుచు తనమందిరమునకుఁబోయెను. అతఁడు చింతాసక్తుఁడై భోజనముకూడవర్జించి యెవరేమియడిగినను పటమునందలిబొమ్మవలె మాఱుమాటలేకయుండెను. పాండిత్యమో మరణమో రెంటిలో నొక్కటియేశరణమని పాన్పునంబడి పరితపించుచుండెను. రాజుయొక్కదురవస్థనుగాంచి పరిజనులందఱును దిగులుపడియుండిరి. తరువాత నేనును శర్వవర్మయు క్రమముగానంతయుఁ దెలిసికొని రాజహంసుఁడను రాజరక్షకభటవర్గములోని వానినొకనిఁబిలిచి రాజిట్లుండుటకుఁ గారణమేమియనియడిగితిమి "ఏలినవారికింత మనోవ్యథమున్నెన్నడిట్లు కలిగియుండలేదు; విష్ణుశక్తి కూఁతురు తన యల్పపాండిత్యగర్వముచేత నేలినవారిని నవమానించినదని తక్కిన రాణులు చెప్పినారు" అనిచెప్పెను. ఈమాటకు మేము మిక్కిలి చింతించితిమి. నేను శర్వవర్మతో నిట్లంటిని. "రాజునకు వ్యాధియైన వైద్యులువచ్చి

యుండును; మనోవ్యాధియేని అందులకు కారణమగుపించదు; రాజ్యము నిష్కంటకముగానున్నది; శత్రువనుమాటయే లేదు; ప్రజలందఱు ననురక్తులై యున్నారు; ఎందును ఏలోపమును గానరాదు; ఆకస్మికముగా నితనికింత ఖేద మేల కలిగినది" మహామతియైన శర్వవర్మ నామాటల కిట్లు ప్రత్యుత్తరమిచ్చెను "మిత్రుఁడా! నేను తెలిసికొంటిని; తాను మూర్ఖుఁడైనందులకు రాజు దుఃఖించుచున్నాఁడు; ఇతఁడు తాను మూర్ఖుఁడనని తెలిసికొని తనకెన్నఁడయిన పాండిత్యమబ్బునాయని సార్వకాలము నపేక్షించుచుండును. ఆమూర్ఖతకై రాణి యవమానపఱచెనని యిప్పుడే గదా విన్నారము" ఇట్లొకరితో నొకర మాలోచించుకొని యింటికిఁబోయి మఱునాఁడు ప్రాతఃకాలమున రాజునగరునకు బోయితిమి. ఎవ్వరును లోనికి రాఁగూడదని యాజ్ఞయైయున్నను ఏదోయుపాయమును పన్ని మేమిరువురమును లోపలఁ బ్రవేశించితిమి. నేను రాజుదగ్గఱకుఁ బోయి కూరుచుండి "దేవా! ఏలయిట్లు నిష్కారణము ఖేదపడుచున్నాఁడవు" అని యడిగితినిగాని అతఁడు యథాప్రకారము ప్రత్యుత్తరము చెప్పక మౌనము వహించియుండెను. అంతట శర్వవర్మ దేవా! ఎట్లయినను నాకు విద్యలభించునాయని నీవు పూర్వమునన్నడిగియుంటివి; అందునిమిత్తమై నేను స్వప్నమాణవకుని చేసితిని; స్వప్నములో నాకాశమునుండి యొకకమలము రాలినది దానిని దివ్యకొమారుఁడొకఁడు వికసిల్లఁజేసెను. అంత నాకమలమునుండి తెల్లవలిపము దాల్చిన యొకదివ్యస్త్రీబయలువెడలి వెంటనే నీనోటఁబ్రవేశించినది. ఇట్లుకలగని మేలుకొంటిని; ఆమె సాక్షాత్తు సరస్వతియె నిస్సంశయముగా నీనోటఁబ్రవేశించినది" అని యిట్లద్భుతవాక్యమును పలికెను. ఈచల్లని పలుకులు చెవినిబడినతోడనె సాతవాహనుండు మౌనమువిడిచి సాభిప్రాయముగా అయ్యా! శ్రద్ధతో చదువు చెప్పినయెడల పురుషునికి పాండిత్య మెంతకాలమునకుగలుగునో చెప్పుము; విద్యలేక యీనాసిరిశోభింపకయున్నది; కొయ్యకుతొడవులంబోలె మూర్ఖునికి నైశ్వర్యములెందుకు?" అనిపలికెను. అంతట నేనును "లోకములో సర్వ విద్యలకును ముఖ్యమయినవ్యాకరణమును పండ్రెండుసంవత్సరములలో మనుష్యులు గ్రహింతురు; ఓదేవా! నేనావ్యాకరణమును నీకాఱుసంవత్సరములలో నేర్పెదను"



అనిపలికితిని. శర్వవర్మ నాపలుకులనువిని యీర్ష్యచేత "సుఖార్హుఁడయిన ప్రభు వింతకాల మెట్లువిద్యాభ్యాసక్లేశము ననుభవింపఁగలఁడు? ఓమహాప్రభూ! నేను నిన్నాఱుమాసములలో పండితునిగా నొనర్చెదను" అని గర్వముతోఁ బలికెను. ఈయసంభావ్యవచనమును విన్నతోడనే నాకురోషమువచ్చి ఇట్లు ప్రతిజ్ఞ చేసితిని.

## గుణాఢ్యశర్వవర్మలు ప్రతిజ్ఞచేయుట.

"ఆఱుమాసములలో నీవేగనుక ప్రభువునకు పాండిత్యము గలుగఁ జేయుదువేని నేను మనుష్య వ్యవహారములోనుండెడు సంస్కృత ప్రాకృత దేశభాషల మూడింటిని త్యజించినాడనని తెలిసికొనుము" ఈనాప్రతిజ్ఞనువిని శర్వవర్మ "నేనుగనుక నామాట ప్రకారము చేయలేకపోయితినా ద్వాదశవత్సరములు నీపాదరక్షలను నెత్తిమీఁద పెట్టుకొని మోసెదను" అని ప్రతి ప్రతిజ్ఞ చేసెను. ఇట్లిరువురము ప్రతిజ్ఞలుచేసి మాయిండ్లకుఁబోయితిమి. మాప్రతిజ్ఞలమూలమున స్వల్పకాలములోఁ దనకోరిక సిద్ధించునని రాజు తలంచి యూఱడిల్లియుండెను.

## శర్వవర్మ సాతవాహనుని విద్వాంసుని జేయుట.

అటుతరువాత శర్వవర్మ తానుజేసిన యసాధ్యప్రతిజ్ఞను దలంచుకొని దిగులుపడి పశ్చాత్తాపముపొంది తనకడగండ్లను పెండ్లామునతోఁ జెప్పుకొని విచారింపసాగెను. ఆమెయు మిక్కిలి చింతించి "నాథా! మనము చింతించిన ప్రయోజనములేదు; ఈయుపాయమునుండి మనలఁదప్పింప నొక్కకుమారస్వామి దక్క వేఱెవ్వరునులేరు" అనిచెప్పెను. అంతట శర్వవర్మయు నదేనిశ్చయముచేసి కుమారస్వామి గుడికింబోయి వాయుమాత్రభక్షుఁడై మౌనముదాల్చి దృఢనిశ్చయముతో తపస్సుచేసి యాదేవుని మెప్పించెను. అంతట కుమారదేవుఁడు వానికిప్రసన్నుఁడై కోరినవరంబులొసంగి యంతర్హితుఁడయ్యెను. శర్వవర్మయు కుమారస్వామి వరముచేత సిద్ధిమంతుఁడైవచ్చి తలంపు మాత్రముచేతనే సాతవాహనుని విద్యావిశారదుని గావించెను. పరమేశ్వరుని యనుగ్రహముండిన నేయసాధ్య

కార్యము సిద్ధింప నేరదని ప్రజలు తమలో దాము చెప్పుకొనుచు రాజునకుం గలిగిన యీయద్భుతవిద్యాలాభమును విని రాత్రియంతటను మహోత్సవములు చేసిరి. ఇంటింటిమీఁద నుత్సవంపుజెండాలను వాయుదేవుఁడు నృత్య మాడించుచుండెను. రాజును శర్వవర్మను గురువునుగా భావించి నమస్కరించి రాజార్హములయిన మణికనక వస్త్రాద్యలంకారములతోఁ బూజించి నర్మదాతీరమందలి భరుకచ్ఛప దేశమునకు (Broach) రాజునుజేసెను. సాతవాహనుఁడు తనకు విద్య లభించుటకు హేతువయినరాణిని విష్ణుశక్తికూఁతురిని స్వయముగా పట్టాభిషేకము చేసి పెఱరాణులపైని పట్టపు దేవినిగావించెను. "ఓ కాణభూతీ! ఇది సాతవాహనుని వృత్తాంతము. హరప్రోక్తమయిన బృహత్కథను నింక నాకుఁజెప్పుము. మన మిద్దఱమును శాపమోక్షమును పొందుదము గాక" అని గుణాఢ్యుఁడడిగెను. ఇట్లు గుణాఢ్యుఁడడుగగా దివ్యమయిన యీమహాకథను ఏడుకథలుగా కాణభూతి తనభాషలో నేచెప్పెను. ఆగుణాఢ్యపండితుఁడు మహారణ్యములో సిరాలేకపోవుటచేత విద్యాధరులు దానిని హరింపకుందురు గాకయని తన రక్తముతోనే ఏడుసంవత్సరములలో ఏడులక్షల గ్రంథముగా విరచించెను. గుణాఢ్యుడు రచియించిన యీమహాకథనుచూచి కాణభూతి శాప విముక్తుఁడై దివ్యగతి నిపొందెను. వానితోనున్న పిశాచము లితరములయినవి సహిత మాదివ్యకథను విని స్వర్గమునకుఁ బోయినవి.

## బృహత్కథను భూమిపై వ్యాపింపఁ జేయఁబూనుట.

ఈబృహత్కథను భూలోకములో స్థాపింపఁదలంచి శిష్యులప్రోత్సాహముచేత గుణాఢ్యుఁడు రసికుఁడయిన సాతవాహనుఁడొక్కఁడే యీకావ్యమును గైకొనఁదగినవాఁడని తనశిష్యులయిన గుణదేవనందిదేవులకా పుస్తకమునిచ్చి సాతవాహనునొద్దకుఁ బంపించెను. వారును సాతవాహన మహారాజును దర్శించి గుణాఢ్యుఁడు రచించిన బృహత్కథయనెడి గ్రంథమిదియని యాతనికి నివేదించిరి. వారుపిశాచరూపులుగను గ్రంథము యొక్కభాష పిశాచభాషగను గన్పట్టుటచేత నసూయతఁగాంచి "ఏడులక్షలుపరిమితి; భాషనీరసమైన పైశాచి; సిరా



రక్తము, నీ! ఇదియేమి పాడుకథ!" అనిపలికెను. అంతనాశిష్యులు జరిగిన మర్యాద చాలుననుకొని యాపొత్తమును గైకొని వచ్చినవారు వచ్చినట్లేపోయి జరిగినది జరిగినట్లు తమ గురువర్యునకుఁ దెలిపిరి. తనకుజరిగిన యవమానమునకు గుణాఢ్య పండితుఁడు మిక్కిలి ఖేదపడియెను.

## గుణాఢ్యుఁడు బృహత్కథను తగలంబెట్టుట.

తరువాత గుణాఢ్యుఁడు కొంతదూరమున నుండిన యొకపర్వతమునకు శిష్యవర్గముతోఁబోయి యేకాంతమైన రమ్యప్రదేశమునందు నగ్నికుండమును గావించి కూర్చుండి తనశిష్యులు కన్నీళ్లతో వీక్షించుచుండఁగా ఒక్కొక్కయాకుగాచదివి మృగములకును పక్షులకును వినిపించి తనశిష్యులకొఱకు నత్యంత ప్రియమైన లక్షగ్రంథాత్మకమయిన నరవాహనదత్తచరిత్రమను కథనుదక్క దక్కిన యాఱుకథలను ఆయగ్నికుండములోఁ బడవైచి కాల్చివేసెను. అట్లు చదువుచు కాల్చివేయుచుండ సారంగవరాహమహిషాది సకలజంతువులు మేఁతలు మాని కన్నీళ్లు విడుచుచు నిటునటు చలింపక యేకాగ్రముగా వినుచుండినవి.

## గుణాఢ్యుఁడు బృహత్కథను సాతవాహనునకిచ్చుట.

ఇంతలో సాతవాహనుఁడు స్వస్థుఁడయ్యెను. అందులకు కారణము నీరసమాంస భోజనమని వైద్యులు చెప్పిరి. అంతట రాజు వంటవాండ్రను బిలుపించి యదలింపఁగా వారలుతమకట్టి మాంసమును వేటకాండ్రు తెచ్చియిచ్చిరని పలికిరి. వేటకాండ్రను బిలుపించి యడుగగా "మహాప్రభూ! ఇక్కడ యీపర్వతములో నొక్కబ్రాహ్మణుఁడొక్కొక్కపత్రమును చదివి నిప్పులో వేయుచుండుటచేత నక్కడకువచ్చి సకలప్రాణులును మేఁతలుమాని వినుచున్నవిగాని యవతలికిపోవు; అందుచేత నాకలివలన వానిమాంసమెండి పోయియున్నది." అని మొఱలెత్తి విన్నవించికొనిరి. వారిమాటలనువిని యతఁడచ్చెరువునొంది కుతూహలముచేత స్వయముగా గుణాఢ్యుఁడున్న చోటికిపోయి శమింపఁగా మిగిలిన శాపాగ్ని ధూమికలచేతనుంబోలె నరణ్యావాసమువలన నైనజటలచేత నంతట సమాకీర్ణుఁడై సబాష్పములైన మృగముల మధ్యనున్న వానిని గుణాఢ్య

మహాకవిని చూచి నమస్కరించి యావృత్తాంతము నంతయుఁ బ్రశ్నించి పుష్పదంతుని శాపము మొదలుకొని కథావతారమునంతయు భూతభాషలోఁ జెప్పగా వానివలన నంతయుఁ దెలిసికొనియెను.

గుణాఢ్యుని ప్రమథావతారమని సాతవాహనుఁడు తెలిసికొని వానిపాదములకు మ్రొక్కి హారముఖోద్గతమైన యా దివ్యకథనంతయుఁ దనకు దయచేయుమని వేడికొనియెను. అంతట గుణాఢ్యుఁడు 'ఓరాజా ఆఱులక్షలగ్రంథమయిన యాఱుకథలను కాల్చివేసితిని; ఇదిలక్షగ్రంథము; ఆకథలలో నిదియొక్కటియే మిగిలియున్నది; పుచ్చుకొమ్ము; నాశిష్యులు నీతోఁ గూడవచ్చి దానిని వివరించి చెప్పఁగలరు'' అనిచెప్పి రాజునువీడ్కొని యోగమహిమచేత దేహమును విడచి గుణాఢ్యపండితుఁడు శాపవిముక్తుఁడై తనదివ్యపదమును బొందెను. అట్లు గుణాఢ్యుఁడొసంగిన దానిని బృహత్కథయను పేరిటి యానరవాహనదత్తచరిత్రమును గ్రహించి రాజు తనపట్టణముచేరి గుణాఢ్యుని శిష్యులయిన గుణదేవనందిదేవులను మణికనక వస్తువాహనాదులతోఁ బూజించెను. ఆశిష్యులతోఁగూడ యాకథను విభజించి యాభూతభాషలోనే కథావతారమును దెలుపుటకై యీ కథాపీఠమును రచియించెను. [1]

ఈబృహత్కథను సుబంధకవి వాసవదత్తలోను, బాణకవి కాదంబరిలోను దండిమహాకవి కావ్యాదర్శమునందును ప్రశంసించియున్నారు. కాళిదాసుకూడ మేఘసందేశములో నిందలికథం దడవియున్నాఁడు. మఱియు నాగానందప్రియదర్శికా రత్నావళీముద్రారాక్షసాది నాటకములకును, కాదంబర్యాదికథలకును, ఈకథయె మూలముగానున్నది.

## ఈగాథయొక్క ప్రయోజనము.

కొండొక ప్రయోజనమాసించి కథాసరిత్సాగరమునఁ దెలుపంబడి మనోహరముగానుండిన పైగాథను సంగ్రహముగాఁ దెలిపియుంటిమి. ఈగాథ కాలనిర్ణయమున కొంతమాత్రమును దోడ్పడకున్నను ఆకాలమునందలి ప్రజలమత

1 కథాసరిత్సాగరము కథాపీఠలంబకమును జూడుఁడు.



విశ్వాసములను సాంఘికస్థితిని దెలుపుటకుమాత్రము చాలియున్నది. ఆకాలమునందు శైవమత మంకురించి ప్రజలలో వ్యాపించుచున్నది. స్వప్నములయందును, జన్మాంతరములయందును, దేవతలయందును మూఢవిశ్వాసము మెండుగాఁ గలదు. గుణాఢ్యునియొక్కయు, సాతవాహనుని యొక్కయు జన్మాదిక వృత్తాంతమునుబట్టి ఆర్యుల కనార్యులకు సంబంధ బాంధవ్యములు వెలయుచున్నవనియు సంకరసంతానము వర్ధిల్లుచున్నదనియు బోధపడకమానదు. గుణాఢ్యుఁడు బ్రాహ్మణ స్త్రీకిని నాగకుమారునకును జనించియు శూద్రుఁడుగాఁగాని చండాలుఁడుగాఁగాని పరిగణింపఁబడక తనవిద్యాప్రభావముచేత బ్రాహ్మణుఁడుగానే పరిగణింపఁ బడుచుండెను. ఇట్టే యార్యబ్రాహ్మణ సంతతి యంతయుసాంకర్యమును జెందుచుండెను. ఆంధ్రులుకూడ మిశ్రజాతివారని సాతవాహనుని జన్మాదికమును దెలుపుగాథయె వేనోళ్లఁ జాటుచున్నది. మఱియు నొక్కవిశేషముగలదు. సాతవాహనుఁడు తొలుత విద్యావిహీనుఁడైయుండి విద్యావతియైన పట్టమహిషిచేత నధిక్షేపింపఁబడి సిగ్గుఁజెంది విద్యావంతుఁడగుటకుఁ బ్రయత్నించి గుణాఢ్యశర్వవర్మలకృషి చేతఁ బండితుఁడై విద్యావతియైన పట్టమహిషిపట్ల కృతజ్ఞతను జూపి యాదరించిన విధమెంత మోదావహముగానున్నది! ఈవిషయ మొక్కటియే స్త్రీవిద్యయొక్క ప్రభావమును వేనోళ్లఁ జాటుచున్నది. మనయాంధ్ర దేశములోఁ బ్రాచీనకాలమున స్త్రీవిద్యమిక్కిలి గౌరవింపఁ బడుచుండెననుటకీ సాత వాహనుని చరిత్రమే ప్రబలసాక్ష్యముగానున్నది. అనార్యులయిన జనసామాన్యముయొక్క భాషను వృద్ధిపొందింపఁబూని ప్రయత్నించిన విధమును, ఆకాలమునందలి రాజులును మంత్రులును జనసామాన్యభాషను నాదరింపుచు గ్రంథములు వ్రాయుచు వ్రాయించి వ్రాసినవారిని సత్కరించుచుండినట్లును, ఆర్యులాభాషయందును, తద్భాషాగ్రంథములయందును అసూయతగలిగి యుండినట్లును బృహత్కథ వృత్తాంతమునుబట్టి మనకు సులభముగా బోధపడుచున్నది. ఈ మొదటి శాతవాహనునకును పురాణములలోఁ జేర్కొనంబడిన శ్రీముఖశాతవాహనునకును నడుమ ఖారవేలునకుఁ దోడ్పడి మగధరాజగు పుష్యమిత్రునితో యుద్ధముచేసిన శాతకర్ణి యను వాని పేరు దక్కమఱియొక యాంధ్రరాజు పేరు

వినంబడకయున్నది. దక్షిణాపథము నేలినవాఁడును ఈ మొదటి శాతవాహనుని తండ్రియును అగు దీపకర్ణి మహారాజు ఆంధ్రవిష్ణు వంశోద్భవుఁడైయుండవలయును. అయిననింకను విచారింపవలయును. ఇంక శాతవాహన (శాలివాహన) వంశజులయిన యాంధ్రరాజుల చరిత్రమునకుఁ బోవుదము.



## ఏడవ ప్రకరణము.

## శాతవాహనవంశము.

### శ్రీ ముఖశాతవాహనుఁడు.

(క్రీ. పూ. 23 మొదలుకొని ౨౦ పఱకు)

ఏదీపి నేఁ డాంగ్లేయనాగరికతకు జన్మభూమియై, భూమండలములోని యేఁబదికోట్లప్రజలయాయురైశ్వర్యభారమును భారమని యెంచక పోషింపఁ గంకణముగట్టుకొని తల్లిశిశువునుంబోలె గర్భమునధరించి, సూర్యుఁడస్తమింపని రాష్ట్రమునకు మూలవిరాట్టుగనున్నదో, అట్టి తెలిదీవి (బ్రిటను)లోని యాదిమ ప్రజలయిన బ్రిటనులు రెండువేల సంవత్సరములక్రిందట కొండకోయలరీతి ననాగరికులైనను స్వేచ్ఛగానుండి స్వపరిపాలనముఁ జేసికొనుచుండ యూరోపుఖండముయొక్క ప్రాగ్దేశముల నప్రతిమానప్రతాపమునుజూపుచు దిగ్విజయయాత్రలుసలుపుచు కీర్తికాముఁడై విహరించుచు బ్రిటనులస్వాతంత్ర్య మపహరింతునని భుజాస్ఫాలనముసేయుచు వారిజన్మభూమిని మ్రింగివేయుదునని యువ్విళులూరుచుండిన "జూలియస్ సీజర్" అను రోమకచక్రవర్తి వలెఁ గాక, ఆకాలమునందే జంబూద్వీపముమధ్యను, కృష్ణాగోదావరీనదులకును పూర్వపశ్చిమసముద్రములకును నడుమ యశోభరితమై విస్తరిల్లుచుండిన యాంధ్రరాజ్యమున కభిషిక్తుఁడయిన శ్రీముఖశాతవాహనుఁడు, భరతఖండమునకు శిరోభూషణముగా నుండిన మగధరాజ్యము తొంటిప్రాభవమును బోఁగొట్టుకొని, యవన శకపహ్లవాది శత్రువులచేఁ జుట్టుకొనఁబడి, యంతఃకలహములచే జీవకళను గోల్పోయి, విపద్దశనొంది యుండుటనుజూచి, యుపేక్షించినఁ దనరాజ్యమునకెక్కుడ ప్రమాదముగలుగునో యని మగధరాజ్యముపై దాడివెడలి, రాజునంతఃపురవాసునిగఁ జేసి నిరంకుశాధికారమును నెఱపుచుండిన బ్రాహ్మణమంత్రియగు సుశర్మను జంపి, మగ

ధరాజ్యము నాక్రమించుకొని, దేశమునందలి యల్లరుల మాన్పి, రాజ ప్రతినిధిని నొక్కనిని నియమించి, తనరాజధాని యగు ధాన్యకటకమునకు మరలివచ్చెను. ఇందునుగూర్చి చరిత్రకారులు భిన్నాభిప్రాయములు గలిగియుండుటచేత నీయంశమును సహేతుకముగా సమర్థింపకున్న పక్షమున నీవాక్యము గొంతవఱకుఁ బరిహాసపాత్రముగాఁ దోఁచవచ్చును. కాణ్వాయనుఁడగు సుశర్మను జంపి మగధరాజ్యము నాక్రమించినవాఁడు శ్రీశుకుఁడని మత్స్యపురాణమును, శ్రీప్రకుఁడని విష్ణుపురాణమును బ్రహ్మాండ పురాణమును,సింధుకుఁడని వాయు పురాణమును, పేరు చెప్పక వృషలుండని మాత్రము భాగవతపురాణమును బేర్కొని శ్రీముఖుని పేరెత్తకయుండుటచేతను, ప్రాచీన హిందూదేశ చరిత్రమును వ్రాసిన విన్సెంటు. ఏ. స్మిత్తుగారు సుశర్మను జంపినవాఁడు శ్రీముఖుఁడుగాక కుంతల శాతకర్ణిగాని, శాతశాతకర్ణిగాని, పులమాయిగానినై యుండురనియు, క్రీస్తునకుఁబూర్వము ౨౬వసంవత్సరమున కాణ్వవంశ మంతరించియుండెనని యొప్పుకొన వచ్చుననియు మగధరాజ్యమును బాలించిన శుంగరాజులలోఁ గడపటివారు పేరునకుమాత్రము రాజులుగానుండి పీష్వాల చేతులలోని మహారాష్ట్ర రాజులవలె బ్రాహ్మణ మంత్రుల చేతులలో బొమ్మలవలెనున్న మాట వాస్తవమేయైనను శుంగరాజులలోఁ బదియవవాఁడగు దేవభూతి కాణ్వాయన బ్రాహ్మణుఁడగు వాసుదేవునిచేఁ జంపఁబడియెనని పురాణములయందును బాణకవి విరచితమగు హర్ష చరిత్రమునందును స్పష్టముగఁ జెప్పఁబడియున్నందున శుంగవంశముతో కాణ్వవంశము సమకాలీనమని చెప్పెడి డాక్టరు భాండార్కరుగారి వాదము[1] గ్రాహ్యముకాదనియు వ్రాసియుండుటచేతను శ్రీముఖునిగూర్చి కొంచెము చర్చింపవలసియున్నది. పురాణములలోని యాంధ్రరాజుల నామములును శాసనములలోని నామములును భేదములేక సరిపోయినవగుటచేతను పురాణములలోఁ బ్రాచీనపురాణమయిన మత్స్యపురాణము శ్రీశుకుఁడని చెప్పియుండుటచేతను, దేవనాగరలిపిలో శకార మకారములకు నీషన్మాత్రమే భేదముగలిగియుండుటచేత లేఖకులు శ్రీముఖుఁ

1. Mr. V. A. Smith's Early History of India. pp.193-194.



డనుటకుఁ శ్రీశుకుఁడని, భ్రమప్రమాదదోషమున వ్రాసియుండవచ్చునని భాండార్కర్ పండితుఁడు చెప్పినమాటయుక్తి యుక్తముగనుండుటచేతను శ్రీశుకుఁడే శ్రీముఖుఁడని చెప్పి నందువలనఁ బ్రత్యవాయమేమియులేదు. కాణ్వునిఁ జంపినవాఁడు పురాణములలోఁ జెప్పఁబడిన పేరులుగలవారిని శ్రీముఖునిగూడ స్మిత్తుగారు నిరాకరించి మఱిముగ్గురి పేరులు చెప్పి వారిలో నెవ్వఁడో యొకఁడైయుండునని తలంచినను శ్రీశుకుఁడే శ్రీముఖుఁడని యొప్పుకొని యున్నారు[1] సుశర్మను జంపినవాఁడు శ్రీశుకుఁడని పురాణము లుద్ఘోషింపుచుండఁగాఁ గాదని చెప్పుటకును, తాము పేర్కొనిన ముగ్గురిలో నొకడై యుండునని చెప్పుటకును, స్మిత్తుగారు హేతువులను గనఁబఱచియుండలేదు. ఇంతియగాక యాంధ్ర భృత్యవంశములో శ్రీముఖుఁడు మొదటివాఁడని కూడ చెప్పిరి. పురాణములలోఁ బేర్కొనఁ బడినవారిలో నీతఁడు మొదటివాఁడనియే మేమునుఅంగీకరింతుముగాని యీతనికిఁ బూర్వమాంధ్ర రాజులులేరని యూహించి చెప్పెడు మాటలుమాత్రము విశ్వసింపఁ దగినవికావు. శుంగవంశజులు క్రీ॥ పూ॥ ౧౮౫వ సంవత్సరము మొదలుకొని ౧౧౨ సంవత్సరములనఁగా ౭౩ వ సంవత్సరము వఱకుఁ బరిపాలించిరని చరిత్రకారులందఱు నంగీకరించిరి పురాణములలోఁ గాణ్వాయనులయిన నలుగురు బ్రాహ్మణ పాలకులకుఁ జెప్పిన ౪౫ సంవత్సరములును శుంగవంశజులకుఁ జెప్పిన ౧౧౨ సంవత్సరములలో నిమిడియున్నవని భాండార్కర్ గారు చెప్పినదానిని స్మిత్తుగారాక్షేపించి యున్నారుగాని కొంచెము విమర్శదృష్టితోఁ జూచిన పక్షమున భాండార్కరుగారూహించినదే సహేతుకముగాఁ గన్పట్టుచున్నది. ఎందుకన "చత్వారశ్శృంగభృత్యాస్తే నృపాః కాణ్వాయనాద్విజాః" యని కాణ్వాయనద్విజులను శృంగభృత్యులనియు "కాణ్వాయనస్థ (నంత) తో భృత్యాః సుశర్మాణం ప్రసహ్యాతం, శృంగాణాం చైవయచ్ఛేషం క్షపయిత్వా బలంతదా" యని కాణ్వాయనులను మాత్రమేగాక శృంగవంశజుల శేషించిన యధికారమునుగూడ[సింధుకుఁడను పేరుగల యాంధ్రభృత్యుఁడు

1. Ibid. p. 193.

(శ్రీముఖుఁడు)] పెఱికివేసెనని వాయుపురాణమునందు చెప్పియుండుట చేత శృంగవంశజులు బలహీనులయినందున కాణ్వాయనద్విజులిటీవలినవీనకాలమునందలి పీష్వాలవలెఁ బేరునకు శుంగరాజుల గద్దెపైనుంచి సర్వాధికారమును దాము పూని పరిపాలించుచుండిరని యూహించునది యుక్తియుక్తముగానె గన్పట్టుచున్నదిగాని యాక్షేపనీయముగఁ గన్పట్టదు. ఇంతియగాక కాణ్వాయనులు బ్రాహ్మణులగుట చేత వారు కేవలమును రాజ్యాధిపత్యము వహించి పాలించిరని చెప్పట యప్పటి కాచార విరుద్ధముగఁ గన్పట్టుచున్నది. మఱియు పురాణముల యందిట్లు చెప్పినది యీ కాణ్వవంశమునుగూర్చియే కాని మఱియేవంశమునుగూర్చియుఁ జెప్పియుండకపోవుట చేత తప్పక శ్రీముఖుఁడు క్రీ. పూ. 23వ సంవత్సరముననే మగధరాజ్యమును జయించెననుట హేతుయుక్తముగఁ గన్పట్టుచున్నది. మఱియును శ్రీముఖుఁడు కల్పిత పురుషుఁడు గాఁడు. వీని పేరుగల శాసనములు రెండు గానంబడుచున్నవి. అందొకటి రాజధానీనగరమగు ధాన్యకటకములోనిస్తూపములోను [1](అమరావతీస్తూపము) రెండవది పశ్చిమాంధ్రదేశము (మహారాష్ట్రము)లోని నానాఘట్టములోని యొకగుహలోను గలవు. [2]అమరావతీ స్తూపములోని శాసనపట్లున్నది. "Rano Siri-Sivamaka Sadasa paniyagharikasaha" అనఁగా సిరిసివమకరాజుయొక్క పానీయశాలకు నధికారిగానున్నవానిదాన మనియర్థము. జున్నారునుండి కొంకణమునకుఁ బోవుబాటఁమీఁదనుండు నానాఘట్టముయొక్క శిరోభాగమునందు బాటసారుల విశ్రాంతికై తొలుపఁబడిన యొకగుహలో నెదుటిగోడపైన ఆఱు విగ్రహములు చెక్కఁబడి వానిపైన పేరులు వ్రాయఁబడియున్నవి. ఆవిగ్రహము లిప్పుడు చాలవఱకు శిథిలములై యున్నవిగాని పేరులుమాత్రము నిలిచియున్నవి. ఈగుహలోనే వేదశ్రీయను రాజుయొక్క శాసనమున్నది

1. J. Burgess- The Buddhist stupas of Amaravati and Jaggayyapeta p. 61.

2. J. R. A. S Vol IV p. 287, Jour Bom. branch Roy. As. soc Vol XII p. 404 and Vol XIIIp. 310, 312.



"౧ రాయసిముక సాతవాహనో; ౨ దేవినాయనికాయ రాణ్ణోచసిరిసాతకానీనో; 3 కుమారోభాయా; ౪ మహారాఠిగానాకాయిరో; ౫ కుమారోహాకుసిరి; ౬ కుమారోసాతవాహనో;" వీనిలో మొదటఁ జేర్కొనఁబడిన రాయసిముక యనుపేరును అమరావతీస్తూపములోని "రాణోసిరిసివమక" యనుపేరును నొక్కనిపేరులే యైయుండవచ్చునని డాక్టరు హాల్ టజ్ గారు చెప్పినది సముచితముగానున్నది. సిముక, సివమకశబ్దములు శ్రీముఖశబ్దయొక్క ప్రాకృతరూపములుగాని వేఱొండుగావు. కాఁబట్టి యీపైనుదాహరించిన ప్రమాణములనుబట్టి యాంధ్రభృత్యవంశమునందు శ్రీముఖుఁడను రాజుగలఁడనియు, అతఁడు ధాన్యకటకమును రాజధానిగఁ జేసికొని యాంధ్రదేశమును బాలించుచుండెననియు, అతఁడే మగధదేశముపై దండెత్తి కాణ్వాయనులను శుంగులను జయించి రాజ్యమును గైకొనియెననియు నిస్సంశయముగా విస్పష్టముగాఁ జెప్పవచ్చును. ఇంకొక విశేషముగలదు. శ్రీముఖశాతవాహనుఁడని చెప్పఁబడియుండుటచేత నితఁడు తప్పక శాతవాహనవంశజుఁడని చెప్పకయ చెప్పుచున్నది. మొదటి శాతవాహనునకును ఈ శ్రీముఖశాతవాహనునకును నడుమ రాజులెందఱో కొందఱుండియుండక తీఱదని శ్రీముఖశాతవాహనుఁడనుపేరే వేనోళ్ల ఘోషించుచున్నది. కనుకనితఁడు శాతవాహనవంశమునకు మూలపురుషుఁడు కాఁడు. పూర్వప్రకరణమునందు మేముసూచించినట్లుగ సాతవాహనుఁడే శాతవాహనవంశమునకు మూలపురుషుఁడై యున్నాఁడు. శ్రీముఖుఁడు ౨౩ సంవత్సరములు పరిపాలనము చేసి యున్నట్లు వాయుమత్స్యపురాణములలోఁ జేర్కొనఁబడియుండెనుగావున క్రీ. పూ. ౫౦వ సంవత్సరము వఱకును బరిపాలనము చేసియుండవచ్చును.

## కృష్ణశాతవాహనుఁడు.

(క్రీ॥ పూ॥ ౫౦ మొదలుకొని ౪౦ వఱకు.)

శ్రీముఖునితరువాత రాజ్యాధిపత్యము వహించినవాఁడు కృష్ణుఁడని పురాణములన్నియు భిన్నాభిప్రాయములులేక యైకకంఠ్యముగాఁ జేర్కొనుచున్న

వి. ఇతఁడు పది సంవత్సరములు మాత్రమే రాజ్యము చేసెనని వాయుపురాణమును ౧౮ సంవత్సరములని మత్స్యపురాణమును చెప్పుచున్నవి. వీని పేరుదాహరించిన శాసనమొకటి నాసికపట్టణ సమీపమునందలి యొక చిన్న గుహాలోఁ గన్పట్టుచున్నది. శాతవాహన వంశజుఁడయిన కృష్ణుఁడను రాజుయొక్క సైన్యాధికారులలో నొకనిచే నాగుహ త్రవ్వింపఁబడినదని యందు వ్రాయఁబడియుండెను.[1] కాని యితఁడు శాతవాహన రాజకుటుంబములోఁ జేరిన యొక సామాన్యుఁడే గాని రాజు గాఁడనియు, ఇతనికి రాజబిరుదావళులేవియును లేవనియు, ఈకృష్ణుఁడే పురాణములలో నాంధ్రభృత్య వంశములో రెండవవాఁడుగాఁ జేర్పఁబడిన కృష్ణుఁడేయని యనేకు లభిప్రాయ పడుచున్నారుగాని కేవలము పొరఁబాటనియు, ఎందుకనఁ నప్పటికి నాంధ్రులు దక్షిణాపథమునకు వచ్చియుండలేదనియు దక్షిణహిందూదేశపు నాణెముల చరిత్రమును వ్రాసిన సర్ వాల్టరు ఎల్లియాట్ గారు వ్రాయుచున్నారు.[2] వీరివాద మెంతమాత్రమును విశ్వసింపఁ దగినది కాదు.

క్రీస్తునకుఁ బూర్వము మూఁడుశతాబ్దములక్రిందట ద్రావిడు లాంధ్రులని కాళింగులని యిరుతెగలుగా నేర్పడి గంగానదీముఖద్వారమున నివసించుచుండి యశోకునికాలమునందు రాజానుగళిగియుండు దొరతనమునకు వశులై మౌర్యరాజుల యనంతరము సంభవించిన రాజ్యకల్లోలమును బురస్కరించుకొని మగధరాజ్యము నాక్రమించుకొని యుశకనులను విదేశరాజులతోఁ బోరుపడలేక మొదటిశతాబ్దమున నాకాలమునందలి యాచారమును బట్టి యాంధ్రులును కాళింగులును స్వకుటుంబస్వపరివార సమేతముగా సముద్రతీరము వెంబడిని దక్షిణమునకు వచ్చిరనియు, వారిలో కాళింగులు గోదావరినదికి నుత్తరభాగమున నిలిచియుండిరనియు, ఆంధ్రులు ''పరకాడ్ అంధార'' యను చిల్కసరస్సుయొక్క యొడ్డులను గొంతకాలముండి తరువాత బయలుదేఱివచ్చి కృష్ణాతీరమున నాంధ్రరాజ్యమును స్థాపించి ధాన్యకటకమును రాజధానిగఁ జేసికొని బహుకాలము పాలించిరనియు, వీరు గంగాతీరమున బ్రప్రథమమున నివసించిన ప్రదేశము ''మాల్భూమి (మాలభూమి) నుండివచ్చినవారగుటచేతనే పంచమజాతివారికి మాలలను పేరు నిలిచియున్నదనియు, ఆంధ్రభృత్యరాజులలో గోతమిపుత్ర శాతకర్ణియొక్క తల్లియగు గోతమియు, గోతమిపుత్రశాతకర్ణి భార్యయగు వాసిష్ఠియు సుప్రసిద్ధులయిన రాణులగావున వారిపట్లగల గౌరవాతిశయము చేత గోదావరిమండలములోని గోదావరినదియొక్క ముఖ్యములయిన రెండుశాఖలను గౌతమియనియు, వాసిష్ఠియనియు వారి పేరులే పెట్టఁబడినవనియు, అశోకునికాలమునందు వీరుగంగాతీరమున నుండుటచేత నాకాలమునాటిలిపి వీరికిఁ దెలిసియేయున్నదిగనుక వీరిప్పటికి వచ్చినపుడు వీరిశాసనముల యందాలిపినే వాడుచు వచ్చిరని శాసనములు దెలుపుచున్నవనియు వ్రాసియున్నారు.

(1) No. 6, Nasik Inscriptions vol, VII Jour B. B. R. A S. and, p 338 Tran's, Oriental Congress 1874

(2) Sir Walter Elliots Numismata Orientalia p. 13.



వీరివాదము భ్రమైకమూలమైనదిగాని సహేతుకమైనది కాదు. అశోకుని కాలమునకుఁ బూర్వమె కాళింగులు మహానదికిని గోదావరికి నడుమనుండు దేశముననున్నవారుగాని గంగానదీ ముఖద్వార ప్రదేశముననున్నట్లుగఁ బ్రమాణముగానరాదు. అశోకుఁడు క్రీ. పూ. ౨౬౧వ సంవత్సరమునఁ గాళింగులను జయించి వారిదేశము నాక్రమించియుఁ గాళింగులకుఁ దానుగలిగించిన మహాసంక్షోభమునకు పశ్చాత్తప్తుఁడై కాళింగులయెడలను, సరిహద్దులనుండెడు తదితరజాతులయెడలను సౌహార్ద్రభావము గలిగియుండి మహామాత్రులనంబడెడు రాజకీయాధికారులు వర్తింపవలసిన విధులనుగుఱించి భువనేశ్వరమునకు సమీపమున ''ధౌళి'' యను ప్రదేశమునందును, గంజామునకుఁ బడమట జౌగడా యను ప్రదేశమునందును శాసనములను వ్రాయించెను.[1] గంగానదీ ముఖద్వారమునందే

1. Indian Antiquary Vol V. The Kalinga Edicts, pp. 82. 102; Dr. Buhler's Translations in Burgess's Amaravati, pp. 125-131; Rulers of India Series-Asoka. pp. 134-138. Mr Smith's Early History of India p.156. See also the map of the Empire of Asoka in the same book.

కాళింగులుండినయెడల నచ్చోటనే యాశాసనములను వ్రాయించి యుండును. ఈయొక్కయంశమే కాళింగు లచ్చటలేరని వేనోళ్లఁజాటఁగలదు. మఱియును క్రీ. పూ. రెండవశతాబ్ద మధ్యముననుండిన ఖారవేలుఁడు వ్రాయించిన హాతిగంఫాగుహాలోని శాసనమున నాంధ్రరాజగు శాతకర్ణిని పశ్చిమదేశమునందు బెట్టియుండుటగూడ నాంధ్రులుగాని కాళింగులుగాని గంగానదీ ముఖద్వార ప్రదేశమున నుండలేదని ధ్రువపఱచుచున్నది. ఆంధ్రదేశము కళింగదేశమునకుఁ బశ్చిమమునను దక్షిణమునను వ్యాపించి యుండుటచేత నాంధ్రరాజగు శాతకర్ణిని పశ్చిమదేశమునందుఁ బెట్టినది యుచితముగానేయున్నది.

ఆంధ్రులు మాల్భూము (Malbhum in Midnapur District) నుండి వచ్చినవారనుటకు మాలలపేరు దృష్టాంతముగాఁ జూపినది వింతగాఁ గన్పట్టకమానదు. కర్నలు విల్ఫర్డుగారు కర్ణశబ్దమును గైకొని క్రీస్తుశకము పంద్రెండవ శతాబ్దమునందుండిన శ్రీకర్ణదేవుఁడు మొదలుగాగల కాలచుర్యరాజులకును అంతకుఁ బూర్వము పంద్రెండు శతాబ్దములక్రిందటనున్న యాంధ్ర శాతకర్ణులకును ముడివెట్టి వృథాయాసము పడినరీతిని వీరును మాలశబ్దమును మాల్భూమికి ముడిపెట్టుచుండిరి. మాలలు మాలవర్తులను వారిని వాయుమత్స్యపురాణములు మధ్యదేశమునందలి జాతులలోఁ జేర్చియున్నవనియు, మార్కండేయ పురాణముయొక్క వ్రాఁతప్రతిలో మాలదాసులును, గవరవర్తులును పూర్వజాతులలో నుదాహరింపఁబడినను అచ్చుప్రతిలోమాత్రము మానదాసులనియు, మానవర్తికులనియు సవరింపఁబడి యుండెననియు, విల్ఫర్డుగారు మాల మిడ్నపూరు (మిధునపురము)లోని మాల్భూమికి సంబంధించినట్లుగాఁ జెప్పుచున్నారుగాని మాల్భూమి మేఘదూతలో సూచించిన ప్రకారము చటీష్ఘురులో నున్నదని నేను తలంచుచున్నానని ఎచ్. ఎచ్. విల్సనుగారు వ్రాయుచున్నారు.[1] తెలుఁగుపరయాల క

1. Vish Pur vol ii pp 156-166; See Prof H. H. Wilson's Essays Analitical sc vol II p 329, note on verse 99 of the Translation of Meghaduta.



న్వయించెడి మాలశబ్దముయొక్క వ్యుత్పత్తి సందిగ్ధముగా నున్నదనియు, అఱవములోనలుపునకు మాలశబ్ద ముపయోగింపఁబడు చున్నదిగాని తెలుఁగులో నుపయోగింపఁబడు చుండలేదనియు, మాలలనియెడి యనాగరికజాతివారిని పురాణములు పేర్కొను చున్నవిగాని వారినివాసస్థానము సందిగ్ధముగా నున్నదనియుఁ పురాణములలోఁ బేర్కొనఁబడినపేరు రాజమహాలుకొండలలో నివసించెడు నాదిమవాసులయిన మాలయులను కొండజాతుల కన్వయించుననియు, దానిని తెలుఁగు పరయాలకు ముడివెట్టుట సాహసమని బిషప్ కాల్డువెల్లు దొరగారు వ్రాసియున్నారు.[1]

కాఁబట్టియిదియును వారివాదమున కంతప్రయోజనకారి కాదు. ఆంధ్రరాణులగు గోతమియొక్కయు, వాసిష్ఠియొక్కయు పేరులు గోదావరినదియొక్క రెండుశాఖలకుఁ బెట్టఁబడినవని వాదమునకొఱకు నొప్పుకొన్నను ఆంధ్రులు గంగాతీరస్థులని యావిషయ మెట్లు సమర్థింపఁగలదో యెన్నివిధముల చేతఁ జూచినను మాకుఁగోచరము గాకయున్నది. ఆంధ్రులు గంగాతీరసులనుట వట్టి భ్రమకాని బలమైన సాక్ష్యము గాన్పింపదు. విల్ఫర్డుగారు చెప్పినట్లుగ ఎనిమిది శతాబ్దములు గాని, ఎల్లియాట్ గారు చెప్పినట్లుగ మూడుశతాబ్దములుగాని యాంధ్రులు గంగాతీరము నందుండినయెడల నొక్కశాసనమైన గానరాదా? ఒక్కకట్టడమైన గానరాదా? ఒక్కనాణమైన గానరాదా? ఏదియును గానరాదు. ఇంక నాంధ్రదేశము నందన్ననో యెచ్చటఁజూచినను బౌద్ధులయిన యాంధ్రరాజులు పరిపాలించిన చిహ్నములే గాన్పించుచున్నవి. ఎచ్చటఁజూచినను శిథిలములయిన బౌద్ధాశ్రమగుహలును,స్తూపములనియెడి బౌద్ధాలయములును, వానిలో నాంధ్రరాజుల శాసనములును, ఆంధ్రరాజులబంగారు వెండి సీస నాణెములును గాన్పించుచున్నవను మాటవారెఱుంగనిదిగాదు. ఆంధ్రరాజు

1. Comparative Grammar of Dravidian Languages, p. 549.

లలో రెండవవాఁడుగాఁ జెప్పఁబడిన కృష్ణుని పేరు దాహరించిన శాసనము నాసికపట్టణ సమీపమునందలి గుహాలోఁ గన్పడినప్పుడును, ఆతఁడు శాతవాహన వంశములోని వాఁడని చెప్పినప్పుడును, అతనికిఁ బూర్వుఁడగు శ్రీముఖుని పేరుగూడ శాసనములలోఁగూడఁ గన్పడినప్పుడును, ఏలయొప్పుకొనరాదు? ఒప్పుకొన్న పక్షమున నాంధ్రులు గంగాతీరమునుండి ప్రథమ శతాబ్దమున వచ్చిరని చెప్పిన తమవాదమునకు భంగమును కలిగించునదిగాన వారేలయొప్పుకొందురు? శాసనములోనుదాహరింపఁబడిన కృష్ణరాజు శాతవాహన వంశజుఁడేయైన యెడలఁ గడపటివారిలో వాఁడయియుండునుగాని మొదటికృష్ణుఁడు మాత్రము కాఁజాలఁడఁట! ఇది యంతయును తమవాదమును నిలుపఁబెట్టుకొనుటకై చెప్పెడుమాటలు గావున వానిని విశ్వసింపరాదని నాయభిప్రాయము.

## శ్రీశాతకర్ణి.

(క్రీ. పూ. ౪౦ మొదలుకొని క్రీ॥త ౧౬ వఱకు.)

కృష్ణుని తరువాత శ్రీశాతకర్ణి రాజ్యాభిషిక్తుఁడయ్యెనని వాయువిష్ణు భాగవతపురాణములు చెప్పుచున్నవిగాని మత్స్యపురాణము మాత్రము కృష్ణుని తరువాత శ్రీమల్లకర్ణియు, పూర్ణోత్సంగుఁడును, స్కంద స్తంభియునను ముగ్గురు రాజులను చెప్పుచున్నది. శ్రీశాతకర్ణి తరువాత విష్ణుపురాణము పూర్ణోత్సంగుని మాత్రము చెప్పుచున్నది. శాతకర్ణుని శాంతకర్ణునిగను, పూర్ణోత్సంగుని పౌర్ణమాస్యునిగనుమార్చి భాగవతపురాణము శాంతకర్ణుని తరువాత పౌర్ణమాస్యునిఁ బెట్టుచున్నది. ఈ నాల్గయిదు పురాణములును పేరులను తికమకలుచేసి యిచ్చవచ్చినట్లు వాడియుండుటచేత కాలనిర్ణయముచేయుట సాధ్యము కాదు. రాజుల పేరులను యువరాజుల పేరులను రాజప్రతినిధుల పేరులను విచ్చలవిడిగా వాడియుండుటచేత నిజముగా రాజులు గానున్నవారెవ్వరో చెప్పుటకు శాసనములుదక్క వేఱుగ నాధారముగాన్పింపదు. కాఁబట్టి శాసనములలోఁ గనఁబడువారి పేరులు మాత్రమె రాజులుగాఁ బరిగణింపఁబడుచున్నవి



కాఁబట్టి మల్లకర్ణి, పూర్ణోత్సంగుఁడు, స్కంద స్తంభినిగూర్చి చరిత్రాంశము లేవియు వినరావు. వారలశాసనములుగాని నాణెములుగాని గానరావు. కాఁబట్టి కృష్ణుని తరువాత రాజ్యాధిపత్యమును వహించి ప్రసిద్ధిగాంచినవాఁడు శ్రీ శాతకర్ణియనువాఁడు. ఇతఁ డేఁబదియాఱు సంవత్సరములు పరిపాలనముచేసెనని పురాణములలోఁ జెప్పఁబడియెను. పై నుదాహరించిన నానాఘట్టము గుహాలోని యాఱువిగ్రహములలో నీశాతకర్ణియొక్కయు, ఈతని పట్టపురాణియొక్కయు విగ్రహములు రెండు గలవు. వానిపైన "దేవినాయనికాయా రాణోచసిరిసాతకానీనో" యనివ్రాయఁబడి యుండుటచేత నందలి శ్రీశాతకర్ణి యితఁడే యనియు, ఇతని పట్టపురాణి నాయనికాదేవియనియు వేద్యమగుచున్నది. ఆవిగ్రహము లీతనికాలముననే చిత్రింపఁబడినవని యూహింపఁ బడుచున్నవి. ఇతనికిఁ బూర్వుఁడగుటచేతనే శ్రీముఖునివిగ్రహమును వాని పేరును ముందుఁ జిత్రింపఁబడినతరువాత తనదేవియొక్కయు తనయొక్కయు విగ్రహములను జిత్రింపించెను. తరువాత కుమార భాయాయనువాని విగ్రహముండెను. ఇతఁడు రాజునకు జ్యేష్ఠపుత్రుఁడై యుండవలయును. తరువాత మహారాష్ట్రనాయకుని విగ్రహముండెను. ఇతఁడు ప్రధాన సైన్యాధ్యక్షుఁడై యుండవలయును. తరువాత కుమారహాకుశ్రీయొక్కయు, కుమార సాతవాహనునియొక్కయు విగ్రహములుండెను. వీరు శాతకర్ణియొక్క కడపటికొడుకులయి యుండవలయును లేక మనమలై యుండవలయును. ఎవ్వరయినను మహారాష్ట్ర నాయకుఁడు దక్క యందఱును శాతవాహనవంశములోఁ జేరిన యొక్కరాజకుటుంబములోనివారనుటకు లేశమాత్రమును సందియములేదు. శాతవాహనవంశజులయిన యాంధ్ర రాజులు శాతకర్ణియనుపేరును పలువురు వహించి యుండుటచేతఁగూడ కొంతచిక్కునకుఁ గారణమగుచున్నది. శాతకర్ణియని శాతవాహన వంశవృక్షమునందుఁ బల్మాఱు గన్పట్టు చుండుటచేత విన్సెంటుస్మిత్తుగారు శాతకర్ణివంశమని తలంచుట భ్రమకాని వేఱొండుగాదు. ఇంగ్లాండు దేశమునందు రాజ్యము చేసిన రాజులలో హెన్రీ, చార్లెసు, జార్జి, ఎడ్వర్డు పేరులుగలవారెందరు లేరు? మొదటిహెన్రీ, మొదటిచార్లెసు, మొదటిజార్జి, మొదటియెడ్వర్డు, అని వరు

సనసంఖ్యతో చరిత్రములందు వారలను బ్రశంసింపుచు వ్రాయుచుండుటలేదా ? ఒకదేశపురాజులలో నొకపేరునే పెక్కండ్రు వహించినంత మాత్రముచేత నారాజులవంశమును హెన్రీవంశమనిగాని చార్లెసువంశమనికాని, జార్జివంశమని కాని, ఎడ్వర్డువంశమనికాని చెప్పుచుండుటలేదు. అట్లేయిచ్చటను శాతకర్ణియను పేరుగలవారు పెక్కండ్రు పరిపాలించినను గౌరవార్థముగ శాతకర్ణియను పేరును తమనామములకడను కొందఱుధరించినను మొదటిశాతకర్ణి రెండవశాతకర్ణి మూడవశాతకర్ణియని చెప్పుకొనవలయునేగాని శాతవాహన వంశమన్నట్లు శాతకర్ణివంశమని తలంపరాదు. [1] శాతకర్ణియనుపేరు పురాణాది సంస్కృత గ్రంథములంగానంబడుచున్నను శతకర్ణియను పేరుసరియైనదయినట్లుగాఁ గన్పట్టుచున్నది. గోతమిపుత్త్రిశాతకర్ణికి సమకాలీనుఁడగు "చెంకుడ్డువాన్ చేర" యనుచేరరాజునకు సోదరుఁడగు "ఇల్లంకోఅడికాల్" అనునాతఁడురచించిన చిలప్పదికారమను తమిళకావ్యమునందు శాతకర్ణికి "నూఱువార్ కన్నార్" అనిపేరిడి యున్నాఁడు.[2] అనఁగా నూఱుగురుకర్ణులనియర్థము. అట్లయినయెడల నయ్యది శతకర్ణియను పేరునకు సరిపోవుచున్నదిగాని శాతకర్ణియనుపేరునకు సరిపోవుచుండలేదు.

సమకాలీనుఁడగు కవివ్రాసిన "శతకర్ణి" యనుపేరును ద్రోసివేయుటకు నాంధ్రరాజులకు బహుకాలమునకు వెనుకఁబుట్టినపురాణములలో శాతకర్ణియని వ్రాయఁబడియుండుటయొక్కటియే యాధారముగానున్నదికాని వేఱొండు గానరాదు. శతకర్ణియనుదానిని పురాణకర్తలు శాతకర్ణిగా మార్చుటకుఁ గారణముగానరాదు. శతకర్ణుఁడనఁగా నూఱుకర్ణములుగలవాఁడు. అనఁగా రాజ్యాంగవిషయములను నూఱుచెవులతో వినుచు దక్షతతోఁ బరిపాలించువాఁడని యర్థము.

1 Dr. R. G. Bhandarkar's article, June, 1909. The Indian Review Vol. X no 6;

(2) The Tamils:-Eighteen Hundred years Ago.



క్రీస్తుశకారంభముననుండిన యీశాతకర్ణియె ఖారవేలునకు మగధరాజుతోనైన యుద్ధమునందు తోడ్పడినవాఁడని చెప్పి విన్సెంటుస్మిత్తుగారు వీనిని నూటయేఁబది సంవత్సరములు వెనుకకుఁ దీసికొనిపోయి విడిచిపెట్టిరి. అట్లుచేయుటకుఁ గారణముగలదు. ఆంధ్రభృత్యవంశపురాజు లశోకుని కాలమునుండి పరిపాలించుచున్నవారని విశ్వసించెడు వారిలో విన్సెంటుస్మిత్తుగారొకరు. ఆంధ్రరాజులు ముప్పదుండ్రు ౪౫౬ సంవత్సరములు మగధరాజ్యమును పరిపాలించిరని మత్స్యవిష్ణుపురాణములలోఁ జెప్పినవాక్యములను, కాణ్వాయనుల యనంతర మాంధ్రరాజులు మాగధమును స్వాధీనము చేసికొనిరని చెప్పినవాక్యములను, క్రమమైనవని విశ్వసించిన వారగుటచేతను, పురాణములలోఁ జెప్పఁబడిన కాలములనుబట్టి కాణ్వాయనుఁడగుసుశర్మ చంపఁబడినది క్రీ. పూ. ౨౮వ సంవత్సరమని విశ్వసించినవారగుటచేతను, అశోకుని కాలమునుండి రాజులను సరిపెట్టవలసివచ్చి పురాణములలోఁ జెప్పినప్రకారము శ్రీముఖుఁడు సుశర్మను జంపినదిమాత్ర మొప్పుకొనక శ్రీముఖుని నశోకుని కాలమునాఁటికిఁ గొనిపోయి ఈశాతకర్ణుని ఖారవేలుని కాలమునఁ బెట్టి సుశర్మనుజంపుటకు కుంతలశాతకర్ణి, శాతశాతకర్ణి, పులమాయి, వీరిలోనొక్కని నుత్తరవాదిగఁ జేసి విడిచిపెట్టిరి. పురాణములలో శ్రీశుకుఁడనియు, శ్రీప్రకుఁడనియు సింధుకుఁడనియు వేర్వేఱునామములతోఁ బిలువఁబడిన శ్రీముఖుఁడు కాణ్వాయనులను నిర్మూలము చేసినవాఁడని పురాణములన్నియు స్పష్టముగాఁ జెప్పుచుండఁగా నిరాకరించుటకు హేతువును జూపలేదు. కాఁబట్టి స్మిత్తుగారు పురాణములలో నుదాహరింపఁబడిన శ్రీశాతకర్ణిని ఖారవేలునికిఁ దోడ్పడిన శాతకర్ణికి ముడిపెట్టుటగాని శ్రీముఖుని నశోకుని కాలమునాటికిఁ గొనిపోవుటగాని కాణ్వాయనుల నాశనమును కుంతలశాతకర్ణి మొదలగు వారియందారోపించుటగాని యుక్తియుక్తముగఁ గన్పట్టుచుండలేదు. కాణ్వాయనుల యనంతరము దేశమును బాలించిన యాంధ్రరాజులను మాత్రమె పురాణములు పేర్కొనుచున్నవి కాని యంతకుఁ బూర్వ మాంధ్రదేశమును బాలించినరాజులను పురాణములు పేర్కొనియుండలేదు. సుచంద్రుఁడు విష్ణువు, దీపకర్ణి సాతవాహనుఁడు, శాతకర్ణియను రాజులు పురాణముల

లోని యాంధ్రభృత్య వంశమునకుఁ బూర్వులని కొన్ని గాథలనుబట్టి నిర్ధారణ చేసియుంటిమి. వీరిలో గడపట చెప్పిన శాతకర్ణియె ఖారవేలునకుఁ దోడ్పడిన వాఁడని మాయభిప్రాయము. పురాణములలోఁ జెప్పంబడిన యాంధ్రరాజులకుఁ బూర్వమాంధ్ర రాజు లనేకు లాంధ్రదేశమును బాలించి రని మాకుంగల పూర్ణ విశ్వాసమును భట్టిప్రోలు శాసనములుగూడ బలపఱచుచున్నవి.

## కుంభీరక రాజు.

కృష్ణామండలములో భట్టిప్రోలను గ్రామముగలదు. అచ్చట బుద్ధునిస్తూప మొకటియున్నది. వానిలోఁ బదిశాసనములు గానుపించుచున్నవి. ఈశాసనములలో నొక రాజుయొక్కయు, అనేక గోష్ఠులయొక్కయు, బౌద్ధ బిక్షువులయొక్కయు నామములు దెలుపఁబడియున్నవి. కుంభీరకుఁడను రాజొకఁడొక బౌద్ధసంఘమునకు నాయకుఁడుగానుండి బుద్ధాలయమునకు నొక యద్దముల పెట్టెను నొకఱాతి పెట్టెను దానము చేసినట్లుగ నాఱవ శిలాశాసనమునందును కుంభీరకుఁడను రాజుయొక్క ప్రేరేపణ చేతఁ బూజనీయుఁడగు అర్హదత్తునిచే తయారు చేయఁబడి చిత్రములు చెక్కఁబడిన బరణియొకటియు, పెట్టె యొకటియు దానము చేయఁబడినట్లుగఁ దొమ్మిదవ శిలాశాసనమునందును చేర్కొనఁబడియుండెను.[1] ఈశాసనములలోని లిపి యశోకుని శాసనములలోని లిపిని బోలి ప్రాచీనమైనదిగాఁ గన్పట్టుచున్నది. వీనిలో నుదాహరింపఁబడిన కుంభీరకుఁడను రాజాప్రాంతమునఁ బరిపాలనము చేయువాఁడై యుండవలయును. ఈ పేరు పురాణములలోఁ గానరాదు. ఈశాసనములను జక్కఁగాఁ బరిశోధించిన డాక్టరు బూలరుగారు క్రీస్తుశకమునకు రెండువందలయేండ్లకుఁ బూర్వమున నెగాని తరువాత వ్రాయఁబడియుండవని నొక్కివక్కాణించుచున్నారు. కనుక నీశాసనములలో నుదాహరింపఁబడిన రాజు కుంభీరకుఁడనువాఁడును గోష్ఠులవారును కుటుంబములవారును, బౌద్ధబిక్షువులును అశోకునికిఁ గొంచె మీవలనో ఆవలనో

(1) Epigraphia Indica Vol. II. p. 326-329. Bhattiprolu Inscriptions by Dr. G. Buhler. C. I. E.



యుండియుందురు. ఈకుంభీరకుఁడు గొప్పవాఁడయినను గాకపోయినను రాజుగాఁ బేర్కొనఁబడియుండుటచేత నాంధ్రదేశమునంతయుఁ గాని కొంతవఱకుఁ గాని పరిపాలించుచున్నవాఁడనుట స్పష్టము. కాఁబట్టి యిట్టిరాజుల పేరుల నేకములు పురాణ కర్తలకుఁ దెలియకుండె ననుట స్పష్టము. విన్సెంటు స్మిత్తుగారు శ్రీముఖుని మొదటివానిగాఁ జెప్పుటకుఁ బైనఁజర్చించిన విషయములన్నియు బాధించుచున్నవి. ఈవిషయమున స్మిత్తుగారు త్రొక్కినత్రోవ యనుసరింపఁదగినది కాదని మా యభిప్రాయము.

ఈ పైనుదుపఁబడిన శాతకర్ణి మిక్కిలి ప్రజ్ఞావంతుఁడును పరాక్రమవంతుఁడు నగుటచేత నేఁబదియాఱు సంవత్సరములు నిరాఘాటముగఁ బరిపాలనము చేసి యున్నవాఁడు.

## ఆపీలవుఁడు.

(క్రీ. శ. ౧౬ మొదలు ౨౮ వఱకు)

శాతకర్ణి తరువాత నీపేరు గన్పట్టుచున్నదికాని యీతని చారిత్రము దెలియరాదు. అపీతఁకుడని మత్స్యపురాణమును, ఇవిలకుఁడని విష్ణుపురాణమును, హివిలకుఁడని భాగవతపురాణమును పేర్కొనుచున్నవి. శాతకర్ణికిని వీనికిని నడుమ లంబోదరుఁ డనురాజు పేరు మత్స్యవిష్ణుభాగవతపురాణములయందుఁ గాన్పించుచున్నది.

## కుంతలశాతకర్ణి.

ఈరాజును మత్స్యపురాణము మాత్రము పేర్కొనియున్నది. వాత్స్యాయనుని కామసూత్రములలో కుంతలశాతకర్ణ శాతవాహనుఁడు మహాదేవియను మలయావతితోడి కామక్రీడలలో కత్తెరలజంటతో నామెను జంపెనని చెప్పఁబడియున్నది. ఒకప్రతిలోమాత్రము మలయావతి యని వ్రాయక గణికయని వ్రాయఁబడియుండెను. గణికయనఁగా వారకాంత. వారకాంత మహాదేవి కాఁబోదు. కుంతలశాతకర్ణి కారోపించెడు నీవిషయము కల్పితమైన దగునుగాని సత్యమై యుండదు. ఈకుంతల శాతకర్ణికి బూర్వమునందును తరువాత మేఘస్వా

తి, స్వాతి, స్కందస్వాతి; మృగేంద్రస్వాతికర్ణుఁడు, అనురాజులను మత్స్య పురాణము పేర్కొనుచున్నది. వీరిలో మేఘస్వాతిని మాత్రము విష్ణుభాగవతపురాణములు పేర్కొనుచున్నవి. ఈరాజులను గూర్చిన శాసనములు గాని చరిత్రముగాని యేవియుఁ గానరావు.

## పులమావి.

(క్రీ. త. ౨౮ మొదలుకొని ౫౨ వఱకు.)

వీని పేరును వాయుమత్స్య విష్ణుపురాణములు పేర్కొనుచున్నవిగాని భాగవతపురాణము మాత్రము అటమానుఁడని పేర్కొనుచున్నది. ఈతని చారిత్రమును దెలియదు. పులమావి పేరు మహారాష్ట్రాంధ్ర దేశములలోని కొన్నిశాసనములలోఁ గన్పట్టుచున్నదిగాని తరువాత నిఁచుమించుగా నూఱేండ్లకు రాజ్యభారమును వహించి ప్రసిద్ధుఁడయిన పులమావియొక్క పేరుగాఁ గన్పట్టుచున్నది. ఈమొదటి పులమావి చరిత్రమును దెలియరాదు. వీనితరువాత రాజ్యపాలనము చేసినది నెమికృష్ణుఁడని వాయుపురాణమును "గౌరికృష్ణుఁడు లేక నౌరికృష్ణుఁడు అని మత్స్యపురాణమును, అరిష్టకర్మయని విష్ణుపురాణమును, అనిష్టకర్మహాలేయుండని భాగవతపురాణమును బేర్కొనుచున్నవి.

## హాలశాతవాహనుఁడు.

(క్రీ. త. ౫౨ మొదలుకొని ౬౮ వఱకును.)

ఈహాలుఁడను వాఁడు విక్రమాదిత్యునివలెను, భోజమహారాజువలెను, శ్రీకృష్ణదేవరాయనివలెను ప్రతాపముతోఁబాటు విద్యాసంపత్తియుఁ బ్రకాశింపదనకీర్తిని భరతఖండము నాల్గుదెసలఁ బఱపినవాఁడు. ఇతఁడు విద్వాంసుఁడగుటం జేసి కవులను పండితులను నాదరించుచువచ్చెను. దేశభాషల యందభిమానముగలిగి గ్రంథములను రచించియు, రచింపఁజేసియు, దేశభాషాభివృద్ధిఁ గావించినట్లు గన్పట్టుచున్నది. ఇతఁడు యువరాజుగానుండి ప్రతిష్ఠానపురమునను్న కాలమునఁ బ్రాచీనమహారాష్ట్రిభాషలో సప్తశతియను నీతిశృంగార పద్యకావ్యమును రచించి వన్నెగాంచెను. తనహర్షచరిత్రమునందు బాణకవి



శాలివాహన విరచితమైన యీసప్తశతిని పొగడియున్నాఁడు. కావ్యప్రకాశికలోను, సరస్వతీ కంఠాభరణములోను, ధనికకృత దశరూపక వ్యాఖ్యానములోను సప్తశతినుండి పద్యము లుదాహరింపఁబడినవి. హేమచంద్రుఁడు తనదేశకోశమునందు శాలివాహనుఁడు, హాలుఁడు, సాలనుఁడు, కుంతలుఁడు వాలుగునొక్కని పేరులే యని చెప్పియున్నాఁడు. శాలివాహనశబ్దము శాతవాహనశబ్దముయొక్క ప్రాకృతరూపమని తనవ్యాకరణమునందుఁ జెప్పియున్నాఁడు. శాలివాహనుఁడనఁగా నితఁడేయని యిటీవలివారెందఱో దుర్భ్రిమ గొంయున్నారు. పైశాచీభాషలో బృహత్కథను కాతంత్రవ్యాకరణమును రచించిన గుణాఢ్యుఁడీతనిమంత్రియని చెప్పుచున్నారు గాని యదియెంతమాత్రమును విశ్వసింపఁదగినది కాదు. సప్తశతిమాత్ర మీహాలుఁడు రచించినట్లుగ నాగ్రంథములోనేయున్నది. ఈతనికాలమునందు రాజ్యమంతయు నెమ్మదిగనుండుటచేత నీతఁడు తనకాలమునంతను విద్యావ్యాసంగము సందేగడపి సుప్రసిద్ధిని వహించినవాఁడు గానున్నాఁడు.

## ఆంధ్రరాజ్యకల్లోలము.

హాలునితరువాత "మాండలకుఁడు, పురీకసేనుఁడు, సుందర శాతకర్ణుఁడు, చకోరశాతకర్ణుఁడు" అనువారు క్రమముగా నొకరితరువాత నొకరు రాజ్యమును పరిపాలించిరిగాని యవనపహ్లవశకను లను మ్లేచ్ఛుల గుంపులువచ్చి దేశముపైఁబడి యల్లకల్లోలము గావించిన హేతువుచేత వీరిపాలనము శోభించినది కాదు. అశోకునితరువాత యవనులు (Indo Bactrians) హిందూదేశముపై దండెత్తివచ్చి సింధు కాశ్మీరపాంచాలముల జయించి పరిపాలింప సాగిరి కాని కొంతకాలమునకు పహ్లవరాజులు (పార్థియన్ రాజులు) దండెత్తివచ్చి యవనరాజులను బాఱఁదోలి యమునాతీరమునందలి మధురానగరమును తక్షశిలానగరము రాజధానులుగఁ జేసికొని పరిపాలించిరి. తరువాత శ

రలను జయించి దేశమాక్రమించుకొనిరి. ఈశకరాజులలో శ

త్రవంతుఁడు. ఇతఁడు బహుదేశములను జయించెను. ఇ

(Modern Peshawar) రాజధానిగఁజేసికొని తూర్పునఁ బాటలీపుత్రమువఱకును, పశ్చిమమున హీరతు పట్టణమువఱకును గలదేశమును బాలించుటయెగాక బుద్ధధర్మము నవలంబించి బౌద్ధమతవ్యాపనము గావించి మిక్కిలిప్రఖ్యాతిగాంచినవాఁడు. ఇతని కాలముననే శకయవన పహ్లవాదులు సింధుదేశమునుండి దిగువునకువచ్చి ఘూర్జరములేక సౌరాష్ట్రము (గుజరాథ్) మాళవము రెండుదేశములలోను స్థిరవాసము ఏర్పరచుకొనుటయెగాక యాంధ్రదేశమునందును జొఱఁబడి కాపురములు గుదుర్చుకొనిరి. భూమకుఁడను క్షాత్రపుఁడు సుగాష్ట్రమునందును, చష్టనుఁడను క్షాత్రపుఁడు మాళవదేశమునందును రాజ్యములనుస్థాపించి కనిష్కునకు లోఁబడి పరిపాలనము సేయుచుండిరి. వీరుపహ్లవులుగాఁ గన్పట్టుచుండిరి. స్త్రాపు(Satraps)లను పేరు పారసీకరాజులకుఁ గలదు. ఇంతియుగాక వీరి పేరులు యవనుల పేరులంబోలియుండనందున పహ్లవులుగానే భావింపఁబడుచున్నారు అయినను దరువాతవచ్చినవారు హిందువుల సంస్కృతనామములను బెట్టుకొని హిందువుల మతములను హిందువులయాచారముల నవలంబించి మతాచార విషయములయందు హిందువులకంటెను బట్టుదలతో వ్యవహరించిరి. ఆకారణముచేత నీమ్లేచ్ఛ జాతుల వారెల్లరును హిందూజాతులలో మగ్నలైపోయిరి. ఇట్లు విదేశస్థులయిన యవనపహ్లవశకునులు తండోపతండములుగా దేశములోఁజొఱఁబడి దేశస్థులగుటచేత నాంధ్రరాజులకుఁ బరిపాలనము కష్టసాధ్యముగ నుండెను. మాండలకుఁడు మొదలగురాజులు మ్లేచ్ఛులతోఁబోరాడి యుఁదరంగములవలె వచ్చుచుండెడి మ్లేచ్ఛసమూహములను నిలుపఁజాలకపోయిరి. కొంతకాల మాంధ్రదేశముయొక్క పశ్చిమభాగము (ఇప్పటి మహారాష్ట్రదేశము) అరాజకమైయుండెను. పూర్వభాగమునఁగూడ పహ్లవులు జొఱఁ
డి రాజధానిసమీపమునఁ జేరి తొందరలు కలిగించుచున్నను శివస్వాతియను
ారమును పూనినతరువాత నల్లఘులనడంచి పరిపాలింపసాగెను గాని
త్రము తనయధికారమును ప్రతాపమునుజూపి యరాజకత్వ
ని పరిపాలించుటకు సావకాశము చిక్కకపోయెను.



## క్షహరాటానహాపానా.

కనిష్కుని మరణానంతరము ఘూర్జరమును బరిపాలించుచున్న క్షహరాటానహాపానుఁడనువాఁడు స్వతంత్రుఁడై మహాక్షాత్రపుఁడను బిరుదును వహించి యాంధ్రులను మహారాష్ట్రదేశమునుండి పాఱఁదోలి యాభాగమునంతయు స్వాధీనముచేసికొనితనయల్లుఁడగు ఋషభదత్తుని రాజప్రతినిధిగఁజేసి నిరంకుశముగఁ బరిపాలింపసాగెను. ఈరాజులు దేశమున స్థిరపడినతరువాత నార్యహిందువులయొక్క బోధనలచే స్వమతాచార సాంప్రదాయములను విడిచిపెట్టి హిందూనామములను హిందూమతాచారముల నవలంబించి బ్రాహ్మణులను మంత్రులనుగా నియమించుకొనుచువచ్చిరి. ఆర్యబ్రాహ్మణులు క్షాత్రపులనుమ్లేచ్ఛరాజులసహాయముతో బ్రాహ్మణమతమును వ్యాపింపఁజేయుచు బౌద్ధులకుఁ బ్రతిస్పర్థులుగ నున్నను అప్పటికింకను బౌద్ధులును బ్రాహ్మణులును నొండొరుల బలద్విరోధులుగ నెంచుకొనక సహనముతోనుండిరి. ఆయముఁడను బ్రాహ్మణుఁడు క్షహరాటానహాపానునకు మంత్రిగానుండెను ఋషభదత్తుఁడు సేనాధ్యక్షుఁడుగా నుండెను. దక్షమిత్రయను దనకొమార్తెను ఋషభదత్తునికిచ్చి వివాహముచేసి వానికిసైన్యాధిపత్యపట్టముగట్టెను. నాసికపట్టణములోని గుహాలలో వ్రాయఁబడిన శాసనములవలన నీక్షాత్రపుల చారిత్రముకొంత బోధపడుచున్నది. ఒకగుహాలో నాలుగుశాసనములున్నవి. వానిలో మొదటిశాసనములో గోవర్ధనములోని త్రిరాస్మి శిఖరముమీఁద నీగుహాయును చెఱువులును దినికుని పుత్త్రుఁడును క్షహరాటనహపానుని జామాతయు పరోపకారియునైన ఋషభదత్తుని ప్రేరేపణచే నిర్మింపఁబడెనని చెప్పఁబడినది.[1]

## ఋషభదత్తునిధర్మకార్యములు.

మఱియు ఋషభదత్తుని ధర్మకార్యము లీక్రిందివి పేర్కొనఁబడియుండెను. ఋషభదత్తుఁడు బ్రాహ్మణులకు మూఁడులక్షల గోదానములను చేసెను;

1. N0. 17, Nasik Inscriptions Vol VII. Jour. B. B. R. A. S. and p. 338. Trans oriental Congress. 1874.

యాత్రికుల కనుకూలముగ నుండునట్లు వారణాస్యనదికి మెట్లవరుసను (సోపానములను) గట్టించెను; దేవాలయములకు బ్రాహ్మణులకు పదునాఱుగ్రామములు దానముచేసెను; ప్రతిసంవత్సరము లక్షబ్రాహ్మణులకు భోజనము పెట్టుచుండెను; ప్రభాసపట్టణమున (సోమనాథపట్టణము) బ్రాహ్మణు లెనమండుగురకు తన సొంతసొమ్ము వెచ్చఁబెట్టి వివాహములను గావించెను; భరుకచ్ఛము(Bharoch)నందు చతురస్రములను, గృహములను, విశ్రాంతిప్రదేశములను నిర్మించెను; మాళవములోని దశపురమునందును, గోవర్ధనమునందును, శూర్పారాగమునందును (The modern supara near Bassein) ఆరామముల నిర్మించి బావులను చెఱువులను త్రవ్వించెను; తాణా సూరతులకు నడుమనుండు ఇవా, పారదా, దమనా, తాపీ, కరవేణా, దాహనుకానదులలో రేవుపడవలను బెట్టించెను. ఈనదుల కిరుప్రక్కలను బాటసారులకొఱకు విశ్రాంతిగృహములను చలివేంద్రలను (పానీయశాలలు) గట్టించెను; నామంగోలగ్రామములోను పిండితకావాడ, గోవర్ధనము, సువర్ణముఖము, శూర్పారాగము రామతీర్థములలోను చారణులకొఱకును, పరిషత్తులకొఱకును (Vedic schools of Brahmaus) కొన్నిధర్మకార్యము లాచరించెను; మలయులచే ముట్టడింపఁబడి చెఱఁబెట్టఁబడిన యుత్తమభద్రులను క్షత్రియజాతినాయకుని విడిపించుటకై తనప్రభువు నాజ్ఞప్తిని శిరసావహించి యొకసంవత్సరమున వర్షకాలములో దండయాత్ర వెడలెను; ఋషభదత్తుని రణభేరీధ్వని వినంబడినతోడనే మలయులు వెన్నిచ్చి పాఱిపోయిరి. ఉత్తమభద్రులకు మలయులు వశులగునట్లు చేసెను; అక్కడనుండి ఋషభదత్తుఁడు పుష్కరిణికిఁబోయి స్నానాదికృత్యములు గావించి బ్రాహ్మణులకు మూఁడువేలగోవులను నొకగ్రామమును దానముచేసెను.''

ఈపై శాసనమునుబట్టి యీఋషభదత్తుఁడు బ్రాహ్మణ మతాభిమానమును, బ్రాహ్మణ భక్తియుఁ గలవాఁడని తేటపడుచున్నను బౌద్ధ మతమును గాని బౌద్ధులనుగాని తిరస్కరించి యుండలేదు. రెండవశాసనములో బౌద్ధభిక్షువులకుఁ జేసిన ధర్మకార్యము లుదాహరింపఁబడినవి. ఋషభదత్తుఁడు శకనృపకాలము ౪౨వ సంవత్సరమున నాల్గుదెసలనుండి వచ్చెడి బౌద్ధసన్న్యాసులయుప



యోగార్థమై గుహావిహారమును(Cave monastery) వారలకు సమర్పించెను; సంవత్సరమునకు నూఱుకర్షపణములు వడ్డిరాఁగల రెండువేల కర్షపణములను గోవర్ధనములోని నేఁతగాండ్ర కూటమికడ నుంచెను; వర్షకాలములో తాను నిర్మించిన విహారములో నివసించెడు నిరువది బౌద్ధమతాచార్యుల కొక్కొక్కనికి నొక్క దుప్పటమును వడ్డి సొమ్ములోనుండి కొని యీయవలసినదిగా నాజ్ఞ చేసెను; ఈసొమ్ములోనుండియే యితరవస్తువులనుగూడ వారలకుఁగొని యీయవలయును; ఈయాజ్ఞలు గోవర్ధనములోని పౌరసభవారిచే (Corporation) తీరుమానింపఁబడి విహారముయొక్క తలుపుమీఁద లిఖింపఁబడినవి; శకనృపకాలము ౪౦, ౪౧ సంవత్సరములలో విశేషధనమును బ్రాహ్మణులకును దేవతలకును దానము చేసెను''[1] మూడవశాసనములో ఋషభదత్తునిభార్య దక్షమిత్రయొక్క ధర్మకార్యమొకటి యుదాహరింపఁబడినదిగాని యాశాసనము మిక్కిలిచిన్నది.[2] నాలుగవశాసనము చాలవఱకు శిథిలమై పోయినదిగాని యదియును ఋషభదత్తుని ధర్మకార్యములను ప్రశంసించుచున్నది.[3]

బొంబాయిరాజధానిలో కార్లి గుహలో నొక బౌద్ధాలయముగలదు; అందొక శాసనముగలదు; వానిలో వాలురాకాపర్వత విహారములోని బౌద్ధభిక్షువుల పోషణార్థముకొఱకు కార్జికగ్రామమును వారలకు దానముచేసినట్లుగ వ్రాయఁబడియున్నది.[4] నాసికశాసనములలోని మొదటిదానిలోఁ జెప్పఁబడిన ధర్మకార్యములవంటివాని వృత్తాంతముగూడ వ్రాయఁబడియున్నది.[5] జున్నారులోని యొకశాసనములో మహాక్షాత్రపుఁడు క్షహరాటానహపానాయొక్క బ్రాహ్మణమంత్రియగు "ఆయమ" యనువాఁడు చెఱువునొకదాని త్రవ్వించుటకును సభాభవన మొకదాని నిర్మించుటకును ప్రేరకుఁడయ్యెనని వ్రాయఁబడియున్నది. ఈ

1 Nos 18 and 16. Nasic Inscription; Ibid (2) 1st part of No. 16, Ibid; (3) No. 14, Ibid.

( 4 ) No. 13, Karli Inscriptions Arch surv w, Ind No. 10. ( 5 ) No. 25 Junnar inscriptions, Ibid.

తఁడు వత్సగోత్రుఁడని చెప్పుటచేత బ్రాహ్మణుఁడుగఁ బరిగణింపఁబడెనని భాండార్కరుగారు వ్రాసియున్నారు.

## కాలనిర్ణయము.

ఋషభదత్తుని శాసనములలోఁ గొన్ని ౪౦, ౪౧, ౪౨, సంవత్సరములలో వ్రాయఁబడినవనియు, నహపానునిమంత్రియగు అయమునియొక్క శాసనము ౪౬వ సంవత్సరమున వ్రాయఁబడినదనియు, చెప్పియుండుటచేత నీసంవత్సరములు శకనృపకాలమునకు సంబంధించినవిగఁ గన్పట్టుచున్నవి గనుక క్రీ. శ. ౧౨౪వ సంవత్సర ప్రాంతమున క్షహరాటానహపానాయను మహాక్షాత్రపుఁడు మహారాష్ట్రదేశమును బాలించుచుండెనని చెప్పవచ్చును.

## శివస్వాతికర్ణుఁడు.

(క్రీ. శ. ౧౦౯ మొదలుకొని ౧౩౦ వఱకు.)

పశ్చిమాంధ్రదేశమున (మహారాష్ట్రమున) పైఁజెప్పిన నహపానుఁడు రాజ్యము చేయుచున్న కాలమునందు శివస్వాతియను శాతవాహనుఁడు పూర్వాంధ్ర దేశమును బరిపాలించుచుండెనని స్పష్టముగఁ జెప్పవచ్చును. బహుశతాబ్దములనుండి యాంధ్రరాజుల సంరక్షణము క్రిందనుండి పరరాజులవలనఁగాని పరదేశీయుల వలనఁగాని బాధింపఁబడక కష్టములెట్టివో యెఱుంగకయుండిన యాంధ్రులనడుమ వేషభాషమతాదులచే వేఱుపడి భరతఖండముయొక్క తీక్ష్ణతరమైన యుష్ణస్థితికి దూరగులై దేహదార్ఢ్యమును బాహుబలసంపన్నతయు, పౌరుషమునుగల జాతులవారగు యవనశకపహ్లవాదులు మిడతలదండులవలె తండోపతండములుగా వచ్చి నివసించియుండుటచేతఁ గొంతకాలము దేశమున కలవరముగలిగి యున్నప్పుడు శివస్వాతి తన భుజపరాక్రమముచేత మ్లేచ్ఛజాతులవలన స్వదేశస్థులకు నేయుపద్రవమును గలుగకుండఁ గాపాడి రాజ్యపాలనము చేసినది శ్లాఘాపాత్రముగా నుండెనుగాని తనకుఁ బూర్వమునందుండిన మాండలకుఁడు మొదలగురాజులు పశ్చిమాంధ్రదేశమును క్షాత్రపులకుఁ గోల్పోవుటచే శాతవాహనవంశమునకుఁ గలిగినయపకీర్తిని బాపుకొనలేక



పోయినది యొకకొంతగానె గన్పట్టుచుండెను. అయినను శివస్వాతి తనచేతనైనది యేమొ చేసియుండెనుగాని కేవలము భీరువువలె నుండియుండలేదు. పైఁజెప్పిన విదేశరాజులు హిందూమతాచారముల నవలంబించి నాగరికులై పరిపాలింప సామర్థ్యముగలిగియుండుటకు విశేషకాలము పట్టకపోయినను స్వజాతిజనులుహిందూమతాచారముల నవలంబించి హిందువులలోఁ గలిసిపోవుటకువిశేషకాలము పట్టకపోదు. అట్టి సమ్మేళనకాలమున దేశమునఁ గలవరము జనించుట సహజమెగాని వింతకాదు. ఈమ్లేచ్ఛజాతులవారు హిందువులనడుమఁ గొంతఁ కాలమునివసించియుండి క్రమముగాఁ గొందఱు జైనమతమును, కొందఱు బౌద్ధమతమును విశేషసంఖ్యగలవారు శైవమతావలంబకులైరిగాని వారిదేహములందు మ్లేచ్ఛరక్తము ప్రవహించుచుండుటచేత నప్పటప్పట ఆంధ్రరాజులకు నధికశ్రమకలుగఁ జేయుచునే యుండిరి.

## శైవమత విజృంభణము.

శైవమతము మొదట ననార్యులలో నుద్భవించి యార్యులచే నంగీకరింపఁబడి సంస్కరింపఁబడినతరువాత కొంతకాలమువఱకు బౌద్ధమతముతో సమానగౌరవమునుగాంచుచు విశేష జనానురాగమును సంపాదించి వర్ధిల్లుచుండెను. ఆర్యులకనార్యులకు శైవమతము నడుమఁబ్రవేశించి సంబంధబాంధవ్యములఁ గలుపుచుండెను. ఆర్యులు శైవమతము నాదరించుటచేత ననార్యులనేకు లందుముఖ్యముగా నాంధ్రద్రావిడులు శైవమతావలంబనముచేసి తమ్మాలమున నార్యాచారములఁ గొంతవఱకు నవలంబించుచు నార్యులకువశులై వర్తించుచుండిరి. ఆర్యులు శైవులను వశపఱచుకొని బౌద్ధులపైఁ బురికొల్పి బౌద్ధులయధికారమును దేశమునఁ దొలఁగింప సర్వవిధములఁ బాటుపడుచుండిరి. బ్రాహ్మణప్రేరితులై శైవమతాచార్యులనేకులు దేశమునడుమ నివసించుచుండిన యవనశకపహ్లవాదిమ్లేచ్ఛజాతులను శైవమతావలంబకులనుగాఁజేసి తమలోఁ గలుపుకొనుచుండిరి. ఆర్యులభాషావాఙ్మయము దేశమున వ్యాపించుచుండెను. నాఁటనుండియు శైవము వీరశైవమగుచు జైనబౌద్ధమతములకు ప్రతిస్పర్థిగనుండెను. ఆర్యులు కేవలము శైవులలోఁ గలియకపోయినను వారిదేవతల నార్యదేవతలను

గా నంగీకరించి పూజించుచుండుటచేతను అట్లు బుద్ధదేవుని పూజింపకుండుటచేతను శైవులు సాధారణముగా బ్రాహ్మణ పక్షపాతులై యుండుచువచ్చిరి. ఆంధ్ర రాజధానీ నగరమగు ధాన్యకటకమునకు దక్షిణభాగమున జైనబౌద్ధశైవమతము లవలంబించిన పహ్లావాదులు వేనవేలు నివసించుచు క్రమముగా నాంధ్రులలోఁగలిసిపోయి యాంధ్రపహ్లావులనంబడుచుండిరి. ఈయాంధ్రపహ్లావులే పల్లవులైరి. ఈ పల్లవులు నివసించుప్రదేశమే పల్లవనాడను పేరంబిలువంబడుచుండెను. ఈపల్లవనాడే నేఁడు పల్నాడని పిలువంబడుచు గుంటూరుమండలములో నున్నది.

---

# ఎనిమిదవ ప్రకరణము.

## గోతమిపుత్ర శాతకర్ణ శాతవాహనుఁడు.

(క్రీ. శ. ౧౩౩ మొదలుకొని ౧౫౪ వఱకు.)

---

ఇతఁడు శివస్వాతికిఁ దరువాత నాంధ్రరాజ్యలక్ష్మినివరించి పట్టముగట్టుకొన్న మహనీయుఁడు. ఇంతకుఁ బూర్వము రాజ్యముచేసిన శాతకర్ణులవలెగాక "గోతమిపుత్రి" యని తనపేరునకుఁ బూర్వమున నొకవిశేషణమును జేర్చివాఁడుకొనుచుండుటచేత నిందొకవిశేషము గన్పట్టుచున్నది. పూర్వమునందుండిన వారెవ్వరును తల్లుల పేరులతోఁ దమపేరులనుజేర్చి వాడుకొని యుండక పోవుటచేత నీతఁడు గోతమిపుత్రుఁడనని తల్లిపేరు చెప్పుకొనుటచేత నితఁడు శాతవాహనవంశములో నిదివఱకు రాజ్యము చేయుచుండిన శాఖలోనివాఁడుగాక మఱియొకశాఖలోనివాఁడైయున్నట్లుగఁ గన్పట్టుచున్నది. ఏశాఖలోనివాడైనను నితఁడుశాతవాహనవంశములోనివాఁడేగాని యన్యుఁడుగాఁడు. మఱియుసామాన్యుఁడుగాఁడు. ఇతఁడుపార్థునివంటి మేటియోధుఁడు; పరాక్రమంబున విక్రమార్కునిమించినవాఁడు; ప్రజ్ఞయందుఁ గృష్ణదేవరాయసదృశుఁడు; బుద్ధదేవుని ప్రియభక్తుఁడయినను పరమతసహనముగలవాఁడు. పూర్వులకీర్తినినిలుపఁగోరువాఁడు. ఇతఁడు కృష్ణదేవరాయనివలె దిగ్విజయముఁజేసి బహుదేశములను జయించిబహుభూములుపాలించి యపజయమన్నమాట యెఱుంగక శత్రువులకజేయుఁడై యాతనివలెనె యిరువదియొక్క సంవత్సరములు మాత్రమె పరిపాలనముచేసి శాసనములునెలకొల్పి జయస్తంభములునాటి లోకవిఖ్యాతిఁగాంచిన మేటిపరాక్రమవంతుఁడగుటచేత నితనిచరిత్రముమనోహరమైనదనుటకు సందియములేదు. ఇతఁడు ధాన్యకటకనగరములో సింహాసనారూఢుఁడై రాజ్యపాలనము ప్రారంభించినతోడనే తనజ్యేష్ఠకుమారుఁడగు పులమాయి యువరాజునుజేసి గోదావరీతీరమునం

దలి ప్రతిష్ఠానపురమునుండి నియమించి తనపూర్వులు గోల్పోయిన దేశములను మరల స్వాధీనముఁ జేసికొనుట వీరపురుషోచితధర్మమని భావించి శాత్రవులపైదండెత్తుటకు సన్నద్ధుఁడయ్యెను వీనిపరాక్రమమునకు వెఱచి యవనశకపహ్లవాదులనేకులు వశులై రాజభక్తిని జూపుచు మ్లేచ్ఛత్వమును విడిచి పెట్టి జైన బౌద్ధమతముల నవలంబించి సర్వవిధముల నాతనికిఁ దోడ్పడుచుండిరి. గోతమిపుత్త్రుఁడు తనకుఁ బ్రతిఘటించి నిలిచిన యవనశకపహ్లవాదులను దఱుముచు శాత్రవులదేశముపై దాడి వెడలి యనేకదినములు వారలతో ఘోరయుద్ధములు సేయుచు విజయమును గాంచుచుండెను. ఈయుద్ధములయందుఁ దండ్రికి యువరాజుగా నుండిన పులమాయి కూడ నుండి తోడ్పడుచుండెను. ఇట్లు యుగాంతకాలరుద్రుఁడై కన్నులకుఁ దేఱి చూడరాక యుండిన యీమహాశూరవరాగ్రగణ్యుని బాఱింబడి జావలేక యామ్లేచ్ఛుల నేకులు యుద్ధములు మానుకొని శరణుచొచ్చిరి. సౌరాష్ట్రమునకు దండెత్తి పోయి నహపానుని వంశమును నిర్మూలముగావించెను. ఈదండయాత్రనుగూర్చిన చరిత్రము శాసనములవలన ధ్రువపడుచున్నది.

## గోతమిపుత్త్రుని శాసనములు.

నాసికపట్టణములోని కొండయొక్క కట్టకడనున్న గుహాలయమునందలి నాలుగు శాసనములలోఁ బొడవయినదానిలో నీక్రింది వృత్తాంతములు గన్పట్టుచున్నవి. వాసిష్ఠిపుత్త్రుఁడయిన పులమాయిరాజుయొక్క పందొమ్మిదవ పరిపాలనసంవత్సరమున గోతమిపుత్త్రి శాతకర్ణియొక్క తల్లి గోతమి ప్రేరేపణమున నీగుహాలయము నిర్మింపఁబడి భద్రాయనీయ శాఖలోని బౌద్ధభిక్షువులకు నర్పణచేయఁబడియెను. ఈశాసనమునందు గోతమి మహారాజుయొక్క తల్లియనియు, మహారాజుయొక్క ముత్తవతల్లి (నాయనమ్మ) యనియుంగూడ పేర్కొనంబడియెను. గోతమిపుత్త్రిశాతకర్ణి రాజాధిరాజనియు, అస్మిక, అసిక, మూలక, సురాష్ట్ర, కుకుర, అపరాంత, అనూప విదర్భ, అకరావంతి, దేశములకుఁ బాలకుఁడనియుఁ బేర్కొనఁబడియెను. అతఁడు వింధ్యావతము, పారియాత్రము, సహ్యము, కృష్ణగిరి, మలయము, మహేంద్రము, శ్రేష్ఠగిరి, చకోరము, మొదలగు పర్వతముల కధినాథుఁడుగనుండెను; అతనియాజ్ఞలను రాజన్యవరులనేకులు విధేయులై శిర



సావహించి పాదపూజ లర్పించుచుండిరి; అతనిసామగ్రిని మోచుజంతువులుమూడు సముద్రములనుండి జలమును ద్రాఁగుచుండినవి; శరణుచొచ్చినవారిని సంరక్షించెను; తనప్రజల సుఖదుఃఖములను దనవిగాఁ భావించుకొనియెను; మానవప్రకృతికి ననుగుణములగు ధర్మార్థకామముల నెట్టికాలమున నెట్టిప్రదేశముల నేరీతి ననుభవింపవలయునో వానింగూర్చి చక్కగ నాలోచించెను. అతఁడు విద్యానిధి; సజ్జనులకాశ్రయుఁడు; కీర్తికిరవైనవాఁడు; సదాచారసంపన్నుఁడు; పద్వర్తనకుఁ బెట్టిన పేరు; అతఁడొక్కఁడే ప్రజ్ఞావంతుఁడు; అతఁడొక్కఁడే ధనుర్విద్యావిశారదుఁడు; అతఁడొక్కఁడేవీరుఁడు; అతఁడొక్కఁడే బ్రాహ్మణసంరక్షకుఁడు. అతఁడు బ్రాహ్మణజాతి వర్ధిల్లుటకు మార్గముకలుగఁజేసెను; వర్ణసంకరాభివృద్ధిని నడ్డగించెను; అతనిశూరకృత్యములు రామకేశవార్జున భీమసేనాదుల శూరకృత్యములను మించియుండెను; అతని పరాక్రమము నాభాగనహుషజనమేజయసగరయయాతి రామాంబరీషాదులను మించియుండెను; అసంఖ్యేయములయిన యుద్ధములలో శాత్రవసమూహంబులను నిర్మూలముచేసెను; క్షత్రియుల గర్వభంగమునుగావించెను; యవనశకపహ్లవుల నాశము గావించెను; ఖగారాటవంశమును కూకటివ్రేళ్లతో బెఱికివేసి యూరుపేరులేకుండ ధ్వంసముచేసెను. శాతవాహనవంశముయొక్క కీర్తిని పునస్థాపితముగావించెను; ఇంతియగాక యీగుహాలోని బౌద్ధాలయముయొక్క సంరక్షణకై యొకగ్రామమునుగూడ దానముచేసెను.[1]

ఈశాసనముక్రింద గోతమిపుత్రశాతకర్ణి ధాన్యకటకాధీశ్వరుండని తెలిపెడి చిన్నశాసనమొకటికలదు. నవనరాధీశ్వరుండయిన వాసిష్ఠిపుత్ర శ్రీపులమావి గోవర్ధమునందుండెడి తనసైన్యాధికారియగు సర్వాక్షదళనునకు ధాన్యకటకాధీశ్వరునిచే (గోతమిపుత్త్రుఁడు) దానముచేయఁబడిన గ్రామమును (పైశాసనములోఁ జెప్పినది) భద్రాయనీయులచేత నంగీకరింపఁబడనందున మఱియొకగ్రామము దానముచేయఁబడినదిగాఁ దెలిసికోవలసినదని చెప్పెడి శాసనముగా నున్నది.[2]

---

1. No. 26. Nasik Inscriptions Arch surv W. Ind. No 10
2. No 27. Ibid.

ఆగుహయొక్క వసారాకు నెడమప్రక్కనున్న గోడమీఁదను మఱియొక శాసనముగలదు. అయ్యది ధాన్యకటకాధీశ్వరుండయిన గోతమిపుత్త్రి శాతకర్ణి జయముగాంచిన తనసేనయొక్క నివేశనస్థానమునుండి గోవర్ధనములోని తనసైన్యాధికారియైన విష్ణుపాలితుఁడనువానికిఁ దెలియఁజేసిన యుత్తరువుయొక్క భావమును దెల్పునదిగనున్నది అప్పటివఱకు ఋషభదత్తుని స్వాధీనములోనుండిన రెండునూఱుల నివర్తనముల పరిమాణముగల పొలమును సాధుల యుపయోగార్థము దానముచేసెను. ఇచ్చట లిఖింపఁబడిన శాసనము ౧౮వ సంవత్సరమున అనఁగా గుహ పూర్ణముగా నిర్మింపఁబడి సమర్పింపఁబడిన పూర్వ సంవత్సరమున మొట్టమొదట ప్రకటింపఁబడినదిగాఁ జెప్పఁబడినది. దీని దిగువను గోతమిపుత్త్రి శాతకర్ణియొక్క పట్టమహిషిచేత గోవర్ధనమునకు పాలకుఁడుగా నేర్పఱుపఁబడిన శ్రామకుఁడను వానికిఁ జేసిన యాజ్ఞారూపముగా నుండెడు మఱియొక శాసనముగలదు. ఈమెకూడ రాజమాతయని పిలువఁబడుచున్నది. ఇదివఱకు దానముచేసిన పొలమునుగూర్చి ప్రశంసింపుచు నదినూఱునివర్తనముల పరిమాణముగలదనియుచెప్పి రాజ్యములోనిదియు, తనస్వార్జితమునగు మఱి నూఱునివర్తనములభూమిని నీశాసనమూలముగ నామె దానముచేసెను. మొదటి శాసనము ప్రకారము రెండువందల నివర్తనములపొలమును దానముచేసినను అది నూఱు నివర్తనములు మాత్రమేయున్నందున కొదువనూఱు నివర్తనములభూమి మఱియొకపొలమునుండి యామెయిచ్చినట్లు గానుపించుచున్నది. ఈ దానముచేసిన సంవత్సరము ౨౪ అగుటచేత మొదటిదాని తరువాత ౬ సంవత్సరముల కీదానము చేయఁబడినది.[1]

ఈ పైఁజెప్పిన శాసనములలో మహారాజుయొక్క తల్లియనియు, మహారాజుయొక్క పితామహియనియు గోతమి పేర్కొనఁబడుటచేతను, గోతమిపుత్త్రి శాతకర్ణియొక్కరాణి మహారాజుయొక్క తల్లియని పేర్కొనఁబడుటచేతను శాతకర్ణిగాక యాశాసనములలోఁ బేర్కొనఁబడిన మఱియొకరాజు పులమాయిగాఁ గన్పట్టుచుండుటచేత నతఁడు గోతమికి మనుమఁడుగను, శాతకర్ణి

1 No-25. Nasik Inscriptions, Arch surv, W- Ind No 10



రాణియగు వాసిష్ఠికిఁ బుత్త్రుఁడుగను గన్పట్టుచున్నాఁడు. శాతకర్ణి రెండవశాసనములోని యధికారపత్రికను పులమాయియొక్క ౧౯వ పాలన సంవత్సరమున నిచ్చినదగుటచేతను, అతనిపాలనమునుఁ బేర్కొనియెడి తేదులుగల, శాసనములు, నాసిక, కార్లిపట్టణములలో మాత్రమె గాన్పించుటచేతను, అయ్యవి గోతమిపుత్రునికి సంబంధించిన తేదులు గాకపోవుటచేత తప్పక పులమాయి పాలనముయొక్క తేదులుగనున్నవి. గోతమిపుత్త్రిని మహాత్కార్యములనుదావారించెడు పెద్దశాసనముకూడ పులమాయిపాలనసంవత్సరమును బేర్కొనుచున్నది. ధాన్యకటకాధీశ్వరుండు గ్రామము నొకదాని భద్రాయనులకు దానముచేసినను అదివారలను దృప్తిపఱచనందున తాను మఱియొకగ్రామమును దానముచేయుచుంటినని పులమాయి చెప్పియుండుటచేత ధాన్యకటకాధీశ్వరుండు గోతమిపుత్త్రిఁడైయుండెను. గుహను సమర్పించుచున్నదని వర్తమానకాలమును దెలుపుచున్నందున నప్పటికి గోతమికూడ బ్రదికియుండెననియు చెప్పవలసియున్నది. వీనినన్నిటిని పరిశోధించిచూడఁగా గోతమిపుత్త్రి శాతకర్ణుఁడు ప్రధానరాజధానీ నగరమగు ధాన్యకటకమున పరిపాలనము సేయుచుండఁగా నాకాలమునందే యాతనికుమారుఁడును యువరాజునునగు వాసిష్ఠిపుత్ర శ్రీపులమాయి ప్రతిష్ఠానగరమున (Paithan) రాజప్రతినిధిగానుండి పశ్చిమాంధ్రదేశమును(మహారాష్ట్రాది దేశములను) బరిపాలించుచుండెనని స్పష్టముగ బోధపడుచున్నది.

## చెంకుడ్డువాన్ గోతమిపుత్ర శాతకర్ణుల మైత్రి.

ఇల్లంకో అడికాల్ అనుద్రమిళకవి విరచితమగు చీలప్పదికారమనుకావ్యమున విజయసేనకనకసేనలతో చెంకుడ్డువాన్ చేరరాజునకుఁ గలిగిన పోరాటమునందు చేరరాజునకుఁ దోడ్పడియెనని చెప్పఁబడిన మగధాధీశ్వరుండగు శాతకర్ణి యీగోతమిపుత్త్రి శాతకర్ణుఁడనియె గన్పట్టుచున్నది. ఆకాలమున నాంధ్రరాజులు మగధరాజులుగాఁ బరిగణింపఁబడుచుండిరనుటకు నీతమిళకావ్యమునందలికథ ప్రబలసాక్ష్యముగాఁ గన్పట్టుచున్నది. తమిలకమునకు మగధరాజ్యము తరపుసరిహద్దుగాఁ బేర్కొనఁబడినది. ఉత్తరమున గంగాన

దిమొదలుకొని దక్షిణమునఁ గాంచీపురమువఱకునుగల దేశమంతయు నాంధ్రరాజుల వశముననున్నట్లు గన్పట్టుచున్నది. ఆంధ్రులకాలమున మగధరాజ్యమునకు రాజధాని ధాన్యకటకనగరముగా నుండెను. ఆకాలమునందు సింహళరాజగు గజబాహువునకును చేరరాజగు చెంకుడ్డువానునకును మగధరాజగు శాతకర్ణికిని విశేషమైత్రిగలిగియుండెను. అదియేమి చిత్రమోగాని యేమిసంబంధబాంధవ్యములచేతనోగాని సింహళరాజులును పాండ్యచోళచేరరాజులును ఆంధ్రరాజులును బహుశతాబ్దములవఱకన్యోన్యమైత్రిగలిగియుండిరి. ఈమైత్రి శివస్కందవర్మని పరిపాలనమున భగ్నమైనట్లుగఁ గన్పట్టుచున్నది. ఆంధ్రరాజులు మిత్రులుగనుండుటచేత చెంకుడ్డువాన్ చేరరాజు మృతభర్తృకయగు తన తల్లిశోణయను నామెకు గంగాస్నానమును లభింపఁజేయ నామెను వెంటఁబెట్టుకొని యాంధ్రదేశము మీఁదుఁగాఁ బోయి కృతకృత్యుఁడయ్యెనని పైకావ్యమునందు వర్ణింపఁబడినది. కొన్నిసంవత్సరములయిన తరువాత నొకనాఁడు చేరరాజు తనరాణియగు వేణుమాలతో వనవిహారమునకుఁబోయి పెరియార్ నదిలోని యిసుకతిన్నెలపై నివసించుకాలమున పార్వతీయులు కొందఱువచ్చి "దేవా! ఎవ్వతెయో యొక్కవనిత యేకస్తనయై వెంకైచెట్టునీడను విగతప్రాణయై పడియున్నది. ఆమె యుదంతమింతయుఁ దెలియరాదు" అని విన్నవింపఁగా రాజుపరివారములోనుండిన "చాతాన్" అను సరసకవియాకథ నెఱింగినవాఁడు కావున రాజునకును రాణికినిట్లు శ్రుతపఱిచెను. ఆమె కావేరిపద్దినములోని యొకవర్తకుని భార్యగానుండెను. ఆవర్తకుఁడొక యాటకత్తె మోహములోఁ జిక్కుకొని తనయైశ్వర్యమునంతను గోలుపోయి పశ్చాత్తప్తుఁడై పతివ్రతయగు భార్యతో మధురాపురమునకువచ్చి భార్యకడ విలువగల యందెలజతమాత్రముండుటఁజూచి యొకదానివిక్రయించి యాసొమ్ముతో మరల వర్తకము ప్రారంభింపఁబూని భార్యకుఁ దెలియఁజెప్పఁగా నామె సంతోషపూర్వకముగా దానినొసంగిన నదిగైకొని తన దురదృష్టముచేత నంతకుపూర్వము మధురాపురరాజ్ఞియొక్క యందెను దొంగిలించిన స్వర్ణకారునికడకుఁ బట్టుకొనిపోయెను. వాఁడు రాణియొక్కయందెను తస్కరించిన దొంగ వీఁడేయని వెంటనె రాజభటులకు



నొప్పగించెను. అంతట వర్తకుఁడు నిశ్చేష్టితుఁడై వారలకు నేమియుఁ బ్రత్యుత్తరము చెప్పలేక కొయ్యవలె నిలువంబడెను. వీనిని నిజముగా దొంగయని యనుమానించి రాజభటులు వెంటనే తలనఱికివైచి యాయందెను రాజభవనమునకుఁ గొనిపోయిరి. ఒకగొల్లవానియింట నివసించియుండిన యామె తన భర్త రాజభటులవలన నఱికివేయఁబడెనని విని దుఃఖాబ్ధినిమునింగి కంటికినేలకు నేకధారగా నేడ్చుచు భర్త రాణియొక్కయందెను దొంగిలించిన కారణమున నిట్లు తల నఱికివేయఁబడెనని విని కోపోద్రేకముతో రాజసభకుంబోయి తనభర్తకడనుండినయందె తనదికాని రాణిదికాదని సహేతుకముగ ఋజువుచేసెను. నిరపరాధియైనవానికి మరణశిక్ష సంభవించెనుగదాయని మూర్ఛితుండై రాజు పడిపోయి యట్లె దీర్ఘనిద్రపోయెను. రాజు మరణమునకుఁ జింతించుచు రాణి భర్తతో సహగమనముచేసెను. అంతట మహాపతివ్రత తన స్తనము నొకదాని కోసివేసి మధురాపురమును రాజుభవనమును మండిపోవునుగాక యని శపించి మనరాజ్యమునకువచ్చి విగతప్రాణయై పడిపోయినది. అచ్చట మధురాపురము రాజుభవనముతో మండిపోయినది. ఈకథవిని రాజును రాణియు మిక్కిలి వగచి యామహాపతివ్రతయైన వితంతువు దేవతనుబోలెఁ బూజింపఁదగినదని తలంచి యేమిచేయఁదగునని పండితుల సలహాయడిగెను వారుహిమాలయములోని యొకశిలతో నామె విగ్రహమును జేయించి గంగాస్నానముగావించి కొనివచ్చి యిక్కడ ప్రతిష్ఠచేయించి పూజించుట సర్వోత్తమమైన కార్యమని సలహాచెప్పిరి. వానిమంత్రి విల్లవాన్‌కొదైయనువాఁడు "దేవా మహాశూరుఁడవు; ఆర్యరాజులు నీకు శత్రువులయినను మగధరాజులయిన శాతకర్ణులు నీకు మిత్రులు కావున నీకొకదుస్సాధ్యకార్యము కానేరదు" అని ప్రోత్సాహపఱిచెను. అంతట రాజు "ఆర్యరాజులు ద్రమిళరాజులనుజూచి యపహాస్యము చేయుచుందురని యాత్రికులవలన వినియుంటిని. వారికి గర్వభంగముకలుగునట్లుగా మనము దండెత్తిపోయి యుద్ధములో వారలనోడించి వారిచేత మన మాశిలను మోయించుకొని మనదేశమునకుఁ దీసికొనివచ్చినప్పుడుగదా మనకీర్తిప్రతాపములు వెల్లడియగునది" యని పలికెను. పిమ్మట వారు తమరాజధానియైన వంజీపురముఁ బ్రవేశించిన

తరువాత బహుసేనలం గూర్చుకొని యోడలమీఁదఁ బ్రయాణముచేసి యుత్కల దేశములోని యొక రేవుపట్టణమున దిగి నీలగిరులచెంత మజిలీ యేర్పఱచుకొని నివసించి యుండఁగా శాతకర్ణి సేనాధిపతులలో నొక్కఁడగు సంజయుఁడనువాఁడు నూఱుమంది యాటకత్తెలతోను రెండువందల యెనుబదిమందిపాటకులతోడను, నూఱురథములతోడను, పదివేల యశ్వములతోడను, ఇరువదివేల బండ్లతోడను, వేయిమంది సంరక్షక భటులతోడను వచ్చి చేరరాజును గలిసికొని వందనమాచరించి యోరాజా! మీమిత్రుఁడయిన శాతకర్ణి మహారాజునన్ను మీ కడకుఁబంపెను; హిమాలయమునుండి శిలగొనివచ్చుట మీయభిమత మని మేము మీకు సహాయముచేసి దానింగొని గంగాభిషేకమును గావించి తీసికొని వచ్చెదము'' అనిచెప్పెను. అదివిని చేరరాజు సంజయునితో నిట్లనియె. ''సంజయా! ద్రమిళరాజుల సత్త్వమెఱుంగలేక బాలకుమారుని కొడుకులు కనకసేనవిజయసేనులనువారు నిందించుచున్నవారు. ఆ పగఁదీర్చుకొనుటకై యీసేన నడపింపఁబడుచున్నది. ఈసమాచారమును మీ శాతకర్ణునకుఁ దెలియఁజేసి మహానదియగు గంగానది మీఁదుగా నాసేననుగొని పోవుటకై పడవలను పోగుచేయవలసినదిగా శ్రుతపఱుపుము'' అనిచెప్పి వానిసైన్యమునుగొని వానిని శాతకర్ణుని కడకుఁ బంపెను. తరువాతఁ గొన్ని దినములకు గంగాతీరమునకుఁబోయి శాతకర్ణి పంపిన పడవలమీఁద గంగానదినిదాటి యావలియొడ్డునకుఁ బోయినతోడనే శాతకర్ణులు స్వాగతమొసంగిరి.

## ద్రమిళార్యరాజులకుయుద్ధము.

వారలకడ సెలవుగైకొని యుత్తరదేశమునకు దండెత్తిపోయి కుయిలాలువమనుచోట నార్యసోదరులగు కనకసేన విజయసేనులనువారలకుఁ దోడ్పడవచ్చిన ఉత్తరుఁడు, విచిత్రుఁడు, రుద్రుఁడు, భైరవుఁడు, చిత్రుఁడు, సింహుఁడు, ధానుత్తరుఁడు, శ్వేతుఁడు, మొదలగురాజుల నెదుర్కొనియెను. అచ్చట నుభయసైన్యములకు ఘోరయుద్ధముజరిగెను. ఆయుద్ధమునం దార్యులోడిపోయిరి. కనకవిజయులను సోదరులిరువురు చెంకుడ్డువానుచేఁ బట్టుకొనఁబడిరి. వీరలకుండు రాజవేషములను దొలఁగించి సన్న్యాసులుధరించు దుస్తుల నొసంగి



కొంతసైన్యమును, మంత్రియగు విల్లవాన్ కోదైయనువానిని, వీరలతోడ హిమాలయమునకుఁబంపి, కావలసినశిలను వీరలచేఁ దెప్పించుకొని, దండయాత్రను ముగించి, గంగాతీరమునకువచ్చి, శాతకర్ణి రాజబంధువులు సేనానులుగావించిన విందులనుగుడిచి, అర్ఘ్యమర్యాదలనుబొంది, సంతుష్టుఁడై, మరలిపోయి, ముప్పదిరెండుమాసములకు చేరరాజధానియగు వంజిపురమును జేరుకొనియెను. తరువాత నితఁడు రాజసూయయాగమును జేసెనఁట.[1] ఈవృత్తాంతమును దనకావ్యమునందుఁ జొనిపిన యిల్లంకో అడికాలనుకవి నిర్గ్రంథసన్యాసియనియు, చెంకుడ్డువానునకు సోదరుఁడనియు నిదివఱకే దెలిపియుంటిమి. సమకాలీనుఁడగు నీకవి వ్రాసిన యీవిషయములను బలపఱచుటకు శాసనాదులుగాని మఱియేగ్రంథదృష్టాంతములుగాని గానరాకున్నయవి. వీనిచేఁజెప్పఁబడిన వృత్తాంతమునం దతిశయోక్తులును భ్రమప్రమాద జనితదోషములు గొన్ని కలవని యొప్పుకొన్నను ఈవిషయములన్నియు, గేవలము కల్పితములని త్రోసివేయుటకుమాత్రము ప్రబలహేతువులేవియుఁ గన్పట్టకున్నవి. కాఁబట్టి గోతమిపుత్త్ర శాతకర్ణికాలమున నాంధ్రరాజ్యము గంగాతీరము మొదలుకొని కాంచీపురమువఱకు వ్యాపించి యుండెనని విశ్వసించుచున్నారము.

## చస్తనుఁడు.

శాతకర్ణి యవనశకపహ్లవుల నిర్జించి నహపానవంశమును నిర్మూలించిన కాలమునందు చస్తనుఁడను క్షాత్రపుఁడు ఉజ్జయిని రాజధానిగ మాళవదేశమును బరిపాలించుచుండుటను జూచి యాతఁడు (చస్తనుఁడు) శాతకర్ణిచే మాళవదేశమునకుఁ రాజప్రతినిధిగఁ జేయఁబడెనని విన్సెంటు స్మిత్తుగారు వ్రాసియున్నారుగాని విశ్వసింపఁ దగినదికాదు. యవనశకపహ్లవాదులను దఱిమి తఱిమి గొట్టి క్షహరాటనహపానుని వంశమునంత నిర్మూలముచేసినవాఁడు మరల నాసమూహములోని విదేశస్థునే పాలకుని జేసెననుట నమ్మఁదగినదికాదు. కోల్హాపురమునందుఁ గన్పట్టిన నాణెములలోఁగొన్నిట గోతమిపుత్త్రవిలివాయకురుఁడను పేరు

1 The Tamils: Eighteen Hundred years Ago. pp-91-98

గాన్పించుటచేత నతఁడే గోతమిపుత్త్రి శాతకర్ణియని స్మిత్తుగారు చెప్పుచున్నారు. విలివాయకురుని పేరు పురాణములలో నుదాహరించిన యాంధ్రరాజుల నామములలో నెచ్చటను గానరాదు. ఈవిలివాయకురుఁడు గోతమిపుత్త్రి యజ్ఞశ్రీ శాతకర్ణియొక్కయు, శ్రీపులమాయియొక్కయు ప్రతినిధియై "హిపోక్కురో" (కోల్హాపురము) మండలమును బాలించినవాఁడు. "బలియోకురోసు" హిపోక్కురోలో నున్నవాఁడని టాలెమీ యనుచరిత్రకారుఁడు వ్రాసియున్నాఁడు. ఈబలియోకురోసే విలివాయకురుఁడని డాక్టరుభాండార్కరుగారు చెప్పిన దానిని స్మిత్తుగారు సహా చరిత్రకారులెల్లరు నంగీకరించినారు.[1] పైఠణ్ (ప్రతిష్ఠానము) లోనున్నవాఁడని టాలెమిచేఁ జెప్పఁబడిన సిరోపోలిమియోసే (Siro Polimios) శ్రీపులమాయిగానుండెను. మఱియు నాకాలమున టియాస్తనీ (Tiastenes) యనువాఁడు ఉజ్జయినిలో పాలనము సేయుచుండెనని చెప్పెను. ఈటాలెమీ యనుచరిత్రకారుఁడు క్రీ. శ. ౧౬౩ వ సంవత్సరమున మరణమునొందెను ఇతఁడు తన భూగోళమును ౧౫౧ వ సంవత్సరము తరువాత రచించెనని చెప్పుదురు. కాఁబట్టి టాలెమీచెప్పిన బలియోకురోసు (Baleokuros) సిరోపోలిమియోసు టియాస్తనీసు మువ్వురును ౧౫౧ వ సంవత్సరమునకుఁ బూర్వపువారయి యుండవలయును. ఈబలియోకురోసు సిరోపోలిమియోసు తండ్రియై తండ్రిహిపోక్కురోలోను తనయుఁడు పైఠణ్‌లోను రాజ్యము చేయుచున్నవారని స్మిత్తుగారివాదము నంగీకరించిన పక్షమున ప్రధాన రాజధానియగు ధాన్యకటకనగర మెవరిపాలు చేయవలసియుండునో బోధపడకున్నది. సత్యమేమనఁగా గోతమిపుత్త్రిశాతకర్ణి ధాన్యకటకమునే రాజధానిగఁ జేసికొని పరిపాలించుచుండెను. వానికాలమునఁ బశ్చిమభాగమున పైఠణ్ (ప్రతిష్ఠానపురము) అనఁబడు పట్టణమునను హిపోక్కురో అనిటాలెమీచేఁ బిలువంబడిన పట్టణమునను రాజప్రతినిధులుగలరు. శాతకర్ణి కుమారుఁడు శ్రీపులమాయి ప్రతిష్ఠానపురియందు రాజప్రతినిధిగనుండి మహారాష్ట్రదేశమును బాలించుచుండెను. బలియోకురోసని టాలెమీచేఁ బిలువంబడినవిలివాయకురుఁడు పులమాయికాలమున దక్షిణమహారాష్ట్రమునకు రాజప్రతినిధిగ హిపోక్కురోయనియెడి కోల్హాపురమునందుండి రాజ్యము సేయుచుండెను. టాలెమీచేఁ జెప్పఁబడిన తియాస్తనీసు ఉజ్జయిని పాలించు చస్తనుఁడని భాండార్కరు స్మిత్తు మొదలగువారెల్లరు నంగీకరించిరి.

1 Dr. Bhandarkar's Early History of Deckhan pp 20, 21, 22, 23. The Indian Review, Vo, X, no. 6. Dr. Bhandarkar's article, June 1909.



## గోతమిపుత్త్రుఁడు పన్నులుతీసివేయుట.

శకరాజులు దండెత్తివచ్చినప్పుడు స్వదేశస్థులలోఁ గలిసిపోయిన విదేశస్థులు కొందఱు సమయము తటస్థమైనప్పుడు తమస్వాతంత్ర్యమును ప్రకటింపవేచియుండి స్వదేశస్థులను బురికొల్పుకొని రాజద్రోహము తలఁపకుండుటకై కాఁబోలు శాస్త్రీయముగా విధించిన సుంకములనుగూడ గోతమిపుత్త్రి శాతకర్ణి తీసివేసెనని నాసికలోనిశాసనము చాటుచున్నది. ఈతఁడు నహపానుని జయించి వానిరాజ్యమును స్వాధీనముఁ జేసికొన్నతరువాత నహపానుని నాణెములమీఁన నేతఁ నామమునుగూడ ముద్రింపించెను. మహారాష్ట్రదేశములో దొరకిన పదునాలుగువేల నహపానుని నాణెములలోను తొమ్మిదివేల నాణెములపైన వెనుకప్రక్కను "రాజ్ఞోగోతమి పుతాస సిరిశాతకానీనో" అనిగోతమిపుత్త్రిశాతకర్ణి పేరు ముద్రింపఁబడినవిగా నున్నవి. ఇతఁడు క్రీ. శ. ౧౫౪వ ప్రాంతమున మరణము నొందియుండును.

## వాసిష్ఠిపుత్త్రశ్రీపులమాయి.

(క్రీ. శ॥ ౧౩౦ మొదలుకొని క్రీ॥ శ॥ ౧౫౪ వఱకు)

## ప్రతిష్ఠానమునను.

(క్రీ॥ శ॥ ౧౫౪ మొదలుకొని క్రీ.శ॥ ౧౫౭ వఱకు)

## ధాన్యకటకమునను.

ఇతఁడు గోతమిపుత్త్రిశాతకర్ణకిని వాసిష్ఠిరాణికిని జనించినవాఁడు. శాతకర్ణి ధాన్యకటకమునఁ బరిపాలనము సేయుచుండ నీతఁడు యువరాజుగను

రాజప్రతినిధిగను ప్రతిష్ఠానపట్టణమునుండి పరిపాలనము సేయుచు క్షాత్రపులతోఁ దండ్రికి జరిగినయుద్ధములో తండ్రితోఁగూడనుండి యుద్ధములనుజేసి జయధ్వజము నెత్తుచువచ్చినవాఁడు. తండ్రివలెనే యితఁడును మిక్కిలి పరాక్రమవంతుఁడుగా నున్నాఁడు. ఇతనికి శాతకర్ణియను పేరులేదు. జనకుని మరణానంతరమున నితఁడు ధాన్యకటకమునఁ బట్టాభిషేకము పొందినటులఁ గన్పట్టుచున్నది. ఇతని పేరుగల శాసనమొకటి ధాన్యకటకస్తూపమునఁ గానంబడుచున్నది. వాసిష్ఠీపుత్రుఁడయిన శ్రీపులమాయి రాజ్యము చేయుచుండఁగా చైత్యకీయశాఖవారిస్వాధీనమునందుండిన బుద్ధునియొక్క మహాచైత్యమునకు గృహస్థుఁడయినకహుతారయు, ఋషిలుఁడును, వానిభార్య నాగనికయు, వానికొడుకులును, గలిసి ధర్మచక్రమును దానము చేసిరని చెప్పఁబడినది [1]

శాతవాహనులలో పులమాయియను పేరుగలవారిలోఁ నీతఁడు రెండవవాఁడు గావున రెండవపులమాయియని పిలువంబడుచున్నాఁడు.

## క్షాత్రపస్వామి జయదాముని దండయాత్ర.

సౌరాష్ట్రక్షాత్రపులవంశము నిర్మూలము చేసి శాలివాహనులు విజృంభించి యాంధ్రసామ్రాజ్యము నానాముఖముల విస్తరింపఁజేయుటకు సహింపంజాలక శాలివాహనుల విజృంభణమును మాన్పినఁగాని తమరాజ్యమునకు క్షేమములేదని నిశ్చయించుకొని ఉజ్జయినీపురవరాధీశ్వరుండును, మహాక్షాత్రపుఁడును అగు చస్తనుని కుమారుఁడు క్షాత్రపస్వామిజయదాముఁడనువాఁడు బహుసేనలం గూర్చుకొని ప్రతిష్ఠానముపై దండెత్తివచ్చి యాపట్టణమును ముట్టడించెను. అప్పుడు శాలివాహనులకును క్షాత్రపులకును ఘోరసంగ్రామము జరిగెను. ఆమహాఘోరసంగ్రామమునందు నుజ్జయినీపురాధీశ్వరుండు మృతినొందినట్లు గానంబడుచున్నది. ఇట్లు శాలివాహనులు క్షాత్రపుల రణరంగమున నోడించుటయేగాక క్షాత్రపసైన్యమును మాళవదేశములోనికిఁ దఱుముకొనిపోయి మాళవదేశములోని విశేషభాగమాక్రమించుకొనిరి. ఇట్లు కొంతకాలము చస్తనునిరాజ్య మాంధ్రులవశమై యుండినటులఁ గాన్పించుచున్నది.

---

1 Dr. Burgess; Buddhistic stupas of Amarawati. p. 100 plate VLI No,1 (Amarawati inscriptions.)



## శాలివాహన విక్రమార్కులగాథ.

ప్రతిష్ఠానమును బాలించుచుండిన శ్రీపులమాయి శాలివాహనుపైని, ఉజ్జయినీపురాధీశ్వరుండయిన క్షాత్రపరాజు జయదాముఁడు దండెత్తివచ్చి యుద్ధము చేసి మడిసిన చరిత్రాంశమును బురస్కరించుకొని యిటీవలివారు దెలియక క్రీస్తుశకమునకుఁ బూర్వము రెండుశతాబ్దములక్రిందటనున్న శాతవాహనవంశమునకు మూలపురుషుఁడైన శాతవాహనుఁడను శాలివాహనునకును, క్రీస్తుశకము ౫వ శతాబ్దమునందుండి ఉజ్జయినీనగరమును బరిపాలించుచుండిన యశోవర్మయను విక్రమార్కునకును ప్రతిష్ఠానపుర సమీపమున యుద్ధము జరిగెననియు శాలివాహనుఁడు యుద్ధములోఁ విక్రమార్కుని తలద్రుంచెననియు నొకగాథను గల్పించి వారికి ముడిపెట్టిరి ఈగాథయే దేశదేశములందుఁ బలురీతులఁ జెప్పఁకొనఁబడుచున్నది కథాసరిత్సాగరమున శాలివాహనుని మంత్రియగు గుణాఢ్యపండితుని జననవృత్తాంతము శాలివాహనజననమునకు ముడివెట్టి గాథలుగల్పించిరి. ప్రతిష్ఠానము నందొక బ్రాహ్మణకన్య తనయిరువురి సోదరులతో నొకకుమ్మరివాని యింట నివసించుచుండి యొకనాఁడు గోదావరికి స్నానమునకుఁ బోవుచుండఁగా శేషుఁడు చూచి యామెను మోహించి మానవరూపమునుదాల్చి యామెను కౌగిలించుకొనియెను. తరువాత కొంతకాలమున కామెకు గర్భముగలిగి శాలివాహనుఁడు జనించెను. వీఁడు కుమ్మరివానియింటఁ బెరుగుచుండెను. ఒకనాఁడు కాళికాదేవి విక్రమార్కునికి ప్రత్యక్షమై రెండేండ్ల బాలికకు జనించినకుమారునిచేఁ జంపఁబడుదువని జోస్యము చెప్పెనఁట! అట్టివాఁడెక్కడ నున్నాఁడో యని విక్రమార్కుఁడు పిశాచరాజగు బేతాళుని బంపి వెదకించెను. బేతాళుఁడు బాలికయైనతల్లితో నాడుకొనుచున్న శాలివాహనుని ప్రతిష్ఠానపురమునందుఁ జూచి విక్రమార్కునికిఁ దెలియఁజేసెను. అంతట విక్రమార్కుఁడు ప్రతిష్ఠానముపై దండెత్తివచ్చెను. శాలివాహనుఁడు తనతండ్రి నాగరాజగు శేషుఁడు తనకుపదేశించిన మంత్రప్రభావము చేత మట్టిగుఱ్ఱములను, మట్టియేనుగులను, మట్టిమనుష్యులను జేసి వానికిఁ బ్రాణప్రతిష్ఠఁ జేసి యాసైన్యములతో విక్రమార్కుని నె

దుర్గాకాని వానినోడించి వానితల నఱికివైచెను. ఈగాథలోని శాలివాహనుఁడే శ్రీపులమాయియనియు, విక్రమార్కుఁడే శ్రీజయదాముఁడనియు నెఱుంగ వలయును.

ఈపైఁజెప్పఁబడిన జయదాముని కుమారుఁడు రుద్రదాముఁడను మహాక్షాత్రపుని కూఁతురు దక్షమిత్రయనునామె శ్రీపులమాయి శాలివాహనునికిచ్చి వివాహము చేయఁబడినదనియు, రుద్రదాముఁడు రెండుసారులు పులమాయిని యుద్ధములో నోడించినను అల్లుఁడగుటచేత వానిదేశము నాక్రమింపక విడిచిపెట్టెననియు విన్సెంటుస్మిత్తుగారు వ్రాసియున్నారు. ఇది శాసనములలోఁ జెప్పిన దానికిని మఱికొన్ని చరిత్రాంశములకును విరుద్ధముగాఁ గానంబడుచున్నది.*

* పురాణములలోనీయఁబడిన యాంధ్రరాజుల పేరులును వారుపాలించిన కాలమునుఁ బరస్పరవిరుద్ధములుగ నుండుటచేతను, పురాణములలోనుదాహరింపఁబడిన పేరులు కొన్ని శాసనాదులలోఁ గాన్పింపకుండుటచేతను, మఱికొన్ని పేరులుమార్పులతోఁ గనఁబట్టుటచేతను, కొన్నిస్థలములందు పురాణములలోనుదాహరించిన కాలమును, శాసనములలో నుదాహరించిన కాలమును సరిపోవక పోవుటచేతను, కడపటియాంధ్రరాజులు శాతకర్ణియను శబ్దమును సామాన్యముగాఁ దమనామముల కడనుజేర్చుకొని యుండుటచేతను, కొందఱుగోతమి, వాసిష్ఠి, మాధారి, హారితియని తల్లుల నామములను తమనామములకు ముందుఁజేర్చుకొని పిలుపించుకొనుచుండిన వారగుటచేతను, కొందఱు తండ్రులకాలముననే యువరాజులుగను, రాజప్రతినిధులుగను నుండి వేఱ్వేఱు దేశములను బాలించినవారుగ నుండి యుండుటచేతను కాలనిర్ణయముఁ జేయుటకు బ్రహ్మముడివలెనుండి పాశ్చాత్యపండితులకు హైందవపండితులకుఁగూడ స్వాధీనముగాక నవ్వులపాలు చేయుచుండెను. ఈబ్రహ్మముడిలోనిచిక్కును దీయుటకు మాఱుగాకొందఱు పాశ్చాత్యపండితులు క్రొత్తచిక్కులనుగల్పించి మఱింత దుస్సాధ్యమగునట్లు గావించిరి. కనుకసరియైన కాలనిర్ణయము చేయుటకిదివఱకు దొరకిన సాధనములను బట్టి యెవ్వరికిని సాధ్యపడదు.



## చస్తనవంశము.

గోతమిపుత్త్రిశాతకర్ణుని కాలమునను ఆతనికుమారుఁడగు శ్రీపులమాయికాలమునను ఉజ్జయినీపురము రాజధానిగా మాళవదేశమును చస్తనుఁడను క్షాత్రపుఁడు పరిపాలించుచుండెనని శాసనములచేతను నాణెములచేతను, టాలెమీయను చరిత్రకారుని వ్రాఁతచేతను ధ్రువపడుచున్నది. చస్తనుఁడు స్మిత్తుగారు భావించినట్లు క్షహారాట నహపానుఁడను క్షాత్రపుని వంశములోని వాఁడుగాఁడు; గోతమిపుత్త్రి శాతకర్ణుఁడు నహపానునుండి గెల్చిన రాజ్యమునకు రాజప్రతినిధిగఁ జేయఁబడిన వాఁడునుగాఁడు. ఉజ్జయిని నేలు స్వతంత్రుఁడయిన మఱియొక క్షాత్రపరాజు. వీనికుమారుఁడు జయదాముఁడు. ఇతఁడే ప్రతిష్ఠానముపై దండెత్తి శ్రీపులమాయి శాలివాహనునితో యుద్ధముచేసి యోడిపోయినవాఁడు. వీనికొడుకు రుద్రదాముఁడనువాఁడు. వీనిశాసనమొకటి జునగడలోఁ గాన్పించుచున్నది. శకకాలము ౭౨ వ సంవత్సరమున మార్గశీర్ష బరనాఁడు సుదర్శన సరస్సుయొక్క గట్టు తెగిపోవుట మొదలగు విషయము లనేకము లీశాసనమునఁగలవు. ఈగట్టు చంద్రగుప్త చక్రవర్తి మౌర్యునికాలమున పుష్యగుప్తునిచేతను, అశోకవర్ధనచక్రవర్తి మౌర్యునికాలమున తుషాష్పుఁడను యవనరాజుచేతను బాగుచేయించఁబడినదని కూడ పైశాసనమునఁ జెప్పఁబడియును[1] "సర్వవర్ణైరభిగమ్య రక్షణార్థంపతిత్వే వృతేహ" అనిచెప్పియుండుటచేత మాళవదేశమునందలి సర్వవర్ణములవారును రుద్రదాముని కడకుఁబోయి తమసంరక్షణకొఱకు నాతనిరాజుగఁ జేసిరనియు, "భ్రష్టరాజ్య ప్రతిష్ఠాపకేన" యనిచెప్పియుండుటచేత భ్రష్ట (పోయిన) రాజ్యమును ప్రతిష్ఠాపించినవాఁడనియు,[2] మహాక్షాత్రప బిరుదమును వహించిన

I. Arch Rep 1874-75p- I29, Indian Antiquary,1878(Vcl vii) p. 26p. 261, 269.

2 "భ్రష్టరాజ ప్రతిష్ఠాపకేనయని భగవన్‌లాలను పండితుఁడు "ఇండియన్ అంటిక్వేరీ యనుగ్రంథము ౭ వ సంపుటమున వ్రాసియున్నాఁడు గాని ఆదిగువనుజేర్చిన వ్యాఖ్యానములో రాజయనుదానిని రాజ్యయని చదువుట సరియైన పాఠమని డాక్టరు బూలరుగారుచెప్పిరి.

వాఁడనియు, అకరావంతి, అపరాంత, అనూప, సురాష్ట్రి మొదలగు దేశములను జయించిన వాఁడనియు,దక్షిణాపథరాజగు శాతకర్ణిని రెండుమాఱులు జయించిన వాఁడయినను సమీపబంధుత్వముకలిగి[1] యుండుటచేతవానిని నాశముచేయ లేదనియు మొదలుగాఁగల సంగతులెన్నియో చెప్పఁబడినవి. ఈరుద్రదామునికొడుకు రుద్రసింహుఁడనువాఁడు. ఈరుద్రసింహునికొడుకు రుద్రసేనుఁడనువాఁడు. వీనిశాసనమొకటి "జాస్‌దన్, అనుప్రదేశమునఁ గానంబడుచున్నది. శక కాలము ౧౨౭వ సంవత్సరమున భాద్రపదబ౭ నాఁడు మహాక్షాత్రపచ స్తనమహారాజుయొక్క మనుమని మనమఁడును,క్షాత్రపస్వామి జయదామమహారాజుయొక్కకుమారుని మనమఁడును,మహాక్షాత్రపరుద్రదామ మహారాజుయొక్క మనమఁడును, మహాక్షాత్రప భద్రముఖస్వామి రుద్రమహారాజుయొక్క కుమారుడునగు మహాక్షాత్రప భద్రముఖస్వామి రుద్రసేన మహారాజుయొక్క యీచెఱువు" మొదలుగాఁగల విషయములుగలవు.[2]

## శాలివాహనులకు క్షాత్రపులకుఁ గలసంబంధము.

సాల్సెట్టిదీపములోని కన్హేరిస్తూపములోని ౧౧వ శాసనమున చెలమనుగూర్చిన దానమునుగూర్చి భగవన్‌లాల్ ఇంద్రాజీపండితుఁడు "మహాక్షాత్రపుఁడయిన రుద్రX+Xయొక్క కూఁతురును, కర్దమక రాజవంశమునందు జనించిన వాసిష్ఠీపుత్రి శాతకర్ణియొక్క రాణియునగుX+X ...క్క" అని శాసనములోని కొన్నిపంక్తులను చదువుచున్నాఁడు. దీనింబట్టి డాక్టరు బూలరుగారు వాసిష్ఠీపుత్రిశాతకర్ణి యొకయాంధ్రిరాజనియు, వానిరాణి క్షాత్రపునికూఁతురనియు, కన్హేరి శాసనములోనుండిన వాసిష్ఠీపుత్రి శాతకర్ణియు, చతురపాన (చతుష్పర్ణ)

1 సంబంధావదూరయు" యనుదానిని "సంబంధావదూరతయు" యని వ్రాయుట మంచిదనిచెప్పి శాతకర్ణి దేశము దూరమగుటచేత రుద్రదాముఁడు విడిచిపెట్టెనని భాండార్కరుగారు తలంచుచున్నారు.

2 Dr. Bhau Daji Journal, Bombay Branch Roy, As Soc Vol viii. p. 235.



వాశిష్ఠీపుత్ర శాతకర్ణియు నొక్కఁడేయనియు, వానిభార్య మహాక్షాత్రపుఁడు రుద్రునియొక్క కూఁతురనియు,ఆమెయె యజ్ఞశ్రీశాతకర్ణియొక్క తల్లియగు గోతమియనియు, కాఁబట్టి రుద్రదామునకు దక్షిణాపథపతితో గలసంబంధము పైఁ జెప్పినప్రకారము తనయల్లుఁడైనచతురపానుని బట్టిగాని మనమఁడయినయజ్ఞశ్రీబట్టిగాని,యజ్ఞశ్రీతల్లి రుద్రదామునికి సమీపబంధుత్వము కలిగియుండుటఁ బట్టిగాని యేర్పడియుండవచ్చునని సారాంశమును దేల్చిరి. పైఁజెప్పినశాసనమునుబట్టి మహాక్షాత్రపుఁడయిన రుద్రదామునియొక్క యల్లుఁడు వాసిష్ఠీపుత్ర శాతకర్ణియని స్పష్టమగుచుండఁగా వాసిష్ఠీపుత్రి పులమాయి రుద్రదాముని యల్లుఁడని స్మిత్తుగారు చెప్పుటకుఁ గారణము గానరాదు. దక్షమిత్రనహపానుని కొమార్తెయనియు, ఋషభదత్తుని భార్యయనియు నాసికశాసనములలోఁ గన్పట్టుచుండఁగా స్మిత్తుగారుదక్షమిత్ర రుద్రదాముని కూఁతురనియు, శ్రీపులమాయి పట్టమహిషియని చెప్పుటకుఁ గారణముగానరాదు. రుద్రదాముఁడు జయించిన దక్షిణాపథపతి శాతకర్ణిగాని మఱియొకఁడుగాఁడు. శ్రీపులమాయికి శాతకర్ణి యను పేరులేదు. రుద్రదాముని యల్లుఁడుగూడ శాతకర్ణియనుపేరు గలిగియుండెను. అదియునుంగాక శ్రీపులమాయికి రుద్రదాముని తాతయగు చస్తనుఁడు సమకాలీనుఁడని టాలెమి వ్రాయుచున్నాడుగాని రుద్రదాముడు సమకాలీనుడని వ్రాసియుండలేదు. రుద్రదాముని జనగడశాసనములో శకనృపకాలము ౭౨వ సంవత్సరమునవని చెప్పినను ఆసంవత్సరము చెఱువుగట్టు తెగిపోయెనని చెప్పెనేకాని తానాసంవత్సరము గుహాతొలిపించి శాసనము వ్రాయించినట్లు చెప్పియుండఁలేదు. కాఁబట్టి రుద్రదాముఁడు శ్రీపులమాయితోఁగాక వాసిష్ఠీపుత్రి చతుష్పర్ణ శాతకర్ణికిని, గోతమిపుత్రయజ్ఞశ్రీశాతకర్ణికిని మాత్రము సమకాలీనుఁడుగానున్నవాఁడు. ఒకవేళ శ్రీపులమాయి వృద్ధదశలోనుండినను నుండవచ్చును. కనుక శ్రీపులమాయి రుద్రదాముని యల్లుఁడనియు, రుద్రదాముఁడు శ్రీపులమాయిని రెండుసారులోడించెననియు, దక్షమిత్ర రుద్రదాముని కూఁతురనియు విన్సెంటుస్మిత్తుగారు వ్రాసినది విశ్వసింపఁదగినదిగాఁ గన్పట్టదు. ఇందుకు శాసనములే ప్రబలసాక్ష్యము లిచ్చుచున్నవి. శ్రీపులమాయికాలమున కో

ల్హాపురమునందు వాసిష్ఠీపుత్ర విలివాయకురుఁడు రాజప్రతినిధిగనుండెను. వీనిపే రిటి నాణెములు కోల్హాపురమునందు గాన్పించినవి.

## వాసిష్ఠీపుత్త్రి చతుష్పర్ణ శాతకర్ణి.

ఇతఁ డే కాలమునందుండినవాఁడో నిశ్చయముగాఁ దెలియరాదు. ఇతఁడు గోతమిపుత్త్రి శాతకర్ణియొక్క పుత్రులలో నొకఁడై యుండవచ్చును. ఇతఁడు మాధారిపుత్రశకసేనుని కొడుకనియు క్రీ. శ. ౧౩౮ దవ సంవత్సరప్రాంతమున దక్షిణమహారాష్ట్రిదేశమును బరిపాలించుచుండెనని డాక్టరు భాండార్కరు గారు వ్రాయుచున్నారు.[1] ఈతఁడే పురాణములలో నుదాహరింపఁబడిన చకోర శాతకర్ణియనియు, ఈతఁడే మొదటి విలివాయకురుఁ డనియు, ఈతఁడాఱుమాసములుమాత్రమే రాజ్యముచేసెననియు క్రీ. శ. ౩౪ గవసంవత్సర ప్రాంతమున నుండెననియు విన్సెంటుస్మిత్తుగారు వ్రాయుచున్నారు.[2] ఇతఁడు రుద్రదాముని యల్లుఁడనియు, గోతమిపుత్త్రి యజ్ఞశ్రీశాతకర్ణియొక్క తండ్రియనియు డాక్టరు బూలరుగారు వ్రాయుచున్నారు.[3] నానాఘట్టము బాటమీఁదను ఈ నడుమ నూతనముగాఁ గనిపెట్టఁబడిన నీటితొట్టిమీఁద నొకశాసనము గన్పట్టెను. దానిపైన "చతరపానశాతకానివాసఠి" వాసిష్ఠీపుత్త్రి చతుష్పర్ణశాతకర్ణియనుపేరు వ్రాయఁబడియున్నది. సుపారాపట్టణమునఁగనుంగొనఁబడిననాణెములో చతుష్పర్ణుని పేరు యజ్ఞశ్రీశాతకర్ణుని పేరును నుదాహరింపఁబడియున్నవి. ఇతఁడు ధాన్యకటకము నందుండి (యాంధ్రి) రాజ్యమునంతయుఁ బరిపాలించినవాఁడో లేక మఱియేభాగమునకైన రాజప్రతినిధిగనుండి పరిపాలించినవాఁడో స్పష్టముగాఁ దెలియరాదు.

1 Early History of Deckhan, section vi

2 Early History of India p. 197

3 Burgess reports; Kanheri Inscriptions no. 11. Numismata orientalia p. 24



## శివశ్రీ శాతకర్ణి.

(క్రీ. త. ౧౫౮ మొదలుకొని క్రీ.త. ౧౬౫ వఱకు)

ఇతఁడును గోతమిపుత్ర శాతకర్ణికిని వాసిష్ఠిరాణికిని జనించినవాఁడు. శ్రీపులమాయిసోదరుఁడుగ నున్నాఁడు. ఇతఁడు పులమాయి మరణానంతరము రాజ్యభారమును వహించినట్లు గాన్పించుచున్నది. వీనిపేరిటినాణెములు కొన్ని ధరణికోట సమీపమున దొరకినవని రివరెండు థామస్సనువారు వర్ణించియున్నారు.[1] ఇతఁ డత్యల్పకాలము మాత్రమె రాజ్యపాలనము చేసెను. వాసిష్ఠీపుత్త్రి చతుష్పర్ణ శాతకర్ణియె శివశ్రీశాతకర్ణియై యుండునేమోయని సందియము కలుగుచున్నది. భగవన్‌లాల్ పండితుఁడు మాధారిపుత్త్రిశకసేనుఁడే శివశ్రీ కావచ్చునని తలంచిరి. భాండార్కరు పండితుఁడుగూడ మొదట నట్లే తలంచిరి గాని యిటీవల నంగీకరించినవారుకారు. థామస్సుగారికి ధరణికోట సమీపమున దొరకిననాణెములలో "శకసేనస" యనియుండక "శకశకాస" యనియుండుటచేత శివశ్రీశాతకర్ణి మాధారిపుత్ర శకసేనుఁడు కాఁజాలఁడని భాండార్కరుగారు వ్రాసిరి. ఇతఁడు శైవమతాధిక్యతను గలిగియుండిన బ్రాహ్మణమతమవలంబించినవాఁడుగ నుండినను బౌద్ధులను బ్రాహ్మణులను తండ్రివలెనే సమానదృష్టితోఁ జూచినవాఁడు. ఈయాంధ్రరాజులతల్లులు బ్రాహ్మణమత మవలంబించిన శకరాజులయొక్కయు, పహ్లవరాజులయొక్కయు పుత్రికలగుటచేత నాంధ్రరాజులుకూడ గడపటివారు బ్రాహ్మణమతాభిమానులగుచువచ్చినట్లు గన్పట్టుచున్నది.

## శివస్కందుఁడు.

(క్రీ. త. ౧౬౫ మొదలుకొని క్రీ. త. ౧౭౨ వఱకు.)

శివశ్రీమరణానంతరము రాజ్యభారమును వహించినవాఁడు శివస్కందుఁడని మత్స్యవిష్ణు భాగవతపురాణములు మూడును పేర్కొనుచున్నవిగాని వాయుపురాణముమాత్రము శివస్కందుని పేరు విడిచిపెట్టినది. శివస్కందుని పేరు

1 The Indian Antiquary vol. ix, p. 64.

మాత్ర మెగాదు. శివశ్రీ పేరుగూడ వాయుపురాణము పేర్కొనియుండలేదు. వాయుపురాణము పేర్కొనకపోయినను శివశ్రీయును, శివస్కందుఁడును ధాన్యకటకము రాజధానిగా నాంధ్రరాజ్యమును బరిపాలించినది వాస్తవమేగాని శివస్కందుఁడుమాత్రము ధాన్యకటకమును విడిచి కాంచీపురమునుగూడ రాజధానిగఁజేసికొని పరిపాలన చేసినట్లు గానంబడుచున్నది. శివస్కందుఁడు బ్రాహ్మణమతమవలంబించినవాఁడుగఁ గానంబడుచున్నాఁడు. ఇతఁడు శివశ్రీయొక్క కుమారుఁడేమోయని సందియము కలుగుచున్నది. శివశ్రీ పేరు భాగవతపురాణము వేదశ్రీయని పేర్కొనుచున్నది. వేదశ్రీయను పేరు నానాఘట్టము గుహాలో నొక శాసనమునఁ గానంబడుచున్నది. శివశ్రీ యనునతఁడే వైదికమతమవలంబించి వేదశ్రీయను పేరుపెట్టుకొనెనేమో యోజింపవలసియున్నది. ఆశాసనమునందు వేదశ్రీయనువాఁడు పవిత్రములయిన యాహుతులఁగొన్నిటిని సమర్పించెనని చెప్పఁబడియున్నది.[1] ఈశాసనమును బరిశోధించినవారు దానినిఁబూర్ణముగఁ దెలిపియుండలేదు. విశేషభాగము శిథిలమైయున్నది. కాఁబట్టి వేదశ్రీయనువాఁడు యజ్ఞయాగాదికర్మల నాచరించెనని చెప్పఁదగును. శివస్కందుఁడు బ్రాహ్మణమత మవలంబించుట చూడఁగా వేదశ్రీయొక్క తనయుఁడేమోయని సందియము కలుగుచున్నది. అయినను కాకపోయినను శివస్కందుఁడు మాత్రము మిక్కిలి బ్రాహ్మణమతాభిమానము గలవాఁడనుటకు సందియములేదు. ఆకాలమునందలి శకరాజులును పహ్లవరాజులును బ్రాహ్మణమత మవలంబించుటచేతను, ప్రజాపరిపాలకులుగనుండుటచేతను బ్రాహ్మణులు వారిని క్షత్రియులనుగా నంగీకరించి వారిని తమస్వాధీనముఁ జేసికొనఁ బ్రయత్నించుచున్న కాలమగుటచేత నీరాజులందఱును బ్రాహ్మణులకు శర్మవలెనె తమనామములకు వర్మయనుదానిని జేర్చుకొని యార్యక్షత్రియులమని లోకమునకు విశదపఱచుటకొఱకు బ్రాహ్మణమతముపట్ల విశేషాభిమానముంజూపుచు బ్రాహ్మణమతమును విజృంభింపఁ జేయఁజూచుచుండిరి. అటువంటివారిలో శివస్కందుఁడొకఁడుగఁ గన్పట్టుచున్నాఁడు.

1 J. R. A. S. Vol V. p. 287; Jour, Bom, Branch Roy As soc; Vol XIII p 404 and Vol xiii pp. 310.312.



ఇతఁడు బ్రాహ్మణులకు భూములు మొదలగునవి యొసంగి యనేక బ్రాహ్మణులను ఆంధ్రదేశమునకు రప్పించినట్లు గానంబడుచున్నది. ఇతఁడు మతసంస్కరణమునఁ గ్రొత్తత్రోవను తొక్కినవాఁడని చెప్పవలసియున్నది. వీని మాతామహుఁడును, మాతులుఁడును, తల్లియును మొదట పహ్లవజాతికి సంబంధించినవారయి యాంధ్రులలోఁ గలిసిపోయి పల్లవులని పిలువంబడుచుండెడివారని తోఁచుచున్నది. ఆకాలమునందు పల్లవనాయకు లనేకులాంధ్రులకడ దండనాథులుగను, రాజప్రతినిధులుగను, మంత్రులుగను నుండి వారలతో సంబంధబాంధవ్యముల నెఱపుచుండిరని యాకాలపు చరిత్రమునుబట్టి మనము సులభముగాఁ దెలిసికొనవచ్చును. ఈకడపటి యాంధ్రరాజులలోఁ గొందఱు పల్లవులతోడి సంబంధముచేతఁ దాము పల్లవ వంశజులమని డంబముతోఁ జెప్పుకొనుచుండిరి. ఆపల్లవ వంశమునకుఁ గౌరవముకలుగుటకై యేభరద్వాజ ఋషికో, ఏయిక్ష్వాకునకో, ఏసూర్యచంద్రులకో ముడిపెట్టుచుండిరి. ఆంధ్రరాజుగనుండిన శివస్కందునిగూర్చి యిచ్చట చెప్పవలసిన దింతకన్న నేమియులేదు. పల్లవరాజుగనుండిన శివస్కందునిగూర్చి మాత్రము పల్లవ వంశమునుగూర్చి వ్రాయు ప్రకరణమునఁ జర్చింపఁదలఁచి ప్రస్తుతమిట విరమించుచున్నారము

## గోతమిపుత్త్ర యజ్ఞశ్రీ శాతకర్ణుఁడు.

### (క్రీ. శ. ౧౭౨ మొదలుకొని ౨౦౫ వఱకు)

బహుకాలము పరిపాలనముచేసి విశేషకీర్తిని సంపాదించిన యాంధ్రరాజులలో గోతమిపుత్త్రి యజ్ఞశ్రీశాతకర్ణుఁడొకఁడు. వీనితల్లి గోతమి. ఈమె యుజ్జయినీ క్షాత్రపులయింటి యాడుపడుచు. మహాక్షాత్రపుఁడు రుద్రదాముని కూతురయినంగావచ్చును. అట్లయినపక్షమున వాసిష్ఠీపుత్త్రి చతుష్పర్ణ శాతకర్ణుఁడు యజ్ఞశ్రీశాతకర్ణునకుఁ దండ్రికావలయును. ఇతఁడు పులమాయి, శివశ్రీ, శివస్కందుఁడు వరుసగా రాజులై పరిపాలనము సేయునప్పుడు యువరాజుగను, రాజప్రతినిధిగను ప్రతిష్ఠానముననుండి క్రీ. శ. ౧౫౪వ సంవత్సరము మొదలుకొని ౧౭౨వ సంవత్సరమువఱకును మహారాష్ట్రదేశమును బరిపాలించి ౧౭౨వ సంవత్సరము మొదలుకొని ౨౦౫వఱకును ఆంధ్రరాజ్యమున కభిషిక్తుఁడై పరి

పాలనము చేసినట్లు గానవచ్చుచున్నది. వీనికాలమున మాళవదేశము తనస్వాతంత్ర్యమును బ్రకటించినటులఁ గానంబడుచున్నది. ఉజ్జయినీ క్షాత్రపులదగు అవంతిదేశ మాంధ్రరాజుల పాలనము నందుండిన కాలమున రుద్రదాముఁడను వాఁడు తనపూర్వులు గోల్పోయిన రాజ్యమును మరల స్వాధీనము చేసికొనెనని విని గోతమిపుత్త్రియజ్ఞశ్రీశాతకర్ణి వాని పైకిదండెత్తిపోయి రెండుపర్యాయము లు యుద్ధముచేసియు విజయము పొందలేకస్వరాజ్యమునకు మరలిపోవలసి వచ్చెను. ఇరువునుగూర్చియె రుద్రదాముఁడు జునగడశాసనములో దక్షిణాపథపతియైన శాతకర్ణిని రెండుమాఱు లోడించితి ననియు, దూరముచేతను, బంధుత్వముచేతను వానిదేశములోనికిఁ దఱుముకొనిపోవక నాశముచేయక విడిచిపెట్టవలసిన వాఁడనైతినని చెప్పుకొనియెను. ఈబంధుత్వము కూఁతురుబిడ్డయగుటచేతనే యని తోఁచుచున్నది. రుద్రదాముని కాలము నిర్ణయించునపుడు పాశ్చాత్యపండితులు భిన్నాభిప్రాయులై యెవరికిఁ దోఁచినరీతిని వారు చెప్పియుండిరి. కావునబట్టి శాతకర్ణికిని రుద్రదామునకును జరిగిన యుద్ధముల కాలమును దెలిసికొనుట మిక్కిలి కష్టసాధ్యముగ నున్నది. క్రీ. పూ. ౨౯వ సంవత్సరమున జరిగియుండునని లాసన్‌గారు చెప్పుచున్నారు[1]. అది యిదియని నిశ్చయపఱచలేక సంకోచముతో ప్రిన్సెప్‌గారు క్రీ.పూ. ౧౨౯వ సంవత్సరమయి యుండునని యూహించుచున్నారు. డాక్టరు భావుదాజీగారు క్రీస్తుశకము ౨౦౦ లని భావించుచున్నారు.[2] క్షాత్రపరాజుల నాణెములను గూర్చి వ్రాయుచు న్యూటనుగారు రుద్రదాముని క్రీ. శ. ౭౦-౭౫ సంవత్సరములలో నిలిపినారు.[3] ఈకాలమును రివరెండు థామస్సనువారామోదించుచున్నారు.[4] ఈశాసనమును ప్రిన్సెప్, విల్సన్, ఎజిలింగ్, భగవన్‌లాల్ ఇంద్రాజి, డాక్టరుబూలరు మొదలగువారనేకులు భాషాంతరీకరించి, ప్రకటించియున్నారు.[5] రుద్రదాముఁడు ౭౨వ సంవత్సరమున సుదర్శన సరస్సుయొక్క గట్టుతెగిపోయెనని తన శాసనమునందుఁ జెప్పియుండుటచేత నాసంవత్సరము శకకాల సంవత్సరమయి యుండును. కనుక నయ్యది క్రీస్తుశకకాలము ౧౫౦దవ సంవత్సరముగా నుండెననియు, అయ్యది చెఱువుకట్ట తెగిపోయిన సంవత్సరమని మాత్రమె చెప్పియుండుటచేత శాశాసనమాసంవత్సరము వ్రాయఁబడినది కాదనియు, అందలి విషయములంతకుఁ బూర్వము జరిగినవి కావనియు, డాక్టరు భాండార్కరుగారు చెప్పెడు హేతువులే సరియైనవయినపక్షమున రుద్రదాముఁడు జయించినది గోతమిపుత్త్రి యజ్ఞశ్రీశాతకర్ణియనియె చెప్పఁదగునుగాని లేనియెడ రుద్రదామునిచే జయింపఁబడినవాఁడు వాసిష్ఠిపుత్త్రి చతుష్పర్ణ శాతకర్ణియై యుండవచ్చునని భావించుచున్నారము. ఈగోతమిపుత్త్రియజ్ఞశ్రీశాతకర్ణి పేరుగలశాసనములు నాసిక, కార్లి, చినగంజాము మొదలగు ప్రదేశములందుఁ గానంబడుటచేత నీతనికాలమునఁగూడ నాంధ్రరాజ్యము బహుదూరము వ్యాపించియున్నదని విశ్వసింపవచ్చును. ఈతఁడును మొదటి గోతమిపుత్త్రునివలెనె మిక్కిలి పరాక్రమవంతుఁగలవాఁడుగా నుండెను. అతనివలెనె యీతఁడును బౌద్ధబ్రాహ్మణమతముల రెంటియందును సమానాదరము గలవాఁడుగనుండి విఖ్యాతి గాంచినవాఁడుగఁ గనుపట్టుచున్నాఁడు. బుద్ధునితరువాత బౌద్ధమతాచార్యులలో సుప్రసిద్ధుఁడయిన నాగార్జునాచార్యులీయజ్ఞశ్రీశాతకర్ణి కాలమున నున్నట్లు గాన్పించుచున్నది.

## శ్రీశైలబౌద్ధసంఘారామనిర్మాణము.

ఏడవశతాబ్ద మధ్యమున హిందూదేశమునందలి బౌద్ధమతస్థితిని దెలిసికొనఁగోరి చీనాదేశపు యాత్రికుఁడగు హౌనుత్సాంగు హిందూదేశమును జూడవచ్చి కొంతకాలము దేశయాత్రలు చేసి వెడలిపోయి వ్రాసిన హిందూదేశయాత్రాచరిత్రమునందు దక్షిణకోసల వృత్తాంతమును దెలిపినవెనుక కోసలము

1. Muir sanskrit Texts Vol ii p. 142 1st ed.
2. Jour, Bom, Branch, Roy, As, Soc Vol vii pp. 117-(120.
3. Ibid Vol ix. p. 17.
4. J. R. A. S Vol xiii N. S. P. 524.
5. Prinsep Translation. J. A. S. B Vol viii, pp. 334-348; Prof. H H. Wilson's, Prinsep's Essays, Vol ii pp. 57-67 Prof. Eggeling. Burgess second Report p. 129. Bhagavan Lal Indraji & Dr. Buhler, Ind. Ant. Vol viii, pp 257-263.

నకు నాగ్నేయమూల నరువది మైళ్లదూరమున పో-లో-మో-లో-కీ-లీ. (Po-lo-mo-lo-ki-li) పర్వతముమీఁదఁ బూర్వకాలమున బౌద్ధమతాచార్యుఁడగు నాగార్జునాచార్యుని కొఱకు సో, తో, ఫో, హో (So-to-pho-ho) అనురాజు బౌద్ధసంఘారామము నొకదాని నిర్మించెనని చెప్పియుండెను. ఏకాంతప్రదేశమున నుండిన యీపర్వతశిఖరము తక్కినవానికంటె మిక్కిలి యున్నతమైనదిగను, నడుమ నడుమఁ గనుమ లేవియును లేక యొక్కటే ఱాయితో గూడుకొని మిక్కిలి యేటవాలుగనుండు గట్లను గలిగియున్నది. ఏవింతవృత్తాంతము దెలియవచ్చినను తాను స్వయముగాఁబోయి చూడకయె సులభముగా విశ్వసించునట్టివాఁ డగుటచేత నీయాత్రికుఁడు చెప్పినమాటలను బట్టి వ్రాసినదానియం దతిశయోక్తి మెండుగాఁ గన్పట్టక మానదు. రాజు పెద్ద ఱాతిబండనడుమనుండి సొరంగమును త్రవ్వించి త్రోవగల్పించెననియు, దానిక్రిందనుండి మేము చూచినపుడు నిట్రముగానుండి యెత్తైనయాకొండ పొడవునను సొరంగములను జూచితిమనియు, క్రిందనడుచుట కనుకూలముగ గుహాలతోఁ గూడిన వసారాలును పైనగోపురములను గలిగి, యైదంతస్థుల కట్టడము గలదనియు, ఒక్కొక్కయంతస్తులో విహారములతోఁ జుట్టుకొనఁబడిన నాలుగేసి పడసాలలు(చావళ్లు) గలవనియుఁ జెప్పుచున్నాఁడు. మఱియును పేరు నల్లనిశిఖరమని దెలుపుచున్నదని కూఁడ తెలియఁజేయుచున్నాఁడు. అయిదవ శతాబ్దారంభము నందుండిన ఫాహియాన్ అను చీనాదేశస్థుఁడయిన యాత్రికుఁడు కాశీనగరము నందుండినపు డీప్రదేశమునుగూర్చి విని యింతకంటెను వింతయైన వృత్తాంతమును దెలుపుచున్నాఁడు. అతఁడు దానిని పో-లో-యు (po-lo-yu) అని పిలుచుచు పారావతమఠమని యర్థము చెప్పుచున్నాఁడు. హూనుత్సాంగు వాడిన "పో-లో-మో-లో-కి-లి" అనుపేరు జూలియన్ చెప్పినప్రకారము పరమాలగిరిలేక పరబరాగిరి యనిగాని బీల్ చెప్పినప్రకారము బ్రహ్మరాగిరి యనిగాని యర్థమగునుగాని యివియేవియును చీనాయాత్రికు లిరువురు చెప్పెడి వర్ణక్రమములతో పారావతమని స్థలనిర్దేశము చేయుటకుఁ దోడ్పడఁ జాలకున్నవి.

పారావతమను పేరే నిజమైనదేమో? ఈ పారావతమఠమునకే నాగార్జునాచార్యులు బౌద్ధభిక్షువులను సన్న్యాసులను దానిలో నివసించుటకు రప్పించి వారి యుపయోగార్థము ధర్మశాస్త్రగ్రంథములన్నిటిని వ్యాఖ్యానములతో సహా దెప్పించి యొక మహాభాండారము నేర్పాటుచేసెనని చెప్పుదురు. అతఁడు (నాగార్జునుఁడు) ద్యాపలగిరి (Dyapalagiri) అనఁగా శ్రీపర్వతమునందు నిర్వాణముంజెందెనని త్రివిష్టపదేశ గ్రంథములు (Tibetan works) చెప్పుచున్నవి. ఈ శ్రీపర్వతము తప్పక యీ శ్రీశైలపర్వతమునకే యన్వయించుచున్నది. అచ్చటి బ్రాహ్మణులకును బౌద్ధులకును గలహములు జనించి కొంతకాలమునకు బ్రాహ్మణులు బౌద్ధులను వెడలఁగొట్టించి యా బౌద్ధవిహారమును స్వాధీనముఁ జేసికొనిరని గూడ హూనుత్సాంగు చెప్పియున్నాఁడు. ఫర్గ్యూసను గారూహించినట్లు కోసలమునకు వైరగడా రాజధానియై హూనుత్సాంగు చెప్పిన యిరువది మైళ్లదూరము(300li) రాజధానినుండియె కొలిచినయెడల నీమఠముయొక్క ప్రదేశము చాందాకు నాగ్నేయమూలను మాణిక్యదుర్గమునకును, వరదానదికిని సమీపస్థలమైయుండవలయును. ఫర్గ్యూసనుగారు "భాండక్" అను పట్టణసమీపమునందలి "వింధ్యసాని" పర్వతమే హూనుత్సాంగు చెప్పిన పర్వతమని చెప్పుచున్నారుగాని యీపర్వతము ప్రాచీనగుహాలను గొన్నిటిని గలిగియున్నను అతఁడు వర్ణించిన వర్ణనకు సరిపోవుచుండలేదు. కాని శ్రీపర్వతమనునది కృష్ణానదికానుకొని పైనివ్రేలాడుచుండి మల్లికార్జునుఁడను శివునియాలయముగలిగి ప్రసిద్ధికెక్కిన బ్రాహ్మణయాత్రాస్థలములలో నొక్కటిగనుండిన యెత్తైన కొండయెగాని మఱియొకటికాదు. ఈ శ్రీపర్వతమె శ్రీశైలమను మఱియొక పర్యాయపదముతో వాడుకొనఁబడుచున్నది.

శ్రీశైలము ద్వాదశ శివలింగక్షేత్రములలో సుప్రసిద్ధమైనది. ఇది ధాన్యకటకమునకు (ధరణికోట) ౧౦౭ మైళ్లదూరమునను, (W. S. W) కందనోలుకు (Kurnool) ౮౭ మైళ్లదూరమునను (E. N. E) నున్నది. ఇదిమాణిక్య దుర్గమునకు దక్షిణముగా ౭౫౦ మైళ్లదూరమున నఁగా కోసలదేశమునకు బహుదూరమున నున్నమాట వాస్తవమేయైనను హూనుత్సాంగు స్వయముగాఁ జూడక యితరులు చెప్పిన మాటలను బట్టి వ్రాసినదిగావున స్థాననిర్ణయమునుజేసి

దూరమును జెప్పుటలో నిశ్చయముగాఁ బొరపడి యుండవచ్చును. ఆ చెప్పిన దూరపరిమాణము, స్యెంతోకియా (కోసలము) (Sh-yen-toh-kia) యొక్క రాజధానినుండియో, లేక కోసలముయొక్క సరిహద్దునుండియో నిర్ణయించుటకుఁ గూడ నతని వాక్యము సందిగ్ధముగాఁ గన్పట్టుచున్నది. చీనాయాత్రికు లిరువురు వ్రాసినస్థలచరిత్రవర్ణనలు శ్రీశైలముమీఁది శివాలయమున కన్వయించుచున్నవి. శ్రీశైలమునకు శ్రీపర్వతమని సంస్కృతభాషాగ్రంథములయందుఁ దఱచుగా వాడఁబడి యున్నది. శ్రీపర్వతమను పేరు టిబెట్ గ్రంథములయందుఁ గానంబడుచున్నది. శ్రీశైలశివాలయము ప్రాచీనమైనదని చెప్పెడు గాథలుకూడ దీనిని బలపఱచుచున్నవి. ఎన్నివిధములచేతఁ జూచినను చీనాదేశపు యాత్రికు లిరువురియొక్క వర్ణనలు దీనికేయన్వయించుచున్నవి గనుక మనయజ్ఞ శ్రీశాతకర్ణి నాగార్జునునికొఱకు నిర్మించిన బౌద్ధసంఘారామ మిదియే యని మఱియొకమాఱు పేర్కొనుచున్నారము.

## నాగార్జునాచార్యుఁడు.

(క్రీ. శ. ౧౩౪ మొదలుకొని క్రీ. శ. ౨౦౦ వఱకు)

సింహళద్వీపములోని అనూరాధపురమునందలి రాన్వెల్లిదాగాబా ప్రతిష్ఠాపనోత్సవమునకు కాశ్మీరము, కాబూల్, హిందూదేశముయొక్క వివిధభాగములనుండియు ౮౪౪౦౦ మంది భక్తులు వెళ్లియుండఁగా మహాదేవమహర్షి పల్లవుల దేశములనుండి ౪౬౦౦౦౦ మంది భక్తులను వెంటఁగొనిపోయియుండెనని యైదవ శతాబ్దమునందు రచింపఁబడిన మహావంశమను బౌద్ధుల చరిత్రమునందు వ్రాయఁబడినది. ఇందలి సంఖ్య నమ్మఁదగినది కాకపోయినను హిందూదేశములో నేభాగముకంటెను హిందూద్వీపకల్పముయొక్క తూర్పుభాగమునందు బౌద్ధమతము పూర్వకాలమున వర్ధిల్లుచుండెనని విశ్వసించుటకు మాత్రమవకాశమిచ్చుచున్నది. బౌద్ధమతాచార్యుఁడగు నాగార్జునునకు పోషకుఁడు (దానపతి) గానుండి తనరాణియొక్క తంత్రమునకు వశుఁడై యామెయొక్క కొడుకు సుశక్తియనువానికి సింహాసనమును కట్టఁబెట్టుటకై ప్రయత్నించి తనయాచార్యుఁడైన నాగార్జునుఁడు మరణమునొందిన కాలముననే మరణమునొందిన రాజు సోతో-పో-హో-నా (so-to-pho-hau-na) అనఁగా శాద్వాహన వంశములోనివాఁడనియు, స్యెంతోకియాయని (sh-yen-toh-kia) పిలువఁబడుచుండెననియు, మఱియొక చీనాయాత్రికుఁడగు "ఈచింగ్" అనునతఁడు నుడువుచున్నాఁడు. క్రీస్తుశకము ౪౩౧ వ సంవత్సరమునందుండి నాగార్జునాచార్యుని సుహృల్లేఖకు సంస్కృత భాషాంతరీకరణముగావించిన గుణవర్మయను వాఁతఁడు వానిని శ్యాంథోకియా యనియె పిలిచెను. చీనాదేశస్థులు సంస్కృతనామములను భాషాంతరీకరించునపుడు వారివారి యిష్టానుసారము పోవుచువచ్చిరిగాని యొకదారిని పోయియుండలేదు. ఆంధ్రరాజులవంశము శాద్వాహనవంశము కాదనియు శాతవాహన వంశమనియు మన మెఱుఁగుదుము. విదేశీయుల యుచ్చారణలయం దిట్టి మార్పులు గానంబడుచుండుట యొకక్రొత్తవిషయముకాదు. మనపేరులను విదేశీయులును విదేశీయులపేరులను మనమును తప్పుగా నుచ్చరించుచునే యున్నారము. శ్యంతోకియా లేక శాంథోకియా యను నామమునకు భాషాంతరీకరణము గానరాదు. టిబెటీయ గ్రంథములయం దతఁడు "బ్డె-బ్యెడ్" అని పిలువంబడుచున్నాఁడు. అనఁగా శంకరుఁడని సంస్కృత భాషాంతరీకరణము చేయఁబడియెను. సుఖమును గలుగఁజేయువాఁడు శంకరుఁడనియర్థము. ఉదయనుఁడని యతఁడు పిలువంబడుచుండెననియు, యౌవనమున నాతఁడు జేతకుఁడనికూడ పిలువంబడుచుండెననియు, తారానాథుఁడు చెప్పుచున్నాఁడు. ఈపేరులెంత మాత్రమును శాంథోకియాయను పేరునకు సరిపోయియుండలేదు. శాంతవాహనవంశము లేక అంతివాహనవంశమని వానివంశనామమును తారానాథుఁడు పేర్కొనుచున్నాఁడు. ఈపైనుదాహరింపఁబడిన దానింబట్టిచూడఁగా నీతఁడుకడపటి యాంధ్రరాజులలో వాఁడై యుండుననియు, నాసిక కన్హేరి శాసనములలోని శ్రీయజ్ఞ శాతకర్ణియే యై యుండవచ్చుననియు మనమూహించి నిశ్చయింపవచ్చును. ఇతఁడు రెండవశతాబ్దాంతమునను మూడవశతాబ్ద ప్రారంభమునను ఆంధ్రరాజ్యమును బరిపాలించుచుండెనని మనము దెలిసికొనుచున్నారము. నాగార్జునుఁడు కూడ నీకాలమునందేయుండి యున్నవాఁడు. ఇంకొకరీతిగ నాగార్జునుని కాలమును నిర్ణయింప వచ్చును. టిబెటీయ గ్రంథములలో రెండవ బౌద్ధసభను

గూర్చి యేమియు వ్రాయఁబడి యుండలేదు. మఱియును అశోకుని కాలమునకు (క్రీ. పూ. ౨౪౦) బూర్వము ౧౦౦ సంవత్సరముల క్రిందటనే బుద్ధనిర్వాణము చెప్పఁబడియున్నది. కనుక శకరాజయిన కనిష్కుని బౌద్ధసభ బుద్ధనిర్వాణమునకుఁ దరువాత ౪౦౦ సంవత్సరములకు జరిగినదని పేర్కొనుచున్నది. ఈకాలనిర్ణయమునే హౌనుత్సాంగు తనగ్రంథమునం దనుసరించి యున్నవాఁడు. బుద్ధనిర్వాణమునకు నాలుగువందల సంవత్సరములకు వెనుకఁ జెప్పఁబడిన కనిష్కుఁడను రాజు క్రీస్తుశకము ౭౮-౧౦౦ సంవత్సరముల ప్రాంతముననున్నవాఁడని సామాన్యముగా నందఱిచేత నంగీకరింపఁ బడియెను. బౌద్ధుల ప్రధానగురువగు పార్శ్వికుఁడు బౌద్ధసభ కధ్యక్షుఁడుగా నున్నందున కనిష్కునకు సమకాలీనుఁడై యుండెను. పార్శ్వకుని తరువాత నాచార్యపీఠము నెక్కినవాఁ డశ్వఘోషుఁడు. నాగార్జునుఁడు నాలవవాఁడు. దీనింబట్టి నాగార్జునుఁడు రెండవ శతాబ్దాంతముననున్నట్లు చెప్పవచ్చును. బుద్ధనిర్వాణమునకు ౫౦౦ సంవత్సరముల వెనుక నాగార్జునుఁడున్నట్లు కొన్నిచరిత్రములు చాటుచున్నవి. టిబెట్ దేశచరిత్రమును వ్రాసినతారానాథుఁడు క్రీ. శ. ౧౮౦-౨౨౦ లకునడుమ నాగార్జునుఁడున్నవాఁడని కాలనిర్ణయము చేయుచున్నవాఁడు. కాఁబట్టి గోతమిపుత్రియజ్ఞశ్రీకాలమున నాగార్జునాచార్యుఁడున్నవాఁడని చెప్పవచ్చును వీని పేరుగల నాణెములయందు "ఓడ" చిత్రింపఁబడియుండుటచేత నీతనికాలమున నోడలనుగూర్చియు సముద్రమునుగూర్చియు నావికాయాత్రను గూర్చియు జ్ఞానమును ప్రజలుగలిగి యున్నారనియు, సుమత్రా, జావా, బోర్నియో మొదలగుద్వీపాంతరములతోడను, చీనా, బర్మాదేశములతోడను, సింహళ ద్వీపముతోడను, విశేషవర్తకవ్యాపారము జరుగుచున్నట్లుగ నూహింపఁబడుచున్నది. ఆంధ్రరాజులలో విశేషకాలము రాజ్యపాలనము చేసినవారిలో నీతఁడొకఁడుగాఁ గన్పట్టుచున్నాఁడు. వీనివెనుక నాంధ్రరాజ్యము బహుకాలము నిలిచి యుండలేదు. రాజవంశము పలుశాఖలుగఁ జీలిపోవుటవలనను, రాజ్యభారమును వహించినవారు బలహీనులగుటవలనను వీనితరువాత నాంధ్రరాజ్యమంతః కలహములచే నంతరించి పోయినది.



## మాధారిపుత్రశకసేనుఁడు.

(క్రీ. శ. ౧౮౦)

ఈతఁడు పశ్చిమాంధ్రదేశమగు మహారాష్ట్రదేశమునఁ బరిపాలనము చేసినట్లు గనంబడుచున్నదిగాని పూర్వాంధ్రదేశమునఁ బరిపాలనము చేసినట్లుగా నరాదు. కొల్హాపురనాణెములయందును కన్హేరిశాసనమునందును వీనిపేరు గానంబడుచున్నది. కొన్నినాణెములయందొకప్రక్క గోతమిపుత్రని పేరును మఱియొకప్రక్కను మాధారి పుత్రని పేరును గన్పట్టు చుండుటచేత గోతమిపుత్రియజ్ఞశ్రీ శాతకర్ణికంటె ముందుగ మాధారిపుత్రుడె రాజ్యపాలనము చేసెనని రివరెండు థామస్‌గారు తలంచుచున్నారు గాని మాధారిపుత్రుడే వెనుకనున్నట్టు నాణెములయొక్క ముద్రణమె చాటుచున్నదని భాండార్కరుగారు నుడువుచున్నారు. మఱియును భాండార్కరుగారు మాధారిపుత్రుఁడు గోతమిపుత్రని శాఖలోనివాఁడు కాఁడనియు మఱియొకకల్పితమైన శాఖలోనివాఁడయి యుండు ననియు గూడ వ్రాయుచున్నారు. వీనికాలమున కొల్హాపురమండలమున శివలకురుఁడను వాఁడు రాజప్రతినిధిగ నుండెను.

## విజయశ్రీశాతకర్ణి.

(క్రీ. శ. ౨౦౨ మొదలుకొని క్రీ. శ. ౨౦౮ వఱకు)

ఈవిజయశ్రీశాతకర్ణికాలమున విజయవాడపట్టణము గట్టఁబడినదిగ నూహింపఁ బడుచున్నది.

## చంద్రశ్రీశాతకర్ణి.

(క్రీ. శ. ౨౦౮ మొదలుకొని క్రీ. శ. ౨౧౧ వఱకు)

వీనిపేరుగల నీసపునాణెములు గొన్ని గానంబడినవి.

## పులమావి.

(క్రీ. శ. ౨౧౧ మొదలుకొని క్రీ. శ. ౨౧౮ వఱకు)

ఈపై నుదాహరింపఁబడిన యాంధ్రరాజులనుగూర్చి మనకేమియును

తెలియరాదు. వీరుమాత్రమె పురాణములలోఁ జేర్కొనఁబడినవారు. అయినను పెక్కండ్రు రాజులపేరులు వినవచ్చుచున్నవి గాని వారల చారిత్రము వినఁబడదు.

## పార్వతీయాంధ్రులు.

ఆంధ్రభృత్యవంశము నశించిన వెనుక నావంశములోని మఱియొక శాఖవారయిన యేడుగురాంధ్రులు రాజ్యభారమునువహించి పరిపాలింతురని సూచించెడి "అంధ్రాణాంసంస్థితా (తే?) రాజ్యేతేషాం భృత్యాన్వయేనృపాః సప్తైవాంధ్రా భవిష్యంతి." అనువాక్యము మత్స్యపురాణమునందుఁ గానంబడుచున్నది. ఇటువంటి శ్లోకము వాయుపురాణమున సహితము గానంబడుచున్నది గాని యాభాసముగా నున్నది. మాధారిపుత్త్రి శకసేనుఁడా శాఖలోనివాఁడేమో?

## మాధారిపుత్త్ర పురుషదత్తుఁడు.

వీని పేరుగల శాసనమొకటి కృష్ణామండలములోని జగ్గయ్యపేట స్తూపమునందుఁ గానంబడుచున్నది [1] ప్రసిద్ధికెక్కిన యిక్ష్వాకువీరుఁడును మాధారయొక్క పుత్త్రుఁడును నగు పురుషదత్తునియొక్క ౨౦వ పరిపాలన సంవత్సరమున వర్షఋతువుయొక్క యెనిమిదవపక్షమున దశమినాఁడు మహాకాండూరగ్రామనివాసియును కమ్మకరాతవిషయమున నడాతూరగ్రామవాసియగు నాగచంద్రునియొక్క కుమారుఁడును, ఆవేశనియునగు సిద్ధార్థుఁడు తనతల్లి నాగలానితోఁడను, తన భార్యసముద్రాణితోడను, కుమారుఁడు మూలశ్రీతోడను, కుమారిక నాగబంధునికతోడను, సోదరుఁడు బుద్ధనికునితోడను, వానిభార్యతోడను, వారియిరువురు పుత్త్రిలగు నాగశ్రీచంద్రశ్రీలతోడను, సిద్ధార్థనికయొక్క కూతురితోడను వేలగిరి గ్రామమునందుండిన రక్తబంధువులతోడను, మిత్రులతోడను గలిసి బుద్ధునిచైత్యముయొక్క ప్రాగ్ద్వారము సమీపమున ప్రాణికోటియొక్క క్షేమమునిమిత్తము ఆయక స్తంభముల నైదింటి నిర్మించి దానముచేసెనని చెప్పఁబడియున్నది. ఈమాధారి పుత్త్రిపురుషదత్తుఁడును ఇక్ష్వాకువంశజుఁడని చెప్పఁబడియున్నను సంకరసంతానకోటిలోనివాఁడేయని చెప్పవచ్చును.

1 Burgess Amrawati&Jaggayyapeta Stupas p. III



ఈశాసనమునందు కమ్మకరాతవిషయము పేర్కొనఁబడినది. రాతయనగా రాష్ట్రము; కమ్మకరాష్ట్రము-జగ్గయ్యపేటకుఁబడమట నిజామురాజ్యములో కమ్మమెట్టుగ్రామముకలదు. దానిచుట్టునుండు ప్రదేశమునకే కమ్మకరాష్ట్రమని పేరుగలిగి యుండవచ్చును గనుక నీమాధారిపుత్త్రిపురుషదత్తుఁ డాంధ్రభృత్యవంశానంతరము స్వతంత్రుఁడై కొంతభాగ మాక్రమించుకొని పాలించుచుండిన పల్లవుఁడై యుండవచ్చును.

## చరిత్రము తెలియంబడని యాంధ్రరాజులు-ఆనందుఁడు.

గోతమిపుత్త్రిశాతకర్ణి పరిపాలనకాలమున వాసిష్ఠీకుమారుఁడయిన యానందుఁడనువాఁడు సాంచితోపుయొక్క దక్షిణద్వారము మీఁదనే దోదానము చేసినట్లుగ వ్రాయఁబడియున్నది. ఈతఁడు గోతమిపుత్త్రి శాతకర్ణియొక్క కడగొట్టు కొడుకని జనరల్ కన్నిహ్యామ్‌గారు వ్రాయుచున్నారు.

## హారితిపుత్త్ర శాతకర్ణి.

వీనిపేరు బనవాసిలోని శాసనమునందుఁ గానంబడుచున్నది. వానివంశముపేరు సందిగ్ధముగనున్నది గాని స్పష్టముగఁ దెలియుచుండలేదు.

1. Bhilsa Tope pp. 264. 272. pl xix no 190
Numismata orientalia p. 12
2. Arch, survey 1881, ins 44, p. 100.

ఆంధ్రభృత్యవంశము.

| వాయు. | | మత్స్య. | | విష్ణు. | భాగవత. |
|---|---|---|---|---|---|
| నామములు. | పరిపాలించిన సం. ల సంఖ్య. | నామములు. | పరిపాలించిన సం. ల సంఖ్య. | నామములు. | నామములు. |
| సింధుకుఁడు | ౨౩ | శ్రీ శుకుఁడు | ౨౩ | శ్రీప్రకుఁడు | పేరుచెప్పలేదు. |
| కృష్ణుఁడు | ౧౦ | కృష్ణుఁడు | ౧౮ | కృష్ణుఁడు | కృష్ణుఁడు |
| | | మల్లకర్ణి | ౧౦-౧౮ | శ్రీశాతకర్ణి | శాంతకర్ణుఁడు |
| | | పూర్ణోత్సంగుఁడు | ౧౮ | పూర్ణోత్సంగుఁడు | పౌర్ణమాస్యుఁడు |
| | | స్కందస్తంభి | ౧౮ | | |
| శాతకర్ణి | ౫౬ | శాతకర్ణి | ౫౬ | | |
| | | లంబోదరుఁడు | ౧౮ | లంబోదరుఁడు | లంబోదరుఁడు |
| ఆపిలకుఁడు | ౧౨ | అపీతకుఁడు | ౧౨ | ఇవిలకుఁడు | హివిలకుఁడు |
| | | మేఘస్వాతి | ౧౮ | మేఘస్వాతి | మేఘస్వాతి |
| | | స్వాతి | ౧౮ | | |
| | | స్కందస్వాతి | ౭ | | |
| | | మృగేంద్రస్వాతికర్ణ | ౩ | | |
| | | కుంతలస్వాతి | ౮ | | |
| | | స్వాతికర్ణ | ౧ | | |
| పతిమావి | ౨౪ | పులమావి | ౩౬ | పటుమతి | అటమానుఁడు |
| నెమికృష్ణుఁడు | ౨౫ | గౌరకృష్ణుఁడు లేక నారికృష్ణుఁడు | ౨౫ | అరిష్ఠకర్మ | అనిష్ఠకర్మ హాలేయుఁడు |
| హాలుఁడు | ౧ | హాలుఁడు | ౫ | హాలుఁడు | |
| సప్తకుఁడు లేక మండలకుఁడు | ౫ | మండలకుఁడు | ౫ | పట్టాలకుఁడు | తాళకుఁడు |
| పురీకసేనుఁడు | ౨౧ | పురీంద్రసేనుఁడు | ౫ | ప్రవిలసేనుఁడు | పురుషభీరు |
| శాతకర్ణి | ౧ | సుందరస్వాతికర్ణుఁడు | ౧ | సుందరుఁడు | సునందనుఁడు |
| చకోరశాతకర్ణి | ౬ మాస | చకోరస్వాతికర్ణుఁడు | ౬ మాస | చకోర | చకోర |
| శివస్వాతి | ౨౮ | శివస్వాతి | ౨౮ | శివస్వాతి | శివస్వాతి |
| గోతమపుత్రుఁడు | ౨౧ | గోతమిపుత్రుండు | ౨౧ | గోతమిపుత్ర | గోతమపుత్ర |
| | | పులమాయి | ౨౮ | పులిమతి | పురిమానుఁడు |
| | | శివశ్రీ | ౭ | శివశ్రీ | వేదశ్రీ |
| | | శివస్కందుఁడు | ౭ | శివస్కందుఁడు | శివస్కందుఁడు |
| యజ్ఞశ్రీ శాతకర్ణి | ౨౯ | యజ్ఞశ్రీశాతకర్ణి | ౨౯ | యజ్ఞశ్రీ | యజ్ఞశ్రీ |
| విజయుఁడు | ౬ | విజయ | ౬ | విజయ | విజయ |
| దండశ్రీశాతకర్ణి | ౩ | చంద్రశ్రీశాతకర్ణి | ౧౦ | చంద్రశ్రీ | చంద్రవిజ్ఞుఁడు |
| పులమావి | ౭ | పులోమవిత్తు | | పులోమర్చిస్సు | సులోమధ |

## తొమ్మిదవప్రకరణము.

### శాలివాహనశకము.

అనేకశకములు మనదేశములో వాడఁబడుచున్నవి. వింధ్యకు నుత్తరభాగమున విక్రమార్కశకమును దక్షిణభాగమున(దక్షిణాపథమున)శాలివాహనశకమును వాడఁబడుచున్నవి. ఈశకములకీపేరు లెట్లుగలిగెనని శంక పుట్టిపండితులు విశేషముగాఁ జర్చించిరి. విక్రమార్కునిశకము క్రీ. పూ. ౫౭ వ సంవత్సరముతోఁ బ్రారంభ మైనదిగాని విక్రమార్కుఁడా కాలమునలేఁడు. శాలివాహనుని శకము క్రీ.శ. ౭౮ వ సంవత్సరముతోఁ బ్రారంభ మైనదిగాని మొదటిశాలివాహనుఁడా కాలమునలేఁడు. అందుచేత నీశకములకు వీరిపేరులెట్లు ముడిపెట్టఁబడినవని సంశయముకలుగుచున్నది. అనేక హిందూరాజులు తమతమ శకములనుస్థాపించిరి కాని యవియన్నియును నంతరించినవి. గుప్తశకము, వల్లభిశకము, శ్రీహర్షశకము మొదలగునవి యన్నియు నంతరించి పోయినవి. ఒకకవి యారుశకముల నొకచాటుధార పద్యములోఁ జేర్కొనియున్నాఁడు.[1] మొదటిది యుధిష్ఠిరశకము. ఇది యిప్పుడు వాడుకలో లేదు. రెండవది విక్రమార్కశకము వింధ్యకు నుత్తరమునను మూఁడవది శాలివాహనశకము వింధ్యకుదక్షిణమునను వ్యవహారములోనున్నవని యిదివఱకె దెలిపియుంటిమి. ఉజ్జయినీ పురాధీశ్వరుఁడయిన విక్రమాదిత్యుఁడు క్రీ. పూ. ౫౭వ సంవత్సరమున శకనుల (Indo Scythians)నోడించి శకారియని బిరుదమువహించి క్రీస్తుశకము ౭౮వ సంవత్సరమున శాలివాహనునితో యుద్ధముచేసి హతుఁడయ్యెననియుఁ జెప్పుదురు. ఇది చాలవిరుద్ధమైన విషయము. ఇట్టి విరుద్ధవిషయమును గూర్చి పండితులు చర్చించుట వింతవిషయముకాదు. డాక్టరు భావుదాజీగారు జనరల్ కన్నింహ్యామ్ గారితో నేకీభవించి శాలివాహనశకము గోతమిపుత్త్రునికి ముడివెట్టిరి.[2] గాని తుదకు జస్టిస్ న్యూటనుగారితో నేకీభవించి నహపానునకు ముడివెట్టిరి.[3]

1. J. R A. S. B. vol viii p. 118. (2) Ibid vol viii p. 238. (3) Ibid p. 233



ఆ కాలమునందు గోతమిపుత్త్రుఁడు ప్రాముఖ్యుఁడని డాక్టరుఫర్గ్యూసనుగారు తలంచినవారయినను వారికాలనిర్ణయపద్ధతినిబట్టి గోతమిపుత్త్రుఁడునాలుగవశతాబ్దములోనికిఁ బోవలసివచ్చినది. అయినను తరువాత వారు శకనులను జయించుటకును శకమునకును సంబంధమేమియులేదనియు, శకరాజగుకనిష్కుని పట్టాభిషేకముతోఁ బ్రారంభమైనదని చెప్పుచు విక్రమార్కశకము నంతకుబూర్వమునఁగాక నవీనకాలమునకుఁ దెచ్చిపెట్టిరి. డాక్టరు ఓల్డెన్ బర్గుగారికడపటి యభిప్రాయము ఫర్గ్యూసనుగారి యభిప్రాయమునకు సరిపోవుచున్నది. సి. కన్నింహ్యామ్‌గారు ఫర్గ్యూసనుగారి యభిప్రాయముతో నేకీభవించుచు ఘూర్జరక్షాత్రపులు శకనులయినపక్షముననేగాని లేనియెడల శకనులకును శాలివాహనశకమునకు సంబంధమేమియులేదని నుడువుచున్నారు.[3] కన్యాకుబ్జరాజగు శ్రీహర్షుఁడు విక్రమార్కశకమును రూపుమాపి తనశకమును స్థాపించెనని చెప్పుదురుగాని యది విశ్వసింపఁదగినదికాదు. ఇంతకును క్రీ.శ. ౮౧౧ వ సంవత్సరమునకుఁబూర్వము విక్రమార్కశకసంవత్సరము తేదియునేవియు దృష్టాంతమునకై శాసనములయందుఁ గానరావు.[4] ద్రావిడసాంప్రదాయములు ప్రతిష్ఠానపురాధీశ్వరుఁడయిన శాలివాహనునితోనే జనించినదనిసూచించుచున్నవని చెప్పెడు కర్నల్ మెకంజీగారి యభిప్రాయముతో కర్నల్ విల్ఫర్డుగారేకీభవించుచున్నారు.[5] మఱికొంద ఱాతఁడొక శ్రామణుఁడనియు, అతఁడు జైనుఁడుగాని బౌద్ధుఁడు గాని యై యుండవచ్చు ననియు, అతఁడు తనదేశశత్రువుల నెదుర్కొనుటకై గోదావరినుండి యుత్తరమునకుఁబోయి యుండెననియు వర్ణించుచున్నారు.[6] జైనగ్రంథకర్తలాతఁ డొక మహావిద్వాంసుఁ డనియు,గ్రంథకర్త

1. J. R. A. S. n. s vol. iv p. 127
2. Indian Antiquary vol x p. 215
3. Arch, Rep vol v p. 20
4. J. R A. S. Bombay Branch vol ii p. 371
5. Asiatic Researches vols ix, x
6. Taylor's Cat Rais vol III page-42.

యనియు సాధారణముగా వర్ణించియున్నారు. పదునొకండవ శతాబ్దమునకుఁ బూర్వమున నుండెడి తామ్రశాసనము లన్నిఁటిలోను శకనృపకాల మని కన్పట్టుచున్న దనియు, బాదామి యనుప్రదేశము నందలి యొకశాసనములో శకరాజుయొక్క పట్టాభిషేకము మొదలుకొని ప్రారంభమైన కాలమని (శకకాలము) వ్రాయఁబడి యున్న దన్నియు, ఆశకశబ్దమే తరువాత మఱియొకయర్థమున వాడఁబడుచున్న దనియు, మొదటిదానిని మఱచిపోయిరనియు, తరువాతివారీశకము నెవ్వరి యొకగొప్పరాజునకు ముడిపెట్టవలసివచ్చి శాలివాహన శకమని శాలివాహనుని పేరుతో ముడివెట్టి వాడుచున్నారే గాని శబ్దార్థప్రకారముచూచినపక్షమున నందర్థము లేదనియు, రెండు రాజకుటుంబముల గలిసినపేరుగా నున్న దనియు, డాక్టరు భాండార్కరుగారు నుడువుచున్నారు.[1]

ఎవరివాద మెట్లున్నను శాలివాహన శకమెవ్వని పేరుతో ముడివెట్టినను, మొదటినుండి గాకపోయినను కొన్నిశతాబ్దముల క్రిందటనుండి యైనను వ్యవహారములోనికి వచ్చినది గనుక మన మీశకమును శిరసావహింప వలసిన దనుటకు సందియము లేదు. ఇది మొదటి సౌరాష్ట్రమాళవదేశపు క్షాత్రపులచేఁ బ్రారంభింపఁబడినది గాని యాక్షాత్రపులరాజ్య మంతరించిన వెనుక విద్వాంసుఁడై ప్రజారంజకుఁడై పరిపాలనము చేసిన హాలశాతవాహనునితో ముడివెట్టఁబడినది. అతఁడాకాలపువాఁడనుట సత్యము. కాఁబట్టి హాలశాతవాహనునితో శాలివాహనశకము ప్రారంభమైనదని మనము విశ్వసింపవచ్చును. కొందఱవివాదములతో మనకు నిమిత్తములేదు. కాని శాలివాహనవంశజుఁడగుటచేత నీహాలశాతవాహనుని శాలివాహనుఁడనవచ్చును గాని యితఁడుమాత్రము మొదటిశాలివాహనుఁడు గాఁడని జ్ఞప్తియం దుంచుకొనవలయును.

## అమరావతీస్తూపము బయల్పడుట.

హిందూద్వీపకల్పముయొక్క పశ్చిమభాగమున నున్న సాంచిస్తూపము వలెఁ గాక (The Tope at Sanchi) అమరావతీస్తూపము సంపూర్ణముగా

1. Early History of the Deckhan. pp. 29—30.



నాశము చేయఁబడుటవలన [1]భూమిలోఁ బాఁతుకొనిపోయి మంటిదిబ్బలచేఁ గప్పఁబడి సామాన్యదృష్టికిఁ గానరాక మఱుఁగుపడి యుండుటచేత అస్సీరియా మంటిదిబ్బలలోఁ బాఁతుకొనిపోయి మంటిదిబ్బలచేఁ గప్పఁబడి మఱుగుపడి యుండిన బోతా, లేయార్డులవలెనె యూరుపేరు లేక యుండెను. అదృష్టవశముచేత వర్షము గురిసినప్పు డేశాతిపలక యైన బయల్పడెనేని అచ్చటి నివాసస్థులేద్వారబంధము క్రిందనో వేసికొనుట గాని యేసున్నముకొఱకో కాల్చివేయుట గాని తటస్థమగుచుండెను. అందువలన కట్టడముయొక్క నడిమిభాగము నిలిచియుండలేదు. కర్నల్ మేకంజీదొరగారు క్రీ. శ. ౧౭౯౭ వ సంవత్సరములో నాజిల్లాలో సంచారము చేయునపుడీయమరావతీస్తూపము వారిదృష్టి నాకర్షించినది. అంతకు రెండుమూడుసంవత్సరములకుఁ బూర్వము చింతపల్లి రాజుగారగు శ్రీరాజా వాసిరెడ్డి వేంకటాద్రినాయఁడు బహదుర్ గారు రాస్థలమునం దుండిన అమరేశ్వరాలయముయొక్క మాహాత్మ్యముచే నాకర్షింపఁబడి యచ్చట నొకపురమును నిర్మించి తనకు రాజధానిగఁ జేసికొనవలయునని నిశ్చయించి తన నూతనరాజధానీనగరమున రాజభవనము నొకదాని గట్టుటకై రాళ్ళు కావలసి దీపాలదిన్నెయను మంటిదిబ్బను మఱికొన్ని సమీపమునందలి దిబ్బలను త్రవ్వ నారంభించెను. తనచేఁ గట్టఁబడుచున్న అమరావతికిఁ బడమట నరమైలు దూరమున నున్న ధరణికోటయొక్క పురాతనపు గోడలనుగూడ విడియఁగొట్ట నారంభించి వానింగూడ నుపయోగపఱచుకొనుచుండెను. ప్రాచీనము లయిన శాతిపలకలు విగ్రహములు మొదలగున వనేకములు నాశము చేయఁబడి గొనిపోఁబడినవి. దేవాలయములకును భవనములకును పెద్దపెద్ద శాల్లు పెక్కులు రాజాగారిచేఁ గొనిపోఁబడినవి కాని విగ్రహములు చిత్రింపఁబడిన శాతిపలక లనేకము లింకను మంటిదిబ్బలలోఁ బూడ్చుకొని పోయి

[1] అయిదవశతాబ్దమునం దుండిన వాతాపిపురాధీశ్వరుండును పశ్చిమ చాళుక్యరాజు నగు మొదటి పులకేశివల్లభునిచే అమరావతీస్తూపము నాశము చేయఁబడినదని యొక శాసనముఁబట్టి తెలియుచున్నది.

యున్నవి. తరువాత నివి కర్నలు మెకంజీగారి దృష్టి నాకర్షింపఁగా వారు దీనివృత్తాంతము నంతను వ్రాసి "ది ఏషియాటిక్ సొసయిటీ ఆఫ్ బెంగాల్" అనుసంఘమునకు(The Asiatlc Society of Bengal) బంపించిరి.[1] అటుపిమ్మట మఱికొంతకాలమున కనఁగా ౧౮౧౮ వ సంవత్సరమున వారు మరల నాస్థలమునకు విచ్చేసిరి. అప్పటికి వారు "సర్వియర్ జనరల్ ఆఫ్ మెడ్రాసు" అను నుద్యోగపదవికి వచ్చిన వారగుటచేత దీపాలదిన్నెలోపల నుండిన చైత్యమును బయలుదీయుటకుఁ దమ స్వాధీనములో నుండిన సాధనముల నన్నిటిని రెండుసంవత్సరముల వఱకు నుపయోగపఱచు చుండిరి. దీపాలదిన్నెకు "హిల్ ఆఫ్‌లైట్సు" (Hill of Lights) అని పేరు పెట్టిరి.

అమరావతి చైత్యముయొక్క ప్లానులును, చుట్టునుండు ప్రదేశములయొక్క పటములును, ఱాతిపలకలపైఁ జిత్రింపఁబడిన ౮౦ విగ్రహముల యొక్కపటములును మిక్కిలి జాగరూకతతో వ్రాయించుటయె వీరి కృషియొక్క ఫలితముగా నున్నది. ఈపటములను వీరికి సహాయకారులుగా నుండు హామిల్టను, న్యూమాన్ బర్కు అనువారు మిక్కిలి యందముగాను, రూపభేదము లేకయుండ సరిపోవునట్లుగను వ్రాసియుండిరి. ఆపటములయొక్క ప్రతినొకదానిని పైఁజెప్పిన "ది ఏషియాటిక్ సొసయిటీ ఆఫ్ బెంగాల్" అనుసంఘమునకును, రెండవప్రతి మద్రాసులో నుంచుటకును మూడవప్రతి ఇంగ్లాండులోని డైరక్టర్లకునుఁ బంపించిరి. మూడవప్రతిని డైరక్టర్ల పుస్తకభాండాగారమున నిప్పటికిని జూడవచ్చును. వీనివివరమును వర్ణించుచు వ్రాసినచరిత్ర మేదియును బంపఁబడనందునను, అచ్చట వారు దీని నవగాహము చేసికొని గ్రహించుట కష్టముగ నుండుటచేతను వీనినిగూర్చి యెవరును నాలోచింపరైరి. ౧౮౩౭ వ సంవత్సరమున వానిలోని రెండుశాసనములను ప్రిన్సెప్‌గారి పత్రికయందు భాషాంతరీకరించి ప్రచురించుటతక్క మఱేపనియును జరిగియుండలేదు. అయినను అదృష్టవశముచేత సర్ వాల్టరు ఎల్లియాట్‌దొరగారు ౧౮౪౦ వ సంవత్సరమున

1. See Asiatic Researches vol IX page. 272.



గుంటూరులో కమిషనర్‌గా నుండుట తటస్థించెను. ఆయనగారు కర్నల్ మెకంజిగారు పూనినపనిని తా మవలంబించి పనిచేయుటకు నిశ్చయించుకొనిరి. ఆయనగారదివఱకుఁ ద్రవ్వియుండని ప్రదేశమును త్రవ్వించి సొగసుగా విగ్రహములు చెక్కఁబడిన ఱాతిపలకల నెన్నిటినో పోగుచేసి చెన్నపురికిఁ బంపఁగా నయ్యవి పదునాలుగు సంవత్సరముల వఱకు వానకు నాని యెండకు నెండి తుదకు ౧౮౫౯ వ సంవత్సరమున నింగ్లాండునకుఁ గొనిపోఁబడినవి. దురదృష్టవశముచేత నయ్యవి హిందూదేశములో సిపాయీల కలహము ప్రారంభమయిన కాల మనఁగా ప్రాఁతదయిన "ఈస్టుఇండియా కంపెనీ" అంతరించి "న్యూయిండియా కవున్సిల్" ఏర్పడుటకు నడుమఁ బంపఁబడిన వగుటచేత వానికి స్వాగత మిచ్చి యాదరించువారు లేకపోయినందున ఫైఫ్‌హావుసు (Fife House) యొక్క కోచిహావుసు (Coach House) లోఁ ద్రోసివేయఁబడినవి. పనికిమాలిన చెత్తలోఁ గొంతకాల మణఁగి మణఁగి యుండి ౧౮౬౭ వ సంవత్సరమున డాక్టరు ఫర్గ్యూసనుగారి పాలఁబడుట తటస్థించెను. ఆయనగారు డాక్టరు ఫోర్‌బ్స్, వాట్సన్ మొదలగువారియొక్కయు, వారియుద్యోగస్థులయొక్కయు సహాయముతో వాని నన్నిటిని బయలునకుఁ దెప్పించి తేజోలేఖనము (photograph) గావించిరి. ఆసాధనములతో ఫర్గ్యూసనుగారు అమరావతీ స్తూపమునువశముఁ జేసికొనుటకుఁ గృషిచేసిరి. అటువంటి పురాతన చైత్యములయొక్కయు, నూతనచైత్యముల యొక్కయు, జ్ఞానమాయన కలిగియున్నను ఇందువిజయముగాంచక పోయియుందురు కాని యాకట్టడములయొక్క తేజోలేఖనములలోనే కట్టడములోని భాగములయొక్క ప్రతిరూపములు సరిగాఁ జిత్రింపఁబడినవి గానవచ్చుటచేత వారికిఁ గట్టడముయొక్క ప్రతిరూపము గన్నులకుఁ బొడగట్టినది. వీనిసహాయముచేత విగ్రహములు గల ఏఱాతిపలక లేభాగమునం దుండినవో తెలిసికొనఁ గలిగిరి. అమరావతీస్తూపముయొక్క స్థలనిర్దేశ మీ క్రిందిపటమువలన మీకు సులభముగా బోధపడగలదు.






అది కృష్ణానదీ ముఖద్వారమునకు నెగువున నలువది డెబ్బది మైళ్ళదూరమున మునియేఱు సంగమించు స్థానమున కెదురుగఁ గృష్ణానదికిఁ గుడిప్రక్కను దక్షిణపుటొడ్డునఁ గట్టఁబడి యున్నది. ప్రాతపట్టణమగు ధరణికోటకుఁ దూర్పుగా నర మైలు దూరమున కూచితిప్ప యను మఱియొక మంటిదిబ్బ గలదు. అది యింకను బరిశోధింపఁ బడవలసి యున్నది. దక్షిణమున నక్కదేవరదిన్నె యను మఱియొక మంటిదిబ్బ కలదు గాని యది త్రవ్వఁబడి యందుఁ బూడ్చుకొని పోయి యుండినవస్తువులు నూతననగరనిర్మాణమునందు నుపయోగింపఁ బడినవి. ఈ యమరావతీ స్తూపమును ఇచ్చటి పురాతనశిలలు మొదలగువానిని భూమిలో నుండి పెళ్ళగించి కాపాడుటకై దొరతనమువారి ప్రయత్నములు నేటివఱకును జరుగుచునే యున్నవి. పురాతనపుఁ గట్టడములు, పురాతనపుఁ బనిముట్లు, పురాతనపు శిలలు మొదలగున వెన్నియో బయలుపడినవి. ఇంకను గొన్ని బయలుపడుచున్నవి. ఇంకను మఱికొన్ని బయలుపడవచ్చును. ఈవిషయమున ప్రాచీనవస్తు పరిశోధనాధికారిగ నుండిన (ఆర్క్యాలాజికల్ సర్వేడిపార్టు మెంటునకు సూపరింటెండెంటు) రీ దొరగారు ౧౯౦౬-౭ వ సాంవత్సరిక వృత్తాంతమునందు వ్రాసిన వాక్యములను దెలుపుట యుక్తము[1] "౧౯౦౬-౭౦ సంవత్సరమునఁ జేసినపని గతసంవత్సరముఁ జేయఁగా మిగిలిన పనిని ప్రారంభించుటయే యై యుండెను. అందు ముఖ్యముగా నుత్తరద్వారమువద్దను పశ్చిమద్వారమువద్దను ప్రారంభింపఁ బడియెను. అసలు మంటిదిబ్బపైన మన్ను పరిమాణము లెక్కింప నలవికాని యంతయత్యధికముగా నిలిచియుండుటచేత ఈద్వారములకడ దాగోబా (చైత్యము) లను కనుగొనునంతటి దూరమువఱకు త్రవ్వికొనిపోయి యుండలేదు. అయినను ఫలితములు రంజింపఁ జేయునవిగా నున్నవి. ఇటుకగోడలును చలువఱాళ్ళ ప్రాగాదికంబములయొక్క భాగములును బయలుపడినవి.

1. The Annual Progress Report of the Archeological Survey Department, Southren Circle for the Year 1906-0.7, p. 2.

ఇవిమాత్రమే గాక సంపూర్ణములయిన ప్రత్యేకవిగ్రహములును, తునకలయిపోయిన విగ్రహములును పెక్కులు బయలుపడినవి. సొగసుగాఁ జిత్రింపఁబడిన యొకనల్లని చిన్నఱాతి విగ్రహమును, శాసనములును, చలువఱాతి పలకలును నిడుపాటి ఱాతితొట్లును, ఱాతికంబములును, మనుష్య విగ్రహములును, స్తంభములయొక్క పీఠములును, నాణెములును, పూసలును మఱియునొక యిత్తడిగొలుసు, మేకులు, చీరణములు (కాసెయులులు) కత్తులు, ఒకగంటము, ఒకతాపియు (గోడ మొదలగువానికి సున్నము వేయు పనిముట్టు,) చక్కఁగ పోతపోయఁబడిన యొకమట్టికూజాయు, పెక్కుమంటిసెమ్మెలు, మంటితాంబాళము, మంటిగొట్టములు, మంటిచట్టములు, మంటిమూకుళ్లు మొదలగువస్తువులును, మనుష్యుల దంతములు, మనుష్యుల బొమికలును గానుపించినవి. ఈద్వారముల కడఁగానిపించినగోడలు వెలుపలిమంటిదిబ్బలవఱకును వ్యాపించి యుండుటచేత దాగోబాలుండిన యెడల బయలుపడు వఱకు త్రవ్వించవలసిన పనినిలిచియున్నది.”

## ధాన్యకటకనగరము.

భరతఖండమునందలి పురాతన పట్టణములలో పాటలీపుత్త్రమునకుఁ దరువాత ధాన్యకటకనగరమే విశేషప్రఖ్యాతిఁ గాంచినదిగా నున్నది. ఇది క్రీస్తుశకమునకుఁ బూర్వము నాగరాజులకును క్రీస్తుశకమునకుఁ దరువాత శాలివాహనులకును రాజధానీ నగరముగానుండి యాంధ్రసామ్రాజ్యమునకంతకు బహుశతాబ్దములకాలము మేటికిరీటమై ప్రకాశించియుండెను. ఈమహానగరము పదునెనిమిది శతాబ్దములక్రిందటఁ బొందిన మహోన్నతవైభవమంతయు నాగరికతాప్రశస్తిఁ గాంచిన పాశ్చాత్యపండితమండలి నేఁడు ధరణికోటమంటిదిబ్బలలోఁ గాంచి యచ్చెరువందుచు వేనోళ్లఁ బొగడుచుండుటను జూచుచుండునపుడాంధ్రదేశమున జన్మించిన యేదేశభక్తుని హృదయమున కానందజనకముగానుండకుండును? ఈపురాతనాంధ్రనగరములోఁ బ్రాచీనాంధ్రులచారిత్రము గూడ బయలుపడి యాంధ్రజాతీయాభివృద్ధికిఁ దోడ్పడుచున్నది.

ఈధాన్యకటకమునే కొందఱు ధన్యకటకమనియు, ధనకటకమనియుఁ గూడ వాడుచువచ్చిరి. మొదటిపేరు ధాన్యకటకమే గాని మఱియొకటి కాదు.



ఇది ౧౨, ౧౩, ౧౪ శతాబ్దములలో ధాన్యవతీపురమను పేరను బిలువంబడుచుండెనని శాసనములుకూడ ఘోషిపఱచుచున్నవి. శాలివాహనశకము ౧౨౮౩ సంవత్సరమునకు సరియైన క్రీస్తుశకము ౧౩౬౧ వ సంవత్సరమున అమరావతీగ్రామమునందలి యమరేశ్వరాలయములోని యొకశాసనములో శ్రీధాన్యవతీపురమని తెలుపఁబడినది. మఱియును కృష్ణామండలములో నూజవీడు తాలూకాలోని యెనమదలగ్రామములో నొకఱాతిబండపైనుండు శాసనములోఁగూడ ధాన్యవతీపురమనియె చెప్పఁబడినది [1] ఈధాన్యకటకమను శబ్దము టిబెట్ దేశగ్రంథములలోఁ ద్పల్-ల్డాన్-బ్రాస్-స్ప్రుయిన్సు” (Dpal-ldan-bras-spruins) అని భాషాంతరీకరింపఁబడినది. అనఁగా ధాన్యరాశు లధికముగాఁగల పట్టణమని యర్థమఁట ఈపట్టణమునందే గొప్పచైత్యమున్నదని యాదేశచరిత్రమును వ్రాసిన తారానాథుఁడు నుడువుచున్నాఁడు. ఈపై వృత్తాంతములనుబట్టి ధాన్యకటకమను పేరు నిజమైనపేరుగాఁ గన్పట్టుచున్నదనుటకు సందియములేదు. చీనాదేశపు యాత్రికుఁడగు హూనుత్సాంగు ధాన్యకటకమును వర్ణించిచెప్పిన విషయములనుబట్టి ధాన్యకటక నగరముండిన ప్రదేశము ధరణికోటయగునా కాదాయని పాశ్చాత్యపండితులలోఁ గొందఱు విశేషముగాఁ జర్చించిరి. ధాన్యకటకము ధరణికోట కాదనియు, విజయవాడ (Bezwada) యనియు వాదించిన వారిలో రాబర్టుస్యూయలుగారు ప్రాముఖ్యతనుగాంచియున్నారు. వీరు హూనుత్సాంగు చేసిన వర్ణన నాధార పఱచుకొనియే వాదించుచున్నారనుటకుసందియములేదు గాని సంగతి సందర్భములనన్నిటిని చక్కఁగ నాలోచించిచూచిన పక్షమున విజయవాడగాక ధరణికోటయె ధాన్యకటకనగరమని చెప్పుటకు ప్రబలహేతువులు కలవని పెక్కండ్రు చరిత్రకారులు తలంచుచున్నారు. హూనుత్సాంగు ధాన్యకటకమునకుఁ దూర్పునఁ బూర్వశైల సంఘారామమును, పశ్చిమమున నపరశైల సంఘారామమును గలవని పేర్కొనియున్నాఁడనియు, అయ్యవి పర్వతములకుఁ జేరియున్నవని చెప్పియున్నాఁడనియు, ఆపూర్వశైల సంఘారామమె బెజవాడకుఁ దూర్పుననున్న కొండపై నున్నదనియు, అపర

1. See Mr. Mackenzie's Kistna District Manual.

శైల సంఘారామము బెజవాడకుఁ బడమటనున్న కొండపై నున్నదనియు, ధాన్యకటకమునకుఁ దక్షిణముననున్న కొండగుహాలలో భావవివేకస్వామి తపస్సు చేసికొనుచున్నాఁడని యాయాత్రికుఁడు వచించియున్నాఁడనియు, అదియె బెజవాడకు దక్షిణ భాగమునందుండిన ఉండవిల్లికొండ యనియు, అపరశైల సంఘారామము అమరావతీ స్తూపమె యైనయెడల నచ్చట కొండలేవియు లేకుండుటకుఁ గారణమేమనియు, చుట్టును గొండలేవియును లేక బట్టబయలులో నుండుటచేత నయ్యది ధాన్యకటకము కాదనియు, కొన్ని నెలలు నివాసము చేసియుండిన హూయనుత్సాంగు వర్ణించిన వర్ణనలకు బెజవాడమాత్రమె సరిపోయియుండుటచేత ధాన్యకటకనగరము తప్పక బెజవాడయే యగునని తమయభిప్రాయమని స్యూయలుగారు కంఠోక్తిగఁ జెప్పియున్నారు.[1] అయినను భరతఖండమునందలి బౌద్ధుల స్తూపములను, బౌద్ధులగుహాలను, పర్వతములలోఁ దొలువంబడిన పురాతన దేవాలయములను బరిశోధించి వానింగూర్చి గ్రంథములను వ్రాసిన డాక్టరు ఫర్గ్యూసనుగారు స్యూయలుగారి వాదము నొప్పుకొనక ఖండించి ధరణికోటయే ధాన్యకటకమని సిద్ధాంతీకరించి యున్నారు. వీరివాదమె విశ్వసనీయమైనదిగఁ గన్పట్టుచున్నది. చీనాయాత్రికుని వ్రాఁత సందిగ్ధముగ నున్నదనియు, వారు కండ్లతోఁ జూచి వ్రాసియుండిరో వినికిడినిబట్టి వ్రాసియుండిరో నిజము తెలియరాదనియు, అపరశైల సంఘారామమును గూర్చి వర్ణించినవర్ణన అమరావతీస్తూపమునకు సరిపోవుచున్నదిగాని బెజవాడకొండలమీఁది గుహాలకువర్తించుచుండలేదనియు, ఉండవల్లికొండగుహాలు పౌరాణికసంబంధమైనవిగాసి పురాతనబౌద్ధమత సంబంధమైన గుహాలు కావనియు, అందలి యనంతశయనుని దేవాలయము నవీనమైనదిగాని మిక్కిలి పురాతనమైనది కాదనియు, హిందూదేశమునందుండిన బౌద్ధవిహారము లన్నిటితోఁ బోల్చి చూచినపుడు బెజవాడగుహాలు భేదించినవిగా నున్నవనియు, అమరావతీస్తూప మట్లుగాక సార్వవిధముల చేతను తక్కినవానిం బోలియున్నదనియును, ఇంతియగాక హిందూదేశము నందలి స్తూపములలోఁ బ్రధానమైనదిగానుండి దేశస్థులకు దిగ్భ్రమను గొల్పెడిసమీ

1. Mr. Sewell's Dhanyakacheka.



ప స్తూపమును విడిచి యేవిధముచేతను మనోహరముగానుండని బెజవాడ గుహాలను వర్ణించియుండెనని చెప్పుట పొసఁగియుండ లేదనియు, అమరావతీ స్తూపములోని విగ్రహములను బోలు నొక్కవిగ్రహమైన నొక్కశాసనమైనఁ గంటికిఁ గానరాదనియు, ఏడవశతాబ్దము నందుండి వ్రాసినవ్రాఁతలోఁ బొరపాటు లుండవచ్చుననియు, హూయనుత్సాంగు వాక్యములను భాషాంతరీకరించిన బీల్ గారి భాషాంతరీకరణమునకు నబ్యాలియనుగారి భాషాంతరీకరణమునకును భేదమున్నదనియు మొదలగు విషయముల నెన్నిటినో చర్చించి స్యూయలుగారి వాదమును బూర్వపక్షము చేసియున్నారు.[1]

ధాన్యకటకమును బాలించిన యాంధ్రరాజుల పేరులను, ధాన్యకటకమను పేరును అమరావతీస్తూపములో గానవచ్చినవి. ఆంధ్రుల శాసనములు మాత్రమె కాక వారితరువాత పాలనముచేసిన యాంధ్రపల్లవుల శాసనములుఁగూడ అమరావతియందుఁ గానుపించినవి. ధాన్యకటకనగరములోని బుద్ధునిచైత్యమును సందర్శించి బుద్ధునికి నమస్కరించుటకై వచ్చితినని చెప్పి పల్లవరాజగు సింహవర్మ యొకశాసన మొక స్తంభముపైని వ్రాయించెను. ఆ స్తంభముకూడ అమరావతిలోని మంటిదిబ్బలోనుండి పైకిఁదీయఁబడినది. నవీనులుకూడ ధాన్యకటకము ధరణికోటయనియే భావించుచుండిరికాని బెజవాడయని భావించుచుండలేదు. కాఁబట్టి హూయనుత్సాంగు వ్రాసిన వ్రాఁతయనిచెప్పెడి పరస్పర విరుద్ధములయిన కొన్నివాక్యములను బట్టి బెజవాడయె ధాన్యకటకమని భావించుట భ్రమకాని వేఱొండుకాదు.

---

1. గ్రంథవిస్తరభీతిచేత వీరిచర్చలను సంపూర్ణముగఁ దెలుపఁజాలక సంగ్రహములుగా వారిభావములను మాత్రము దెలిపితిమి.

# పదవప్రకరణము.

## పునర్విమర్శనము.

---:o:---

### ఆంధ్రసామ్రాజ్య విస్తీర్ణము.

ఆంధ్రరాజులు మగధసామ్రాజ్యమును గైకొని పాలించిరని పురాణములు పేర్కొని యుండుటయును, చీనాచక్రవర్తులును, చీనాదేశపుచరిత్రకారులును, బలిద్వీపవాసులును, యవద్వీపవాసులును, వీరిని ఇండియా చక్రవర్తులని పేర్కొని యుండుటయును, పాండ్యచోళ కేరళములకు బాలించినరాజులు వీరిని మగధరాజులని పేర్కొనియుండుటయు ఆంధ్రసామ్రాజ్యమున మగధరాజ్యము చేరియున్నదని చెప్పుటకు ప్రబలసాక్ష్యములుగానున్నవి. మధ్యదేశము, కళింగదేశము, దక్షిణకోసలము, విదర్భదేశము, కొంకణదేశము, మహారాష్ట్రదేశము, దక్షిణకుంతలదేశము, ఇంతయేల, పాండ్య చోళ కేరళదేశములు దక్క తక్కిన దక్షిణాపథ దేశములన్నియు నాంధ్రసామ్రాజ్యమునఁ జేరియున్నవని చెప్పవచ్చును. వనవాసి (Banavasi) రాజధానిగఁ జేసికొని యాంధ్రరాజుల రాజప్రతినిధిగ నుండి దక్షిణకుంతల దేశమును బాలించినహారితిపుత్త్రి శాతకర్ణుని పేరుగల దానశాసనములు మైసూరునందు రైసుదొరగారివలన నూతనముగాఁ గనిపెట్టఁబడినవి. కనుక నాంధ్రరాజులగు శాతకర్ణులు మైసూరునుగూడ పాలించినట్లు స్పష్టపడుచున్నది. అసిక, అస్మక, మూలక, సురాష్ట్ర, కుకుర, అచిరాంత, అనూప, విదర్భ, ఆకరావంతి దేశములను గోతమిపుత్త్రి శాతకర్ణి జయించెనని నాసికశాసనములలో నొకదానిలో నుదాహరింపఁబడి యుండెను. అస్మకమూలిక దేశములు దక్షిణాపథ దేశములోనివని పురాణములు చెప్పుచున్నవి.

1. The Madras Journal of Literature and Science 1886-87 pp. 56 to 62; Archeological Survey of India (New Series) Vol III p.25,28.



దక్షిణకత్తివాడి దేశమునకు సురాష్ట్రమను పేరుగలదు. కుకురదేశము రాజపుత్త్రస్థానములో నొకభాగమై యున్నది. ఉత్తరకొంకణదేశమే అపరాంతమనఁబడుచున్నది. అనూపదేశము వింధ్యకు సామీప్యమున నున్నదని పురాణములు చాటుచున్నవి. అయ్యది నర్మదకు నెగువున నున్నదనియు, దానికి మాహిష్మతీ నగరము రాజధానియనియు రఘువంశమునందుఁ జెప్పఁబడినది. అకరావంతి యనునది మాళవదేశముయొక్క తూర్పుభాగముగానున్నది. కాబట్టి యాంధ్ర సామ్రాజ్యము దక్షిణమున మైసూరు మొదలుకొని యుత్తరమున గంగానదివఱకును విస్తరించియుండెనని చెప్పవచ్చును. మాళవము, కన్యాకుబ్జదేశము, సింధు సౌవీరదేశములు, పాంచాలకాశ్మీరములు, ఉత్తరకోసల కాశీదేశములును, నేపాల భూపాలదేశములును, కామరూపబ్రహ్మదేశములును, పాండ్యచోళకేరళదేశములును మాత్ర మీయాంధ్ర సామ్రాజ్యమునఁ జేరియుండలేదు. పైఁజెప్పినదేశములలోఁ బశ్చిమోత్తరదేశములు విజాతీయులయిన శకరాజుల పాలనమునం దుండినవి.

### బౌద్ధమతము.

ఆకాలమునందలి మతములలో బుద్ధునిమతమే బహుజనానురాగమును బడసి దేశమంతటను వ్యాపించి సర్వోత్కృష్టమైనమతముగా నెంచఁబడుచు నగ్రస్థానమును వహించియుండెను. శాలివాహనవంశజులమని చెప్పుకొనియెడి యాంధ్రరాజులును, మహాభోజులమని, మహారాతులమని చెప్పుకొనియెడి మండలాధిపతులును, బౌద్ధమతము నవలంబించి యాంధ్ర చక్రవర్తులకు నూడిగము సేయుచుండిన యవనశకపహ్లావాది నాయకులును, నైగములును, (వర్తకులు), స్వర్ణకారులును (బంగారుపనులు చేయువారు) వర్ధకులును, (వడ్రంగులు), ధాన్యకశ్రేణులును (ధాన్యపు వ్యాపారము చేయువారు), గాంధికులును (ఓషధులు మొదలగువాని విక్రయించువారు), సామాన్యగృహస్థులును బౌద్ధమతావలంబకుల యుపయోగార్థ మేకశిలామయమైన కొండలను దొలిపించి గుహాలను, మఠములను, చైత్యములను, నిర్మించుచువచ్చిరి. ఈయాంధ్రరాజుల పరిపాలనకాలమున మొదట విజాతీయులును విదేశస్థులునగు యవనులు (Bactrian Greeks) శకనులు, (Indo Scythians) పహ్లావులు(Persians) గుంపులుగుంపులుగా వచ్చి

దేశముఁజొఱఁబడి కల్లోలము గావించిరి. తుదకు నాంధ్రుల పరిపాలనమునకు లోఁబడి దేశమున స్థిరవాసము లేర్పఱచుకొని దేశమతములను దేశాచారములను బూని దేశీయులలోఁ గలిసిపోయిరని యిదివఱకే పూర్వప్రకరణములఁ దెలుపఁబడియెను. పైఁజెప్పినగుహాలలోని శాసనములలో బుద్ధధర్మప్రచారమునకై దానము చేసినవారిలో యవనులయొక్కయు శకనులయొక్కయు నామములుగూడ లిఖింపఁబడి యుండుటయే యిందుకు ప్రబలసాక్ష్యముగా నుండెను. బౌద్ధభిక్షువులు నివసించుటకొఱకు శిలామఠములలో గదులేర్పఱుపఁబడినవి. ఈబౌద్ధసన్న్యాసులు సాధారణముగా దేశాటనము సేయుచు వర్షకాలములయందునీకొండగుహాలలో నివసించుచుండిరి. శ్రావణమాసములో బౌద్ధసన్న్యాసులు ప్రాతదుస్తులను విడిచి క్రొత్తదుస్తులను ధరించుచుండిరి. పరోపకారబుద్ధిగలవారు వీరికి దుస్తులనుబహుమానము చేయుటకుఁ గొంతధనమును గ్రామసంఘములకడనిలువఁ జేయుచుండిరి. ఆసంఘములవారు మూలధనమును వెచ్చింపక వానివడ్డినిమాత్ర మీధర్మకార్యములకొఱకు వినియోగించుచుండిరి. ఇటువంటి మతకార్యముల నిర్వాహముకొఱకు రాజులును రాజకీయోద్యోగస్థులును గ్రామముల నిచ్చివేయుచుండిరి. మతబోధకులయిన సన్న్యాసులు తఱచుగా సముద్రయానము సలుపుచుండిరి. కాబట్టి కొంకణదేశములో సముద్రతీరమున వీరికొఱకు ధర్మశాలలు విశ్రాంతిగృహములు నిర్మింపఁబడి యుండినవి. కాఁబట్టి డాభోల్, బాంకోట్, రాజపురి కయ్యలకడ వరుసగా "చిప్లన్, మహాడ్, కూడెమ్, అనుప్రదేశములకడ నట్టి గుహాలుకలవు. ఘోడ్బందరుకడ దిగువారికి కన్హేరిగుహాలు కలవు. ఇంతియగాక యాంధ్రదేశమునందును బెజవాడ, ఆఱుగొలను, గుంటుపల్లి, శ్రీశైలము మొగలరాజపురము మొదలగు తావులనుకొండగుహాలు తొలువఁబడియుండినవి. ఆంధ్రరాజుల పరిపాలనమున సమస్తవిధములచేత బౌద్ధమతమౌన్నత్యదశనను భవించె ననుటకు లేశమాత్రమునుసందియములేదు.

## బౌద్ధమత భేదములు.

బౌద్ధమతాచార్యులు స్వల్పవిషయములలో భేదాభిప్రాయముగలిగి యుండి మహాసాంఘికు లనియు, మహాస్థవీరులనియు రెండుతెగలుగావిడిపోయిరి. మహాసాంఘికులన మహాసంఘముయొక్క విద్యాలయమునకు సంబంధించిన వారని యర్థము. మహాస్థవీరులన మహాధ్యక్షుని విద్యాలయమునకు సంబంధించిన వారని యర్థము. మరల మహాసాంఘికులు "చైత్యకులు (పూర్వశైలులు,) అపరశైలులు, హైమవతులు, లోకోత్తరవాదినులు, ప్రజ్ఞాప్తివాదినులు" అనియైదుతెరగులుగ వేఱుపడిరి. చైత్యకపర్వతము మీఁదనుండు సన్న్యాసిబోధనము నవలంబించినవారు చైత్యకులనం బడుచుండిరి. హూనుత్సాంగు పూర్వశైలసంఘారామమని చెప్పినది యీచైత్యకులకు సంబంధించినదిగ నేలచెప్పరాదని డాక్టరు బర్జెస్సుగారు ప్రశ్నించుచున్నారు. [1]పూర్వశైలులతో భేదించినవారపరశైలు లనంబడుచున్నారు.



## బ్రాహ్మణమతము.

ఆంధ్రులును ఆంధ్రరాజులును, బౌద్ధమతాభిమానులును బౌద్ధమతావలంబకులునైనను ఆంధ్రరాజుల పాలనమున బౌద్ధమతముతోఁ బాటు బ్రాహ్మణమతమును వర్ధిల్లుచుండెను. బౌద్ధులయిన యాంధ్రరాజు లెప్పుడును బ్రాహ్మణమతముపట్ల ద్వేషమును జూపినట్లెక్కడను గానరాదు. మఱియు గోతమిపుత్ర శాతకర్ణి బ్రాహ్మణజాతిని సాంకర్యమునుండి సంరక్షించెనని నాసికశాసనమునందు జెప్పఁబడియుండుటచేత గోతమిపుత్త్రుఁడు బ్రాహ్మణమతాభిమానియని కొందఱు తలంపవచ్చునుగాని నిజముగా నాతఁడు మతసమాన బుద్ధికలవాఁడె గాని బ్రాహ్మణమతాభిమానిగాఁడు. యవనశక పహ్లావాదులు మొదలగు విజాతీయులు పెక్కండ్రు బ్రాహ్మణమతావలంబకులై కొందఱు బ్రాహ్మణులమనియు కొందఱు క్షత్రియులమనియుఁ జెప్పుకొనుచు బ్రాహ్మణసంఘమును సాంకర్యము నొందించు నప్పుడట్టి సందర్భముల గోతమిపుత్త్రుఁడు కలుగఁజేసికొని బ్రాహ్మణజాతికి భంగముకలుగకుండఁ గాపాడుచు వచ్చెననుటకును సందియముండదు. కాఁబట్టి యాకాలమునందు బ్రాహ్మణ బౌద్ధమతములరెంటికిని శత్రుత్వము లేకపోవుటయేగాక యన్యోన్యమైత్రికూడకలదని చెప్పుటకు సంశయింపవలసిన పనిలేదు.

1. Archeological Survey of Southren India Vol I p. 24.

ఈవిషయమును బ్రాహ్మణమతాభిమాని ఋషభదత్తునియొక్కయు, బౌద్ధమతాభిమానియగు గోతమి పుత్త్రునియొక్కయు దానశాసనములే వేనోళ్లఁ జాటుచున్నవి.

## వర్ణాశ్రమ ధర్మములు.

ఒక్కయార్యజాతివారిచే మాత్రమె యీవర్ణాశ్రమ భేదములు గల్పింపఁబడినవికాని యనార్యులయిన నాగులలోను మిశ్రజాతులవారయిన బౌద్ధులలోను గల్పింపఁబడియుండలేదు. ఆర్యులలోనైన నిప్పటిరీతి వర్ణభేదములు గానరావు. ఆకాలమునందు వృత్తులనుబట్టి కులభేదము లేర్పడినవిగాని కులభేదములనుబట్టి వృత్తులేర్పడి యుండలేదు. ఆకాలమునందు భోజనప్రతిభోజనములకు ప్రతిబంధకములేవియు నేర్పడియుండలేదు. బ్రాహ్మణుఁడు చాతుర్వర్ణ్యములలోని స్త్రీలను వివాహమాడుటకు నధికారము కలిగియుండెను. ఇట్టి యధికారమును బ్రాహ్మణులు కలిగియుండుటకుఁ గారణములేకపోలేదు; ఆకాలమునందు బ్రాహ్మణులు దక్షిణాపథమున మిక్కిలి తక్కువసంఖ్యకలవారుగ నుండిరి. ఇతరజాతులలోని స్త్రీలను వివాహమాడకుండినచో వారి సంఘ మభివృద్ధిని గాంచనేరదు. శీఘ్రకాలములోనే యంతరించి పోవచ్చునుగనుక స్వరక్షణార్థమై వారు బ్రాహ్మణేతరులు బ్రాహ్మణులగుటకు మార్గము లేర్పఱచి బ్రాహ్మణేతరజాతి కన్యలను వివాహముఁజేసి కొనుచుండిరి. అప్పటికింకను బ్రాహ్మణులు మాంసభక్షకులుగానే యున్నందున శూద్రాదులుచేసిన వంటకమును భుజించుటకు సంకోచింప కుండిరి. కానిబౌద్ధమతాచార్యులయొక్కయు, జైనమతాచార్యుల యొక్కయు బోధనలచేతను ఆచరణ విధానములచేతను బౌద్ధులును జైనులును పెక్కండ్రు మాంసభోజనమునువర్జించిరి. వీరితోడి మతచర్చలచేతను, సంపర్కముచేతను బ్రాహ్మణులు తరువాత పితృకార్యములయందు సహితము మాంసభోజనము వర్జింపవలసిన వారయిరి. ఈగౌరవము విశేషముగ జైనమతమునకుఁ జెందవలసియున్నది. అహింసయే పరమధర్మమనిబుద్ధుఁడు బోధించినదానిని అశోకవర్ధనుఁడు ప్రకాశింపఁజేసెను. అశోకుని సందేశమును ఆంధ్రులు శిరసావహించిరి. వీరిప్రేరేపణములచేతను జైనబౌద్ధమతాచార్యుల బోధనలచేతను ద్రావిడబ్రాహ్మణులెల్లరును క్రమక్రమముగా మాంసభోజనమును వర్జించిరి. నేడుపంచద్రావిడ బ్రాహ్మణులు మాంసమును ముట్టరు. వీరుదాక్షిణాత్యులు. పంచగౌడబ్రాహ్మణులుమాత్రము వర్జింపలేదు. వీరౌత్తరాహులు. ఇప్పటిబ్రాహ్మణోత్తములకుఁ దమపూర్వు లొకకాలమున మాంసభోజనము చేయుచుండిరను మాటయే తెలియదు. అట్టిమాటయే వారికిఁ గర్ణకఠోరముగా నుండకమానదు. బహుశతాబ్దముల క్రిందటనె యాదురభ్యాసమును విడిచిపెట్టినవారుగావున వారికట్లుండుట సహజగుణమె గాని యందు విరుద్ధగుణమేమియులేదు. ఆర్యులాకాలమునఁ బరిపాలనము చేయు నాంధ్రులను కేవలమును శూద్రులనుగాఁ జూచి యుండలేదు. వారిని క్షత్రియులని పైకిచెప్పుచువచ్చిరిగాని కర్మాధికారమును గలిగింపక లోపలద్వేషభావమును గలిగియుండిరి. మొదట నామమాత్రములుగా నేర్పడిన వర్ణాశ్రమ బంధనములు సడలియున్నవిగాని కాలముగడచిన కొలదిగట్టిగా బిగింపఁబడుచు వచ్చినవి. మనుస్మృతియందుఁ జెప్పఁబడిన భేదకారణములు కేవలము కల్పితములుగాని స్వాభావికములు గావుగనుకనవి యెంతమాత్రము విశ్వసింపఁ దగినవికావు.



## ఇతరమతములు.

ఆకాలమునందు శైవమతమును జైనమతమునుగూడ వర్ధిల్లుచుండెను. రాజప్రతినిధిగనుండి వనవాసి రాజధానిగఁజేసికొని దక్షిణకొంకణమును, కర్ణాటమును బాలించిన హారితిపుత్త్ర శాతకర్ణి కర్ణాటకము (మైసూరు) లోని స్థానకుందూరువద్దనున్న శివాలయమున కేదో దానధర్మము చేసెనని కుబ్జుఁడను కర్ణాటకవి ప్రాశస్తియను కావ్యమునందు వ్రాసియుండుటనుబట్టి యాంధ్రరాజుల పోషకత్వమున శైవమతముకూడ వర్ధిల్లుచుండెనని చెప్పవచ్చును. ఆర్యులలోను బౌద్ధులలోను మొదట విగ్రహారాధనములేదు. విగ్రహారాధనము మొదట ననార్యులలోను నాగులలోను విశేషముగా వ్యాపించియుండెను. తరువాత బౌద్ధులచేతను, అటుపిమ్మట ఆర్యులచేతను అవలంబింపఁ బడినది.

## దేశభాషాభివృద్ధి.

ఆకాలమున నార్యబ్రాహ్మణులు సంస్కృత ప్రాకృతములను వాడుకొను

చుండిరి. రాజకీయ భాష ప్రాకృతము. వ్యవహారిక భాష మాగధము. ప్రాచీన మహారాష్ట్రిము, పైశాచి, అపభ్రంశము, మొదలగు ప్రాకృత భేదములు దేశభాషలుగా నుండినవి. ఆకాలమున వాడఁబడుచుండిన లిపి మౌర్యలిపిగా నుండెను. శాసనములన్నియు పాలి భాషలో నున్నవి. ప్రాచీన ద్రావిడభాషయె పైశాచి యనంబడుచుండెను. ఆర్యులు దీనిని పైశాచియని యపహాస్యము చేయుచుండిరి. అయినను ఆంధ్రరాజు లీ భాషలో గ్రంథములను వ్రాసియు, వ్రాయించియు దేశభాషను ప్రోత్సాహపఱచిరి. శాలివాహనుని మంత్రియగు గుణాఢ్య పండితుఁడీ భాషలోనే బృహత్కథను రచించెనని యిదివఱకె తెలిపియుంటిమి. శర్వవర్మయను మఱియొకమంత్రి కాతంత్రవ్యాకరణము నాభాషలోనే రచించి శాలివాహనునకుఁ జెప్పెను. హాలశాతవాహనుఁడు ప్రాచీనమహారాష్ట్రి భాషలో సప్తశతి యనుగ్రంథమును రచించియున్నాఁడు. వీనిని బట్టి యాంధ్రరాజుల పరిపాలనమున దేశభాషలు పోషింపఁబడి వర్ధిల్లినవని యూహింపవచ్చును. ఈపైశాచిభాషలో నుండియే అఱవము, తెలుఁగు, కన్నడము, మళయాళము తులు మొదలగు భాషలు జనించినవి. అనేకభాషలసాంకర్యమె తెలుంగుబాస కబ్బుటచేతఁ దక్కిన పైశాచీ పుత్త్రికలకంటె భిన్నమైనదిగఁ గాన్పించుచున్నది.

## శిల్పశాస్త్రము - చిత్రవిద్య.

ఆంధ్రరాజుల పరిపాలనకాలమున శిల్పశాస్త్రిము చిత్రవిద్యలు మిగుల నభివృద్ధికిఁ దేఁబడినవి. ఈ యాంధ్రరాజు లనేకచైత్యములను స్తూపములను విహారములను, రాజభవనములను నిర్మించినందున శిల్పులకుఁ దమతమ విద్యానైపుణ్యములను జూపుటకు మంచియవకాశము కలిగెను. మందిరము లెట్లు నిర్మింప వలయునో, విగ్రహము లెట్లు చెక్కవలయునో, చిత్రపటము లెట్లు వ్రాయవలయునో తెలుపునట్టి శాస్త్రిములనేకము లంతకుఁ బూర్వమె బౌద్ధులచే వ్రాయఁబడి యున్నవి. అట్టి శిల్పశాస్త్రిజ్ఞులలో నాగ్నజిత్తుఁడను వాఁడు ముఖ్యుఁడు. ప్రత్యేకశిలలతో బట్టబయలునఁ గట్టఁబడక పర్వతములను



గుట్టలను దొలఁచి నిర్మింపఁబడిన బౌద్ధదేవాలయము లాకాలమునందలి యద్వితీయ శిల్పకలానైపుణ్యమును నేటికిని బ్రకాశింపఁ జేయుచుండుట ప్రశంసనీయముగదా. ఈ బౌద్ధదేవాలయములకు వెలుపల నంతయుఁ గొండయైనందునఁ బైకి శోభాయమానముగఁ గన్పట్టక పోయినను లోనికిఁబోయి చూచినపక్షమున మహేంద్ర భవనములను బోలియుండును. ఇవిగాక అమరావతీస్తూపమువలె బయలున నిర్మింపఁబడిన స్తూపములు సహితము నిరుపమానమైన శిల్పవిద్యామహిమచేఁ బ్రశంసనీయములుగ నున్నవి. వానిలో ముఖ్యముగా గుంటూరుమండలములోని అమరావతి స్తూపమునందు గానంబడియెడు శిల్పవిద్యానైపుణ్యమును గన్నులారఁగాంచి యానందింపవలసినదియె గాని యిట్టిదని నిరూపించి వర్ణించుటకుఁ బదములు గానరావు; ఈగ్రంథమును జాలదు. ఈ యమరావతీ స్తూపమును గూర్చి వివరముగాఁ దెలిపెడి రెండుగొప్పగ్రంథము లాంగ్లేయభాషయందు విరచింపఁబడియున్నవి. అందొకటి డాక్టరు ఫర్గ్యూసను (Dr. Fergusson) గారిచేతను మఱియొకటి డాక్టరు బర్గెస్సు (Dr. Burgess) గారి చేతను వ్రాయఁబడినవి. ఈ యమరావతీ స్తూపముచుట్టును శిలాస్తంభములతో వెలుపలను లోపలను గ్రాదులు (కంచెలు) కట్టఁబడినవి. ఆ స్తంభముల మీఁద శిల్పకులు చూపిన పనితన మింతింత యనివర్ణింప నలవికాదు. వానిలోఁ బెద్దదియు వెలుపలదియునగు గ్రాదివలయముయొక్క నడిమికొలత ౧౯-౫ యడుగులును, లోపల గ్రాదివలయము యొక్క నడిమికొలత ౧౬-౫ యడుగులునుగలిగి ఈ రెంటికినడుమ యాత్రికుల ప్రదక్షిణమార్గమును గూడగలిగి యుండెను. పెద్దగ్రాదివెలుపల ౧౪ అడుగులును, లోపల ౧౨ అడుగులును, లోపలగ్రాది ౬ అడుగులయెత్తుమాత్ర ముండెను. పెద్దగ్రాదియొక్క క్రిందిభాగము జంతువులయొక్కయు బాలురయొక్కయు విగ్రహములతో నలంకరింపఁబడియెను. స్తంభములు యథాప్రకారముగ నష్టకోణాకృతులు గలిగి చక్రమువలె గుండ్రముగ నుండు బిళ్లలతో నలంకరింపఁబడియున్నవి. ఈ పెద్దగ్రాదియొక్క వెలుపలి భాగముకంటె లోపలిభాగమంతయు నెక్కువచిత్రముగానుండు చిత్తరువులతోఁ జిత్రింపఁబడియున్నది. వెలుపలిగ్రాదికంటె లోపలిగ్రాదిమీఁద బుద్ధునిచరిత్రము

లోనివియుఁ గాథలలోనివియునగు స్త్రీపురుషులయొక్క చిత్రపటములా చరిత్రమును గాథలుబోధపడురీతిగ మిక్కిలిసొగసుగాఁజిత్రింపఁబడినవి.

డాక్టరు ఫెర్గూసనుగారు ప్రకటించిన గ్రంథములోని చిత్రపటములలో రెండు మిక్కిలి మనోహరములుగానున్నవి. అందొకటి వెలుపలి పెద్దగోడనుండియు, మఱియొకటి లోపలిగోడనుండియుఁ దీయఁబడినవి.

తనముంగటి సైన్యము గోడలను గాపాడుచుండఁగా రాజు సింహాసనమునఁ గూరుచుండి యప్పుడే యేతెంచిన యొక దూత చెప్పెడి సమాచారమును వినుచుండినట్లును, దిగువను కాల్బలము నశ్వసైన్యము దంతావళములు యుద్ధమునకుఁ బ్రయాణోన్ముఖములై నడచుచున్నట్లును శత్రుకోటిలో నొకఁడువచ్చి సంధిని గోరుచున్నట్లును మొదటిదానిలో సత్యాద్భుతముగాఁ జిత్రింపఁబడినవి. అయ్యది నిన్నమొన్నను జిత్రింపఁబడినట్లుగా నుండి యాకాలపు శిల్పకారుల నైపుణ్యమును బుద్ధివైభవమును నాగరికతను వేనోళ్లఁ జాటుచున్నది. డాక్టరు ఫెర్గూసనుగారును, డాక్టరు బర్గెస్సుగారును ఆపటమును మిక్కుటముగ మెచ్చుకొని యున్నారు.

రెండవపటము మూఁడు పూజార్హములయిన వస్తువులను దెలుపుచున్నది. అందొకటి గ్రాదులతోడి స్తూపము, మఱియొకటి మతచక్రము, వేఱొకటి పవిత్రమైన వృక్షమునుగాని (బోధి వృక్షము) బుద్ధుని దంతమునుగాని పూజించుచున్న సంఘము. ఈస్తూపముపైని బుద్ధునికి సంబంధించిన విగ్రహములు మాత్రమెగాక నాగరికతయందు వెనుకఁబడియున్న ప్రాచీన నాగులయొక్కయు నాగరాజులయొక్కయు, నాగరాణులయొక్కయు, నాగకన్యలయొక్కయు విగ్రహములుగూడ మిక్కిలి చిత్రింపఁబడియున్నవి. ఇట్టి స్తూపము లమరావతియేగాక జగ్గయ్యపేట, గుడివాడ, భట్టిప్రోలు, ఘంటశాల మొదలగు స్థలములలోఁ గూడ మఱికొన్నిగలవు. గుడివాడ, భట్టిప్రోలు, ఘంటశాలలోనివి యిటుకలతోను సున్నముతోడను గట్టఁబడినవిగా నున్నవి. మఱియును బౌద్ధభిక్షువులకొఱకుఁ బర్వతములలోఁ దొలుపఁబడిన విహారములలోను చైత్యములలోను కార్లీపర్వతములోని చైత్యమును అజంటావిహారమును గొప్పవి. కార్లీ



చైత్యము బొంబాయి పునహానగరములకు నడుమనున్నది. ఈచైత్యము వెలుపలినుండి చూచునపుడు శోభాయమానముగఁ గాన్పింపక పోయినను లోపలికిఁబోయి చూచునపుడు దేవేంద్రభవనమును బోలియుండును.



కార్లీచైత్యము.

కార్లీపర్వతములోని చైత్యముయొక్క పొడవు ముఖద్వారము మొదలుకొని వెనుక ప్రక్కనుండెడు గోడవఱకు ౧౨౬ అడుగులుండును. వెడల్పు ౪౫ అడుగుల ౭ అంగుళములుండును. ఈ చావడిలోని ప్రక్కభాగములు క్రైస్తవాలయములలోని ప్రక్కభాగములంత విశాలములుగ లేవు. వానిలో నడిమిభాగము మాత్రము ౨౫ అడుగుల ౭ అంగుళములు వెడల్పుకలిగి యున్నదిగాని తక్కినవన్నియు స్తంభములసాంద్రతను గలుపుకొని పదియడుగులు మాత్రమె గలిగియున్నవి. శిల్పకారులయొక్క నైపుణ్యమును బుద్ధిచాతుర్యమును దెలుపునట్టి చెక్కడపుఁబనులచే శోభించుచుండిన ముప్పదితొమ్మిది స్తంభములుగలవు. ఈ విహారమున కంతకు వెలుతురు కలుగుటకై పైన నసుకూలకోణముగల తావున నొకరంధ్రముంచఁబడినది.

అజంటాలో నాలుగుచైత్యములుగలవు. తరువాతికాలమున నిర్మింపఁబడిన చైత్యములలో బుద్ధునిరూపపటములు గానుపించుచున్నవి. ఈకడపటి చైత్యములలో నిరూపింపఁబడిన బౌద్ధమతమాఅవశతాబ్దములోని హిందూమతమును సమీపించియున్నది. అజంటావిహారములలో నొకదానిపటమిూక్రిందఁ జూపుచున్నారము. ఇది మిక్కిలి సొగసుగానుండునది. ఈవిహారము ౬౫ అడుగుల పరిమాణముగలిగి ౨౫ స్తంభములతో నొప్పారుచున్నది.

అజంటావిహారములో శిల్పచాతుర్యము.



బౌద్ధభిక్షువులు నివసించుటకై రెండు ప్రక్కలను ౧౬ గదులుగలవు. నడుమనొక్కగొప్పచావడియు ముంగటనొకవసారయు వెనుకపవిత్రమైన గర్భగృ



హమును గలవు. కుడ్యములపైన బుద్ధునిజీవితములోని చర్యలనుదెలుపు ప్రదర్శనములు చిత్రింపఁబడినవి. స్తంభములును కప్పును చిత్రవిచిత్రములయిన నగిషీపనులచే నెలుగొందుచున్నవి. వీనినన్నిటిని గన్నులార వీక్షించునప్పుడు గలుగునట్టి ధ్యానందము వర్ణనాతీతమై యుండును. అందలి స్త్రీపురుషుల విగ్రహములుసొగసుగను స్వభావసిద్ధములుగను ముఖవికాసములు సత్ప్రవృత్తిని సూచించునవిగను నాహ్లాదకరములుగను నున్నవి. అలంకారములు పరిశుద్ధములయినవిగను క్రమపద్ధతికలవిగను నున్నవి.

ఆకాలపు స్తూపములయొక్కయు, చైత్యములయొక్కయు, విహారములయొక్కయు, విగ్రహములయొక్కయు, రూపపటములను ముద్రింపవలయునన్న విశేషవ్యయప్రయాససాధ్యమైనది కావున శిల్పకారుల బుద్ధికౌశలతను, చిత్రవిద్యలతీరును జూపుటకు నీయొకటిరెండు పటములను మాత్రము ముద్రింపఁగలిగితిమి.

## మతసంఘములు - పౌరసభలు.

ఆకాలమునందు మతకార్యములను ధర్మకార్యములను నిర్వహించుటకై యాకాలపు దేవస్థానసంఘములవంటి మతసంఘములును, పౌరజనోపయోగకరములయిన కార్యములను నిర్వహించుటకై యాకాలపు పౌరసభల (Corporations) వంటి పౌరసభలు నేర్పడియుండినవి. అట్టిసభలు రెండు శైలతో భట్టిప్రోలు శాసనములలోఁ గన్పట్టుచున్నవి.

ధర్మకార్యనిర్వాహక సంఘములోని సభ్యులు:—హిరణ్యవ్యాఘ్రపాద (డు); ఉగలక (ఉద్గారకుఁడు), కలహ* (డు), విసాక (విశాఖుఁడు), స్థూలశీర్షి, శ్రామణ (డు), ఒదల (ఔదలుఁడు), అపక (డు), సముద్ర (డు), అనుగ్రహ(డు), సూర(డు), శత్రుఘ్న(డు), పోతక(డు), పోత(డు) అలినాక (అలినాగుఁడు), వరుణ (డు), పింగళక (డు), కౌశిక (డు), సూతి (సూత్రుఁ

* కలహ (డు) అనుదానిని కలహుఁడని చదువుకొను రీతిగానే తక్కిన నామములను డుప్రత్యయమును జేర్చి చదువుకొనవలయును.

డు), పాప (డు), కుబీరక (కుంభీరకుఁడు - ఇతఁడొకరాజు), గాలిక (డు), శామిమణదాస (డు), భారద (భారతుఁడు), ఒదల (ఔదరుఁడు) స్థాలతిష్య (డు), తిష (తిష్యుఁడు), గిలన (జ్ఞానుఁడు), జంభ (డు),......బుబ (బువుఁడు),...జనక (డు), గోసాలక (డు), ఉపసాదునికొడుకుకూర (డు), కరహునికొడుకు ఉత్తర (డు).

పౌరసభాసభ్యుల నామములు:—వచ్ఛ (వత్సుఁడు), ఛఘ (జఘన్యు, డు), జెటా (జటుఁడు), జంభ (డు), తిస (త్రిష్యుఁడు), రేత (రైవతుఁడు), అచిన (అచీర్ణుఁడు), సభిక (డు), అఖఘ (అక్షుఘ్నుఁడు), కేల (డు), కేళ (డు), మాహ (మాఘుఁడు) సేత (శ్వైత్రుఁడు), చడిక (చండికుఁడు), ఓఖబల, ఓఘబలుఁడు) సోనుతర (సోనుత్తరుఁడు), సువర్ణోత్తర (డు), సామన (శామిమణుఁడు), సామనదాస (శామిమణదాసుఁడు), సామక (శ్యామకుఁడు), కామక (డు), చితక (చిత్రకుఁడు)

## వర్తకసంఘములు.

ఆకాలమున వాణిజ్యముచేయుచుండిన వణిక్కులు విశేషభాగ్యమును సంపాదించినట్లు గానంబడుచున్నది. కార్లీలోని గొప్పచైత్య గుహను జయంతీ నగరములోని యొక సేఠ్ వలన నిర్మింపఁబడియె నని చెప్పఁబడినది. ధాన్యకటకము, కన్హేరి మొదలగు స్థలములలో గూడను వారిదానములు మిక్కిలి విలువగలిగినవిగా నున్నవి. సేఠ్ అనుశబ్దము శ్రేష్ఠియనుదాని ప్రాకృతరూపము. సేఠ్ యొక్క వికృతియె తెలుఁగులో సెట్టియగుచున్నది. సెట్టియనగా వర్తకుఁడు. ఆకాలములో వర్తకసభలు పెక్కులుండినవి. సేతగాండ్రకు, గాంధికులకు, ధాన్యక శ్రేణులకు, నూనె మొదలగువానిని తయారు చేయువారలకుఁ బ్రత్యేక వర్తకసభలుగలవు. ఈసభలన్నియుఁ గ్రమమైన యేర్పాటులను నిబంధనములను కలిగి యోగ్యస్థితి యందున్నట్లుగఁ గానంబడుచున్నవి. ప్రజలు తమ సొమ్మును శాశ్వతముగా నీసభలవద్దభద్రముగా నుంచుకొనుటయు,వారలు కిరలకు తరతరములవఱకు వడ్డీ నిచ్చుచుండుటయుఁ గూడగలదు. ఈసభల మూలమున స్వపరి

1 Epigraphia India, Vol. II. pp. 326. 329.



పాలనము చేసికొనుచుండుట అప్పటి రాజ్యాంగపద్ధతిలో ప్రధానమైన విషయముగా నుండెను. పైనుదాహరించిన భట్టిప్రోలు శాసనములోని నిగమ సభ మాత్రమెగాక ఋషభదత్తుని నాసిక శాసనములో గోవర్ధనములోని నిగమ సభ యొకటి పేర్కొనఁబడి యుండెను. దేశములో నెట్టెట్టి విక్రాంతులు సంభవించినను, పరిపాలనచేయు రాజు లెట్టివారయినను నిరాఘాటముగ రాజ్యపాలనమునడుచుటకు నిట్టి సభలు తోడ్పడు చుండిన వనుటకు సందియములేదు. ఆకాలమునందు నూటికి కైదు మొదలుకొని యేడున్నరవఱకు మాత్రమె వడ్డీ గైకొనఁబడుచుండెను గాని యీకాలమునందువలె నధికమైన వడ్డీ గైకొనఁబడుచుండ లేదు.

## నాణెములు.

ఆంధ్రరాజుల కాలమున నాణెములు సీసముతోడను, రాగితోడను, వెండితోడను జేయఁబడినవిగా నున్నవి. వీనిలోఁ బెక్కువేల నాణెములు ధరణికోటలోను, గుడివాడ ప్రాంతముననుదొరకినవి. కొన్నినాణెములను రాబర్టు స్యూయలుగారు సంపాదించి జనరల్ కన్నిహ్యామ్ గారికిఁ బంపఁగా నయ్యవి గోతమిపుత్త్రిశాతకర్ణి, యజ్ఞశ్రీశాతకర్ణి, చంద్రశ్రీశాతకర్ణి కాలమునాటివై యున్నవని వారు కనుగొనిరి. పశ్చిమ భాగమున నఁగా నిప్పటి మహారాష్ట్ర దేశమునందును భగవన్‌లాల్ ఇంద్రాజిపండితునిచేతను గిబ్బుగారిచేతను కనుఁగొనఁబడినవి. అవియును గోతమిపుత్త్రిని యొక్కయు, యజ్ఞశ్రీయొక్కయు, పులమావియొక్కయు, వారి ప్రతినిధి పరిపాలకులయొక్కయు నాణెములుగా నున్నవి. పశ్చిమదేశమున దొరకిన యాంధ్రనాణెములపైన విల్లునంబులు చిత్రింపఁబడినవిగా నున్నవి.

స్యూయలుగారు గుడివాడలోఁ గనుఁగొనిన కొన్నినాణెములు చిత్రములుగా నున్నవి. రోమనులయొక్కయు, యవనులయొక్కయు ఓడలనుబోలిన యోడయొకటి అర్ధచంద్రాకృతిగల టాపుతోడను రెండు తెఱచాపలతోడను, తెడ్డువలెనుండు నొకపెద్ద లంగరు (చుక్కాను) తోడను జిత్రింపఁబడినవిగా నున్నవి. ఇయ్యవి యజ్ఞశ్రీకాలమునాటివిగా నున్నవి. ఈ నాణెమునుబట్టియె

యాకాలపునాటియాంధ్రులకు నోడలనుగూర్చియు, నావికాయాత్రలనుగూర్చియు, జ్ఞానముకలదనియు, ఆవిషయములందు వారాఱితేఱిన వారేయనియు స్పష్టముగాఁ జెప్పుటకు సంశయింపం బనిలేదు. ఈ నాణెములుగాక యాకాలమునందుగవ్వలు మొదలగునవి కూడ వ్యవహారమునం దుపయోగింపఁ బడుచుండినవి.

## విశేషానుభవముగల మణికారకులు.

విశేషానుభవముగల మణికారకులని (రత్నవర్తకులు, పూసలవర్తకులు, రత్నములకు సానపట్టువారు మణికారకు లనంబడుదురు. రాబర్టు స్యూయలుగారాంధ్రులనుగూర్చి వ్రాసియున్నారు. ఈవిషయమున రాబర్టు స్యూయలుగా రాంధ్రులకిచ్చిన యోగ్యతా పత్రిక చదువరుల కాహ్లాదకరముగా నుండునని దాని నీక్రింద నుదాహరించుచున్నారము.

“నాకు దొరకినపూసలు రేగడిమట్టితోఁ జేయఁబడి యెండఁ బెట్టఁబడినవిగను, బంకమట్టితోఁ జేసి కాల్చినవిగను, ఎముకతోడను, స్ఫటికముతోడను, గాజుతోడను, తృణమణితోడను, కెంపులతోడను, వివిధములయిన ఱాళ్లతోడను జేయఁబడినవిగను నున్నవి. కొన్ని చిన్నవిగను కొన్ని పెద్దవిగను పెక్కుతరహాలుగ నున్నవి. వానిలో ముఖ్యముగా ఱాళ్లతోఁ జేయఁబడినవి సొగసయిన పనివానితనమును దెలుపునవిగానున్నవి. స్ఫటికముతోఁ జేయఁబడిన గిన్నెయొక్క చిన్నభాగమును ఎముకతోఁ జేయబడిన హస్తకంకణములయొక్క యొకటి రెండుముక్కలును, నునుపుచేయఁబడిన యొకటి రెండు చిన్నఱాళ్లును, అటువంటివస్తువులె మఱికొన్నియునుగూడ దొరకినవి. ఇవియన్నియు నాకాలపునాటి మనుష్యులు విశేషానుభవముగల మణికారకులని ఋజువు చేయుచున్నవి. ఈవస్తువులన్నియును వీరిచే కృష్ణామండములోని గుడవాడవద్దఁ గనుగొనఁబడినవేగావున నీయోగ్యతాపత్రిక యాంధ్రులకే చెందునదిగాని మఱియొకరికిఁగాదు.

1 Archeological Survey of India, New Imperial Series Vol. XV. page 20.



## కుమ్మరపనులు.

ఆకాలపునాటి యిటుకలను మఱికొన్ని కుమ్మరపనులను పరిశోధించిన స్యూయలుగారె మరల నిట్లు వ్రాయుచున్నారు.

“ఆకాలపునాటి కుమ్మరు లీ కాలపునాటి వారికన్న నధికచాతుర్యము కలవారని నాకు దొరకిన పగిలిపోయిన కుండముక్కలు మొదలగునవి తేటపఱచుచున్నవి. అయ్యది నిస్సంశయముగా నిర్వివాదాంశమని నేననుకొనుచున్నాను. కొన్ని కుండలయొక్క మూతులు మూడునాలు గడుగులు నడిమికొలత గలిగి మిక్కిలి పెద్దవిగానుండి ధాన్యము మొదలగునవి నిలువఁజేసుకొనుటకనుకూలముగా నుండి యుండఁబోలు. కొన్ని మిక్కిలి సొగసుగా నగిషీ చేయఁబడినవిగా నున్నవి”

## సముద్రమార్గములు - రేవుపట్టణములు.

ఆంధ్రరాజుల పరిపాలనములో విదేశముతోడి వర్తకవ్యాపారము సముద్ర మార్గముల నడుపఁబడుచుండె ననుటకు దృష్టాంతము లనేకములు గలవు. అరేబియా, ఈజిప్తు, రోము, గ్రీసు, పారశీకము మొదలగు పశ్చిమదేశములనుండి యోడలు పశ్చిమ సముద్రతీరమునందలి భరుకచ్ఛము, సింహపురము, శూర్పారగము మొదలగు రేవు పట్టణములకు వచ్చుచుండెను. భరుకచ్ఛము నేడు బ్రోచి (Broach) యని పిలువఁబడుచున్నది. ఇచ్చటనుండి సింహళమునకును సింహళమునుండి గంగానదీ ముఖద్వారము నందుండిన తామ్రలిప్తి నగరమునకు సముద్రమార్గము కలదు. ఈ మార్గమున నోడలు రాకపోకలు సలుపుచుండెను. తామ్రలిప్తి నగరమున బయలువెడలిన యోడ తూర్పుతీరము వెంబడిని వచ్చి కళింగదేశములోని రెండు రేవు పట్టణములను ఆంధ్రదేశములోని రెండు రేవు పట్టణములను జూచుకొని చోళదేశపుతీరముప్రక్కనే సింహళద్వీపమునకుఁ బోవుచుండెను. కళింగదేశములోని ప్రధానమైన రేవుపట్టణము అడ్జిటాయనునదిగా నున్నది. ఈ పేరు బర్మాదేశపుగాథలలో గానుపించుచున్నది గాని కళింగదేశములోని యేపట్టణమునకు వర్తించునో దెలియరాకున్నయది. బర్మాదేశమునుండి “తా

వూసా, పాలికాట్'' అనువర్తకు లిరువురు తమసరకులను అడ్జిటారేవున దింపుకొని మగధదేశములోని సువర్ణపురికిఁ బోయిరని చెప్పఁబడినది. [1]కళింగదేశములోని రెండవరేవు పట్టణముపేరు తెలియరాదు. కృష్ణానదీ ముఖద్వారమునందొకరేవుపట్టణ ముండినట్లనేక గాథలవలనఁ దెలియుచున్నది. కొన్నిగాథలనైదవ ప్రకరణమునఁ దెలిపియే యుంటిమి. ఈపట్టణము పేరేమియని గ్రంథములను బరిశోధింపఁగ విదేశస్థులువ్రాసిన గ్రంథములలో "మసాలియా''యని పేర్కొనఁబడియెను. టాలెమీయను చరిత్రకారుఁడు, తన భూగోళమునందు మైసాలియా యని పేర్కొనియున్నాఁడు. "పెరిప్లస్ ఆఫ్ ఇరిత్రోయాన్‌సీ'' అనుగ్రంథమువ్రాసిన గంథకర్తకూడ "మసాలియా'' యనిపేర్కొని యున్నాఁడు. ఈ గ్రంథకర్త లిరువురు రెండవ శతాబ్దములోని వారుగా నున్నారు. ఈ పట్టణము పేరుతోనే మండలమునుగూడ వాఁడియున్నారు.[2] మసాలియా యనఁగా మోసలపురమని యొకరు వ్రాసియున్నారు. ఈ మోసలలేక మాసలపురము కృష్ణామండలములోని మసూలాయను మచిలీపట్టణమునకో లేక యిరువదిడెబ్బది మైళ్లదిగువున గుంటూరుమండలము బాపట్లతాలూకాలోని మోటుపల్లి గ్రామమునకో సంబంధించి యుండునని తోఁచుచున్నది. ఈ మండలము రవసెల్లాలకు (సన్ననినూలుబట్టలకు) విఖ్యాతిఁగాంచిన దని పై గ్రంథకారులు పేర్కొనియున్నారు. ఇటీవలి చరిత్రకారులు వ్రాసిన విషయములను బట్టికూడ నీయంశము ధ్రువపడుచున్నది. పదునొకండవ శతాబ్దప్రారంభమున "ఆబూరిహాన్'' అను అరాబియాదేశస్థుఁడొకఁడు "దనక'' యనుదేశము కొంకణమను పేరుగల కృష్ణానదీ తీరమునందలి పల్లపుప్రదేశములలో నున్నదని పేర్కొనియున్నాఁడు. ఆబూరిహాను

(1) The Deccan in the time of Goutama Buddha by the Rev. Thomas Foulkes, Chaplain of Coimbatore in the Ind. Ant., Vol. XVI.

(2) McCrindle's Ptolemy, p. 183, ff; The Periplus of the Erythroean Sea and Voyage of Nearchus, translated by William Vincent, D. D., p. 105, ff.



యొక్కయుద్దేశము ప్రకారము దనకదేశము ఖడ్గమృగముల దేశముగానున్నది. ఈయభిప్రాయమునే సూలిమాన్ అనువర్తకుఁడు దెలుపుచునట్టిదేశము దక్షిణహిందూదేశములోని "రూమి' (Ruhmi) యని పేర్కొని ఒకయుంగరములో దూరిపోఁగలట్టి సొగసయిన రవసెల్లాలకు (fine muslins) విఖ్యాతికెక్కినదనిగూడ చెప్పియున్నాఁడు. ఈదేశమునే మసుడియను (Masudi) యనునాతఁడు 'రహమా' (Rahama) యనియు, ఇద్రిసి (Idrisi) యనునాతడుడుమి (Dumi) యనియు, పేర్కొనియున్నారు. ఈదేశము సముద్రతీరమువెంబడి నున్నదనికూడ మసుడి చెప్పుచున్నాఁడు.

ఇంతియగాక పదునాలుగవ శతాబ్దమునం దీదేశమును జూడవచ్చిన మార్కోపోలో (Marco polo) అనునతఁడు మాబారుదేశమున కుత్తరమున మచిలీపట్టణ మండలములో ముటఫిలి (Mutafili) యనురేవుపట్టణమును బేర్కొనుచు వజ్రములకును, సాలెపట్టునుబోలె మిక్కిలి పలచనైన సన్ననిబట్టలకును ప్రసిద్ధికెక్కినదని పేర్కొనియున్నాఁడు. ఈముటఫిలి మచిలీపట్టణమునకు సంబంధించినదని కొందఱును, మోటుపల్లికి సంబంధించి యుండునని కొందఱును జెప్పుచున్నారు. ఇంకను ననేకులీదేశము వజ్రములకును మంచిరవసెల్లాలకును విఖ్యాతికెక్కినదని పేర్కొనియున్నారు. కాఁబట్టి టాలెమీమొదలగువారు రెండవశతాబ్దమునఁ బేర్కొనిన మసాలియా దేశమును, అరబ్బిదేశస్థులు పేర్కొనిన రహూమి లేక డుమి మండలమును, ఆబూరిహాన్ పేర్కొనిన దనకదేశమును ధాన్యకటకమను నాంధ్రదేశమునకు సంబంధించినవి కాని వేఱొకదేశమునకు సంబంధించినవికావు.[1]

చీనా, జపాను, బర్మా, దేశములనుండియు, సుమత్రా, జావా, బోర్నియో దీవులనుండియును, సింహళమునుండియు, వంగదేశమునుండియు నీమసాలియా రేవుపట్టణమునకు నోడలు సరకులను గొనివచ్చి మరల సరకులను గొనిపోవుచుండును. ఇంతియగాక నెల్లూరునకు సమీపమున పినాకినీ నదీముఖద్వారమున మఱియొకరేవుపట్టణముకలదుగాని పేరుదెలియరాకున్నది. ఈదేశమునందలి బట్టలు

1 Mr. Cunnimgham's Ancient Geography of India.

మొదలుగునవి ధాన్యకటకమునుండి ప్రతిష్ఠానపురముమీఁదుగా మెట్టదారినిభరుకచ్ఛము రేవునకుఁబోయి యచ్చటనుండి పశ్చిమమండలములకుఁ బంపఁబడుచుండినవి. పశ్చిమఖండములనుండి వచ్చుసరకులుగూడ భరుకచ్ఛమునుండి మెట్టదారిని ప్రతిష్ఠానపురము మీఁదుగానే యీదేశమునకుఁ గొనిరాఁబడుచుండినవి.

రోము మొదలగు ఖండాంతరదేశములతోడ వ్యాపారము జరుగుచుండినందులకు దృష్టాంతము రోమకచక్రవర్తులనాణెము లీతీరమునందు చెల్లుబడియగుచుండుటకన్న మఱియేమికావలయును. అట్టిరోమకనాణెములు రెండవశతాబ్దములోనివి నెల్లూరునకు సమీపమున భూమిలోనుండి పెల్లగింపఁబడినవి.

నెల్లూరునకు సమీపమున నొకకాపుఱాళ్లఅప్పలతోఁగూ యెక్కుటక సాధ్యముగానుండిన యొకకొండప్రక్కను పొలముదున్నుచుండఁగానిటుకకట్టడమొకటి యడ్డమువచ్చినందున నతఁడు దానిని త్రవ్విచూడఁగా నొకచిన్న దేవాలయము బయలుపడెను. దానిలో నొకచిన్నమట్టిముంత గానంబడియెను. ఆముంతలో రెండవశతాబ్దములోని కొన్నిరోమకనాణెములును, బిరుదుబిల్లలును గానవచ్చెను. అతఁడు వానిఁగైకొని పాతబంగారము క్రిందవాని నమ్మివేసెను. పెక్కునాణెములు కరగింపఁబడినవి. కాని అమీరు-ఉల్-ఉమ్రా అనునవాబు వానిముప్పదింటివఱకును స్వాధీనముచేసికొని అప్పుడు అనఁగా ౧౭౮౭వ సంవత్సరము జూలయినెలలో చెన్నపురిగవర్నరుగానుండిన అలెగ్జాండరు డేవిడ్సన్ దొరగారికిఁ బంపించెను. వారు వానిలో అడ్రియాన్ ఫాస్టినాయను రోమనుచక్రవర్తులపేరులుగల రెండునాణెములమాత్రము తీసికొనిరి. వానిలో ట్రజానుల నాణెములుమాత్రము సురక్షితములనియు, అవియన్నియు మేలిమిబంగారముతో పోతపోయఁబడినవనియు, అనేకములప్పుడే టంకసాలనుండి తేఁబడినట్లు క్రొత్తవిగను సొగసయినవిగనున్నవనియు, కొన్నియాభరణములుగ నుపయోగించుకొనఁబడుటచేత కాఁబోలు రూపములుచెడిపోయి యున్నవనియు వ్రాసియున్నారు. ఈరోమకనాణెములు మనదేశములోదొరకుటచేత ఖండాంతరదేశములతోఁగూడ వర్తకము జరుగుచుండెనని మనము నిశ్చయింపవచ్చును.

1 Asiatic Researches vol. II. pages 331,332.



మఱియును ఆంధ్రదేశమునకును సుమాత్రాజావా ద్వీపములకును విశేష సంబంధముగలదని కొన్నిహేతువులచే నిశ్చయింపఁబడుచున్నది. ఈయాంధ్రరాజులను మగధరాజులనియు, మహాకర్ణులనియు విదేశస్థులు పేర్కొనుచుండిరి. వీరినిగూర్చి యాకాలమున నాద్వీపములలోఁ గథలు చెప్పుకొనబడుచుండెను. ఒకకర్ణమహారాజునుగూర్చి యాదేశమునందొక కావ్యముకలదఁట. ఆకావ్యమేదియో తెలిసికొన్నయెడల వీరలచరిత్రము కొంతవఱకుఁ దెలియఁబడవచ్చును. ఈయాంధ్రరాజులకాలముననే బౌద్ధమతమాదీవులకు వ్యాపించినది. ఈదేశమునుండి బౌద్ధభిక్షువులును, వర్తకులు ననేకులాదేశమునకుఁ బోయివచ్చుచుండిరనికూడ తేటఁబడుచున్నది.

ఇంతియగాక యాంధ్రరాజులనుగూర్చి చీనాదేశమునందలి చరిత్రములలోఁ బ్రశంసింపఁబడియుండెను. చీనాదేశపు చరిత్రకారులు "యజ్ఞాయ్" (Yagnai) అని యజ్ఞశ్రీశాతకర్ణిని పేర్కొని వానిని హిందూదేశపు చక్రవర్తి యని చెప్పియున్నారు. ఆంధ్రరాజులలోఁ గడపటివాఁడయిన పులమాయిని "పౌలోమీన్" (Powlomein), హౌలోమీన్ (Howlomein), హౌలోమీన్తో (Howlomeinto), అని యాదేశపు చరిత్రకారులు పేర్కొనియున్నారు. ఇండియాదేశమును వారు పులిమాను దేశమని యర్థము నిచ్చునట్టి పౌలోమీన్కోవె (Poulomien kove) యని పిలిచియున్నారు. కడపటివాఁడయిన యీపులమాయి మరణానంతరము దేశమల్లకల్లోలమయ్యెనని "డీగ్నెస్ ఓలోనాచెన్" (Degiunes Olonachen) వ్రాసియున్నాఁడు. ఈపులమాయి క్రింది యధికారులలో నొకఁడు గంగానదీప్రాంతభూముల నాక్రమించుకొని చీనాచక్రవర్తి యగు టెయిట్ సాంగు (Taitsong), వద్దనుండి హ్యూంట్జె (Hiuntse) యనువాఁడు కొందఱు రాయబారులతో వచ్చుచున్నాఁడని విని వారలను బట్టికొనుటకై సేనలను బంపెననియు, బహుకష్టముతో

1 William Marsden: Asiatic Researches Vol. IV. pages 227. 229.

2 Asiatic Researches Vol. IX. p. III

హ్యూయాంట్సి తప్పించుకొని టిబెట్ దేశమునకుఁ బాఱిపోయెననియు, ఆదేశపురాజయిన "యెత్సోంగ్లాన్ స్తాన్" (Yetsonglonstan) అనునాతఁడు వానికిఁ గొంతసైన్యము నిచ్చెననియు, అతఁడాసైన్యముతో మరలవచ్చి పులమాయి శత్రువుని నోడించి వానిని జెఱఁ బట్టెననియు వ్రాసియున్నాఁడు. [1] వీనినన్నిటినిబట్టి చూడఁగా వీరలకును చీనా చక్రవర్తులకు విశేషమైత్రికలదనియు, ఈ రెండుదేశములకును వర్తక వ్యాపారము జరుగుచుండెననియుఁ దేటపడకమానదు.

## పట్టణములు—పల్లెలు.

ఆకాలమున నాంధ్రదేశమందుండిన పట్టణములు పల్లెలు కొన్ని ధాన్యకటకశాసనములలోఁ గానంబడుచున్నవి. "రాజగిరి, కేవూరూరు, మందర, విజయపురము. (బెజవాడ?), ధాన్యకటకము (ధరణికోట), కుట్టపరవేన, మహావనశాల, కూడూరు (బందరు తాలూకాలోని గూడూరులేక కృష్ణామండలములోని గుడివాడయై యుండవయును), ఒడి పరివేనన (ఒద్దిపట్టు?), సాధుగ, రాజశైలము, కటకశాల (ఘంటశాల), నడతూరు, మహాకాండూరూరు, వేలగిరి" అనునవి మాత్రము పేర్కొనఁబడినవి. "నందపురము, గిలనకేర, సగతి" అనునవి భట్టిప్రోలు శాసనములలోఁ బేర్కొనఁబడినవి.

## ఆంధ్రులవర్ణనము.

ఆంధ్రులు నాగరికతయందు పెక్కుతరగతులుగ వేఱుపడియుండిరి. అనార్యాంధ్రులు నాగరికతయందు వెనుకఁబడియున్నవారగుటచేత వారు కేవలముదిగంబరులుగా నుండిరని చెప్పవచ్చును. నాగరికులయిన నాగులు కొంచెము వస్త్రాదికమును గలిగియుండిరి. వారు ధరించుకొనుదుస్తులును, అలంకరించుకొను నాభరణములు వారివారిస్థితుల ననుసరించి భేదించియుండినవి. సాంచి, నాసిక, కార్లి, అమరావతి, మొదలగు ప్రదేశములలోని విగ్రహములను జూచినయెడల వారలంకరించుకొనినయాభరణముల వైఖరులు తేటపడఁగలవు. ఆంధ్రస్త్రీలలంకరించుకొను నాభరణములలో పెద్దవిగను దీర్ఘచతురస్రములుగనుండిన బిల్లలతోఁ గూర్పఁబడి బరువుగను వెడల్పుగనుండు మెడసరము ప్రాముఖ్యమును గాంచియుండినది. చెవులపోగులు పెద్దవిగనుండినవి. ఒక్కొకప్పుడు దీర్ఘచతురస్రములుగనుండి భుజములపై వ్రేలాడుచుండినవి. చేతులకు మణికట్టులకడ బరువైన కంకణములుగలవు. కాళ్లకును బరువైన యందెలు కడియములు నుండినవి. పచ్చనిబొట్టు స్త్రీలమోము నలంకరించియుండెను. ముంగటి భాగము గుబురుగనుండి యెత్తుగ నుండు నొకవిధమైన తలపాగ పురుషులచే నలంకరించుకొనఁబడుచుండెను. పురుషులును స్త్రీలును కటిప్రదేశమునకు పై భాగమున నగలుతక్క విశేష వస్త్రాదికమును ధరించి యుండలేదు. స్త్రీలనడుములకు నొడ్డాణములు గలవు. రణశూరులయిన యాంధ్రులు విల్లంబులను (ధనురస్త్రములు), కుంతములను (ఈఁటెలను), ఖడ్గములను ధరించుకొనియుండిరి. ఇత్తడి, రాగి, దంతము మొదలగువానితోఁ జేయఁబడిననగలను బీదవారు ధరించియుండఁగా భాగ్యవంతులు బంగారునగలను ధరించుచుండిరి. ఆకాలమున లోహములలో వెండి మిక్కిలి స్వల్పముగ నుండుటచేత వెండినగల నెవ్వరును ధరించుచుండలేదు. భాగ్యవంతులు కాళ్లకుఁగూడ బంగారందియలను బంగారు కడియములను ధరించియుండిరి. ఈకాలమునందుఁ గొన్ని తెగలలో వలెఁ దమ స్త్రీలకు ముసుగులువేసి సూర్యరస్మిసైనఁ గానరాకుండ మూలఁ గూర్చుండబెట్టు విపరీతాచారములను వారెఱుంగరు. ఆంధ్రరాణులు సహితము రాజసభలలోఁ దమభర్తల ప్రక్కను గూరుచుండుచువచ్చిరి. ఉన్నతస్థితియందుండిన స్త్రీలు సహితము విద్యాభ్యాసమును జేయుచుండిరి. ఆకాలమునందు పురుషులు స్త్రీలను మిక్కిలి మర్యాదతోఁ జూచుచుండిరనుటకుఁ బెక్కు దృష్టాంతములు గలవు. మతకార్యములలోను స్త్రీలే ప్రాముఖ్యురాండ్రుగ నుండుచువచ్చిరి. ఏమత మవలంబించినను స్త్రీలే మార్గదర్శనులుగ నుండిరి. పురుషులకన్నను స్త్రీలకే మతాభినివేశమధికముగా నుండెను. సర్వసామాన్యముగా పురుషులే స్త్రీలకు వశులై వర్తించుచుండిరి.



## విశేషాంశములు.

ధాన్యకటకబౌద్ధస్తూపములోనిదానశాసనములలో రెండు విచిత్రమయిన సంబంధమును దెలుపునవిగా నున్నవి. తోళ్లపనిచేయువాఁడును నాగఘు

రుని కుమారుఁడును నగు విధికుఁడను వాఁడు తనతల్లితోడను, తనభార్యతోడను, తనసహోదరులతోడను, తనకుమారుఁడగు నాగునితోడను, తనపుత్త్రికలతోడను, తనబంధువులతోడను, తనమిత్త్రులతోడను గలిసివచ్చి వ్రాయించిన దాన శాసన మొకటియు, ముకుందశర్మయనువానికుమారుఁడు కూతుంద్రతోడను కోడంద్రతోడను మనమలతోడను గలిసివచ్చి వ్రాయించిన దానశాసన మొకటియుఁ గలవు.[1] శర్మయనునది బ్రాహ్మణుల పట్టపు పేరు. పై ముకుందశర్మ వైదికమతమునకు సంబంధించిన బ్రాహ్మణుఁడుగఁ గన్పట్టుచున్నాఁడు. విధికుఁడు తోళ్ళపని చేయువాఁడని చెప్పఁబడినది వాస్తవమయినేని వాఁతఁడు హైన్యజాతివాఁడయి యుండవలయును గదా. పూర్వమున సాధారణముగా మాదిగవాండ్రు మాత్రమె తోళ్లపని చేయుచుండిరి. అప్పటికి మాలమాదిగలు లేకపోయినను వాండ్ర పూర్వు లెవ్వరో యొకరుండి యుండక తప్పదుగదా ఆకాలమునందు బుద్ధుని పూజించువారిలో బ్రాహ్మణులుకూడ గలరనియు, మఱియు బ్రాహ్మణుఁడయినను చండాలుఁడయినను వర్ణభేదము లేకుండి సమస్తమతములవారును బౌద్ధాలయములం బ్రవేశించుటకు నర్చనలు పలుపుటకు సమానహక్కునే గలిగియున్నారనియును పైదానశాసనములు రెండును దెలుపుచున్నవి. ఆకాలమునందు యవనపహ్లవాది మ్లేచ్ఛులే హిందూనామములను ధరించి బౌద్ధమతము నవలంబించి బౌద్ధాలయములకు వచ్చి బుద్ధుని సేవించి దానధర్మములుగావించి శాసనములఁ జెక్కించినవారు పెక్కండ్రుగలరు.

కృష్ణుఁడును, వానిసోదరుఁడు క్షుల్లకృష్ణుఁడును, వారిసోదరి నాఖాయను నామెయు, ధాన్యకటకములోని గొప్పచైత్యమునకు నూర్ధ్వపట్టమును దానముచేసిరని దెలిపెడి దాన శాసన మొకటికలదు. ఇందు కృష్ణుఁడు దమిళుఁడని పేర్కొనఁబడియున్నది. తమిళమె దమిళముకాఁగా నయ్యది ద్రమిళముగాను ద్రవిడముగాను సంస్కృత గ్రంథకారులచేఁ బేర్కొనఁబడినది గావున నాశాసనమునాఁటికిదమిళులు వేఱుగను నాంధ్రులు వేఱుగనుండిరని తేటపడుచున్నది.

1 The Buddhist Stupas of Amaravati and Jaggayyapeta. pp. 91 to 103.



తమిళులను బట్టియె ద్రావిడ శబ్దమేర్పడినదిగావునఁ దమిళులకుఁ బూర్వ మీదేశముననున్న వారిని ద్రావిడులని పిలువరాదని పూర్వప్రకరణములయందు చేసిన వాదము సహేతుకమైనదని తేటపడకమానదు. ఏభాష నాగులు మొదలగు జాతులవారిచే భాషింపఁబడుచుండెనో యాభాషనే తమిళజాతుల వారీ దక్షిణాపథమునకు రావేగమె యవలంబించిరి గావున నాటనుండియు నాభాష ద్రావిడభాషగాఁ బరిగణింపఁబడుచుండెను. కాఁబట్టి ద్రావిడభాషలని చెప్పఁబడియెడి యిప్పటి యఱవము, కన్నడము, తెలుఁగు, మలయాళము మొదలగు భాషలకుఁ దల్లి తొంటి నాగజాతులవారి భాషయె కాని తమిళుల భాష కాదనియు, కొందఱు తలంచునట్లుగ నిప్పటి తమిళభాషనుండి తెలుఁగుపుట్టినది కాదనియుఁ నూహింపఁ దగియున్నది.

## కర్ణాటము.

కర్ణమనఁగా కొండలోయ యనియుఁ వానియందు సంచరించువారు కర్ణాటులనియు, కర్ణాటులు నివసించుదేశము కర్ణాటమైనదనియు కొందఱు పండితులు చెప్పినది నాలుగవ ప్రకరణమునందుఁ గొంచెముగఁ బ్రశంసింపఁబడినది. కర్ణాటమనునది మొదట కొండలోయను బట్టికాక కర్ణులనుబట్టి యేర్పడినదని కొందఱు చరిత్రకారుల యభిప్రాయమై యున్నది. ఆంధ్రదేశమును బాలించినరాజులలో "శాతకర్ణి" అనుపేరును వహించినవారనేకులుండుటచేత సామాన్యముగా నాంధ్రరాజులను కర్ణులని వ్యవహరించుచుండిరి. వీరు బహుశతాబ్దములు దేశమును బాలించినవారగుటచేత వీరి కీర్తి సర్వత్ర వ్యాపించినది. తమిళజాతుల వారిచే నివసింపఁబడు దేశములోఁ గొంతభాగ మాంధ్రరాజులగు కర్ణులచే జయింపఁబడి వారికి సంచారభూమిగనుండుటచేత నాభాగమునకు కర్ణాటమని పేరు వచ్చినదని చెప్పుచున్నారు. మొట్టమొదట కర్ణాటమని వ్యవహరింపఁబడిన భాగము మైసూరుదేశము. ఈభాగము తమిళజాతులవారినుండి యాంధ్రులచే నాక్రమింపఁబడినదని చెప్పుటకు దృష్టాంతములుగఁ జారిత్రక విషయములు గలవు. హారితీ పుత్త్రి శాతకర్ణియొక్క శిలాశాసనములు రెండు మైసూరుదేశ

మునందుఁ గన్పట్టఁబడె నని యిదివఱకె తెలుపఁబడియెను. శాతకర్ణియను పేరు నాంధ్రభృత్యవంశపురాజులు ధరించుచుండుటచేత నితఁడుకూడ నావంశములోని వాఁడే యని నిశ్చయింపఁదగును. ఇతని కొమార్తె యొకనాగప్రతిమను, ఒక చెఱువును, ఒకబౌద్ధ విహారమును దానముచేసెనని తెలిపెడి దానశాసన మొకటి వనవాసియందు బర్గెస్సుగారివలనఁ గనిపెట్టఁబడినది. ఇతఁడచ్చోటఁ బరిపాలనము చేయుచుండెనని యందుఁ దెలుపంబడియెనని యిదివఱకు పేర్కొనంబడియెను. ఈక్రొత్తశాసనములో నితఁడొక బ్రాహ్మణునకుఁ గొన్ని గ్రామముల దానము చేసినట్లు చెప్పఁబడియెను. అందితఁడు మట్టిపట్టి యనుదేవుని గూర్చిన ప్రార్థనముగూడ వ్రాయించెను. ఇయ్యది శివుని పేరులలో నొకటిగాఁ గన్పట్టుచున్నది. ఈశాసనము నాసిక, ధాన్యకటకము మొదలగుస్థలములలోని యాంధ్రశాసనములం బోలియుండుటయే గాక వానివలె ప్రాకృత భాషలో నున్నది.[1] ఇంతియగాక మఱియొకవిశేషము గలదు.

స్థానకుంధూరునకు సమీపముననున్న యొకపురాతన శైవదేవాలయము చెంగట నొకకోనేరును నిర్మించుటనుగూర్చి ప్రాశస్తి యనుదానిలో కుబ్జుఁడను శైవకవి యొకఁడు వర్ణించియున్నాఁడు. ఆశివాలయమునకు దానధర్మములు చేసినవారిలో శాతకర్ణి యొకఁడని యాకవి పేర్కొనియున్నాఁడు. అతఁడు హారితపుత్త్రి శాతకర్ణియని పైఁజెప్పిన యంశములను బట్టి స్పష్టపడకమానదు. ఈహేతువులన్నిటినిఁ బరిశీలించి చూచినప్పుడు శాతకర్ణాభిధానులయిన యాంధ్రరాజులు మొదట ద్రావిడులనుండి యాభాగమును గైకొని పరిపాలించిరనియు వారిమూలముననే యాభాగమునకుఁ గర్ణాట మనునామము గలిగినదనియుఁ జెప్పెడి వారివాదమునకుఁ బైనుదాహరించిన యంశములు బలకరములుగా నున్నవనుటకు సందియములేదు.

1 The Indian Antiquary Vol. XXV.p. 27.

పదునొకొండవ ప్రకరణము.

# ఆంధ్రపల్లవులు.



పల్లవులచరిత్ర మగాధముగనున్నది. పల్లవులు స్వదేశస్థులని కొందఱును విదేశస్థులని మఱికొందఱు భిన్నాభిప్రాయులై యున్నను, మొదట నాంధ్రదేశమునుండియె దక్షిణమునకుఁ బోయియుండిరను విషయమును మాత్రము చరిత్రకారులెల్లరు నంగీకరించినవారు. విదేశస్థులని చెప్పెడివారు దేశమతాచారముల నవలంబించి దేశీయులలోఁ గలసి బహుశతాబ్దములు నివసించియుండి తమతొంటి జన్మస్థానమును మఱచి తాముండినదేశమే తమదేశముగ భావించుకొనుచు దేశపరిపాలనముచేసిన పల్లవులను విదేశస్థులనుగానే పేర్కొనుచుండుటయు, స్వదేశస్థులని చెప్పెడివారు బహురాజ్యములను సంపాదించి రాజాధిరాజులై నిర్వక్రపరాక్రమమును జూపి దేశపరిపాలనముఁ జేసిన వారిని దారిదోపిడికాండ్ర తెగలలోఁ జేర్చి పేర్కొనుచుండుటయు వింతగాఁ గన్పట్టకమానదు. ఈద్విపక్షముల వారివాదములను కేవలము సత్యములని యంగీకరింపరాదు; కేవలమసత్యములని నిరాకరింపనురాదు. కొంతవఱకు సత్యములు నసత్యములుగూడనై యున్నవి. ఏదేశస్థులయినను, ఏజాతివారయినను ఈదేశమునకువచ్చి ఈదేశమతాచారముల నవలంబించి ఈదేశనామముల నలంకరించుకొని ఈదేశమే తమ మాతృదేశముగా భావించుకొనినవారిని స్వదేశస్థులనుగానే పేర్కొనవలసియుండునుగాని కడవఱకు విదేశస్థులనుగానే భావించి అట్లు పేర్కొనుచుండుట కేవలముఁ బొరపాటని చెప్పఁదగును. గోదావరినది నాసికాత్ర్యంబకముకడ జనించి సముద్రములోఁ గలియువఱకు నడుమ నెన్నో యుపనదు లెచ్చటెచ్చటనో పుట్టి వేర్వేఱు నామములతోఁ బ్రవహించుచువచ్చి గోదావరి మహానదిలోఁ గలియుచున్నవిగదా. అట్లు వరద, మంజీర, ప్రాణహిత, ఇంద్రావతి మొదలగు

నుపనదులువచ్చి గోదావరిలోఁ గలియుచున్నను, ఆగోదావరిలోని జలమును గూర్చి ప్రసంగింపవలసి వచ్చినప్పుడు వరదానది జలమనికాని, మంజీరానది జలమనికాని, ప్రాణహితానది జలమనికాని, ఇంద్రావతీనదిజలమనికాని పిలువక గోదావరీజలమనియే పిలుచుచున్నారము. అట్లు, ఏదేశస్థులయినను, ఏజాతివారయినను, ఆంధ్రదేశమునకువచ్చి, ఆంధ్రదేశమతాచారముల నవలంబించి, ఆంధ్రుల వేషభాషల నలవరించుకొని, ఆంధ్రులతో సంబంధబాంధవ్యముల నెఱపుచు, ఆంధ్రమహాసంఘములోఁ గలిసిపోయిన వారాంధ్రులుగానే పరిగణింపఁబడఁదగిన వారుగాని అన్యులుగాఁ బరిగణింపఁ బడఁదగినవారుకారు. ఆంధ్రులలోఁ గలిసిపోయిన పల్లవులయొక్క పూర్వులయిన పహ్లావులయొక్క జన్మస్థానము పారసీకమై నంతమాత్రముచేతఁ బల్లవులను పారసీకులనుగా భావించి విదేశస్థులనుగాఁ బరిగణించుట యొప్పిదమైన విషయముగాదు. కావున నేయాంధ్రులలో నొకతెగగా నేర్పడిన పల్లవుల నాంధ్రులనియే భావించి చదువరులకు సులభముగా బోధపడులాగున నాంధ్రపల్లవులని పేర్కొనుచున్నారము. పహ్లావులేపల్లవులయిరనియు, ఆంధ్రదేశములోఁ బల్లవులకు జన్మభూమి పల్లవనాడనియు, (పల్నాడు) ఏడవప్రకరణమున గొంచెముగ సూచించియుంటిమి. పహ్లావులెవ్వరు? ఎక్కడనుండి వచ్చినవారు? వీరిచరిత్రమేమి? మన పూర్వగ్రంథములం దెచ్చటనైన వీరినిగూర్చి తెలుపంబడియెనా? అనుప్రశ్నంబులను మనము విచారింపవలయును.

## పురాణములలోని పహ్లావులు.

మనపురాణాదిపూర్వగ్రంథములలోఁ బహ్లావులు పేర్కొనఁబడియున్నారుగాని పల్లవులు పేర్కొనఁబడి యుండలేదు. పహ్లావులు పశ్చిమోత్తరజాతులలోనివారనియు, వారిదేశము సింధునదికిని పారసీకమునకు నడుమనెచ్చటనోయున్నదని పురాణములలోఁ బేర్కొనంబడియెను. మనుధర్మశాస్త్రకారుఁడు పహ్లావులను మ్లేచ్ఛులనుగాఁ జెప్పియున్నాఁడు. పహ్లావులు మ్లేచ్ఛులని మహాభారతములోని భీష్మపర్వము లో ౯ దవ యధ్యాయమునఁ జెప్పంబడి

1 మనుధర్మశాస్త్రము, అధ్యాయము. ౧౦. శ్లో. ౪౪.



యెను. వారు సగరునిచేత జయింపఁబడిరి గాని సగరుని కులగురువగు వసిష్ఠుఁడడ్డుపడుటచేత నిర్మూలము చేయఁబడక విడిచిపెట్టఁబడిరి. మాంధాతయనురాజు పహ్లావుల [1] విధులనుగూర్చి యింద్రుని ప్రశ్నించినట్లుగ మహాభారతములోని శాంతిపర్వములో ౬౪ గవ యధ్యాయమునం జెప్పఁబడినది. అచ్చట యవనులు, కిరాతులు, గాంధారులు, చీనులు, శబరులు, బర్బరులు, శకనులు, తుషారులు, కంకులు, ఆంధ్రులు, మద్రకులు, పుండ్రకులు, పుళిందులు, రమఠులు, కాంభోజులు మొదలగు జాతులతోఁ బహ్లావులు చేర్పఁబడిరి?

వసిష్ఠమహాముని కామధేనువు అంకెవేయునపుడు జనించిన పహ్లావులు మొదటక్షత్రియులయినను క్రమముగా శూద్రులయిరని హరివంశము రామాయణములలోఁ జెప్పంబడియెను. అచ్చట వీరలు శకనులతోను, యవనులతోను, కాంభోజులతోను జేర్పఁబడి ఈజాతికి ముఖ్యమైన గుఱుతుగడ్డమని [2] యు, దానిని ధరించుటకు సగరుఁ డనుమతించె ననియుఁగూడ చెప్పంబడియెను. విష్ణుపురాణమునందును యవన పహ్లావ కాంభోజులు మొట్టమొదట క్షత్రియులయినను బ్రాహ్మణులనుండియు, బ్రాహ్మణాశ్రమములనుండియు వేఱుపడినవారగుటచేత శూద్రులయిపోయిరని చెప్పఁబడియెను. [3] మొదట వీరు క్షత్రియులేయనియు, పవిత్రకర్మలను విడనాడి బ్రాహ్మణాధికార మతిక్రమించుటచేత శూద్రు

1 టి. ఆర్. కృష్ణమాచార్యులు, వ్యాసాచార్యులుగార్లచే ముద్రింపఁబడుచుండిన సంస్కృత మహాభారతములో పహ్లావశబ్దమునకు బదులుగా పల్లవశబ్దమే గ్రహింపఁబడినదనియు, దక్షిణ హిందూదేశములోని వ్రాఁతప్రతులనుబట్టి తామాగ్రంథమును బరిష్కరించి ముద్రించుచున్నారమని సంపాదకులు తమతోఁ జెప్పినట్లుగ రావుబహాదుర్ వి. వెంకయ్య. ఎమ్. ఏగారు వ్రాయుచున్నారు.

2 పాశ్చాత్త్యుల (అనఁగాయవనుల గడ్డములనుగూర్చి కాళిదాసుకూడ తనరఘువంశము చతుర్థసర్గమున ౬౩ వ శ్లోకమునఁ బ్రశంసించి యున్నాఁడు

3 Muir Sanskrit Texts Vol. II. p. 259, and Indian Antiqnary Vol. IV, p. 166.

లయిపోయిరని మనువుగూడ వ్రాసియుండెను. కాళిదాసు తనరఘువంశమునందు రఘుమహారాజు దిగ్విజయమును వర్ణించు పట్టున యవనులను హిందూదేశమునకుఁ బశ్చిమదిశను జేర్చియున్నాఁడు. పారసీకులను జయించుటకై రఘుమహారాజు త్రికూటమునుండి మెట్టదారిని బోయెనని చెప్పియుండెను. యవనులనుజయించినతరువాత పారసీకులను జయించెనని చెప్పియుండెను. దీనింబట్టి పౌరాణిక కాలమునందు పహ్లవులు పరిపాలన భారమును వహించిన యొకజాతివారని స్పష్టపడుచున్నది. వారు బ్రాహ్మణకర్మల ననుసరింపలేదని చెప్పుటచేత వారు విదేశస్థులనియు, విజాతీయులనియు, వారిపూర్వులెప్పుడో యీదేశమునకువచ్చి యుండిరనియుఁ దేటపడుచున్నది.

## శాసనములలోని పల్లవరాజవంశము.

పల్లవమను సంస్కృత శబ్దమునకు చిగురనియర్థము. పల్లవవంశములోని పూర్వుఁడయిన పల్లవుఁడు పల్లవముల పల్లకిలో నాకస్మికముగ నశ్వత్థామకు జనించుటచేత నతనికా పేరువచ్చినదనియు, వానిసంతతివారలు పల్లవులయిరనియు కాసకుడి తామ్రశాసనమునఁ జెప్పఁబడియెను. ఇయ్యది నందిపల్లవమల్లునిచే వ్రాయించఁబడినది. పరమేశ్వరవర్మకురము శాసనమునందును, ఉదయేంద్రము శాసనమునందును, అశ్వత్థామకు పల్లవుఁడు జనించెనని లిఖింపఁబడియెను.[1] కాసకుడి తామ్రశాసనమునందశ్వత్థామకు నప్సరసయగు మేనకయందు పల్లవుఁడు జనించెననికూడ చెప్పఁబడియున్నది.[2] అయినను సింహవర్మ అమరావతీ శిలాస్తంభముపై వ్రాయించిన శాసనములో నశ్వత్థామకు మదనికయను నప్సరసవలన పల్లవుఁడు జనించెనని గానంబడుచున్నది.[3] ప్రాచీన పల్లవరాజులు తమ శాసనములలోఁ దాముపల్లవులమనియు, భారద్వాజ గోత్రులమనియు, వ్రాసికొనియుండిరి[4] కాని తరువాతివారు పోయిన పోకలేవియు వారిశాసనములందుఁ

1 రఘువంశము, సర్గము ౪, శ్లో ౬౦ మొదలు ౭౪ వఱకు.

2 South Indian Inscriptions Vol. I, p. 152; *Ibid* Vol. II p. 370. 3 *Ibid* Vol. II, p. 355. 4 *Ibid* Vol. I, p. 27



గానరావు. ఈ పల్లవరాజవంశమైనను పలుశాసనముల యందుఁ బలురీతులుగ నభివర్ణింపఁబడినది. ఈపల్లవుఁడు క్షత్రియుఁడుగాఁ జెప్పఁబడక బ్రహ్మకులములోనివాఁడుగాఁ జెప్పఁబడియెను. ఈబ్రహ్మవంశము సహితము తాతలను మనుమలుగను, మనుమలను తాతలుగను జేయఁబడి పలుశాసనములలో వర్ణింపఁబడినది.

కాంచీపురము కైలాసనాథుని దేవాలయములో నొకశాసనమున బ్రహ్మకునంగిరసుఁడు, వానికి బృహస్పతి, వానికిసంయువు, వానికి భారద్వాజుఁడు, వానికిద్రోణుఁడు, వానికి నశ్వత్థామ, వానికి పల్లవుఁడు జనించెనని చెప్పియుండఁగా కురముశాసనము సంయువును నెగురఁగొట్టి బృహస్పతికి మనుమఁడుగఁ జెప్పఁబడిన భారద్వాజుని పుత్త్రునిగఁ జేసి వర్ణించియుండెను. అమరావతీశాసనమన్ననో బృహస్పతిని నెగురఁగొట్టి కురముశాసనమున నంగిరసునకు మనుమఁడుగాఁ జెప్పఁబడిన భరద్వాజుని నంగిరసునకుఁ దండ్రిగఁ జేసి మధ్యసుధామానుఁడనువానిఁ గల్పించి ద్రోణునకుఁ దండ్రిగఁ జేసెను. ఇంకనుసట్టివే వైచిత్ర్యములీశాసనము లోనివంశములఁ గనృట్టుచున్నవి. పల్లవరాజులు కొందఱు భారద్వాజగోత్రులమని చెప్పుకొనియున్నను మఱికొందఱు సాలంకాయనులమనియు, బృహత్ఫలాయనులమనియుఁ జెప్పుకొనిరి. దక్షిణాపథమున రాజ్యాధికారమును బూని పరిపాలనము చేసినవారిలో పాండ్యచోళకేరళులు, చాళుక్యులు, గాంగులు, కాకతీయులు మొదలగువారు తాము సూర్యవంశపురాజులమని చంద్రవంశపురాజులమని యిక్ష్వాకువంశపురాజులమని చెప్పుకొని యుండిరిగాని పల్లవులవలె బ్రహ్మవంశమని చెప్పుకొని యుండలేదు. చోళులు సూర్యవంశజులమని చెప్పుకొని యుండిరి. పాండ్యులు చంద్రవంశజులమని చెప్పుకొనియుండిరి. కేరళులు సూర్యవంశజులమని చెప్పుకొనిరి. చాళుక్యులు చంద్రవంశజులమనిరి. రాష్ట్రకూటులు నట్లే చెప్పిరి. మఱియువీరలు పురాతనకాలమునఁ బ్రసిద్ధిఁగాంచిన పౌరాణికరాజుల వంశములనుండి తాము జన్మించితిమని కూడ చెప్పుకొని

1 Ep. Ind. Vol. 5, text 2; line Vol. VIII p. 145, text line 2 and Vol. VI. p. 86 text line 2.

యుండిరి. మనువును, ఇక్ష్వాకువును, మాంధాతను, ముచికుందుని, శిబిని తమపూర్వులనుగా చోళరాజులు చెప్పుకొనిరి. తమవంశము పురూరవచక్రవర్తినుండి ప్రారంభమైనదని పాండ్యులు చెప్పుకొనిరి. సగరుఁడు, భగీరథుఁడు. రఘువు, దశరథుఁడు, రాముఁడు తమపూర్వులని చేరరాజులు చెప్పుకొనిరి. చాళుక్యులును చంద్రవంశపురాజులను బెక్కండ్రను జేర్కొనిరి. రాష్ట్రకూటులు యదువంశజులమనియు, సాత్యకిసంతతి వారమనియుఁ జెప్పుకొనిరి. కళింగగాంగులు తమది చంద్రవంశమనియు, పురూరవుఁడు, ఆయువు, నహుషుఁడు, యయాతి, దుర్వసుఁడు తమపూర్వులనియుఁ జెప్పుకొనియుండిరి. తలకాడులోని పశ్చిమగాంగులు తమది సూర్యకులమనియు, ఇక్ష్వాకుఁడు తమపూర్వుఁడనియుఁ జెప్పుకొనియుండిరి. పల్లవ పంశమున బౌరాణిక రాజులలో నొక్కని పేరు మాత్రము గానంబడుచున్నది. అశోకవర్మ పల్లవుని కొడుకని చెప్పఁబడియున్నది. మౌర్య చక్రవర్తియగు నశోకవర్ధనుని పేరే అశోకవర్మగా మార్పఁబడి యిందుఁ జేర్పఁబడినదని డాక్టరు హుల్‌ట్జ్ (Hultzseh) గారూహించినది సరియైనదిగానున్నది.[4] ఇట్లు పాండ్యచోళకేరళాదు లవలంబించినపద్ధతికి విరుద్ధమైన పద్ధతి నవలంబించి వారలకుఁ బ్రబలశత్రువులుగ నుండుటచేతఁ బల్లవులు విదేశస్థులయిన జాతీయులలోని వారనియును, పాండ్యచోళకేరళాదులు స్వదేశస్థులయిన స్వజాతీయులలోని వారనియును రావుబహాదరు వెంకయ్యగారు వ్రాయుచున్నారుగాని పాండ్యచోళకేరళాదులు వెంకయ్యగారు తలంచునట్లుగాక మొట్టమొదట త్రివిష్టప (Tibet) ప్రాంతదేశములనుండి వచ్చినవారని నాలుగవ ప్రకరణమునందు వ్రాసియుంటిమి. కాఁబట్టి పల్లవులు విదేశస్థులయినచో పాండ్యచోళాదులును విదేశస్థులుగానె పరిగణింపఁ బడవలయును. పాండ్యచోళాదులు స్వదేశస్థులయిన స్వజాతీయులుగాఁ జేర్కొనఁబడినప్పుడు పల్లవులను గూఁడ స్వదేశస్థులయిన స్వజాతీయులనుగానే చేర్కొనవలసి యుండును. పల్ల-

1 Ind. Ant, Vol. XVIII. p. 170; 2 Mr. Rice's Mysore Gagetteer Vol. I, pp. 308; 3 South, Ind. Ins, Vol II, p. 342; (4) Arch. Sur, Annual Report, 1906-1907.



వులయినను పాండ్యచోళులయినను మఱి యెవ్వరయినను మొదట వారెక్కడనుండినను దక్షిణాపథమునకు వచ్చియిచ్చటి భాషలను, ఇచ్చటిమతముల నవలంబించి దేశస్థులలోఁ గలసిపోయిన వారగుటచేత స్వదేశస్థులుగాఁ బరిగణింపఁబడవలసిన వారగుచున్నారు.

## అశ్వత్థామ వంశమనుటకుఁ గారణము.

పల్లవులకును పాండ్యులకును గర్భశత్రుత్వముగలదు. పాండ్యులు తాము పాండవులసంతతి వారమని చెప్పుకొన మొదలు పెట్టిన నాఁటనుండియుఁ బల్లవులును తమపూర్వులు భారద్వాజ గోత్రులమని చెప్పుకొని యుండుటచేతను, పాండవుల బంధుపుత్త్రమిత్రపరివారమును నిర్మూలముచేసిన వాఁ డశ్వత్థామయగుటచేతను, భారతమునందు నశ్వత్థామ ద్రోణపుత్త్రుఁడుగను, భారద్వాజుని మనుమఁడుగను జెప్పఁబడియుండుట చేతను, అశ్వత్థామ పాండవ బలముల నిర్మూలముచేసినట్లుగఁ బాండవుల సంతతివారయిన పాండ్యుల బలమును అశ్వత్థామ సంతతి వారలయిన పల్లవులు నిర్మూలము చేయఁగలరని సూచించున దగుటచేతను, అశ్వత్థామకుఁ బల్లవుఁడు జనించెననియు, ఆపల్లవుని వంశమునందే తాము జన్మించుటచేతఁ దమదిపల్లవ వంశమని చెప్పుకొను చుండిరిగాని నిజముగా నశ్వత్థామకుజనించిన పల్లవుని వంశజులేయైనయెడల నయదార్థములును వ్యత్యస్తములును నగువిషయములను వంశచారిత్రములందుఁ జెప్పుకొనకయే యుందురు. అశ్వత్థామ బ్రహ్మచారియని మహాభారతమునుబట్టి మన మెఱుంగుదుము. అశ్వత్థామకు భార్యలేదుగనుక నప్సరసనొకదాని ముడివెట్టిరి. పల్లవులు బ్రాహ్మణుల నాదరించి పోషించిరి. పాండ్యులు మొదట జైనమతావలంబకులుగనుండిరి తరువాత శైవులయిరి. వీరు బ్రాహ్మణులకుఁ బ్రతిపక్షులుగనుండిరి. కనుక బ్రాహ్మణులు తఱుచుగాఁ బల్లవులపక్షమున నుండుచువచ్చిరి. పల్లవుల శాసనములను వ్రాసినవారు బ్రాహ్మణులే. తమపక్షమునుబూని తమ్మునాదరించుటకొఱకు వారిని బ్రహ్మకులమని, భారద్వాజ గోత్రులని, అశ్వత్థామ సంతతియని, పల్లవరాజ వంశమని వారలకు ల్లాసముగలుగునట్లుగాఁ బొగడి యిట్టివెన్నియో గల్పించి వార-

లను వశపఱచుకొనిరి. బ్రాహ్మణులు తమకార్యములను సాధించుకొని లాభమును బొందియుందురు. అశ్వత్థామ యాగ్రహమునుజూపి విజృంభించినతోడనే భీమార్జునకృష్ణులు భయంపడి పిఱికి పందలై యాయుధములను విడిచిపెట్టి చేతులు జోడించుకొని నిలంబడిరని కాసకుడి తామ్రశాసనమునం దశ్వత్థామ పరాక్రమము వర్ణింపఁబడినది. ఇట్టివర్ణన పల్లవులను సంతోషపెట్టుటకు గాక మఱియెందులకు?

## పార్థియనులే పహ్లావులు.

పహ్లావశబ్దమునుండి పల్లవశబ్దమేర్పడినదని కన్పట్టుచుండఁగా పార్థియను శబ్దముయొక్క వికృతరూపమే పహ్లావమని విశ్వసింపఁబడుచున్నది. హిందూపార్థియనులు పహ్లావులని భాండార్కరుగారు నుడువుచున్నారు. పార్థియనులు క్రీస్తునకుఁ బూర్వము ౧౬౧ వ సంవత్సరమున కాబూలుకనమలో స్థిరవసతులేర్పఱచుకొనిరని కన్పట్టుచున్నది. [2] పార్థివులు కౌశికులలోనొక శాఖవారుగ నున్నారు. వీరువిశ్వామిత్రునియొక్క సంతతిలోనివారు. పహ్లోదపుర స్తంభముమీఁది శాసనములో శిశుపాలుఁడను రాజుపార్థివ రక్షకుఁడనుబిరుదమునుగలిగ యున్నట్లు వ్రాయఁబడినది. [3]

## తొండైయారులు.

పల్లవులు తొండైయారులని ద్రవిడభాషాగ్రంథములఁలో బిలువఁబడినట్లుగాఁ గన్పట్టుచున్నది. పల్లవరాజు "తొండైమాన్" అనిపిలువంబడియుండెను. ఎనిమిదవశతాబ్దమున పల్లవదేశము తుండకవిషయమని పిలువంబడియుండెను. ఈనామోత్పత్తియెట్లుగలిగినదో స్పష్టముగఁ దెలియరాదు. మొదటితొండై

---

1 Bombay Gazetteer Vol. I. part II, p. 317 f. and Ind Ant, Vol. X.p 224. 2 Ind. Ant, Vol. XVIII, b. 126.

3 Dr. Fleet's Gupta Inscriptions p. 250; See his article entitled "A peep into the Early History of India published in the B. B. R. A. S. Vol xx, pp. 356 to 408.



మానురాజు నాగస్త్రీకిని చోళరాజునకు రహస్యముగాఁబుట్టిన (జారజుఁడు) కొడుకని గాథకలదు. ఈజారజుఁడయిన చోళరాజ కుమారునకు నొసంగఁబడినదేశముయొక్క మొదటినిజమైనపేరు తొండయనికూడ సూచింపఁబడియెను. తొండారమండలమనఁగా *బానిసలదేశము. అయినను ఈకథ పల్లవుల నిజస్థితిని దెలుపఁజాలకున్నది. "నెడముడికిళ్ళి" యనుచోళరాజొకఁడు తన రాజధానీనగరమగు కావీరిపద్దినములోని యుపవనములోనొక నాగకన్యకను గలిసికొనియె నని చెప్పఁబడినది. ఆమెపేరు పాలవల్లై యనునది. వల్లైమాసను నాగరాజుయొక్క కొమార్తె. నాగరాజకుమారిక వలనఁ జోళరాజునకుఁ బుత్రుఁడు జనించెను. అయినను కాంచీపురదేశమే రాజకుమారునకొసంగినట్లుగ నిచ్చట నేమియు నుదాహరింపఁబడలేదు. కాఁబట్టి యీకథపైకథకు విరుద్ధముగాఁ గన్పట్టుచున్నది. ఈకథలు శాసనములలో నెచ్చటను గనరావు. కాని గాంగపల్లవుఁడయిన స్కందశిష్య విక్రమవర్మయొక్క రాయకోటశాసనములోఁ గొంచెము సూచన గలదు. మఱియే శాసనమునందును వినరావు.

## కురుంబాలుపల్లవులా.

సర్ వాల్టర్ ఎలియాట్ గారి యభిప్రాయము ప్రకారము ద్రావిడదేశములో విశేషభాగమునకు పూర్వము కురుంబభూమియని పేరుగలదు. ఈద్రావిడ దేశముయొక్క పూర్వభాగము చోళులచేత జయింపఁబడినమీఁదట తొండైమండలమని పిలువంబడుచుండెను. ఇదికురుంబాలవలన ౨౪ కొట్టములుగా విభాగింపఁబడినది. కరికాలుఁడనుచోళరాజు కురుంబాలను జయించినవాఁడని చెప్పఁబడియెను. ఈకురుంబజాతి యేశాసనమునందు నుదాహరింపఁబడి యుండలేదు. వరాహమిహిరాచార్యుని బృహత్సంహిత యందయిన నుదాహరింపఁబడి యుండలేదు. వారలు యదువంశజులనియు, జైనమతావలంబకులనియు స్థానిక చారిత్రములందు మాత్రము పేర్కొనంబడిరి. పల్లవులు తప్పకకురుంబాలని నిశ్చయింప వలనుగాదు. ఎల్లియాట్ గారు కొన్ని నాణెములను కురుంబాలవనియు, కొన్ని నాణెములను పల్లవులవనియు నిర్ణయించియున్నారు.

## తుండకవిషయమె దండకనాడు.

తొండైమండలమనుపల్లవదేశమునకు నుత్తరమున తిరుపతికాళహస్తి పర్వతములును, దక్షిణమున పాలేఱును, పడమటఘాట్టు (గట్టు) లని తొండై మండల శతకమునఁ జెప్పఁబడియెను. అవ్వవిరచితమైనదని చెప్పు నొకపద్యము లోనుత్తరమున వెంగడమనియు (తిరుపతి) దక్షిణమున పినగ్గైయునుననియు, తూర్పున సముద్రమును, పశ్చిమమునఁదూర్పుకనమలనియుఁ జెప్పఁబడియుండెను. తొండైమండలము దండకనాడుయొక్క రూపాంతరముగఁ గనఁబట్టుచున్నది. దండకనాడనునది దండకారణ్యమను సంస్కృతమునుండి యేర్పడినదిగఁగనఁబట్టుచున్నది.[2]

## పల్లవులాంధ్రులలోని వారెగాని యన్యులుగారు.

పల్లవులనుగూర్చి యెవ్వరెవ్వరెట్లెటు భావించినదియుఁ గొంతవఱకుఁ దెలిపియుంటిమి. పల్లవులు తమిళజాతులలోని వారెంతమాత్రమును గారనియు, ఆంధ్రులలో నొకతెగవారనియును కొందఱి యభిప్రాయమై యున్నది. విన్సెంటు స్మిత్తుగారు తమ దక్షిణ హిందూదేశ చారిత్రమునందుఁ బల్లవులనుగూర్చికొంచెము వ్రాసియున్నారు గావున వారి యభిప్రాయము నొకించుక నీక్రింద నుదాహరించుచున్నారము.

"పల్లవనామము పహ్లావనామముఁ బోలియుండుటచేత డాక్టరుఫ్లీట్ (Dr. Fleet) మొదలగు చరిత్రకారులు పల్లవులు పహ్లావు లొక్కరేయని యభిప్రాయపడి కాంచీపురము నేలిన దక్షిణపల్లవ వంశము పారసీకమునుండి జనగాంచినదని యభిప్రాయపడుచున్నారు. ఈగ్రంథముయొక్క మొదటికూర్పునందట్టి యూహ సంభవమని తలంచినను నూతన పరిశోధన మీయూహను బలపఱచుచుండలేదు. చెన్నపురి రాజధానికి నుత్తరభాగమున ననఁగా కృష్ణాగోదావరులకు నడుమనుండిన వేంగిదేశమున నేర్పడిన యొకతెగవారని గనఁబట్టుచు

1 Taylor's Catologue Vol. III, p. 29.

2 Bombay Gazetteer Vol. I, part p. 319.



న్నది. ద్రవిడరాజ్యములతోఁ బల్లవులకుఁ గల విడువని శత్రుత్వమును, పల్లవులకిదియని నిర్దేశింపఁదగిన దేశములేకుండుటయును, పల్లవులు తమిళులకంటె భిన్నమైన జాతివారనుటకు సంజ్ఞలుగానున్నవి. దక్షిణభాగమునంతయు నాక్రమించిన పాండ్యచోళ చేరరాజులపైని వారియధికారమధికముగాఁ గూడ విధింపఁబడుచువచ్చెను. పల్లవులు పదునెనిమిదవ శతాబ్దములోని మహారాష్ట్రులవలెఁ గొల్లపెట్టెడు దోపిడి కాండ్రతెగగా నుండి క్రమముగా స్వబలముచేత చోళరాజ్యముపై సంపూర్ణముగను, తక్కిన వానిపైఁ గొంతవఱకును నధికారమును బూనియుండిరని మనమూహింతుమేని నింతవఱకుఁ దెలియం బడిన విషయములాయూహకు సరిపోవునని తలంచెదను."

పల్లవులు దారిదోపిడికాండ్ర తెగవారని యూహించుటకు హేతువుగానరాదు. వీరలు కృష్ణా గోదావరులకు నడుమ వేంగిదేశమునఁగాని, మఱి యేభాగమునఁగాని యాంధ్రదేశమునం దేర్పడిన యొకతెగవారనుట వాస్తవము. రెండవశతాబ్దమునుండి పల్లవరాజు లాంధ్రదేశమును బాలించుచుండిరని వారి శాసనములే వేనోళ్ళ ఘోషించుచున్నవి. ఈవిషయమును జరిత్రకారులందఱు నంగీకరించి యున్నారు. ఈ తెగ యెట్లేర్పడినదను విషయములో మాత్రము చరిత్రకారులు భిన్నాభిప్రాయులయి యున్నారు. పల్లవులు దారిదోపిడికాండ్ర తెగయనుటకంటెనుపహ్లావులు పల్లవులయిరని యూహించుటకే హేతువు లెక్కువగఁగానవచ్చుచున్నవి. పహ్లావుల ప్రదేశములు కందహారము, సెయిస్తాన్ సులలో నేర్పడి గాండఫరేసు పరిపాలనములో ననఁగా క్రీస్తుశకము ౧౨౦ దవ సంవత్సరమునకును౬౦ దవ సంవత్సరమునకును నడుమ పంజాబుయొక్క పశ్చిమభాగమునకును, సింధునది ప్రవహించు పల్లపు భూములకును వ్యాపించెను.[1] సింధూనది ప్రవహించు పల్లపు ప్రదేశములు పార్థియనుల స్వాధీనములో నున్నవనియు, తమలోఁ దాము పార్థియనులు పోరాడుకొనుచుండిరనియు క్రీస్తుశకము ౭౦ దవ సంవత్సరమున రచింపఁబడిన పెరిప్లస్సను గ్రంథమునుబట్టి తెలిసికొనుచున్నాము.[2]

1 Prof E. J. Rapson's Indian Coins p. 15. Mr. Smith's Catologue of Coins in the Indian Meusium, Calcutta p. 36; 2 Ind. Ant, Vol viii, p. 338.

ఈకాలముననే పహ్లవులకో శకులకో సంబంధించిన క్షాత్రపులు సురాష్ట్రమాళవదేశములను వశముచేసికొని పాలించుచుండిరని మనమిదివఱకే తెలిసికొనియుంటిమి. ఈకాలముననే యాంధ్రదేశమునుజొచ్చి యవనశక పహ్లవాదులు కల్లోలముఁ బుట్టించిరనియు, ఆంధ్రుల స్వాధీనమందుండిన మహారాష్ట్ర దేశము సురాష్ట్ర క్షాత్రపులచే జయింపఁబడి యాక్రమింపఁబడినదనియుఁ దెలిసికొని యుంటిమి. రెండవశతాబ్దప్రారంభము నందనఁగా ౧౩౦ దవ సంవత్సర ప్రాంతమున గోతమిపుత్త్రశాతకర్ణుఁడను నాంధ్రరాజు యవనశకపహ్లవాదుల నోడించి సురాష్ట్ర క్షాత్రపుఁడగు క్షహరాటనహపానువంశమును నిర్మూలముచేసి తనపూర్వులు గోల్పోయిన రాజ్యమును మరల సంపాదించుటయెగాక క్షాత్రపభూములనుగూడ నాక్రమించెనని కూడ దెలిసికొని యుంటిమి. అంతకుఁబూర్వమాంధ్రదేశమునకు వచ్చియుండిన యవనశక పహ్లవాదులు శివస్వాతికర్ణుఁడు, గోతమిపుత్త్రశాతకర్ణుఁడు మొదలగు నాంధ్రరాజులయొక్క పరాక్రమమునకు నిలువంజాలక వశులైరనియు, అదివఱకె విశేషముగా మార్పుఁజెంది యుండిన యవనశకపహ్లవాదులు దేశమున స్థిరనివాసము లేర్పఱచుకొని దేశాచారమతాచారము లవలంబించి దేశీయులతో సంబంధబాంధవ్యముల నెఱపుచుఁ గ్రమముగా దేశీయులలోఁ గలిసిపోయి పల్లవులను తెగగా నేర్పడిరనియు, వీరు మొదట నివసించిన ప్రదేశము పల్లవనాఁడయినదనియు అదియె యిప్పుడు పల్నాఁడను పేరఁబిలువంబడుచున్నదనియును గూడ దెలిసికొనియుంటిమి. పహ్లవులు హిందూమతముల నవలంబించి హిందూనామముల నలంకరించుకొనుచుండి రనుటకుఁగూడ శాసనములనుండి ప్రమాణవాక్యముల నెత్తిచూపవచ్చును. క్రీస్తుశకము ౧౫౦ దవ సంవత్సర ప్రాంతమున మాళవదేశమును బరిపాలించుచుండి మహాక్షాత్రపుడగు రుద్రదాముఁడు వ్రాయించిన జనగడ శాసనమునందు వానిమంత్రిసువిశాఖుఁడనువాఁడు పహ్లవుఁడుగాఁ జేర్కొనఁబడియున్నాఁడు.[1] ఈసువిశాఖుఁడు కేవలము మంత్రిమాత్రమెకాఁడు. రెండుపరగణాలకుఁ బరిపాలకుఁడుగ నున్నవాఁడు. రుద్రదాముఁడు యజ్ఞశ్రీశాతకర్ణినో

1 Ep. Ind, Vol. VIII, p. 49.



వాసిష్ఠీపుత్త్రశాతకర్ణినో రెండుసారులు జయించెనని కూడఁజెప్పంబడియెను. ఈక్షాత్రపులకు నాంధ్రులకు సంబంధబాంధవ్యములు గలవని శాసనములు చాటుచున్నవి. రుద్రదాముఁడు తనకొమార్తెను నాంధ్రరాజునకిచ్చి వివాహముచేసినట్లుగ శాసనములఁ జేర్కొనంబడియెను. కాఁబట్టి వీనినన్నిటిని పరిశీలించిచూచినప్పుడు పహ్లవులు దేశాచారమతాచారముల నవలంబించి దేశీయనామములనేధరించి పల్లవులై యాంధ్రులకు క్షాత్రపులకు నూడిగములు సల్పుచుండి క్రమముగా సేనాధ్యక్షులుగను మంత్రులుగ నేర్పడి రాజకుటుంబములతో సంబంధబాంధవ్యముల నెఱపుచు ప్రధానరాజకుటుంబము బలహీనమై రాజ్యభారమును నిర్వహింపఁజాలనికాలమున స్వతంత్రులై స్వతంత్రరాజ్యముల నెలకొల్పిరని యూహింపఁదగియున్నది. స్వదేశమును స్వమతమును మఱచిపోయి హిందూమతములను బూని హిందూనామములను బెట్టుకొని వ్యవహరించుచు బహుకాలమునకు వెనుక నాంధ్రదేశమునకువచ్చి వర్ణాశ్రమధర్మములంతగాఁ బాటింపఁబడనికాలమున నొకశతాబ్దమువఱకు నాంధ్రులనడుమ నివసించుచుండి సంబంధబాంధవ్యముల నెఱపుచుండిన వారాంధ్రులుగాఁ గాక మఱియెవ్వరుగాఁ బరిగణింపఁబడ వలసినది?

ఆంధ్రులనకతప్పదు. ద్రావిడదేశమునందలి కాంచీపురమును జయించి పరిపాలించినది యాంధ్రపల్లవులుగాని పహ్లవులుగారు. కాంచీపురమునందు కట్టకడపట స్థిరముగా నిలిచిపోయినది యాంధ్రపల్లవులలో నొకశాఖవారు మాత్రమెగాని కొందఱుతలంచునట్లు పల్లవులందఱుగారు. ఇప్పటివఱకు దొరకిన శాసనములను బట్టిచూడఁగా మొదటిపల్లవరాజు శివస్కందవర్మగాఁ గానంబడుచున్నాఁడు. ఇతఁడే మొదట కాంచీపురమునుండి శాసనములం బ్రకటించినవాఁడు. "ఇతఁడాంధ్రుఁడా? పహ్లవుఁడా? యాంధ్రపల్లవుఁడా? ఏకాలపువాఁడు?" అనువిషయములను జర్చించి తెలిసికొన వలసియున్నది.

## పంత్రెండవ ప్రకరణము.

# శివస్కందవర్మ.



ఇతఁడు కాంచీపురమునుండి ప్రకటించిన తామ్రశాసనములు రెండుగలవు. అందొకటి బళ్లారిమండలములోని హిరాహడగల్లి (హార్పనహాల్లి) గ్రామమున దొరకినది.[1] మఱియొకటి యిప్పటి గుంటూరు మండలములోని నరసారావుపేటకుఁ దూర్పున ౧౫ మైళ్లదూరముననున్న మైదవోలను నొక చిన్న గ్రామమున దొరకినది.[2] శివస్కందవర్మ యువమహారాజుగ నుండినపుడు మైదవోలుశాసనమును, మహారాజుగ నుండినపుడు హార్పనహాల్లిశాసనమును బ్రకటింపఁబడినవి.

### మైదవ్రోలుశాసనము.

ఈశాసనము ప్రాచీన ప్రాకృతభాషలో వ్రాయఁబడి కాంచీపురమునుండి ప్రకటింపఁబడినది. ఇందు శివస్కందవర్మ యువమహారాజుగఁ బేర్కొనఁబడియుండెను. తాను భారద్వాజగోత్రుఁడననియు, పల్లవులవంశములోనివాఁడననియుఁ జెప్పుకొనియుండెను. ఈశాసనము వ్రాయఁబడిన తేది శివస్కందవర్మకుఁ బూర్వము రాజ్యము చేయుచుండిన రాజుయొక్క పదయవ పరిపాలన సంవత్సరమున గ్రీష్మఋతువు నాఱవపక్షములోని పంచమి తిథిగానున్నది. ఆంధ్ర

(1) Ep. Ind. Vol I page. 2; (2) Ibid Vol VI. p. 85. ఇది మైదవోలులో మైదవోలు జయరామయ్యగారి పొలములో దొరకినది. మ. జయంతిరామయ్యపంతులు. బి. ఏ. బి. ఎల్ గారివలనఁ బంపబడినది.



పథము[1]లోని విరిపరయను గ్రామమును పూర్వకుటార్యుఁడు గోనందార్యుఁడు నను సామములను పఠించినవారలును, అగ్నివేశ్యగోత్రులును నగునిరువురు బ్రాహ్మణులకు దానము చేసినట్లుగ ధాన్యకటకములో నుండిన తనవ్యాపృతునకు నాజ్ఞ చేయఁబడినది

### హిరాహడగల్లిశాసనము.

ఇదియును ప్రాచీన ప్రాకృతభాషలోనే వ్రాయఁబడినదిగాని శాసనము చివరనుండిన యాశీర్వాద వచనమును రాజముద్రికలోని శివస్కందవర్మ పేరును మాత్రము సంస్కృతభాషలో వ్రాయఁబడినవి. ఇందు శివస్కందవర్మ మహారాజాధిరాజనియు, పల్లవులవంశములోనివాఁడనియు, భారద్వాజ గోత్రుఁడనియుఁ దెలుపఁబడినది. ఈశాసనమును బ్రకటించిన శివస్కందవర్మయు, మైదవోలు శాసనమును బ్రకటించిన శివస్కందవర్మయు నొక్కఁడే కాని వేఱ్వేఱు రాజులు కారు. ఇందధిక విశేష మొకటికలదు. ఇతఁడు, అగ్నిష్టోమము, వాజపేయము, అశ్వమేధము మొదలగు క్రతువులను జేసినట్లుగఁ జెప్పఁబడినది. శివస్కందవర్మకుఁ బూర్వముండిన ''బప్పా'' యనుమహారాజు చిల్లరేక కొడుంక యను గ్రామములోని తోఁటనొకదాని బ్రాహ్మణులకు దానము చేసియుండఁగా దానినే మరలఁ బేర్కొనుచు నొకనూర్ఫదుకళ్లమును, నివేశనములనుగూడ నీతఁడు దానము చేసినట్లుగ నీశాసనమున వ్రాయించఁబడినది. ఇందుఁ బేర్కొనఁబడిన బప్పా కోటిసువర్ణములను దుక్కిటెడ్లతోడి లక్షయరకలను బ్రాహ్మణులకు దానము చేసి యుండెనని పేర్కొనఁబడియుండెను.

1 శివస్కందవర్మకుఁ బూర్వముండిన శాసనములలో నాంధ్రశబ్దముపయోగింపఁబడియుండలేదు. ఆంధ్రమనుమాట ఉపయోగింపఁబడిన శాసనమిదియె మొదటిదని తోఁచుచున్నది. ఆంధ్రపథమె ఆంధ్రమండలమని కొన్నిశాసనములలోఁ బేర్కొనఁబడినది. ఆఱవలశాసనములలోనియ్యది వడుగాఁళియని పేర్కొనఁబడియున్నది.

ఈశాసనములో దానము చేసినట్లుగ నుదాహరింపఁబడిన తోఁటయొక్క ఫలము ముప్పదినాలుగు భాగములుగ విభాగించి యిరువదినాలుగు బ్రాహ్మణకుటుంబములకు నొక్కొక్కనికి నొకభాగము మొదలుకొని నాలుగుభాగముల వఱకు దానము చేయఁ బడియుండెను. ఈశాసనము కోలివోలా గ్రహారికుఁడును మంత్రాలోచన సభ్యుఁడును నగుభట్టిశర్మయొక్క స్వహస్త విలేఖనముతో గూడినదిగనున్నది. దీనిని రాజు స్వయముగాఁ బరిశోధించి చేవ్రాలు చేసియుండెనఁట! శాసనము తుదను గోబ్రాహ్మణులకును, విలేఖకునకును, పాఠకులకును, వినువారికి శుభ వాక్యము పలుకఁబడియెను. తనవంశము యొక్కయు, తనజాతి యొక్కయు, పరంపరాభివృద్ధికిని యశోభివృద్ధికిని ఈదానము చేయఁబడినట్లుగఁ జెప్పఁబడినది.

## కాలనిర్ణయము.

శాసనములోని భాషను బట్టియు, అందుదాహరింపఁ బడిన కాలమును బట్టియు శివస్కందవర్మ క్రీస్తుశకము రెండవశతాబ్దము లోనివాఁడని రివరెండు. టి. ఫవుల్క్సుగారు యుక్తియుక్తముగ సిద్ధాంతీకరించినారు. [1] ఇంతసహేతుకమైనవాదము మఱియొకటి గానరాదు. వీరు శివస్కందవర్మ రెండవశతాబ్దములోని యాంధ్రభృత్యులతో సమకాలికుఁడని రెండు హేతువులను జూపిరి. ఆంధ్రభృత్యుల శాసనములలోని భాషయె యీశాసనమునందును గానవచ్చుట మొదటిది. దానము చేసినతిథి తెలుపఁబడినవిధాన మాంధ్రభృత్యులశాసనములలోని విధానమును బోలియుండుట రెండవది. ఈ రెండు హేతువులచేత నాంధ్రభృత్యులకు దూరముననుండువాఁడు కాఁడనియును, సమకాలికుఁడనియును సిద్ధాంతము చేసినారు.

శివస్కందవర్మ శాసనములలో శాలివాహన శకసంవత్సరములకు మాఱుగా వానిపరిపాలన సంవత్సరములయొక్క సంఖ్యలు పేర్కొనఁబడినవి. మాసము

1 The Journal of the Royal Asiatic Society, Vol XXI. (New series), IV. pp IIII to 1124



నకు బదులుగా ఋతువు పేర్కొనఁబడినది. చాంద్రమాన పక్షముగాక సౌరమానపక్షముయొక్క సంఖ్య పేర్కొనఁబడినది. ఇట్టిపద్ధతి యేకాలమునం దేవంశపు రాజుల శాసనములలో నవలంబింపఁబడియెనో తెలిసికొన్న పక్షమున శివస్కందవర్మ కాలము తెలియఁగలదని నిశ్చయించి నవీనపల్లవులయొక్కయు, క్షాత్రపులయొక్కయు, గుప్తులయొక్కయు, చాళుక్యులయొక్కయు, శాసనములనుబరిశోధించిచూడఁగా సమస్తవిషయములయందు నాంధ్రభృత్యుల శాసనములలోని పద్ధతినిబోలి యుండుటచేత శివస్కందవర్మ యాకాలమునందె యుండవలయునని సిద్ధాంతీకరింపఁబడినది. క్షాత్రపరాజుల యొక్కయు, గుప్తరాజులయొక్కయు, చాళుక్యరాజులయొక్కయు, నవీనపల్లవరాజులయొక్కయు శాసనములన్నియు సంస్కృత భాషలో వ్రాయఁబడినవి. క్షాత్రపుల శాసనములలో శకనృపకాల సంవత్సరములును, గుప్తరాజుల శాసనములలో గుప్తశకసంవత్సరములును, చాళుక్యరాజుల శాసనములలో శాలివాహన శకసంవత్సరములును పేర్కొనఁబడినవి. సర్వవిధముల చేతను స్వల్పవిషయములందుకూడ నాశాసనములను భేదించి యుండుటయేగాక యాంధ్రభృత్య వంశపురాజులగు గోతమిపుత్రశాతకర్ణి, పులమాయి, యజ్ఞశ్రీశాతకర్ణి మాధారిపుత్రశ్రీశకసేనుఁడు మొదలగువారిశాసనములనుబోలి యించుకయైన భేదములేక యుండుటచేత నీశాసనము గూడ నాకాలమునాటిదే గనుక శివస్కందవర్మ రెండవశతాబ్ద మధ్యముననో శతాబ్దాంతముననోయుండియుండవలయునని రివరెండు ఫౌల్క్సుగారు నుడువుచున్నారు. ఆంధ్రభృత్యులనియెడి శాతవాహన వంశజులు క్రీస్తుశకము ౨౩౬వ సంవత్సరమువఱకు నాంధ్రదేశమును బాలించుచుండిరని శాసనాదులనుబట్టియు పురాణాది పూర్వగ్రంథములనుబట్టియుఁ దెలిసికొనఁగలిగితిమి. క్రీస్తుశకము ౩౮౦ దవ సంవత్సర ప్రాంతమున గుప్తచక్రవర్తియగు సముద్రగుప్తుఁడు దక్షిణదేశముపై దండెత్తి వచ్చినప్పుడు విష్ణుగోప వర్మయనురాజు కాంచీపురమును బాలించుచుండినట్లు ప్రయాగలోని సముద్రగుప్తుని శాసనమువలనఁ దెలియవచ్చుచున్నది. శివస్కందుఁడు విష్ణుగోపవర్మకుఁ బూర్వుఁడుకాని తరువాతివాఁడు కాఁడని శివస్కందవర్మ శాసనములనుబట్టి స్పష్టముగాఁ జెప్పవచ్చును.

ఆంధ్రరాజులు ధాన్యకటకము రాజధానిగా నాంధ్రరాజ్యమును గొంచెమించు మించుగా క్రీస్తుశకము ౨౮౦ దవ సంవత్సరమువఱకుఁ బాలించినట్లు గన్పట్టు చున్నది గావున నాంధ్రభృత్య శాఖకంటె భిన్నుఁడేయై ఆకాలమునకుఁ బూర్వమెయున్న దాను యువమహారాజుగనుండినపు డాంధ్రపథములోని విరిపర గ్రామమును బ్రాహ్మణులకు దానముచేసినట్లుగ ధాన్యకటకములోని తనవ్యాపృతునకుఁ దెలియఁజేయుట యెట్లుసంభవించును? కనుక ౨౮౦ దవ సంవత్సరమునకుఁ దరువాతివాఁడని చెప్పవలసియుండును. అదియె నిజమైనయెడల మూఁడవశతాబ్దాంతమునం దనఁగా ౨౮౦ సంవత్సరమునకుఁ దరువాతను ౩౦౧ వ సంవత్సరమునకుఁ బూర్వమునను నుండవలయును. ఇతని శాసనములను బట్టిచూడఁగా నితఁడుకృష్ణానది మొదలుకొని దక్షిణమునఁ గాంచీపురమువఱకును పడమట బళ్లారివఱకునుగల గొప్పదేశమున కంతకును బ్రభువుగనుండి యేలినట్లుగానిపించుచున్నది. అట్లయినయెడల నీతఁడింతరాజ్యము నెట్లుసంపాదింపఁ గలిగెనని శంకపుట్టకమానదు. ఈతఁడు తనశాసనములం దెచ్చటను తానుగాని తనపూర్వులుగాని యాంధ్రభృత్యులను జయించి సంపాదించినట్లుగఁ జెప్పుకొని యుండలేదు. అటువంటి శాసనములను గరువముతోఁ బ్రకటించుకొన్నవాఁడు, అంతటి బ్రాహ్మణభక్తిగలవాఁడు, శాసనములయందుఁ దనయొక్క విజయములను గూర్చి లేశమాత్రమును ముచ్చటింపకుండుటకుఁ గారణమేమి? దేశము నెమ్మదిగ లేకుండిన కాలమునందు క్రతువులు చేయుటకుఁగాని బ్రాహ్మణులకు గోవుల నగ్రహారముల దానముచేసి యరణ్యదేశముల నివసింప బ్రాహ్మణులను బంపుటకు సాధ్యమగునా? సాధ్యముకాదని స్పష్టముగఁ జెప్పవచ్చును. తనకుఁ బూర్వము బప్పాయనురాజుధర్మకార్యము లనేకములు చేసెనని శివస్కందవర్మ పేర్కొనియుండెను. వీరలిరువురును బహుకాలము దేశపరిపాలనముచేసి ప్రఖ్యాతిఁగాంచి యుండవలయును గదా. ఆంధ్రజాతికంటె భిన్నులైయెక్కడనుండియో వచ్చినవారేయైనయెడల బహుశతాబ్దములనుండి రాజ్యము చేయుచుండిన వంశమును నిర్మూలముచేసి బహుస్వల్పకాలములో దేశమును స్వస్థపఱచి పరిపాలించుటకు సాధ్యమగునా? ఒకవేళ సాధ్యమగునేని ఘోరసంగ్రామమున నాం



ధ్రులనునోడించి దేశమును స్వాధీనము చేసికొనవలయును గాని యూరక స్వాధీనమగుననుట విశ్వసింపఁ దగినదికాదు.

అట్టిఘోరసంగ్రామ మేదియును జరగినట్లుగాఁ గానరాదు. శాసనములందును జెప్పబడియుండలేదు. కాఁబట్టి శివస్కందవర్మగాని వానిపూర్వులుగాని క్రొత్తగా నాకాశమునుండి దిగివచ్చిన వారుగాక దేశములోని వారేయై యుండవలయును. పల్లవుఁడనని చెప్పుకొనుచుండిన యీశివస్కందవర్మ యాంధ్రభృత్యులలో నుదాహరింపఁబడిన శివస్కంద వర్మయెగాని యన్యుఁడుగాఁ గన్పట్టఁడు. మత్స్యపురాణమునందు "ఆంధ్రాణాం సంస్థితా (తే) రాజ్యేతేషాంభృత్యాన్వయేనృపాః సప్తైవాంధ్రాభవిష్యంతి" అని యాంధ్రభృత్యులకు వెనుక సప్తాంధ్రులు రాజ్యపాలనము నేయుదురని చెప్పంబడియెను. శకయవనపహ్లవాదు లాంధ్రులలోఁ గలిసిపోయి యాంధ్రరాజుల కడ నూడిగము సేయుచుండిరని యిదివఱకె తెలుపఁబడియుండెను. అట్లాంధ్రులయియున్నతస్థితికి వచ్చిన కుటుంబములతో నాంధ్రరాజులు సంబంధ బాంధవ్యముల నెఱపుచుండిరని గూడవ్రాసియుంటిమి. ఇట్లుసంబంధ బాంధవ్యములు జరుపుచుండుటచేత రాజకుటుంబములలోఁ బలుశాఖలేర్పడినవి. ఇందుకు దృష్టాంతముగఁ గొందఱిని జూపవచ్చును. హారితిపుత్రి శాతకర్ణుఁడు విష్ణుదత్తుల వంశములోని వాఁడని వనవాసిలోని యొకశాసనమునఁ జెప్పఁబడినది. వాసిష్ఠీపుత్రి శాతకర్ణుఁడు కర్దమకరాజులవంశములోనివాఁడని యొకశాసనమునఁ జెప్పఁబడినది. మాధరపురుషదత్తుఁడు ఇక్ష్వాకులవంశములోనివాఁడని బేతవోలు (జగ్గయ్యపేట) శాసనమునఁ జెప్పఁబడినది. శివస్కందవర్మ పల్లవులలోని వాఁడని మైదవోలు హర్షనహల్లిశాసనములు చెప్పుచున్నవి. యవన శకపహ్లవాదు లాంధ్రులలోఁ గలిసిన తరువాత వేఱ్వేఱు తెగలుగ నుండవచ్చును యవను లిక్ష్వాకులు కావచ్చును. శకనులు విష్ణుదత్తులు కావచ్చును. పహ్లావులు పల్లవులు కావచ్చును. ఈ యిక్ష్వాకులును, ఈవిష్ణుదత్తులును, ఈకర్దమకులును ఈపల్లవులును కేవలమును విదేశస్థులుగారు. ఆంధ్రులయొక్కయు, యవన శక పహ్లవాదులయొక్కయు రక్తసమ్మేళనమువలన జనించిన మిశ్రజాతులవారే కాని

మఱియొకరు కారు. వీరల నెల్లరను నాంధ్రులనియే వచించుటయొప్పును. కాఁబట్టి శివస్కంద వర్మయాంధ్ర పల్లవ శాఖలోని వాఁడని చెప్పవచ్చును. ఎనిమిదవ ప్రకరణమున శివస్కందవర్మను గూర్చి వ్రాయుచు నీయభిప్రాయమునే దెలిపి యుంటిమి. ఆతఁడే యితఁడైనయెడల నందుదాహరింపఁబడినకాలము సరియైనదిగఁ దలంపరాదు. ఇతఁడు మూఁడవశతాబ్దమధ్యముననో మూఁడవశతాబ్దాంతముననో యుండియుండునని నిశ్చయముగాఁ జెప్పవచ్చును.

## శివస్కంద వర్మ పరిపాలనము.

శాతవాహన వంశజులలోఁ గడపటివాఁడయిన మూఁడవపులమాయికిఁ బిమ్మట ధాన్యకటకము రాజధానిగఁ జేసికొని యాంధ్రదేశమును బరిపాలించుచుండిన మూలవంశము నిర్మూలము కాఁగాఁ గృష్ణానది కుత్తరభాగము నిక్ష్వాకులును, వాయవ్యభాగము నాభీరులును, పశ్చిమభాగమును రాష్ట్రకూటులును, నైఋతిభాగమును విష్ణుదత్తులును, పూర్వదక్షిణభాగములను పల్లవులు నాక్రమించుకొనిరి. ఈశాన్యభాగమనఁగా కృష్ణామండలమును కళింగమును సాలంకాయన గోత్రులయిన పల్లవు లాక్రమించుకొనిరి. మూఁడవ శతాబ్దాంతమునందు నాంధ్రదేశమునకంతకుఁ బల్లవులధిపతులయి యుండిరని చెప్పుటకు లేశమాత్రమును సందియములేదు. శివస్కందవర్మ రాజాధిరాజని చెప్పఁబడియుండుటచేత నాకాలమునందతఁడే మిక్కిలి పరాక్రమవంతుఁడని యూహింపఁదగియున్నది. ఇంతియగాక యశ్వమేధమును గూడఁ జేసినట్లుగఁ జెప్పఁబడియుండుటచేత నిశ్చయముగా నీతఁడు బహుపరాక్రమవంతుఁడై రాజాధిరాజై యుండినఁగాని యట్టికార్యమును నిర్వహింపఁజాలఁడు. ఇతఁడు కాంచీపురమునుండి శాసనములను బ్రకటించినట్లు గన్పట్టుచున్నదిగాని కాంచీపురము రాజధానిగ నుండెనో లేదో శాసనములం బట్టి దెలియరాదు. అయిన నితఁడు కాంచీపురమును రాజధానిగఁ జేసికొనియెనని చెప్పినఁ జెప్పవచ్చును. రాజ్యపరిపాలనమందు మంత్రులును, మంత్రాలోచన సభ్యులునితనికి తోడ్పడుచుండిరి. ఇతఁడు సామంతులయిన రాజకుమారులచేఁ బరివేష్టింపఁ బడియుండెను. వీని



రాజ్యము విషయములుగను (Provinces) నాడులుగను (Districts) విభజింపఁబడి వేఱ్వేఱు పరిపాలకులచేఁ బరిపాలింపఁబడుచుండెను. వీని పరిపాలనము చక్కని కట్టుదిట్టములయిన చట్టములుగలిగి నిరంకుశముగ సాగుచుండెనని శాసనములె వేనోళ్లఁ జాటుచున్నవి. వీనికాలమునందు దక్షిణ హిందూస్థానమున నాత్రేయ, హారిత, భారద్వాజ, కౌశిక, కాశ్యప వాత్స్య మొదలగు గోత్రముల బ్రాహ్మణులు సర్వమాన్య భూముల ననుభవించుచు నగ్రహారములలో సంఘములుగా నివసించుచుండిరనియు, వీరలు కేవలము వైదికవృత్తులను మాత్రమేగాక లౌకికవృత్తులనుగూడ నవలంబించుచుండిరని వీని శాసనములు రూఢిపఱచుచున్నవి. ఈకాలమునందు ప్రజల మత మెట్టిదయినను రాజు మతము స్పష్టముగఁ గానంబడుచున్నది. అశ్వమేధాది క్రతువులను జేయుటయు, బ్రాహ్మణుల కగ్రహారములు మొదలగునవిచ్చి సమ్మానించుటయు, భారద్వాజ గోత్రుఁడనని చెప్పుకొనుటయు, తన నామమునకుఁ జివర వర్మయను క్షత్రియ సంజ్ఞం దెలుపు శబ్దమును జేర్చుకొనుటయు, బ్రాహ్మణులను మంత్రులగాను మంత్రాలోచన సభ్యులుగ నుంచుకొనుటయుఁ జూడఁగా నీతఁడు బ్రాహ్మణ మతావలంబకుఁడని గాని బ్రాహ్మణమతాభిమాని యని కాని చెప్పఁదగును. జైన బౌద్ధమతములను ద్వేషభావముతోఁ జూచినట్లుగ శాసనముల యందెచ్చటను గానరాదు. అయిన నాకాలమున జైన బౌద్ధమతములే విశేషముగా వ్యాపించి యుండుటంజేసి పరమతావలంబకులయిన రాజులంతగా ద్వేషభావమున జూపఁజాలకుందురు. ఆంధ్రదేశమునఁ బల్లవరాజుల పాలనముతోఁ గ్రొత్తయుగము ప్రారంభమైనదని చెప్పవచ్చును. బ్రాహ్మణుల యాధిక్యత పెంపొందినతోడనే ప్రజలలోఁ గూడ జాతిభేదములు పెక్కు లేర్పడుచు వచ్చినవని చెప్పవచ్చును. అప్పటికప్పుడే యనాగరికులయిన యాదిమనివాసులను మిశ్రజాతులవారు మిక్కిలి తక్కువగఁ జూడ నారంభించిరి. మఱియు నాకాలమునఁ గాంచీపురము వేదాధ్యయన సంపన్నులయిన బ్రాహ్మణోత్తముల యాదరముచే సంస్కృతభాషాభ్యాసము శతవిధంబుల నభివృద్ధి గాంచుచు విద్యలకుఁ బెన్నిధానమై యొప్పుచుండెను.

## జయవర్మ.

శివస్కంద వర్మగాక మఱికొందఱు ప్రాచీనపల్లవరాజుల పేరులు శాసనములందు గానవచ్చుచున్నవిగాని వారికాలము మాత్రము సరిగాఁ దెలియరాదు. మఱియొకవిశేషముకలదు. ఈప్రాచీన పల్లవుల శాసనములన్నియును ఆంధ్రదేశమునందే గానవచ్చుచున్నవి. కూడూహార విషయాధిపతియగు జయవర్మయొక్క తామ్రశాసనమొకటి తెనాలి తాలూకాలోని కొండముది గ్రామమునందలి మంటిదిబ్బలో దొరకినది. [1] ఈశాసనములోనిలిపి శివస్కందవర్మయొక్క మైదవోలు శాసనములోనిలిపిని బోలియున్నది. మహేశ్వర బృహత్పలాయన శబ్దములు రెండును దక్క తక్కినదంతయుఁ బ్రాకృతభాషలో నున్నది. ఈశాసనములోని రాజముద్రికలో జయవర్మమహారాజు పేరు గానంబడుచున్నది. ఇతఁడు బృహత్పలాయన గోత్రుఁడు. మహేశ్వర పాదభక్తుఁడు. ఇతఁడు కూడూహారమండలములోని పంతూరనుగ్రామమును ౮ గురు బ్రాహ్మణులకు దానముచేసి యున్నానని కూడూరులోని తన వ్యాపృతునకుఁ దెలియంజేసి యున్నాఁడు. కూడూరు రాజధానీనగరముగా నుండెను. ఈ జయవర్మగాని వీనిగోత్రముకాని మఱి యేశాసనమునందును గానరావు. ఇతఁడు శివస్కంద వర్మకాలమునాటి వాఁడని చెప్పవచ్చునుగాని యాతనికి సామంతుఁడో లేక స్వతంత్రుఁడో దెలియరాదు. ఈశాసనములోని భాషయు లిపియు గోతమిపుత్త్రి శాతకర్ణియొక్కయు, వాసిష్ఠీపుత్త్రి పులమాయియొక్కయు నాసిక శాసనములను బోలియుండుటచేత నారాజులకు మిక్కిలి దూరమున నున్నవాఁడని చెప్పరాదు. రాజముద్రికలోని ప్రాచీన సంస్కృతలిపికూడ దీనినే బలపఱచుచున్నది. ఇది వేంగిదేశమున కనఁగా నిప్పటి కృష్ణామండలమునకుఁ బ్రాచీననామము. దీనికి రాజధానికూడూరు. ఈకూడూరు గుడివాడయొక్కయో గూడూరుయొక్కయో ప్రాచీననామము. ఈశాసనము మహాత్యాగి వంశములో యోగ్యుఁడును జయవర్మ మహారాజుయొక్క మహాదండనాయకుఁడును నగు

1 Epigraphia India Vol vii, p. 315.



భాపహన వర్మచేత వ్రాయఁబడినది. పంతూరను గ్రామమెద్దియో దెలియరాకున్నది. ఈగ్రామము జయవర్మచే బ్రాహ్మదేయము క్రింద నీయఁబడినది. ఇరువదినాలుగు భాగములుగ విభజింపఁబడి యెనమండ్రు బ్రాహ్మణులకు దానముచేయఁబడినది. అందు గౌతమిగోత్రుఁడగు సర్వగుప్తార్యునకు ౮ భాగములును, తానవ్యగోత్రుఁడగు సవిజ్ఞార్యునకు 3 భాగములును, గోగణార్యునకు 3 భాగములును, కౌండిన్యగోత్రుఁడయిన భావనార్యునకు ౨ భాగములును, భారద్వాజ గోత్రుఁడయిన రుద్రవిష్ణ్వార్యునకు ౧ టిన్నరభాగమును, కర్షణాయన గోత్రుఁడయిన యీశ్వర దత్తార్యునకు ౧ టిన్నరభాగమును, ఔపమాన్యవ గోత్రుఁడయిన రుద్రఘోషార్యునకు ౧ భాగమును, కౌశికగోత్రుఁడయిన స్కంద రుద్రార్యునకు నరభాగమును నొసంగఁబడినవి. జయవర్మ మహేశ్వర భక్తుఁడని చెప్పఁబడి యుండుటచేత నితఁడు శైవమతాభిమాని యని సూచింపుచున్నది. ఇతఁడు తనశాసనమునందు దాను పల్లవుఁడనని చెప్పకొని యుండకపోయినను వీనిని పల్లవుఁడనియె విశ్వసింపవచ్చును. ఇంతకంటెవీని చారిత్రము మనకేమియుఁ దెలియరాదు.

## విజయదేవవర్మ.

ఇతఁడు వేంగీదేశమును బరిపాలించిన వారిలో మిక్కిలి ప్రాచీనుఁడు. వీనిశాసనమొకటి నూతనముగాఁ గనిపెట్టఁబడినది. [1] ఈశాసనము ప్రాకృతభాషలో వ్రాయఁబడి వేంగీపురమునుండి ప్రకటింపఁబడినదగుటచేత నిది పురాతనమైనదనుటకు సందియములేదు. విజయదేవవర్మ జయవర్మకుఁ దరువాతి వాఁడును విజయనంది వర్మకుఁ బూర్వుఁడును నని చెప్పుటకు సంశయింపంబనిలేదు. జయవర్మకుఁ గూడూరు రాజధానిగ నుండెనని చెప్పఁబడినది. కూడూహార విషయమునకు (వేంగిరాష్ట్రము) మొదట కూడూరును తరువాత వేంగీపురమును రాజధానిగనుండుటచేతను, విజయదేవ వర్మ వేంగీపురమునుండి యీశాసనము ప్రకటించుటచేతను జయవర్మ తరువాత వాఁడని తేటపడుచున్నది. విజయనందివర్మశాసనమువలెగాక యియ్యది ప్రాకృతములో నుంటచేత నతనికంటె

1 District Manual of Godavary

విజయదేవవర్మ పూర్వుండని చెప్పవలసియున్నది. ఇతఁడు సాలంకాయన గోత్రుఁడు. విజయనందివర్మవలెనె చిత్రరథస్వామిపాదసేవాతత్పరుఁడు. చిత్రరథస్వామిదేవాలయము వేంగీపురమునందున్నది.

## వేంగీపురము లేక వ్యాఘ్రపురము.

వేంగిదేశమునకు ముఖ్యపట్టణముగానుండిన వేంగీపురము కృష్ణామండలములోని యేలూరునకు నుత్తరమున ౭ మైళ్లదూరమున నుండెడిది. ఆస్థానమునం దిపుడు పెదవేఁగి, చినవేఁగి, అను పల్లెలు మాత్రముగలవు. వీనికిదక్షిణముగా ౫ మైళ్లదూరమున దెందులూరను గ్రామముగలదు. ఈగ్రామమునకు గంగనగూడెముఁ సేనగూడెము మొదలగు సివారుపాలెములు చుట్టును నున్నవి. ఇవియన్నియుం గలిసి యొకమహాపట్టణముగానుండి వేంగీపురమని పిలువంబడుచుండెను. ఈప్రదేశమునందుశిథిలములయిపోయిన శివాలయములు పెక్కులుగలవు. మఱియును విఘ్నేశ్వరునియొక్క విగ్రహములు నాలుగు దెందులూరునకు దక్షిణముగానున్న చెఱువు సమీపముననుండియున్నవి. వానిలోనొకటి మిక్కిలి పెద్దదిగానున్నది. ఈగ్రామమునకుఁ దూర్పుప్రక్కను భీమలింగము దిబ్బయను పేరుగల యెత్తైన యొకపాటి మట్టిదిబ్బగలదు. దానికుత్తరముగా మాకమ్మ చెఱువును దానినడుమనొక మట్టిదిబ్బయు, దానిపైన రెండుఱాతినందులును గలవు. ఈగ్రామమునకుఁ బడమరగానొక చెఱువుగలదు. దానిని నారికేళవారిచెఱువని చెప్పుదురు. వానిగట్లపైని రెండు శిలాశాసనములు నిలువుగానుండియు, మఱి రెండు సాగిలంబడియు నుండినవి. పెదవేఁగికిని చినవేఁగికిని నడుమ మఱియొకమంటిదిబ్బగలదు. వీనినన్నిటిని బరిశోధించిచూడఁగా వేంగీపురము మిక్కిలి యున్నతస్థితియందుండిన పూర్వకాలమున నొకయందమైన మహానగరముగానుండెననుటకు సందియములేదు. ఇచ్చటి దేవాలయములయొక్క ఱాళ్లను తురకలు గొనిపోయి యేలూరులోని కోటను గట్టిరని తెలియుచున్నది. వేంగీపురమనియెడి మహానగరమొకటి యిక్కడనుండెనాయని కొందఱు సంశయించుచుండిరిగాని విజయదేవవర్మయొక్కయు, విజయనందివర్మయొక్కయు శాసనములాసంశయమును నివారించినవి. మఱియును దండియును మహాకవి కొల్లేరును వర్ణింపుచు దానికి ననతిదూరముగానుం



డిన యీవేంగీపురమునే యాంధ్రనగరియని పిలిచియున్నాఁడు.[1] విజయదేవవర్మ విజయనందివర్మ శాసనములలో నుదాహరింపఁబడిన చిత్రరథస్వామి దేవాలయమిప్పటికిని నిలిచియుండి యాపేరుతోనే పిలువంబడుచున్నది.[2]

## అఱువనాడు- వేంగిదేశము.

ఆంధ్రదేశమునకు వేఁగిదేశమను పేరెట్లుకలిగినదియుఁ గొంతవఱకు మూఁడవప్రకరణాంతమునఁ దెలుపఁబడినదిగాని యదిచదువరులకంతగాఁ దృప్తి కలిగింపఁజాలదు. ఎందుకన మొదటివేంగిదేశమని యేభాగము పిలువంబడియెనో దెలిసికొనుట కష్టసాధ్యముగనుండెను. మొదటి వేఁగిదేశము కన్నడదేశప్రాంతమని చెప్పెడివారిమాట యెంతమాత్రమును విశ్వసింపఁదగినదికాదు. కాంచీపురప్రాంతదేశమునకు మొదటవేఁగినాడను పేరు కలదని యూహింపఁబడినది కాని వాస్తవమదికాదు. ఇఁక మొదటి వేఁగిదేశమేభాగమునకువర్తించునో సహేతుకముగా నిర్ధారణముచేసినఁగాని చదువరులకు దృప్తికలిగింపఁజాలదు. ఈదేశము పూర్వము నాగులచేఁ బరిపాలింపఁబడుచుండెనని యైదవప్రకరణమునవిశేషముగాఁ జర్చింపఁబడినది. దక్షిణదేశమునందలి నాగులలో మరవార్ అయినార్, ఒలియార్, ఒపియార్, అఱువలార్, పరదవార్, మొదలగు పేరులుగల తెగలవారు నివసించుచుండిరి. వారిలో “అఱువలార్” అనఁగా అఱువలు కాంచీపురప్రాంతదేశమున నివసించుచుండిరి. ఆకారణముచే నాభాగమునకు “అఱువనాడు”, “అఱువవడదలై”, అను నామములుగలిగెను. కాంచీపురమునకు దక్షిణదేశమఱువనాడుగను, గాంచీపురముండిన ప్రదేశమఱువవడదలైయనియుం బిలువంబడుచుండెను. టాలెమీ మొదలగు విదేశీయచరిత్రకారులు మసాలియాదేశమునకు దిగువభాగమును అశార్నోరి(అర్ వార్ నాయ్)అనగా అఱువనాడని పేర్కొనియుండుటగూడ నీయంశము ధ్రువపడుచున్నది.

---

1. రెండవప్రకరణమున ౯దవ పేజి చూడుఁడు. 2. Madras Journal of Literature and Science Vol XIX p. 327

కాఁబట్టి అఱవలను పేరు నాగులలో నొకతెగవారిదిగాని ద్రావిడులది గాదు. అఱవనాడునుండి మొదట ద్రావిడులీదేశమునకు వచ్చుటచేత వారిని మనవారఱవలని పిలువనారంభించిరికాని నిజముగా వారలఱవలుగారు. శివస్కందవర్మ కాంచీపురమునుండి తనశాసనములను ప్రకటించినకాలమున నాదేశము వాసుకిసంతతివారలయిన యఱవనాగులచే నివసింపఁబడు నఱవనాడుగానుండెనుగాని మఱియొక పేరుతో లేదు. కాఁబట్టి మొట్టమొదటి వేంగిదేశము కృష్ణాగోదావరీనదీ ముఖద్వారములకు నడుమనుండు దేశమనగా నిప్పటికృష్ణామండలమునకు వర్తింపఁగలదు. దీనియుత్పత్తికిఁ గారణమీవిధముగాఁ జెప్పకొనవచ్చును. మొట్టమొదటనీదేశమునకు కూడూహారవిషయమను పేరుగలదు. అప్పడు కూడూరా(గుడివాడ లేక గూడూరు) అనుపట్టణము రాజధానిగనుండెను. ఏకారణముచేతనో రాజధాని మార్చుకొనవలసివచ్చినది. సాలంకాయనగోత్రులయిన పల్లవరాజులలోనొకరు నూతనముగా ననుకూలమగు నగరమొకదానిని కట్టించి వేంగియనఁగా పులియని యర్థముండుటచేతను, శత్రువులకు బెబ్బులివలె సమీపింప సాధ్యముకానిదని సూచించుచుండుటచేతను వేంగీపురమని పేరు పెట్టియుండును. వేంగీపురమును బాలించినరాజులను వేంగిరాజులనుట సామాన్యముగా వ్యవహారమునకు వచ్చియుండును. వేంగిరాజులు జయించిన దేశమునకుఁగాని పాలించిన దేశమునకుఁగాని వేంగిరాష్ట్రమనికాని వేంగిదేశమనికాని పేరుపెట్టఁబడినదన్న వింతయేమున్నది? కాఁబట్టి మొట్టమొదట వేంగీపురమేర్పడి దానంబట్టి వేంగిదేశమువాడుకలోనికివచ్చినది. వేంగియనునఱవశబ్దము తెలుఁగులోవేఁగియని పిలువంబడుచున్నది. ఈవేఁగిదేశము పల్లవులకాలమునను చాళుక్యులకాలమునను దక్షిణమునఁ గాంచీపురమువఱకును నుత్తరమున మహానదివఱకును వ్యాపించినది. నన్నయభట్టుకాలమున రాజమహేంద్రవరము మొదలుకొని కాంచీపురమువఱకును గలదేశము వేఁగిదేశముగానే పరిగణింపఁబడుచువచ్చెను. వేఁగిదేశమునకు దగ్ధరాష్ట్రమని పేరుచెప్పట కేవలము పొరబాటని చెప్పవలయును. అట్లయిన యెడల వేంగిపురమును దగ్ధపురమని చెప్పవలసివచ్చి యపహాస్యము పాలగుట తటస్థింపవలసివచ్చును. వేంగిరాజులయిన మొదటిపల్లవులకాలమున నఱవనాడు



నుండి బ్రాహ్మణులను రప్పించినగాని వచ్చినవారిని నాదరించిగాని యగ్రహారములు మొదలగువాని నిచ్చి దేశమున నిలుపుటచేత వీరలే మొదట వేఁగినాటి శాఖాబ్రాహ్మణులుగాఁ బరిగణింపఁబడుచువచ్చిరి. అఱవనాడునుండివచ్చిన బ్రాహ్మణులఱవబ్రాహ్మణులుగా నేపరిగణింపఁబడుచుండిరి. క్రీస్తుశకము నాలుగవశతాబ్దము రెండవ సంవత్సరప్రాంతమునందు నలహాబాదునగరమున నశోకుని స్తంభముమీఁద సముద్రగుప్తునిచే వ్రాయించఁబడిన శాసనమునందు వేఁగిపుర ముదాహరింపఁబడినది గనుక నంతకుఁ బూర్వమునుండియు ననఁగా క్రీస్తుశకము రెండవశతాబ్దమునుండియో మూఁడవశతాబ్దమునుండియో వ్యవహారములోనికి వచ్చియుండును.

## సముద్రగుప్తుని దండయాత్ర.

### స్వామిదత్తుఁడు, మహేంద్రవర్మ, హస్తివర్మ, విష్ణుగోపవర్మ.

నాలుగవశతాబ్దప్రారంభమున నుత్తరహిందూస్థానమును గుప్తరాజులాక్రమించుకొనిపరిపాలించుచుఁదమభుజబలపరాక్రమముచేత వెంటనె నానాముఖములఁ దమరాజ్యమును విస్తరింపఁజేయసాగిరి. వారిలో సముద్రగుప్తుఁడు నెపోలియన్ చక్రవర్తి వంటివాఁడగుటచేత దిగ్విజయయాత్ర మొదలుపెట్టి దక్షిణహిందూదేశముపైఁ గూడదండెత్తివచ్చెను. ఈతని దక్షిణ దిగ్విజయమువలన నాకాలమున మహానదిమొదలుకొని కాంచీపురమువఱకును గలదేశమును బాలించురాజులపేరును వారుండుముఖ్యపట్టణములును దెలియుచున్నవి. సముద్రగుప్తుఁడు దక్షిణకోశలమును బాలించుమహేంద్రుని జయించి మహాకాంతారమునకువచ్చి యచ్చటి వ్యాఘ్రరాజునోడించి పిమ్మట కళింగదేశమునకు వచ్చెను. పర్వతముమీఁదనున్న కొత్తూరుదుర్గమును ముట్టడించి యాదుర్గాధిపతియగు స్వామిదత్తునినోడించి యెరండపల్లను బాలించు దమనుని జయించి తరువాతదేవరాష్ట్రమును బాలించుకుబేరుని, పిమ్మట అవముక్తాధీశ్వరుండయిన నీలరాజును, అటుపిమ్మట పిష్ఠపురమును బాలించుమహేంద్రవర్మను, అనంతరము వేంగినిబాలించుహస్తివర్మను, పాలక్కడను బాలించునుగ్రసేనుని, కుస్థలపురిని బాలిం

చుధనంజయుని, అటుతరువాత కాంచీపురాధీశ్వరుండయిన విష్ణుగోపుని జయించి దైవపుత్రుల (ద్రమిళులు) పైకిఁబోయెను. ఇందుచెప్పఁబడిన దేశములును రాజులును పట్టణములు నిప్పటి యాంధ్ర దేశములోనివేగాని యన్యములుగావు. కొత్తూరు గంజాము మండలములోని మహేంద్రగిరికి ౧౨ మైళ్లదూరముననున్నది. ఈరంవపల్లయు, దేవరాష్ట్రమును, అవముక్తయు గంజాము విశాఖపట్టణ మండలములలోనివిగాని యన్యములుగావు. చీపురుపల్లి ప్రాంతదేశము దేవరాష్ట్రమని చాళుక్యులశాసనములందును, గాంగపల్లవుల శాసనములందును బేర్కొనంబడినది. పిష్టపురము ప్రాచీనకళింగమునకు రాజధానిగనుండెను. ఇది యిప్పటి గోదావరిమండలములోని పిఠాపురమెగాని యన్యముగాదు. వేంగి వేంగీపురమెగానియన్యముకాదు. కుస్థలపురము, పాలక్కడ నెల్లూరుమండలములోనివిగాఁ గన్పట్టుచున్నవి. కాంచీపురము ప్రసిద్ధమైనది. వీరలచరిత్రము మనకేమియుఁ దెలియఁరాకున్నయది. వీరిపేరులుసముద్రగుప్తునిశాసనమునం దుదాహరింపఁబడుటచేతఁ దెలిసినవిగానిలేకపోయిన వీనినైనందెలిసికొనుట కాధారమేలేకపోయినయుండును. సముద్రగుప్తుని శాసనమునందు దైవపుత్రులని చెప్పఁబడినవారు జాతులవారయి యుందురు. కాంచీపురమును బాలించువిష్ణుగోపవర్మయు, వేంగిని బాలించుహస్తివర్మయు పిష్టపురమును బాలించుమహేంద్రవర్మయు పల్లవులయి యుందురు. మహేంద్రవర్మయు, హస్తివర్మయు విష్ణుగోపవర్మకు లోఁబడి పాలనముచేయు సామంతరాజులని కొందఱు తలంచుచుండిరి కాని యెచ్చటను జెప్పఁబడియుండలేదు. ప్రస్తుతనిరాధారస్థితియందు వారుముగ్గురు వేఱ్వేఱు స్వతంత్రరాజులనియె మనమూహింపవలయును.

## విజయస్కందవర్మ, విజయబుద్ధవర్మ.

విజయస్కందవర్మ పరిపాలనముసేయుచుండిన కాలమున వానికుమారుఁడును యువమహారాజునగు విజయబుద్ధవర్మయొక్క భార్యయు రాణియునగు చారుదేవియొక్క దానశాసనమొకటి గాన్పించినది. ఇదియును బ్రాచీన ప్రాకృతభాషలోనే యుండ మోటుగానుండు నక్షరములతోఁగూడియుండుటచేత



మిక్కిలి ప్రాచీనమైనదిగ భావింపఁబడుచున్నది. [1]ఇందు విజయస్కందవర్మ కుమారుఁడగు విజయబుద్ధవర్మ పల్లవుఁడనియు, భారద్వాజుఁడనియుఁ దెలుపఁబడినది. మఱియు విజయబుద్ధవర్మయొక్క రాణియగు చారుదేవి దాలూరగ్రామములోని కులిమహాతారక దేవాలయములోని దేవుఁడగు నారాయణునకు, మంచినీళ్లబావికి నుత్తరపు దిక్కునను రాజుచెఱువునకు దిగువను నాలుగునివర్తనముల భూమిని, దానముచేసెనని కటకములోని వ్యాపృతునకుఁ దెలియఁజేయఁబడినటుల నీశాసనమునందుఁ జెప్పఁబడినది. ఈచారుదేవి బుద్ధ్యాంకురవర్మయొక్క తల్లియనిగూడ పేర్కొనఁబడినది గాని వీరెచ్చటివారో పేర్కొనఁబడియుండలేదు. కటకమనఁగా ధాన్యకటకమేమోయని సందియము కలుగుచున్నది. దాలూరయనునది కృష్ణామండలములోని యిప్పటి దావులూరు గ్రామమునకు వర్తించునేమో యింకను విచారింపవలసి యున్నది. ఈవిజయస్కందవర్మ రెండవ శతాబ్దాంతమునఁగాని మూడవశతాబ్దాదిని గాని యుండి యుండవలయునని యూహింపవచ్చును. ఇతఁడు భారద్వాజ గోత్రుఁడగుటచేత సాలంకాయనులగు వేంగిరాజులకు సంబంధించిన వాఁడుగాఁడు. ఆంధ్రభృత్యవంశములో నుదాహరింపఁబడిన విజయశ్రీయనువాఁడేమో భావిపరిశోధనములవలనంగాని దెలియంబడదు.

## విజయనందివర్మ.

ఇతఁడు వేంగిపురము రాజధానిగా వేంగిరాష్ట్రమును బాలించినవారిలో నొకఁడు. వీనిశాసనము సంస్కృతభాషలోనుండుటచేత నితఁడు విజయదేవవర్మకును, హస్తివర్మకును దరువాతి వాఁడని యూహింపఁబడుచున్నాఁడు. ఇతఁడు సాలంకాయనుఁడు. విజయదేవవర్మవలెనె చిత్రరథస్వామి పాదసేవాతత్పరుఁడు. వీనిశాసనము కొల్లేరునకు సమీపమున దొరకినది. [2] ఇతఁడు తనశాసనమునందు బప్పా భట్టారక పాదభక్తుఁడనని చెప్పుకొనియెను. ఇట్లు చెప్పుకొన్న

1 Ep. Ind. Vol Viii. pp. 145-116. ఇదిగుంటూరు మండలములోని కొండకూరులో మాధవరావువలన కనుగొనఁబడినది.

2 Indian Antiquary. Vol V. p. 175

వారిశాసనములు మఱికొన్ని కలవు. బప్పాయనునది ప్రాకృతము. తండ్రియని యర్థము. శివస్కందవర్మ శాసనమున బప్పాయనురాజు పేర్కొనఁ బడియెను. అదిరాజుపేరుగా నుదాహరింపఁబడినదిగాని నిజముచేత దానిభావమది కాదని తోఁచుచున్నది. శివస్కందవర్మ బప్పాయని తనతండ్రిని ప్రశంసించియుండెనేమో? ఈశాసనమును భాషాంతరీకరించిన డాక్టరు బర్నెల్ గారు విజయనందివర్మ వాచవర్మ మహారాజుయొక్క జ్యేష్ఠపుత్త్రుఁడని భాషాంతరీకరించి యుండఁగా మఱికొందఱు చండవర్మయొక్క జ్యేష్ఠపుత్త్రుఁడని పేర్కొనుచున్నారు. విజయనందివర్మ తల్లికులాంక దేవి, అభ్యుదయ పరంపరాభివృద్ధికై చిన్నపాకూరు వాకాగ్రహారములో నివసించుచుండిన వేదాధ్యయన సంపన్నులును, నానాగోత్ర సంభవులునైన ౧౫౭ గురు బ్రాహ్మణోత్తములకు కూడూహార విషయము (వేంగిదేశము) లోని పడానూరుపల్లియను గ్రామమును ధారాదత్తము చేసెను. ఇంతకన్నను వీనినిగుఱించి మనకేమియును దెలియరాదు. ఇతఁడు నాలుగవశతాబ్దములోని వాఁడని తెలుపుటకు సంశయింపంబని లేదు.

## కంధరవర్మ - అత్తివర్మ.

ఆనంద ఋషిగోత్రసంభవుఁడయిన కందరవర్మయను మహారాజుయొక్క పుత్త్రిక పేరుగల ప్రాచీనశాసనమొకటి కృష్ణామండలములోని చెజ్జరాలయను గ్రామమునందు దొరకినది.[1] ధరణికోటయొక్క ప్రాచీననామమగు ధాన్యకటకమును త్రికూటపర్వతమును కందరునిగూర్చి ప్రశంసించు సందర్భమున నుదాహరింపఁబడినవి. మఱియు గుంటూరుమండలములోని గోరంట్ల గ్రామములో అత్తివర్మయొక్క శాసనమొకటి గన్పట్టఁబడినది.[2] ఆనందగోత్ర సంభవుఁడయిన కందరునియొక్క పుత్త్రుఁడగు అత్తివర్మయను రాజు ఆతుకూరు (ఆతుకూరు) గ్రామమును, కృష్ణవేణినదియొక్క దక్షిణతటముననుండు తాతికుంట గ్రామములో "అష్టాశతపట్టి" పరిమాణముగల పొలమును కొట్టిశర్మయనుబ్రా

(1) Ins No. 155 of Annual Report on Epigraphy of 1899
(2) Indian Antiquary Vol IX. pp. 101, 103



హ్మణునకు దానముచేసి నట్లుగ నీశాసనమునందుఁ జెప్పఁబడినది. హిరణ్యగర్భుని (బ్రహ్మ) వంశమునం దుద్భవించినవాఁడని చెప్పఁబడినందున నీయత్తివర్మ పల్లవుఁడని యూహింపఁబడుచున్నాఁడు. అత్తివర్మయొక్క తండ్రికందరుఁ డానందగోత్రుఁడని చెప్పఁబడియుండుటచేత చెజ్జరాల శాసనములో నుదాహరింపఁబడిన కందరుఁడును, ఈకందరుఁడు నొక్కఁడేయై యుండవలయును. అత్తివర్మశాసనము సంస్కృతభాషలో నున్నది. వీని రాజధాని యెచ్చటనుండెనో దెలియరాదుకాని యితఁడు గుంటూరు మండలమును పాలించిన వాఁడని దెలియుచున్నది. వీరు నాలుగవ శతాబ్దములోనివారని చెప్పవచ్చును. ప్రస్తుత మింతకన్న వీరినిగూర్చి మనకుఁ దెలియవచ్చినదేమియును లేదు. వేంగిపురమును పాలించినహస్తివర్మయె అత్తివర్మయని స్మిత్తుగా రభిప్రాయపడిరి గాని ఋజువుచేసి యుండలేదు.

## చండవర్మ.

చండవర్మ మహారాజు కళింగదేశమును బరిపాలించినవాఁడు. వీనిశాసనమొకటి గంజాము మండలములోని నరసన్నపేటకు రెండుమైళ్ల దూరమునందున్న కోమర్తియను గ్రామమున దొరకినది.[1] ఈశాసనములోని లిపి వేంగిపురమును పాలించిన విజయనందివర్మ శాసనములోనిలిపిని బోలియుండుటచేత నితఁడు నాలుగవశతాబ్దములోనివాఁడని శాసనపరిశోధకులు చెప్పుచున్నారు. ఈశాసనములోనిభాష దాదాపుగసంస్కృతమైయున్నది. శాసనమతిక్రమించి వర్తించెడివారిని శపించునట్టి శ్లోకములు మూడుమాత్రము తక్కతక్కినభాగమంతయు వచనముగ వ్రాయఁబడినది. కళింగాధిపతియైన చండవర్మ మహారాజు తనయాఱవ పరిపాలన వత్సరమునఁ జైత్రశుద్ధ పంచమినాఁడు భారద్వాజ గోత్రుఁడును వాజసనేయ శాఖాబ్రాహ్మణుఁడును నగు దేవశర్మకు కొహితూర (కొత్తూరు) గ్రామమును దానముచేసినట్లుగఁ జెప్పఁబడినది. ఈశాసనము సింహపురమునుండి ప్రకటింపఁబడినది. విజయనందివర్మ శాసనములో[illegible]లెనె బప్పాభట్టా

1 Ep. Ind. Vol IV, pp. 142, 143;

రకపాదభక్తుఁడని కూడఁ జేర్కొనఁబడినది.[1] చండవర్మ శాసనమునకును విజయనందివర్మ శాసనమునకును దగ్గఱపోలిక విశేషముగఁ గన్పట్టుచుండుటచేతఁ బరిశోధకులు కొందఱు విజయనందివర్మ తండ్రియగు చండవర్మయు నితఁడు నొక్కఁడేయని యూహించుచున్నారు. వీరిరువు రొక్కరయినను గాకపోయినను సమకాలికులని చెప్పవచ్చును. శ్రీకాకుళమునకును నరసన్నపేటకును నడుమనుండు సింగపురమె సింహపురమై యుండవచ్చునని యూహింపఁబడుచున్నది. చండవర్మశాసనములోని రాజముద్రికపైన ''పితృభక్తః'' యని వ్రాయఁబడినది.

## నంద ప్రభంజనవర్మ.

ఈనందప్రభంజనవర్మయుఁ గళింగదేశమును బాలించిన పూర్వరాజులలో నొకఁడుగా నున్నాఁడు. కళింగాధిపతియైన యీనంద ప్రభంజనవర్మ మహారాజుయొక్క దానశాసన మొకటి శ్రీకాకుళమునఁ గాన్పించినది.[2] నంద ప్రభంజనవర్మ సారపల్లినగరమునుండి యీశాసనమును బ్రకటించినవాఁడు. ఇతఁడు దేవరాత గోత్రులయిన చారణులకును హారిశ్చంద్ర స్వామియని బ్రాహ్మణునికొఱకును దేయవటమను గ్రామమును దానము చేసెనని చెప్పఁబడి యున్నది. ఈశాసనములోని లిపి చండవర్మశాసనములోని లిపిని బోలియుండుట చేతను, కళింగాధిపతియని యుభయ శాసనములయందును జేర్కొనంబడి యుండుటచేతను, వీనిశాసనములోని ముద్రికపైన చండవర్మ ముద్రికలో వ్రాయఁబడిన ''పితృభక్తః'' అనునక్షరములే వ్రాయఁబడియుండుటచేతను వీరలిరువురు నొక్కకుటుంబములోనివారేయై యుందురని శాసనపరిశోధకు లభిప్రాయపడుచున్నారు. ఈశాసన పరిశోధకు లూహించిన యూహాలేసరియైన వయినయెడల వీరినిగూడ

(1) Compare Ind. Ant, Vol XV p. 274; and South Indian Inscriptions, Vo II, p. 358 note 2.

2 Indian Antiquary Vol, XIII p. 48. ఈ శ్రీకాకుళశాసనమును, కోమర్తి శాసనమును జి. వి. రామమూర్తిపంతులుగారి వలనఁ బంపఁబడినవి.



సాలంకాయను లయిన పల్లవులనియె భావింపవచ్చును. కళింగాధిపులమని చెప్పుకొనిన యీనందప్రభంజనవర్మ చండవర్మలను గూర్చిన చరిత్రము దెలియరాకున్నది.

## స్కంద వర్మవంశము.

స్కందవర్మ కొడుకు వీరవర్మ; వీరవర్మకొడుకు రెండవ స్కందవర్మ రెండవ స్కందవర్మకొడుకు యువమహారాజ విష్ణుగోపవర్మ; విష్ణుగోపవర్మ కొడుకు సింహావర్మ; వీరిలో విష్ణుగోపవర్మ యొక్కయు సింహావర్మయొక్కయు శాసనములు నెల్లూరు మండలమునఁ గాన్పించినవి. ఇవియన్నియును సంస్కృతభాషలో వ్రాయఁబడినవి. ఈవంశములో గడపటి వాఁడయిన సింహవర్మ మాత్రమె రాజ్యపరిపాలనము చేసినట్లు గన్పట్టుచున్నది గాని తక్కినవారి సంగతి తెలియుచుండలేదు. వీరిశాసనములు దశనపురము పాలక్కడ మెన్మతూర పట్టణములనుండి ప్రకటింపఁబడినవి. ఈపట్టణములు నెల్లూరు గుంటూరు మండలములలోనివేగాని యన్యములుగావు. రాజకేసరివర్మయను చోడరాజుయొక్క తిరుకాళుకుండ్రముశాసనములో నొకస్కందశిష్యుని పే రుదాహరింపఁ బడినది.[1] ఈస్కందశిష్యుఁడు సింహవిష్ణు వంశములోని మొదటి నరసింహవర్మకుఁ బూర్వుఁడుగా నుండెనని యూహింపఁబడుచున్నాఁడు. సంస్కృతశాసనములలో నుదాహరింపఁబడిన యిరువురి స్కందవర్మలలో నొకఁడు స్కందశిష్యుఁడు కావచ్చునని శాసనపరిశోధకులు చెప్పుచున్నారు గాని యింకను విచారింపవలసి యున్నది. విష్ణుగోపవర్మ యువమహారాజుగ నుండినపుడు ముండరాష్ట్రములోని ఉఱవపల్లి గ్రామమును కందుకూరగ్రామములోని దేవాలయమునకు దానము చేసెనని పాలక్కడనుండి ప్రకటించిన యుఱవపల్లి శాసనమునం జెప్పఁబడినది.[2] ఇందు చెప్పఁబడిన ముండరాష్ట్రమె చోడరాజగు మూడవకులోత్తుంగుని నెల్లూరి శాసనమున ముండైనాడుగఁ జేర్కొనఁబడినది.[3]

(1) Ep. Ind Vol. III. p. 279; (2) Ind. Ant, Vol V. p. 50; (3) Reports on Epigrappy in Madras. G. O. Public No 195 of 1894.

కందుకూరయనునదియె కందుకూరు. ఇవియన్నియును నెల్లూరు మండలములోనివే.

తనయైదవపరిపాలన సంవత్సరమున సింహవర్మ ముండరాష్ట్రములోని పీకిరెయను గ్రామమును విలాసశర్మయను బ్రాహ్మణునకు దానముచేసినట్లుగఁ జెప్పఁబడినది. ఈసింహవర్మయును మంగదూరు (మంగలూరు) శాసనమును బ్రకటించిన సింహవర్మయు నొక్కడేయని డాక్టరుఫ్లీటుగారు వ్రాసియున్నారు.[1] పీకిరశాసనములోని ముద్రికయు కొంచెమించుమించుగా నుఱవపల్లి శాసనములోని ముద్రికను బోలియున్నది. సింహవర్మ మంగదూరు శాసనము దశనపురమునుండి ప్రకటింపఁబడినది.[2] మంగదూరు శాసనములో రెండవసింహవర్మతండ్రివిష్ణుగోపుడని వర్మ తీసివేయబడి పేర్కొనఁబడినది. ఈశాసనమునందును విష్ణుగోపుడు యువమహారాజుగనే చెప్పఁబడియెను. దీనింబట్టి యితఁడెన్నఁడును రాజ్యాధిపత్యము వహించియుండలేదని యూహింప వలసి వచ్చుచున్నది. వీరకోచవర్మ (వీరవర్మ)యొక్కమునిమనుమని శిథిలమయిపోయినశాసన మొకటి దర్శిగ్రామమున గాన్పించినది. ఈశాసనములో నుదాహరింపఁబడిన రాజుయొక్కపేరు చెడిపోయినది.[3] దర్శనపురము దశనపురమైనది. దశనపురమే నేఁడుదర్శియని పిలువఁబడుచున్నది. మెనుమనూరనునది గుంటూరు మండలములోని మనుమూరు కావలయును. పాలక్కడయనునది యెద్దియో దెలియరాదు. ఈవంశపు రాజులు కాంచీపురమునుండి పరిపాలనము చేసినట్లు గానరాదు. వీరలు భారద్వాజ గోత్రులయిన పల్లవులు. వీరుకాంచీపురమునుండి తఱిమివేయఁ బడియుండవచ్చునని కొందఱుతలంచుచున్నారుగాని యట్లుతలంచుటకు సరియైనహేతువుగానరాదు.

## స్కందవర్మకుమారవిష్ణువంశము.

స్కందవర్మకుమారుఁడు కుమారవిష్ణువు; కుమారవిష్ణువుకుమారుడు బుద్ధవర్మ, బుద్ధవర్మకుమారుడు కుమారవిష్ణువు. ఈ రెండవకుమారవిష్ణునిదానశాసన

(1) The Bombay Gazetteer Vol I part II, p, 321; (2) Ind. Ant, vol V, pp.154 ff. (3) Ep. Ind. Vol I. p. 397 f.



మొకటి నెల్లూరుమండలములోని చెందలూరుగ్రామమునఁ గాన్పించినది.[1] ఈకుమారవిష్ణునిశాసనము కాంచీపురమునుండి ప్రకటింపఁబడినది. ఈ శాసనములోని లిపిని పరిశోధించినడాక్టరు హల్ట్జుగారీనలుగురు పల్లవులును రెండవసింహవర్మకును సింహవిష్ణువునకును నడుమనుండి యుందురని యూహించుచున్నారు. పల్లవమహారాజగు కుమారవిష్ణువు కర్మకరాష్ట్రములోని భాగమగు కవచకారభాగములోని చెందలూరుగ్రామములో నెనమన్నూరు పట్టికలపాలమును అభిరూపనివాసియును కౌండిన్యగోత్రుఁడును నగు భావస్కందత్రాతయను బ్రాహ్మణునకు దానముచేసినట్లుగ నీశాసనమునఁ బేర్కొనఁబడినది. ఈవంశజులు విష్ణుభక్తులయిన భాగవతులుగాఁ బేర్కొనఁబడిరి. వీరును భారద్వాజగోత్రులుగను పల్లవులుగనుండిరి. ఈ రాజులును పైఁజెప్పినరాజులును కేవలము తమభుజబలపగాక్రమముచేత ననేకరాజులనుజయించి యశ్వమేధాదియాగములఁ బెక్కింటినాచరించినట్లుగఁ గన్పట్టుచున్నది. విష్ణుగోపయని, కుమారవిష్ణువని పేరులు వహించియుండుటఁ జూడ వైష్ణవమతము తలయెత్తి ప్రజలుచుండినకాలమైయుండునని తోఁచుచున్నది. వైష్ణవాళ్వారులు కొందఱయిన నాకాలమునందుండియుండవలయును. అశ్వమేధయాగముల్ల నాచరించితిమని గరువముతోఁ జెప్పుకొనినది వాస్తవముగాక శివస్కందవర్మశాసనము ననుసరించినదిగానున్నది. వీరవర్మవంశజులకును వీరికినిగలసంబంధము దెలియరాకున్నది.

## కమ్మరాష్ట్రము.

ఈ యిరువంశములవారును ౫, ౬ శతాబ్దములలోనివారని చెప్పవచ్చును. కుమారవిష్ణుశాసనమునందు బేర్కొనఁబడినకర్మంక లేక కమ్మంకరాష్ట్రము పూర్వచాళుక్యరాజగు మంగియువరాజు చెందలూరుశాసనమున కమ్మరాష్ట్రమని పేర్కొనఁబడినది. జగ్గయ్యపేటశాసనములో నుదాహరింపఁబడిన కమ్మకరాతవిషయము మేమిదివఱ కూహించిన కమ్మమెట్టుగాక యీకమ్మరాష్ట్రమెయని పైశాసనములఁబట్టి తేటఁబడుచున్నది. ఈకమ్మరాష్ట్రమె తరువాత కమ్మనాడుగఁ బేర్కొనఁబడుటకు దృష్టాంతము లనేకములుగలవు. నన్నయ

1 Eph. Ind. Vol. viii pp. 233 236.

భట్టుకాలమునందుండి గణితశాస్త్రమును రచించిన పావులూరుమల్లనకవి "ఇలఁ గమ్మనాటిలోపల విలసిల్లిన పావులూరివిభుఁడ" నని చెప్పుకొనియున్నాఁడు. అయినను పావులూరుగ్రామము గోదావరిమండలములోనిదని రావుబహాదరు వీరేశలింగముపంతులవారు తమయాంధ్రకవులచరిత్రములో వ్రాసియుండుట కాధారమేమో దెలియరాదు. పంతులవారు పొరబడియుండవలయును లేదా గోదావరిమండలములోఁగూడ మఱియొకకమ్మనాడుండవలయును. గుంటూరిమండలములోని కమ్మనాడె ప్రాచీనమైనదని చెప్పుటకు లేశమాత్రమును సందియము లేదు. ఇప్పటియాంధ్రులలో నొకతెగవారగు కమ్మవారు కమ్మకరాతవిషయమునకు సంబంధించినవారుగఁ గన్పట్టుచుండుటచేత నీతెగవారు క్రీస్తుశకారంభమునుండి యున్నవారని చెప్పవచ్చును.

## నైయోగికులు లేక నియోగులు.

కుమారవిష్ణువుయొక్క చెందలూరుశాసనమున రాజకీయోద్యోగీయులకు (Officials) నైయోగికు లన్నపదము వాడఁబడినది. చాళుక్యరాజగు మంగియువరాజుయొక్క చెందలూరుశాసనమునందు నైయోగికులన్నపదము వాడఁబడినది కాఁబట్టి యుద్యోగపదవులందుండిన బ్రాహ్మణులను నైయోగికులు లేక నియోగులని పిలువంబడుచుండుట క్రీస్తుశక మయిదాఱవ శతాబ్దములనుండి వచ్చుచున్నదని పల్లవచాళుక్యరాజుల చెందలూరుశాసనములు చాటుచున్నవి.

## త్రిలోచనపల్లవుఁడు.

వీనినామము పదవశతాబ్దమునాటి పూర్వచాళుక్యుల శాసనములలోని గాథలలో వినంబడుచున్నదిగాని మఱియెచ్చటను వీనిశాసనము గానరాదు. ఈత్రిలోచనవర్మపల్లవ యోధాగ్రేసరుఁడని చెప్పంబడుచుండెను. పల్లవులకు గర్భశత్రువులగు చాళుక్యుల మొట్టమొదట నెదిరించినవాఁడు త్రిలోచన పల్లవుఁడే. వీనికాలమున నుత్తరకోసలాధీశ్వరుండగు విజయాదిత్యుఁ డయోధ్యనుండి దక్షిణాపథముపై దండెత్తి వచ్చినప్పుడు త్రిలోచన పల్లవుఁడు వాని



నెదుర్కొని ఘోరసంగ్రామమును సలిపి యోడిపోయెను. చాళుక్యులకు విజయము కలిగెను గాని విజయాదిత్యుఁడు యుద్ధములోఁ జంపఁబడియెను. ఈ యుద్ధము కడపమండలములో నెచ్చటనో జరిగియుండును. విజయాదిత్యుని భార్య గర్భవతిగానుండి ముదివేమగ్రహారమున విష్ణుభట్ట సోమయాజి నింట దాగి యుండెను. ఈముదివేము కడపమండలములోని పెద్దముడియ మనుగ్రామమేయని జయంతి రామయ్యపంతులుగారు నిర్ధారణచేసి యున్నారు. త్రిలోచన పల్లవుని వంశకర్తనుగాఁ జెప్పుకొనిన రాజవంశములు పెక్కులుగలవు. కరికాలుఁడను చోడరాజు త్రిలోచన పల్లవుఁడు తనకు సామంతరాజుగ నుండెనని చెప్పుకొని యున్నాఁడు. మఱియు నాతఁడు కాంచీపురమును సువర్ణములోఁ బ్రకాశింపఁ జేసెనని చెప్పఁబడియుండెను. నిజముగాఁ ద్రిలోచన పల్లవుఁడను నొకరాజుండిన యెడల నాతఁడు కాంచీపురము రాజధానిగ నాంధ్రదేశము లోని కొంతభాగమును బరిపాలించియుండి యుండును.

## నవీనకదంబులు - మయూరశర్మ.

ప్రాచీనపల్లవులు పాలించినదేశ మాంధ్రదేశముగా నుండినది. ఇప్పటి గోదావరి, కృష్ణ, గుంటూరు, నెల్లూరు, కడప, కందనోలు (కర్నూలు), అనంతపురము, బళ్లారి మండలము లాకాలమునఁ బల్లవరాష్ట్రములలోనివిగ నున్నవి. మొట్టమొదట బ్రాహ్మణులుగానుండిన వనవాసి (Banavasi) కదంబులు పల్లవుల యధికారమును ధిక్కరింపఁ బ్రయత్నించిరి. మయూరశర్మయనుబ్రాహ్మణుఁడే నవీనకదంబ వంశమునకు మూలపురుషుఁడుగ నుండెను. ఈమయూరశర్మ విద్యాభ్యాసము నిమిత్తము పల్లవరాజధానికిఁ బోయియుండెను. ఒకనాఁ డొక పల్లవాశ్వికునితో మయూరశర్మకు ఘోరమైన పోరాటము సంభవించెను. ఆ జగడమునకుఁ గారణమేమో, అదియెట్లు పర్యవసించెనో చెప్పఁబడియుండలేదు. ఒకనాఁడు మయూరశర్మ "అయ్యో! ఈ కలియుగములో

1 Annual Report on Epigraphy for 1905-1906 part II para 15.

బ్రాహ్మణులు క్షత్రియులకంటె బలహీనులుగా నుండవలసి వచ్చెను గదా! క్రమముగా గురుకులమును సేవించి యేకాగ్రచిత్తముతో స్వశాఖావేదము నభ్యసించినవాఁడు పుణ్యసిద్ధికై రాజానుగ్రహమునకుఁ బాత్రుఁడు గావలయునేని ఇంతకన్న దుఃఖకరమైన విషయము మఱియేమి కలదు?'' అని తనలోఁ దాను వితర్కించుకొనియెను. ఇట్టి వితర్కముతో మయూరశర్మ నిలిచియుండలేదు. అతఁడు తన తలంపుల నాచరణమునకుఁ దేఁబూనెను. మున్ను దర్భలను, సమిథలను, పెద్దగరిటెను, కరఁగిన వెన్నగల యాహుతిపాత్రను జమత్కారముగఁ బట్టుకొనఁ గలిగిన హస్తముతో భూమిని జయింపఁగోరి మండుచున్న కత్తిని వరలోనుండి పైకిదీసెను.

పిమ్మట మయూరశర్మ పల్లవరాష్ట్రముయొక్క సరిహద్దులనుండు రక్షక సైన్యముల నతిక్రమించి శ్రీశైలద్వారములవఱకు వ్యాపించి చొఱనసాధ్యముకాని మహారణ్యమునంత నాక్రమించి మహాబాణుఁడు నాయకుడుగా నేర్పడిన రాజమండలినుండి సుంకములను జేపట్ట నారంభించెను. ఇట్లనుపమానపరాక్రమవిజృంభణముచే నొప్పుచుండిన బ్రాహ్మణ శత్రువును ద్వేషముతో నెదుర్కొనుట ప్రమాదకరమని యూహించి రాజ్యతంత్రజ్ఞుఁడయిన పల్లవరాజు వానిధైర్యసాహసములను గొనియాడుచు బలిమిచేఁగాక యుపాయముచే వశపఱచుకొని పశ్చిమ సముద్రతీరమునందు కొంతదేశము నొసంగి పరిపాలనము సేయఁబంపెను. అయిన నాబ్రాహ్మణయోధవరుని పరిపాలనానంతరము తత్సంతతివారు మాత్రము పల్లవులతోడి మైత్రిపాటింపక గర్భశత్రుత్వము నే వహించి పల్లవాధికారము నెదుర్కొనుచువచ్చిరి. కదంబులలో మృగేశవర్మయను వాఁడొకఁడు పల్లవుల కగ్నిహోత్రుఁడనని చాటుకొనియెను. రవివర్మయను మఱియొక కదంబరాజు కృష్ణవర్మ మొదలగు రాజులనుజయించుటయెగాక కాంచీపురాధీశ్వరుండును పల్లవరాజునగు చండదండుఁడను వానిని సింహాసనమునుండి తొలఁగంజేసెను. నానక్కాసపల్లవరాజొకఁడు కదంబుఁడగు కృష్ణవర్మ జయించెనని చెప్పఁబడియెను. ఈకదంబుల కాలమునుగూర్చి డాక్టరుఫ్లీటుగారు చర్చించుచు నాఱవ శతాబ్దములోని వారుగ నిర్ణయించి యున్నారు. ఈకదంబులకును. వీరికిఁ బూర్వము



నందు వనవాసి నగరమున మూడవశతాబ్దమునను నాలుగవశతాబ్దమునను బరిపాలించి కదంబులకు నెంతమాత్రమును సంబంధములేదు. మొదటికదంబులు జైనమతావలంబకులు. ఈకదంబులు బ్రాహ్మణులుకాని మయూరశర్మసంతతివారలు బ్రాహ్మణుల పట్టపుపేరగుశర్మ శబ్దమును విడిచి క్షత్రియుల పట్టపుపేరగు వర్మయనుదానిని తమనామములతోఁ జేర్చుకొనుటచేత క్షత్రియులుగానే పరిగణింపఁబడుచుండిరి.

## మఱియొక పల్లవవంశము.

గుంటూరు మండలములోని యమరావతీ పట్టణమున నొక శిలాశాసనము గలదు. [1]ఆ శిలాస్తంభము చెన్నపురిలోని మ్యూజియములో నుంచఁబడినది. ఈశాసన మాత్రాతిమీఁదను క్రిందినుండి పైకి వ్రాయఁబడియుండుట వింతగాఁ గనుపట్టకమానదు. అనఁగా శాసనమును క్రిందినుండి చదువుట ప్రారంభించవలయును. ఈశాసనమున నేడుగురు రాజులు పేర్కొనఁబడిరి. భరద్వాజ ద్రోణాశ్వత్థామలు పల్లవుని పూర్వికులుగాఁ జెప్పఁబడిరి. ఈపల్లవ వంశములోఁ జెప్పఁబడిన రాజులు కొందఱు నందివర్మపల్లవమల్లుని పూర్వికులలోఁ బేర్కొనఁబడియున్నారు. ఈ శాసనములోని పల్లవ రాజులలోఁ గడపటి వాఁడయిన రెండవ సింహవర్మ జయస్తంభమును నాటుటకై మేరు పర్వతమునకుఁ బోయినట్లుగఁ జెప్పఁబడి యుండెను. ఇతఁడు భాగీరథిని, గోదావరిని, కృష్ణవర్ణను దాటి ధాన్యకటకమునకు వచ్చి బౌద్ధాలయమును సందర్శించి బుద్ధధర్మమును వినెనని చెప్పఁబడినది. తక్కిన భాగము శిథిలమయి పోయినది. ఈ పల్లవరాజులెప్పటివారో యెక్కడ పరిపాలనము చేసిరో నిజము తెలియరాదు. ఈశాసనములోఁ బేర్కొనఁబడిన వంశము తక్కిన శాసనములలో నుదాహరింపఁ బడిన యేవంశమునకు సంబంధింపక యున్నది. అయినను ఈ శాసనములో నుగ్రవర్మయని యొకరాజు పేర్కొనఁ బడియున్నాఁడు. సముద్రగుప్తుడు దక్షిణదిగ్విజయ యాత్రకు వచ్చినప్పుడు పాలక్కడను బాలించు నుగ్రసేనుని జయిం

1 Madras Journal of Literature and Science 1886-87 p. 56.

చినట్లు చెప్పఁబడి యుండెను. ఈ వంశములో నాలవపురుషుఁడుగాఁ జెప్పఁబడిన యుగ్రవర్మయే యుగ్రసేనుఁడయిన యెడల నైదవశతాబ్దములోను కాక యుండిన నాలవశతాబ్దములోను వీరలుండి యుండుదురు.

## చాళుక్యులదండయాత్ర.

వాతాపినగరము రాజధానిగాఁజేసికొని యుత్తరకర్ణాటకమును దక్షిణ మహారాష్ట్రమును బరిపాలించుచుండిన చాళుక్యులు రెండవపులకేశివల్లభుని కాలమున నానాముఖముల విజృంభించి చుట్టుపట్లుగల దేశముల నాక్రమించుకొనుచు నాలవ శతాబ్దాంతమున నాంధ్రదేశముపై దండెత్తివచ్చిరి. ఆంధ్రదేశమంతయుఁ బలురాష్ట్రములుగానుండి వేర్వేఱు స్వతంత్ర రాజ్యములుగ నేర్పడి పెక్కండ్రు పల్లవరాజులచేఁ బరిపాలింపఁ బడుచు బరస్పరసహాయములేక గాఁబోలు బలహీనములయి సులభముగాఁ జాళుక్యులకు వశము లయ్యెను. చాళుక్యులకు లోఁబడనిపల్లవరాజులు కాంచీపురమునకుఁ దఱుమఁబడిరి. ఏడవ శతాబ్దాదిని చాళుక్యులాంధ్రదేశముయొక్క పశ్చిమోత్తర భాగములును ఈశాన్యప్రాగ్భాగముల నాక్రమించుకొనిరి. ఆంధ్రదేశముయొక్క దక్షిణ పశ్చిమభాగములను ఆంధ్రచోడులును మహాబాణులు నాక్రమించుకొనఁగా నింకఁ బల్లవులకుఁ గాంచీపుర ప్రాంతభూమిమాత్రము మిగిలెను. ఉత్తరమున దేశమును గోల్పోయినతోడనే పల్లవులు దక్షిణమునఁ జోళరాజ్య మాక్రమించుకొని పాండ్యచోళకేరళాదులతోడను పశ్చిమంబునఁ గదంబులతోడను గాంగులతోడను ఉత్తరంబున రాష్ట్రకూటులతోడను చాళుక్యులతోడను విధివిరామములేకుండ నహోరాత్రము లొకశతాబ్దము పోరాడిన విషయము చరిత్రమునందనుపమానమయినదిగ నున్నది. ఏడవశతాబ్దమునుండి కాంచీపురములోని పల్లవులకు నాంధ్రదేశముమీఁద నధికారములోలఁగిపోయి ద్రావిడదేశమునందే నిలిచిపోవుటచేతి వారిచరిత్రమంతగా మనకవసరములేకపోయినను చరిత్రములోని సంబంధము తెగి[illegible] నిలుపుటకై యొకింత సంగ్రహముగా నిటఁ దెలుపుచున్నారము.



## సింహవిష్ణువంశము.

(౫౭౫ మొదలుకొని ౭౮౦ వఱకు)

పశ్చిమచాళుక్యులు ౭౫౩ వ సంవత్సరమున రాష్ట్రకూటులచేఁ బదభ్రష్టులగు వఱకు చాళుక్యులును పల్లవులును సామాన్యముగా ఘోరయుద్ధములు సలుపుచునే యుండిరి. ఈకాలమునందు సింహవిష్ణువంశములోని రాజులు తొమ్మండ్రుగురు కాంచీపురమును బాలించుచుండిరి. వీరిలో మొదటివాఁడు సింహవిష్ణువు. ఇతఁడు ౫౭౫ వ సంవత్సరమునఁ బరిపాలనము చేయుచుండినట్లు దెలిసికొనఁబడినది. సింహవిష్ణువు సింహళరాజును పాండ్యచోళకేరళ రాజులనుజయించెను.

## మహేంద్రవర్మ.

(౬౦౦-౬౭౫)

సింహవిష్ణుకొడుకును వానితరువాత రాజ్యభారమును బూనినవాఁడు నైన యీమొదటి మహేంద్రవర్మ తిరుచనాపల్లి చెంగలుపట్టు, ఉత్తరార్కాడు జిల్లాలలోని కొండలను జెక్కించి దేవాలయముల నిర్మించి మహాబలిపురమనియెడి మామల్లపురములోని ప్రసిద్ధికెక్కిన సప్తగోపురములలో నొకకొన్నింటిని నిర్మించి తనపేరును శాశ్వతముగా నిలుపుకొనియెను. ఆర్కాడునకును ఆర్కోణమునకును, నడుమ మహేంద్రవాడియను పట్టణమును మహేంద్రుని కొలను నిర్మించెను. నేఁడు శిథిలములై పోయిన వానిచిహ్నములు మాత్రము గాన్పించుచున్నవి. ఈచెఱువుగట్టుమీఁద విష్ణునికంకితముచేయఁబడిన గుహాలయమొకటియుండెను. ఆనాఁటి రాజవర్గములోఁ బేరెన్నిక గాంచినవాఁడును బహుసమర్థుఁడును చాళుక్యుఁడుననగు రెండవపులకేశివల్లభుఁడు దండెత్తివచ్చి యీ మహేంద్రవర్మ మొదలగు పల్లవులనుజయించి వేంగిరాష్ట్రము నాక్ర

(1) Prof. Kielhorn (op. cit, p. 20)

మించుకొనియెను. మహేంద్రవర్మయు చాళుక్యులను గొన్ని యుద్ధములలో జయించెను.

## నరసింహావర్మ.

(౬౩౫-౬౭౫.)

మహేంద్రవర్మ తరువాత రాజ్యభారమునువహించిన నరసింహావర్మ కాలమునఁ బల్లవులయధికారము మిక్కిలివిజృంభించి యున్నతస్థితికివచ్చినది. వీనికి మొదటినరసింహావర్మయందురు. ఇతఁడు పల్లవులకుగర్భశత్రువై భయంకరుఁడుగానుండిన పశ్చిమచాళుక్యుండగు రెండవపులకేశివల్లభుని రాజధానియగు వాతాపినగరమును ముట్టడించి కైకొనియెను. ఆముట్టడికాలమున పులకేశివల్లభుఁడు మృతుఁడయ్యెననియెదరు. ఆదెబ్బతోఁ జాళుక్యులు ౧౩ సంవత్సరముల వఱకు నణఁగియుండిరి. పల్లవరాజగు నరసింహావర్మయధికారము దక్కనునకు మైసూరునకును వ్యాపించి నిరంకుశమైయుండెను. ఈ నరసింహావర్మ చాళుక్యులనుజయించి వాతాపినగరము కైకొన్నవిషయము వాతాపికి నిప్పటిపేరగు బాదామిలోని నరసింహావర్మశాసనమే వేనోళ్లఁజాటుచున్నది. నరసింహావర్మకు మహామల్లుఁడని బిరుదుగలదు. ఇతఁడిటీవల వాతాపికొండనరసింగపోతరాయలని పిలువంబడుచుండెను. ఈయుద్ధము క్రీస్తుశకము ౬౪౨ వ సంవత్సరమున జరిగియుండెనని నిశ్చయింపఁబడినది. ఈయుద్ధము సింహళదేశచరిత్రమగుమహావంశమునందుఁ బేర్కొనఁబడుటయె గాక తమిళపెరియపురాణమునందుఁగూడ సూచింపఁబడినది.

## రెండవమహేంద్రవర్మ

నరసింహావర్మతరువాత సింహాసనమునకువచ్చినవాఁడు మహేంద్రవర్మ ఈ రెండవ మహేంద్రవర్మకాలమున సహితము చాళుక్యులు తలయెత్తలేదు ఇతఁడును తండ్రివలెనె నిరంకుశముగఁ బరిపాలనముచేసియుండెను.



## పరమేశ్వరవర్మ.

ఇతఁడు రెండవమహేంద్ర వర్మకొడుకు; పరమేశ్వర వర్మయను పేరు వహించిన వారిలో నితఁడు మొదటివాఁడు. ఈ పరమేశ్వరవర్మ రాజ్యభారమును వహించి పరిపాలనము సేయుచుండినకాలమున పశ్చిమచాళుక్యరాజును రెండవపులకేశి వల్లభుని కుమారుఁడును నగు మొదటి విక్రమాదిత్యుఁడు ౬౫౫ వ సంవత్సరమున నదివఱకుఁ బల్లవులచే నాక్రమింపఁ బడిన తన దేశమును స్వాధీన పఱచుకొనుటకై కాంచీపురముపై దండెత్తివచ్చి పరమేశ్వరవర్మను నోడించి కాంచీపురమును కైకొనియెనని విక్రమాదిత్యుని శాసనము వలనఁ దెలియుచున్నది. అయినను తరువాత పరమేశ్వరవర్మ పెరువల నల్లూరను ప్రదేశమున విక్రమాదిత్యునితో ఘోరసంగ్రామమును సలిపి చాళుక్యుల నోడించినట్లుగ కురముగ్రామములోని పరమేశ్వరవర్మశాసనము దెలుపుచున్నది. ఎట్లయినను అదివఱకు పల్లవుల స్వాధీనములో నుండిన కందనోలు మండల మంతయుఁ గాని కొంతవఱకుఁగాని చాళుక్యుల స్వాధీనమై యుండెననుట వాస్తవము. చాళుక్య విక్రమాదిత్యుని తామ్రశాసనములు రెండును, విక్రమాదిత్యుని కొడుకు వినయాదిత్యుని శాసనములు రెండును మొత్తము నాలుగు శాసనములు చాళుక్యులవి యీమండలమునఁ గానంబడు చున్నవి.

## రాజసింహుఁడు లేక రెండవనరసింహావర్మ.

ఇతఁడు పరమేశ్వర వర్మకొడుకు; కాంచీపుర కైలాసనాథుని దేవాలయములో నడుమనుండిన రాజసింహేశ్వరుని గుడిని కట్టించినవాఁ డితఁడే.

## మూడవమహేంద్రవర్మ.

రాజసింహునియనంతరము సింహాసనమధిష్ఠించిన వానికుమారుఁడు మూడవమహేంద్రవర్మ తండ్రికాలమున పూర్తికాని దేవాలయపుంబనులను పూర్తికావించినవాఁడు. ఈయిరువురిరాజులనుగూర్చి చెప్పఁదగినవిశేషాంశములేవియునులేవు.

## రెండవపరమేశ్వరవర్మ

ఇతఁడు మూఁడవమహేంద్రవర్మ సోదరుఁడు. రాజసింహునికొడుకు. సోదరునికిఁ బిమ్మట రాజ్యభారమును వహించెను. ఇతఁడు కాంచీపురములోని వైకుంఠ పెరుమాళ్ల దేవాలయమును నిర్మించినవాఁడు. ఇయ్యది యొకశాసనములో పరమేశ్వర విష్ణుఘృతమని పిలువంబడియెను. తిరుమంగయాళ్వారు స్తోత్రములలో పరమెచ్చర విన్నగరమని పేర్కొనంబడియెను. ఈపరమేశ్వరవర్మ మరణానంతరము రాజవంశమునందు గృహకల్లోలము జనించి రాజ్యక్రాంతి సంభవించినట్లు గన్పట్టుచున్నది.

## నందివర్మపల్లవమల్లుఁడు.

పరమేశ్వర వర్మకుఁ బిమ్మట సింహాసనారోహణమునుగూర్చి వివాదము సంభవించినటుల కాసకుడితామ్ర శాసనమునందు సూచింపఁబడినది. పరమేశ్వర వర్మజ్ఞాతియగు నందివర్మ రాజ్యాధిపత్యము వహింపవలయునని ప్రజలెన్నికొనుటచేత నందివర్మ పల్లవ మల్లుఁడు సింహాసనమెక్కెను. నందివర్మ పల్లవమల్లుని ఉదయేంద్రము శాసనములో నందివర్మ సేనాధిపతియగు నుదయ చంద్రుఁడు స్వహస్తముతోఁ జిత్రమయుఁడను పల్లవరాజును జంపినట్లుగఁ జెప్పఁబడియుండుటచేత గృహకల్లోలవిషయము స్పష్టమగుచున్నది. పల్లవరాష్ట్రమునందు జనించిన కలవరమును మార్పును దూరమునుండి వీక్షించుచుండిన పశ్చిమ చాళుక్య రాజగు వినయాదిత్యుని మనుమఁడగు రెండవ విక్రమాదిత్యుఁడు తమకుఁ బ్రబల శత్రువులుగనుండిన పల్లవుల రూపడంచుటకదియె యదనని యూహించి యమేయబలములం గూర్చికొని తుండక విషయముపై దండెత్తివచ్చి తన్నెదుర్కొనిన నంది పోత వర్మను ఘోరసంగ్రామమున జయించి తఱిమి గొట్టెను. ఈరెండవ విక్రమాదిత్యుఁడు తరువాత కాంచీపురమును ప్రవేశించి పూర్వధర్మము ననుసరించి పట్టణమును నాశముచేయకుండుటయె గాక బ్రాహ్మణులకు బీదవారలకు దానధర్మములుసేయుటయె గాక కాంచీపురములోని కైలాసనాథునకుఁ బురాతననామమగు రాజసింహేశ్వరునకు పెక్కువేల



సువర్ణమును దానముచేసెను. కైలాసనాథుని దేవాలయపు స్తంభముమీఁద విక్రమాదిత్యుని శాసనము లిఖియింపఁబడినది. ఈవిక్రమాదిత్యుని దండయాత్ర పల్లవ రాజ్యాధికార విజృంభణమునకు మృత్యుప్రాయమయ్యెను. నందిపోతవర్మ బహుకాలము రాజ్య పరిపాలనము చేసినట్లుగఁ గన్పట్టుచున్నది.

## అపరాజితవర్మ.

నందిపోతవర్మకుఁ దరువాత అపరాజితవర్మ రాజ్యభారమును వహించి శ్రీపెరుంబీయముకడ పాండ్యరాజగు రెండవ వరగుణుని జయించెను గాని విధివశంబున నెనిమిదవ శతాబ్దాంతమున ఆదిత్యచోడునిచే జయింపఁబడియెను. ఈయుద్ధముతో పల్లవ రాజ్యాధికారము చోడుల వశమయ్యెను. పల్లవరాజులు చోడరాజులకు సామంతులయిరి. పల్లవులు చోడులచే జయింపఁబడినట్లుగనే పశ్చిమ చాళుక్యులు గూడ రాష్ట్రకూటులచే జయింపఁబడిరి. ఇట్లు పల్లవులయొక్కయు, పశ్చిమచాళుక్యులయొక్కయు ప్రభయంతయు నెనిమిదవశతాబ్దముతో తగ్గిపోయి రాష్ట్రకూటులయొక్కయు, చోడులయొక్కయు, వేంగిరాజులయిన పూర్వచాళుక్యులయొక్కయు ప్రభ వికసింపసాగెను. ఇట్లు తొమ్మిదవ శతాబ్దమునాటికి కాంచీపుర పల్లవరాష్ట్ర మంతరించిన మాత్రమున నింకఁ బల్లవరాష్ట్రములు లేవని భావింపరాదు. ఆంధ్ర ద్రావిడ కర్ణాటక దేశములయందు పల్లవులు వేర్వేఱు శాఖలవారు ప్రత్యేకరాష్ట్రములను గలిగియుండి పదుమూడవ శతాబ్దాంతమువఱకు పరిపాలనముసేయుచుండిరి. కాని వారల యధికారములు వారిభూములను దాటిపోయి యుండలేదు.

## హూయానుత్సాంగు.

క్రీస్తుశకము ౬౪౦ దవ సంవత్సర ప్రాంతమున జయసింహుఁడను పూర్వచాళుక్య రాజు వేంగిదేశమును, మొదటి నరసింహవర్మయను పల్లవరాజు కాంచీపురమునందును బరిపాలనముచేయుచుండ దక్షిణాపథదేశములను జూచుటకై చీనాదేశపు యాత్రికుఁడగు హూయానుత్సాంగు బయలువెడలి మొదట వేంగిపురమునకు వచ్చెను. వేంగీపురమును పింకిలో (Phing-ki-lo) అని పిలిచినాఁడు. ఈవేంగిదేశమునకు దక్షిణమున మహేంద్రములేక ధాన్యకటకదేశము కల

దని చెప్పియున్నాఁడు. భూమి సారవంతమైనదనియు, పలుపంటలు పండుచున్నవనియును, దేశమున నడవులు పెక్కులున్నవనియు, పట్టణములలో జనసంఖ్య తక్కువగ నున్నదనియు మనుష్యులు పచ్చన నలుపు గలిసిన చామనచాయ వర్ణముగలిగియున్నారనియు, ధైర్యసాహసములుగలిగి భయంకరులుగాఁ గన్పట్టినను విద్యాసక్తి కలవారుగా నుండిరని చెప్పియున్నాఁడు. బౌద్ధుల పురాతన సంఘారామములు శిథిలములై యున్నవనియును, నూఱు దేవాలయము లనేక శిష్యులను గలిగియుండఁగా బౌద్ధారామములు తొంబది మాత్రమె జనులచే నలంకరింపఁబడి యున్నవని చెప్పియున్నాఁడు. మఱియును ధాన్యకటకములోని బుద్ధుని గౌరవార్థముగాఁ గట్టఁబడిన రెండుసంఘారామములను పూర్వశైల సంఘారామమని, అపరశైలసంఘారామమని పేరుపెట్టియున్నాఁడు. మహాంధ్రదేశమునకు నైరుతిమూల నుండిన చోడదేశమునకుఁ (కడపమండలము) బోయెను. దేశము కొల్లపెట్టఁబడి యుండుటచేత మిక్కిలి తక్కువయిన జనసంఖ్య గలిగి యడవులచే నావరింపఁబడి క్రూరచిత్తులును దుష్ప్రవర్తకులయిన జనులతోఁ గూడియున్నదని నుడివియున్నాఁడు. ఈదేశమును చులియ (Chuliya) అనఁగా చోడదేశమని పిలిచియున్నాఁడు.

హానుత్సాంగు ఆంధ్రచోడదేశమునుండి కాంచీపురమునకుఁ బోయెను. కాంచీపురము రాజధానిగానుండిన దేశమును తాలోపిచ (Tha-lo-pi-cha) అనఁగా ద్రావిడదేశమని పేర్కొని యున్నాఁడు. భూమిసారవంతమై చక్కఁగ వ్యవసాయము చేయఁబడుచున్నదనియు, ధాన్యములు మొదలగుపంటలు సమృద్ధములుగా ఫలించుచున్నవనియును చెప్పియున్నాఁడు. రాజధానియగు కాంచీపురము ౫, ౬ మైళ్ళ విస్తీర్ణముగల పట్టణమనియును, దేశములో నూఱుబౌద్ధ సంఘారామములును పదివేలమంది బౌద్ధమతాచార్యులును గలరనియును, సింహళద్వీపవాసులవలెనె వీరిలోననేకులు స్థావిరవిద్యాలయమునకుఁ జేరిన మహాయానశాఖాసంబంధులనియును, హిందూ దేవాలయములు ౮౦ మాత్రమె కలవనియును, దక్షిణహిందూదేశముయొక్క దక్షిణభాగములలో వలెనె దిగంబర జైనసన్యాసులుకూడ వేనవేలుండిరనియును, హానుత్సాంగు పేర్కొని



యున్నాఁడు. ఇచ్చటిమనుజులు ధైర్యవంతులుగను సత్యసంధులుగను, విద్యాసక్తులుగ ఋజువర్తనులుగనుండిరని నుడివియున్నాఁడు. ఆకాలమునాటి బౌద్ధ సంఘారామములలో గొప్పదగు నాలందసంఘారామమున కధిపతిగా నుండి హానుత్సాంగునకు గురువుగానుండిన శిలాభద్రునకుఁ బూర్వికుఁడయి మహాతత్త్వ విచారకుఁడని ప్రఖ్యాతిగన్న ధర్మపాలునకు జన్మస్థానమగుటచేత కాంచీపురము బౌద్ధులకుఁ బుణ్యక్షేత్రముగ నుండెను.[1] ఆకారణముచేత నిచ్చట బౌద్ధమతాచార్యు లనేకులీపట్టణమును జూడవచ్చుచుందురు. మఱికొంద ఱిచ్చటనే నివసించుచుందురు. ఈతూర్పుతీరము నందంతటను మధ్యహిందూదేశములోని భాషనేమాటలాడుచున్నారని కూడవక్కాణించి యున్నాఁడు.

1 Beal, Records, ii, 228. 30; Life, pp 138. 40; Watters, ii, 226 8 It-sing, Records of the Buddhist Religion trans Takakusu; pp. XIX, lviii, 179, 181






## కాంచీపురము బ్రాహ్మణక్షేత్రము.

ఆకాలమునందు కాంచీపురము బౌద్ధులకు మాత్రమెగాక బ్రాహ్మణులకును ముఖ్యస్థానముగ నుండెను. వేదవేదాంగవిదులయిన బ్రాహ్మణోత్తము లనేకులు కాంచీపురమునుజేరి పల్లవరాజుల పోషకత్వమునఁ బరిషత్తులను వేదవిద్యాలయములను నెలకొల్పి స్వమతవ్యాప్తికై కృషిచేయుచు కృతార్థులగుచుండిరి. ఈవిషయము హూనుత్సాంగు వాక్యములవలనఁగూడ స్పష్టపడుచున్నది. ఇక్కడనుండి బ్రాహ్మణుల నేకులు పల్లవరాజులచే నగ్రహారములను సర్వమాన్యభూములనుబడసి బ్రాహ్మణులులేని దేశభాగములకుఁ బంపఁబడుచుండిరి. దేశములో బ్రాహ్మణేతర మతముల నవలంబించిన ప్రజలే విశేషముగానున్నను బ్రాహ్మణులు తమ విద్యాప్రభావముచే రాజుల నాకర్షించి కేవలము వైదికవృత్తులందు మాత్రమెగాక లౌకికవృత్తులయందును బ్రవేశించి మంత్రిత్వాధికారములను సహితముఁబొంది బ్రాహ్మణులను బ్రాహ్మణవృత్తులను గాపాడుచు సాధ్యమగునంతవఱకు మతాంతరులయిన ప్రజలతో వైరముఁబెట్టుకొనక జైన బౌద్ధమతాచార్యులపట్ల వైషమ్యమును బురికొల్పక సహనముగలిగి యొప్పియుండి జాగరూకులై మెలకువతో వర్తించుచుండుటచేత బ్రాహ్మణ మతాంకురము క్రమక్రమముగా బలపడి జనసామాన్యములో సహితమునాటుకొని వేళ్లుపాఱి మహావృక్షమై శాఖోపశాఖలతో విస్తరిల్లి వర్ధిల్లుటకు హేతువయ్యెను. అప్పటికి నద్వైతమత స్థాపనాచార్యుఁడగు శంకరుఁ డవతరించి యుండలేదు. అప్పటికి దక్షిణాపథమునందలి బ్రాహ్మణోత్తము లెల్లరును వేదవేదాంగ విద్యలను మాత్రమెగాక సమస్తశాస్త్రములఁ బరిశ్రమచేసి యభ్యసించినవారుగనుండిరి. ఇట్లార్య క్షత్రియులనిపించుకొనఁగోరిన పల్లవరాజపుత్త్రుల ప్రాపకమువలనఁ గ్రీస్తుశకము మూడవశతాబ్దమునుండి ప్రబలిన హిందూమతము పదునాల్గవ శతాబ్దమునాటికి దక్షిణాపథమున ముఖ్యముగా నాంధ్రదేశమున బౌద్ధజైన మతములను సంపూర్ణముగా మ్రింగివేసినది.

## జైనమతము.

ఆంధ్రదేశమున బహుశతాబ్దములకాలము జైనమతమువ్యాపించియుండు టవలన నిచ్చట జైనమతచరిత్రమునుగూర్చి కొంచెము చదువరులకు వినిపించుట

యావశ్యకముగాకపోదు. జైనమతస్థాపకుఁడయిన మహావీరుఁడు గౌతమబుద్ధునకు సమకాలీనుఁడనియును బంధువుఁడనియును జెప్పెదరు. ఇతఁడు మగధదేశములోని పాటలీపుత్రనగరమునకు నిరువదియేడు మైళ్లదూరముననున్న వైశాలియను పట్టణమున జనించెను. అప్పుడు రాజ్యము చేయువాఁడు రాజుగాక క్షత్రియకుటుంబములోని నాయకులనేకులు గలిసి రాజ్యపరిపాలనము సేయుచుండిరి. నాయకసత్తాకరాజ్యము (Oligarchical Republic) అనిపిలిచెదరు. ఈమహావీరుఁడట్టి క్షత్రియనాయకులలో "నతవంశ" జూఁడగు నొకనాయకునియొక్క కనిష్ఠపుత్త్రుఁడుగానుండెను. ఇతఁడు ముప్పదేండ్లప్రాయముననే పారసనాథు అను సన్న్యాసులలోఁ గలిసి రెండుసంవత్సరములు సంచారమును జేసినతరువాత స్వతంత్రమతమును స్థాపించి నలువదేండ్లవఱకు ధర్మబోధన సేయుచు నుత్తరదక్షిణమాగధములయందే మఠములఁగొన్నిటి నేర్పాటుచేసి క్రీస్తువునకుఁ బూర్వము ౪౯౦ దవ సంవత్సరములోఁ బరమపదముఁగాంచెను. ఈమతావలంబకులను మొదట నిర్గ్రంథులని పేర్కొనిరి. అనఁగా వీర లేగ్రంథముల నీశ్వరదత్తములని విశ్వసించువారు కారని యర్థము. ఈమతమువారి తమమతస్థాపకులను మహావీరునిగూడ "జిను" లని చెప్పినందున నీమతమున కిటీవల జైనమతమని పేరువచ్చినది. కొంతకాలము గడచిన తరువాత దిగంబరులనియు శ్వేతాంబరులనియు వీరలు రెండుతెగలుగ నేర్పడిరి. ఈమతము క్రమక్రమముగా దక్షిణమునకును వ్యాపించెను. అకలంకుఁడను జైనాచార్యుఁడొకఁడు కాంచీపురములో బౌద్ధుల నోడించి వెడలఁగొట్టెనఁట. జైనులు ద్రావిడకర్ణాటభాషలలో చక్కని యుద్గ్రంథములను వ్రాసిరి. ప్రస్తుతము హిందూదేశమున ౧౩లక్షల జైనులు మాత్రమున్నారు.

## జైనమతసిద్ధాంతములు.

౧ వేదములు పౌరుషేయములు; ౨ అహాఁగణుఁడను సర్వేశ్వరుఁడొకఁడుమాత్రము గలఁడుగాని సర్వశక్తిమంతుఁడయ్యును తటస్థునివలె నూరకుండును; ౩ మనసదాచరణదురాచరణలే మనలరక్షించుటకు శిక్షించుటకుఁ గారణములుగాని యీశ్వరుఁడు మనలనిష్టమువచ్చినట్లు రక్షించుటకు శిక్షించుటకుఁ గార



ణుఁడు గాఁడు ౪ సృష్టియు సృష్టిలోనిజీవులనాదులుగానవినాశమునుఁ జెందునవి కావు; ౫ ఈభూమికి దిగువ నేడునరకలోకములును, పైనఁబదునాలు దేవలోకములును గలవు; అన్నిటికినిఁ బైనఁ బదునేడవది ఆగమీంద్రలోకముగలదు; అచ్చటనే సర్వేశ్వరుఁడు నివసించుచుండును; పుణ్యాత్ములగువా రచ్చటికిఁ బోయెదరు. పాపాత్ములు నరకలోకములకుఁ బోయెదరు. ఇదివఱకు వెడలిపోయిన తీర్థంకరులను గురువులను పూజింపవలయును; ౬ అహింసాధర్మము నాచరణములోనికిఁ దీసికొనిరావలయును. అహింసయే వీరివ్రతములలోఁ బ్రధానమైనవ్రతముగానున్నది. జీవహింస కలుగునను భయముచేత వీరలు రాత్రిభోజనముఁ నుమాని సాయంకాలముననే భుజింతురు. వడియఁగట్టనినీరును ద్రాగరు. మొదట వీరికి జాతిభేదము లేకపోయినను ఇప్పటివారు జాతిభేదమును బాటించుచున్నారు.

## ఆంధ్రదేశమున జైనమతవ్యాపనము.

ఆంధ్రదేశమున నొకప్పుడు జైనమతము వ్యాపించియున్నదని చెప్పుటకు దృష్టాంతము లిప్పటికి ననేకములుగలవు. ఆంధ్రదేశమున నెచ్చటఁజూచినను జైనవిగ్రహములె గానంబడుచున్నవి. గోదావరి మండలములోని కాకినాడ తాలూకాలోనున్న ఆర్యవట్టమనుగ్రామము జైనవిగ్రహములను గలిగియుండి కొన్నిసమయములందుఁ జైనపాడని పిలువంబడుచున్నది. ఆవిగ్రహములే గొన్నిసన్న్యాసిదేవులను పేరుతో పిఠాపురము వీధులలో హిందువులచేఁ బూజింపఁబడుచున్నవి. అనావృష్టికాలమున నీవిగ్రహములకు నుత్సవము చేయఁబడును. అమలాపురము తాలూకా నేదునూరుగ్రామములోని విగ్రహములు మండలములోని యన్నిటికంటెను బెద్దవిగానున్నట్లు చెప్పఁబడుచున్నవి. ఇట్టి జైనవిగ్రహములు కొన్ని రామచంద్రపురము తాలూకాలోని కాజలూరు, ఎండమూరు, నీల మొదలగుగ్రామములలోను, పిఠాపురము తాలూకాలోని జల్లూరులోను, అమలాపురము తాలూకాలోని ఆత్రేయపురములోను, నగరము తాలూకాలోని తాటిపాకలోను, రామచంద్రపురము తాలూకాలోని దాక్షారామములోను గానుపించుచున్నవి. అమలాపురము నగరము తాలూకాలలోని పురాతనము లయినబావులు కొన్ని జైనబావులని పిలువంబడుచున్నవి

ఇట్లు గోదావరిమండలమున మాత్రమెగాక విశాఖపట్టణమండలమందును జైన స్థానము లనేకములుగలవు. జైనమతములలోఁబుట్టి పెరిఁగిన కృష్ణా గుంటూరు మండలములసంగతి చెప్పనక్కఱలేదు. ప్రతాపరుద్రుని కాలమువఱకు ధాన్యకటకము జైనులస్వాధీనమందే యుండెను. బౌద్ధమత మెంత క్షీణించిపోయినను ధాన్యకటకములో (ధరణికోట) బుద్ధదేవుడు పూజింపఁబడుచునే యుండెను.

## కుమారిలభట్టు.

ఆంధ్ర బ్రాహ్మణులు మొదటినుండియు వేదవిద్యాసంపన్నులై మహావిద్వాంసులై పేరెన్నిక గాంచినవారుగా నుండిరి. ఇప్పటికి నాంధ్రబ్రాహ్మణులు వేదపఠనమునందసమాన ప్రజ్ఞగలవారని డాక్టరు భాండార్కర్ మొదలగు విద్వాంసు లభిప్రాయము లిచ్చియున్నారు. వేదవేత్తలయి ప్రఖ్యాతిగాంచిన యాంధ్రబ్రాహ్మణులలో కుమారిలభట్టు మిక్కిలి ప్రముఖుఁడుగా నున్నాఁడు. ఇతఁ డేడవ శతాబ్దములోని విద్వాంసులలో మహా విద్వాంసుఁడుగా నుండెను. ఇతఁడు జైమిని సూత్రములకు భాష్యమును విరచించెను. ఈజైమిని సూత్రములలోని మతమునకే పూర్వ మీమాంసమతమని పేరు. ఇయ్యది కర్మప్రధానమైన వైదికమతమును బోధించును. కపిలుని సాంఖ్యతత్త్వము నాధారపఱచుకొని హేతువాదికములై నవీనతత్త్వమార్గముల బోధించుచు కర్మప్రధానమైన వైదికమతము నిరర్థకమైనదని నిరసించెడు జైన బౌద్ధమతముల ఖండించి కుమారిలభట్టు కర్మమార్గ ప్రధానమైన వైదిక ధర్మమును ప్రబలఁజేసెను. ఈకుమారిలభట్టునకు భట్టపాదుఁడను మఱియొక పేరుగలదు. ఈతఁడు వంగదేశీయుఁడని పాశ్చాత్యులు మొదలగువారు కొందఱు వ్రాసిరిగాని యితఁ డాంధ్రదేశీయుఁడని జైనుల గ్రంథమునందుఁ జెప్పఁబడియుండుటచేత నాంధ్రుఁడని విశ్వసింపవచ్చును. జినవిజయమను జైనగ్రంథమునం దీక్రిందిశ్లోకము గానంబడుచున్నది.

"శ్లో. ఆంధ్రోత్కలానాం సంయోగే పవిత్రే జయమంగలే
గ్రామే తస్మిన్ మహానద్యాం భట్టాచార్యః కుమారకః
ఆంధ్రజాతి స్త్రిత్రిరిస్తో మాతా చంద్రగుణాసతీ యజ్ఞేశ్వరః పితా యస్య.



మహావాదిర్మహాన్ ఘోరః శ్రుతీనాం చాభిమానవాన్
జినానామంతకః సాక్షాత్ గురుద్వేష్టాతి పాపవాన్.

ఇతఁ డాంధ్రజాతివాఁడనియును, తైత్తిరీయశాఖవాఁడనియును, ఈతనితండ్రి పేరు యజ్ఞేశ్వర భట్టనియును, ఈతని తల్లి పేరు చంద్రగుణాయనియును, ఈతఁ డాంధ్రోత్కల సంయోగప్రదేశమనఁగా నిప్పటి గంజాము జిల్లాలో జయమంగలమను గ్రామమునందు జనించెననియును పైశ్లోకముయొక్క భావమై యున్నది. జైనులు తమ మత గ్రంథముల నితరులకుఁ జూపనందునఁ బూర్వాచార పరాయణుఁడైన యీమహా విద్వాంసుఁడు జైనవేషము వేసికొని జినాచార్యులవద్ద నాజైన ధర్మతత్త్వములను నేర్చుకొని తరువాత జైనమత ఖండనముఁ జేసినందున జైను లీతనిని గురుద్రోహియనియు, పాపుఁడనియును నిందించెదరు. ఇతఁడు మహావాదియని వీని ప్రతిపక్షులయిన జైనులే యొప్పుకొనిరి. మఱియు నీతఁడు మేదినీపురరాజయిన సుధన్వుని శిష్యునిగఁ జేసికొని వానిచే బౌద్ధజైనుల ననేకులఁ జంపించెనని చెప్పెదరుకాని అది వాస్తవమైనను గాకపోయినను జైన బౌద్ధమతములడుగంటుటకు నితఁడు కొంతవఱకుఁ గారకుఁడని చెప్పవచ్చును. జైమిని కృత మీమాంసపై నితఁడు వ్రాసినభాష్యములో వర్ణింపఁబడిన సాంప్రదాయమునకు భాట్టమతమని పేరుకలదు. వేదములో వర్ణింపఁబడిన యజ్ఞ యాగాదికర్మలు చేయుటవలన ముక్తి కలుగునని కుమారిలభట్టు యొక్క సిద్ధాంతమై యున్నదిగనుక నితఁడు కర్మమార్గవాదియని యుత్తరమీమాంసకు లనియెదరు. కుమారిలభట్టు రెండుశతాబ్దములకుఁ బూర్వమే బౌద్ధజైనులపై దండెత్తి వాగ్యుద్ధములను సలుపుటవలన శంకరాచార్యునికి మార్గము సులభమయ్యెను.

## బ్రాహ్మణులు-సముద్రయానము.

(క్రీ. శ. ౪౦౫-౪౧౧).

అయిదవ శతాబ్దారంభమున చీనాదేశస్థుఁడగు "ఫాహియాన్" అను యాత్రికుఁడొకఁడు బౌద్ధక్షేత్రములను సందర్శించుటకును, బౌద్ధధర్మగ్రంథము

నభ్యసించు నిమిత్తమును హిందూదేశమునకు వచ్చియుండి యాఱుసంవత్సరములు దేశసంచారము చేసి హిందూదేశముయొక్క యాకాలపుస్థితిని గొంత వ్రాసిపెట్టినాఁడు. ఇతఁడు హిందూదేశమంతయుఁ దిరిగిచూచిన తరువాత తామ్రలిప్తనగరమున నోడయెక్కి బహుదినములు ప్రయాణముచేసి సింహళద్వీపమునకుఁ బోయి యచ్చట కొంతకాలము నివసించియుండి పిమ్మట వర్తకులదైన యొకయోడ నెక్కి తొంబదిదినములకు జావాద్వీపమును బ్రవేశించెను. ఇన్నిదినములు ప్రయాణముచేయుటకుఁ గారణమును దెలిపియున్నాఁడు. ఇతఁడెక్కిన యోడలో రెండువందల బాటసారులు గలరు. మార్గమధ్యమునం దొకగొప్ప తుపానుపట్టుట సంభవించెను. ఓడకొక చిన్నరంధ్రముగూడ పడెను. ఓడలోని సరకులను సముద్రములోఁ బాఱవేయవలసి వచ్చెను. తానుసంపాదించిన మతగ్రంథములను విగ్రహములను పటములను వర్తకులు సముద్రములోఁ బాఱవేయుదురేమో యని ఫాహియాన్ భయపడెను. అట్టిదేమియును తటస్థింపలేదు. కాని మూఢవిశ్వాసము గలిగిన బ్రాహ్మణులు కొందఱు తన్నుఁగూర్చి తమలోఁ దామిట్లని వితర్కించుకొనిరఁట. "ఈశ్రామణుఁడు మనతోఁగూడ నోడపై నుండుటచేత మనమదృష్టవిహీనులమై యీవిపత్తు పాలఁబడితిమి; ఒక్కనికొఱకు మనమందఱము చావరాదు; ఏద్వీపము మనకుఁగానంబడినను ఈభిక్షువును భూమిమీఁద విడిచిపెట్టి మనము పోవుదము." అయినను ఫాహియానుకు రక్షకుఁడుగానుండిన యాతఁడు వాని నొంటరిగ నేకాంతద్వీపమునఁ జనిపోవునట్లుగ దిగవిడిచిపోవుటకై సమ్మతింపక దృఢముగా వానిపక్షమున నిలిచియుండెనఁట! ఈయాత్రికుఁడు జావాద్వీపములో పాషండులును బ్రాహ్మణులును వర్ధిల్లుచుండిరని నుడివియున్నాఁడు. హిందువులు వర్తకముచేయుటకై యాంధ్రరాజులకాలముననే యచ్చటికిఁ బోవుచుండిరని యిదివఱకె వ్రాసియున్నారము. తరువాతను సహితము హిందువులు వర్తకముచేయుటకై యచ్చటికిఁ బోవుచుండిరి. ఫాహియాన్ బ్రాహ్మణులా ద్వీపమున నుండిరని వ్రాసిన విషయ మబద్ధముకాదు. నాల్గవశతాబ్దమువందు వేంగిరాజు లయిన పల్లవులు జావాసుమత్రాద్వీపములను జయించినట్లు గానంబడుచున్నది. జావాసుమత్రాదీవులలోఁ గొన్నిశాసనములు గానవచ్చుచున్నవి.



కళింగదేశముననుండు నాగరికత జావాసుమత్రాదీవులకు వ్యాపించెనని గాథలలోఁ జెప్పుకొనుటమాత్రముండెను గాని చాలకాలమువఱకుఁ బ్రత్యక్ష నిదర్శనమేమియుఁ గానరాకుండెను. ఇటీవల కాలధర్మమునొందిన కోహెన్ స్టువార్టుఁగారివలనఁ గనుఁగొనఁబడిన రెండుశాసనములవలన కాయి, జావా లిపుల యుత్పత్తియొక్క నిజతత్త్వము బోధపడినది. ఈరెండును సంస్కృతభాషలో వ్రాయఁబడినవి. వీనిలోనిలిపి వేంగిరాజుల ప్రాచీన శాసనములలోనిలిపిని బోలియున్నది. బెయిటన్‌జార్గునకు ననతిదూరమున నున్న జాంపియా, (Tjampea) జాంబో (Djam bo) అనుప్రదేశములలోని కొండలపై సంస్కృత శ్లోకములు మనోహరముగాఁ జెక్కఁబడియున్నవి. హిందూరాజుయొక్క పాదములను నీకొండలపై నీద్వీపములను జయించి నందుకుఁ గుర్తుగాఁ జెక్కఁబడినవని యూహింపఁబడుచున్నది. ఈమహాకార్యమును నిర్వహించినది పూర్ణవర్మ యనిపేరుఁ దెలుపఁబడినది. ఈశాసనములను బోలిన మఱియొక శాసనము జెబాన్‌కోపి (Xebon Kopi) అనుప్రదేశమునఁ గానవచ్చుచున్నది గాని స్పష్టముగఁ దెలియరాకుండ విశేషభాగము శిథిలమయియున్నది. ఈమూఁడుశాసనములు సుండాదీవులలో మిక్కిలి పురాతనము లయినవిగఁ గన్పట్టుచున్నవి.

కాఁబట్టి శాసనపరిశోధకుల యభిప్రాయము ప్రకారము పూర్ణవర్మ కళింగమును, వేంగిని, కాంచీపురమును బాలించిన పల్లవులలోనివాఁడై యుండవలయునని బోధపడుచున్నది. ప్రాచీనవేంగిపల్లవశాసనములలిపిని బోలియుండుటచేత నైదవశతాబ్దమున కీవలివాఁడుగాఁడని చెప్పవలసియుండును. ఆకాలమునందలి పల్లవులందఱు నొక్కకూటములోని వారేగాని యన్యులు గారని డాక్టరు బర్నెలుగారు సహితము నుడువుచునేయున్నారు. కాంచీపురమును బాలించిన ప్రాచీనపల్లవుల దేశములో విశేషభాగ మాంధ్రదేశముగానే యుండుటచేతఁ బూర్ణవర్మ యాంధ్రదేశములోనివాఁడేయనియు, వానితో జావాద్వీపమునకుఁబోయిన బ్రాహ్మణు లాంధ్రద్రావిడబ్రాహ్మణులై యుందురనియు జెప్పవచ్చును. సుమత్రా జావాద్వీపములలోని క్లింగులను వారు కళింగదేశమునుండివచ్చిన తెలుఁగువాండ్రని పెక్కండ్రు చరిత్రకారులు తలంచుచుండఁగా

డాక్టరు బర్నెలుగారు ఉత్తరద్రవిడదేశతీరమునుండివచ్చిన ద్రమిళులని యభిప్రాయపడుచున్నారు. ఇప్పటి ద్రమిళులు సుమత్రాద్వీపమునందు విశేషముగానున్నను ప్రాచీనక్లింగులు కళింగదేశమునుండి వచ్చినవారని యూహించుటకు క్లింగుశబ్దము కళింగశబ్దమునుండి పుట్టినదని సూచించుటయె ప్రబలాధారముగానున్నది. ఏదియెట్లున్నను పల్లవులకాలమునఁ దూర్పుతీరమునకును సుమత్రా జావా ద్వీపములకును వర్తకవ్యాపారము విశేషముగా జరుగుచుండెననియు, ఈరెండుదేశములనడుమ నోడలు నడుపఁబడుచుండెననియు, ఆంధ్రద్రావిడ బ్రాహ్మణులు సహితముఁ బరదేశగమనమును నౌకావిహారమును జేయుచుండిరనియును స్పష్టముగాఁ జెప్పవచ్చును. పూర్వమెనుబది తొంబదిదినములవఱకు సముద్రయానము చేయుచుండిన బ్రాహ్మణోత్తములసంతతివారు సముద్రయానము కూడదని నేఁడు వాదించుట వింతగాఁ గన్పట్టకమానదు అప్పటి బ్రాహ్మణుల యున్నతస్థితికిని ఇప్పటి వారి యవనతస్థితికిని గలకారణము తప్పక గోచరము గాకమానదు. సముద్రయానము కూడదనివాదించు బ్రాహ్మణులు తమ పూర్వుల వృత్తాంతమును జదువుకొని జ్ఞానవంతులయి దురాగ్రహమును విడిచిపెట్టి దేశాభివృద్ధి కడ్డుపడక హిందూమాతయొక్క అభ్యుదయపరంపరాభివృద్ధికై పరదేశములకుఁబోయి వచ్చినవారిని బాధింపక యాదరింతురుగాక.

## వైష్ణవమతము.

పల్లవులు నందిని తురాయిగను ఖట్వాంగమును టెక్కెముగ నవలంబించి సర్వసాధారణముగ శైవులుగనున్నను సంస్కృతశాసనములం బ్రకటించినవారిలోఁ గొందఱు వైష్ణవభక్తిపరాయణులుగనున్నట్లు గన్పట్టుచున్నది. కుమారవిష్ణువు, విష్ణుగోపవర్మ, సింహవిష్ణువు మొదలగు పేరులు వైష్ణవమతమును దెలుపునవియైయున్నవి. కుమారవిష్ణువు మొదలగు రాజులు విష్ణుపాదభక్తిరతులమయిన భాగవతులమని చెప్పుకొనుటయె వారు వైష్ణవమతావలంబకులని ధ్రువపడుచున్నది. ఈకాలమునందే వైష్ణవమత మున్నతస్థితికి వచ్చుచున్నదని యూహింపఁదగియున్నది. ప్రాచీనవైష్ణవాళ్వారులీకాలమునందే తలయెత్తిరని యూహింపఁదగియున్నది. ఈయాళ్వారులలో తిరుమలిశైయాళ్వారును



పల్లవరాజొకఁడు మొదట పరిభవించి తరువాత పశ్చాత్తప్తుఁడయ్యెనని యొక వైష్ణవగాథగలదు. ఆఱవశతాబ్దములోని పల్లవులుకొందఱు వైష్ణవమత మవలంబించినను మఱికొన్నిశతాబ్దములవఱకు విజృంభింపకయుండెను. ఇంతకంటెఁ బల్లవరాజులకాలమున వైష్ణవమతమునుగూర్చి చెప్పవలసిన విశేషచరిత్రాంశమేదియును గానరాదు.

## గాంగపల్లవులు.

పల్లవుల మహారాజ్యాధిపత్య మెప్పు డస్తమించినదో సరియైనకాలము దెలియరాదు గాని నందివర్మపల్లవమల్లుఁడే కడపటి వాఁడని విశ్వసింపఁబడుచుండుటచేత నెనిమిదవ శతాబ్దాంతముతోఁ బల్లవ సామ్రాజ్య మస్తమించినదని చెప్పఁదగియున్నది. ఇట్లెనిమిదవ శతాబ్దముతోఁ బల్లవ సామ్రాజ్య మంతరించినను ఆంధ్ర ద్రావిడ కర్ణాటకదేశములయందుఁ బల్లవరాజు లధికార పరిమితిగల చిన్నచిన్నరాజ్యముల కధిపతులై మఱికొన్ని శతాబ్దముల కాలమువఱకు దక్షిణ హిందూదేశమునందుఁ దమతమ పాత్రములను బ్రదర్శించుచునే యుండిరి. కడపటి పల్లవుల చారిత్రము సంగ్రహముగా నొకింత యిట వివరింతుము. ఈపల్లవకుటుంబములో నొకశాఖవారు కర్ణాటగాంగులతో సంబంధముగలవారమని దెలుపుకొనుచుఁ దొమ్మిదవ శతాబ్దాంతమువఱకు తొండైనాడులో విశేషభాగమును బరిపాలించుచు వచ్చిరి. ఇతర పల్లవులకును వీరికిని భేదము గన్పట్టుటకై వీరిని గాంగపల్లవు లనుచుండిరి. వీరలును భారద్వాజగోత్రులమనియును మహాభారతవీరుఁడైన యశ్వత్థామ సంతతి వారమనియుఁ జెప్పుకొనుచుండిరి. ఈ గాంగపల్లవరాజులలో విజయదంతివిక్రమవర్మ, విజయనందివిక్రమవర్మ, విజయనృపతుంగవిక్రమవర్మ, విజయాపరాజితవిక్రమవర్మ యనురాజులు ప్రముఖులుగాఁ గన్పట్టుచున్నారు. తక్కిన విజయనరసింహ విక్రమవర్మ, విజయస్కంద శిష్య విక్రమవర్మ, విజయేశ్వరవర్మ అనుమువ్వురు రాజులును పేరులనుబట్టి చూడఁగాఁ బైవారికి సంబంధించిన వారుగనే గన్పట్టుచున్నారు. ఈపై నుదాహరించిన గాంగపల్లవులలో నృపతుంగవిక్రమవర్మశాసనములు బహుభూములయందుఁ జెక్కులు వ్యాపించియుండుటచేత మిక్కిలి పరాక్రమ

వంతుఁడని యూహింపఁబడుచున్నాఁడు అపరాజిత విక్రమవర్మ కడపటివాఁడుగాఁ బరిగణింపఁ బడుచున్నాఁడు. కుంభకోణమునకు సమీపము నందుండిన శ్రీపెరుంబియమను ప్రదేశమున నితఁడు వరగుణుఁడను పాండ్యరాజు నోడించెను. తొమ్మిదవ శతాబ్దాంతమునందు ఆదిత్యుఁడను చోళరాజుచేత జయింపఁబడియెను. అంతటితో వీరి రాజ్యము చోడుల వశమయ్యెను. మైసూరుదేశములోని గాంగవాడి రాజులయిన పశ్చిమగాంగులును బాణులును గాంగపల్లవులకు లోఁబడినవారని చెప్పెదరు. బాణరాజులను గూర్చి ప్రత్యేకముగ వేఱొకప్రకరణమున వివరింతుము.

## మఱియొకపల్లవవంశము.

గాంగపల్లవులతోఁ గూడ మఱియొకపల్లవ వంశము తొండైనాడులోని మఱియొకభాగమును బరిపాలించుచుండెను. వీరు నందివర్మ పల్లవమల్లునివంశములోని వారమని చెప్పుకొనుచుండిరి. తిరువళిక్కేణిశాసనమునందు దంతివర్మ మహారాజు పేరుగానంబడుచున్నది. నాలాయిర ప్రబంధములోని వైరమేఘుఁడు తొండై యారునకు రాజని చెప్పఁబడియెను. తెల్లరేరిండ నందిపోతరాయని శాసనములు కాంచీపురములోను తంజావూరుమండలములోని కొన్నిగ్రామములలోను గానంబడుచున్నవి.పల్లవతిలక వంశమునకు సంబంధించిన నందిపోతరాయరను మఱియొక పల్లవరాజుగలఁడు.ఈరాజులకును గాంగపల్లవులకునుగల సంబంధము భావిపరిశోధనలవలనఁగాని గానరాదు. రాష్ట్రకూటరాజయిన మూడవ గోవిందరాజుచే జయింపఁబడిన దంతిగయను కాంచీపురాధీశ్వరుఁడు గాంగపల్లవ వంశములోనివాఁడో నందివర్మపల్లవ మల్లుని వంశములోని వాఁడోయైయుండవచ్చును.

## నలంబవాడిపల్లవవంశము.

కడప, కందనోలు, బల్లారి, అనంతపురమండలము లొకప్పుడు పల్లవరాష్ట్రములోఁ జేరియుండెనని యిదివఱకె తెలుపంబడియెను. పల్లవసామ్రాజ్యము విచ్ఛిన్నమైన తరువాత ౩౨౦౦౦ గల నలంబవాడి రాజ్యమేర్పడియెను.



ఈనలంబవాడి పల్లవరాజ్యములో నిప్పటి బల్లారిమండలములో నధికభాగమును మైసూరునకు త్తరభాగమును ఈశాన్యభాగమును జేరియుండినవి. ఈరాజ్యమునకు మొదట అనంతపుర మండలములోని హేమావతి రాజధానిగ నుండెను. అదియిప్పటి "పెంజేరు లేక హెంజేరు' 'అనుగ్రామముయొక్క ప్రాచీననామమైయున్నది. నలంబులుతా మీశ్వరవంశజులమనియు, త్రినయన పల్లవుని వంశము లోనివారమనియును జెప్పుకొనుచుండిరి. ఈత్రినయనపల్లవుఁడు విజయాదిత్యుఁడను చాళుక్యరాజువలన నోడింపఁబడిన త్రిలోచన పల్లవుఁడేయని నిర్దేశింపఁబడుచున్నాఁడు. ఈనలంబుల చరిత్రమును మైసూరు గెజటీరను గ్రంథమునందు రైసుదొరగారు కొంతవఱకుఁ దెలిపియున్నారు. ఈనలంబవాడి రాజవంశముయొక్క ప్రాచీన వృత్తాంతము తొమ్మిదవ శతాబ్దమునాటిదిగ నున్నది. బాణవంశమును నాశముఁజేసితినని బడాయిగొట్టుకొనిన మహేంద్రాధిరాజనలంబుని శిలాశాసనమొకటి సేలము మండలములోని ధర్మపురియందుఁ గనుగొనంబడినది. గాంగపల్లవులకాలములో పశువులను దొంగిలించెడివారని ద్రవిడచారిత్రములలో నలంబులు వర్ణింపఁబడియుండిరి. అట్టిగోగ్రహణములను గూర్చి తెలిపెడు రెండుశాసనము లుత్తరార్కాడు మండలములోని అంబూరుకడఁ గానిపించినవి. వేలూరునకు సమీపమునఁ గానిపించిన యొకశాసనములో "పల్లవమురారి"యనియెడి త్రిభువనాధీరనలంబుని పేరుగానవచ్చుచున్నది.నలంబవాడిదాటి వీరియధికార మెంతవఱకువ్యాపించెనో పైశాసనములంబట్టియె గోచరముకాఁగలదు. పశ్చిమగాంగరాజగు రెండవమారసింహుఁడు (క్రీ. శ. ౯౬౩ మొదలుకొని ౯౭౪ వఱకు) నలంబులనాశముఁజేసినట్లుగ గరువముతోఁ జెప్పుకొనియెను. చోడరాజగు మొదటిరాజరాజు (౯౮౫ మొదలుకొని ౧౦౧౩ వఱకు) నలంబపాడిని జయించినట్లుగఁ జెప్పుకొనియున్నాఁడు. చాళుక్యులు కళ్యాణిపురమునఁ బరిపాలనము చేయుచున్న కాలమునందు నలంబరాజులకు బల్లారిమండలములోని కంపిలియను పట్టణము రాజధానిగ నున్నట్లు గన్పట్టుచున్నది. ఆభాగమున క్రీస్తుశకము ౧౩ వ శతాబ్దమువఱకు పల్లవులు గొంతవఱ కధికారమును గలిగియుండిరని శాసనములనుండి సాక్ష్యమును జూపవచ్చును.

## ద్రావిడపల్లవులు.

తొమ్మిదవ శతాబ్దమున గాంగపల్లవు లాదిత్యచోడునిచేజయింపఁబడిన తరువాత ద్రావిడదేశములోని పల్లవులు చోడరాజులకడ నుద్యోగపదవులనువహించి వారలను గొలుచుచుండిరి. కళింగట్టుపారణియను ద్రవిడభాషాకావ్యములోఁ జెప్పినప్రకారము మొదటికులోత్తుంగ చోడునికాలములో (క్రీ. శ. ౧౦౭౦ మొదలుకొని ౧౧౧౮ వఱకు) కళింగదేశముమీఁదికి దండయాత్రవెడలిన కరుణాకర తొండైమానను రాజుపల్లవుఁడును చెంగలుపట్టు మండలములోని వందలూరు సంస్థానాధిపతియునై యుండెను. విక్రమచోడుని క్రిందిరాజులలో తొండైమానురాజు మొదటివాఁడుగానుండెను. పండ్రెండవ శతాబ్దములో పాండ్యరాజ్యాధిపత్యమునుగుఱించి జరిగిన యుద్ధములో తొండైమానురాజు కులశేఖరుని పక్షమునఁ జేరెను. కారట్టట్టాంగు గ్రామములో నొకభాగమును బ్రాహ్మణులకుదానముచేసిన సామంతనారాయణుఁడను సంస్థానాధిపతి తంజావూరు శాసనములలో నొకదానిలో తొండైమానని పిలువంబడియెను. తొండైమానను పేరు క్రమక్రమముగాఁ బల్లవదేశమునుండి చోడదేశమునకుఁ బ్రాకినది. పల్లవరాజని బిరుదువహించి పుదుకోటను బాలించుతొండైమాను రాజుపల్లవులవంశమున జనించెనని తలంచుటకుఁ గారణముగలదు.

## త్రినయనపల్లవవంశము.

తాము త్రినయనపల్లవులవంశములోని వారమని చెప్పుకొనుచుండిన కొందఱు స్థానికరాజులయొక్క శాసనము లనేకము లాంధ్రదేశములోఁ గానంబడుచున్నవి. ఈత్రినయనపల్లవుఁడే ముక్కంటికాడువెట్టియని పిలువంబడుచున్నాఁడు. ఈరాజులును తాము భారద్వాజగోత్రులమని చెప్పుకొనియుండిరి. వీరును కాంచీపురమున కధిపతులుగనుండిరి. కాంచీపురము కామాక్షీదేవాలయములోని కామకోట్యాంబికకు భక్తులుగనుండిరి. వీరిశాసనములు కడప కందనోలు

(1) Journal of the Royal Asiatic Society, 1909; see notes on Archeological Exploration in India 1908-09 byMr. F. H. Marshall, p. 1084



నెల్లూరుమండలములలో ౧౩వశతాబ్దమువఱకును గానిపించుచున్నవి. వీరిచారిత్రములనిఁకమీఁదట రాఁబోవుప్రకరణముల వివరింతుము. ఆంధ్రదేశమును బాలించిన రెడ్లుకొందఱు పల్లవాదిత్యులమనియు, పల్లవత్రినేత్రులమనియు, బిరుదుపేరులు వహించుటచూడ వీరలకును బల్లవులకు సంబంధముకలదని చరిత్రకారులూహించుచున్నారు. వీనింగూర్చి వారలచరిత్రమును దెలుపుసందర్భమున వివరించి వ్రాయుదుము. కాంచీపురమును బాలించిన నందివర్మపల్లవమల్లునివంశములోఁ జేరిన కలివర్మకు చాళుక్యుఁడగు రెండవతాళరాజు వెలనాటిసీమలో నొకగ్రామమును దానముచేసెనని తాళరాజు శాసనమువలన ధ్రువపడుచున్నది. ఇయ్యది నందివర్మపల్లవమల్లుని వంశములోని యొకకుటుంబమువా రాంధ్రదేశమున స్థిరముగా నిలిచిపోయిరని చెప్పుటకు ప్రత్యక్ష ప్రమాణముగా నున్నది.

ఆంధ్రద్రావిడ దేశములలోని పల్లె తెగవారును మఱికొన్ని తెగలవారును తాము వహ్నికుల క్షత్రియుల మనియును, పల్లవరాజుల సంతతివారమనియును జెప్పుకొనుచున్నారు.



(1) Journal of the Royal Asiatic Society, 1909; see Notes on Archeological Exploration in India 1908-09 by Mr. F. H. Marshall p. 1084.

పదుమూడవ ప్రకరణము.

# ఆంధ్ర చాళుక్యులు.



(క్రీ. శ. ౭ వ శతాబ్దము మొదలుకొని ౧౩ వ శతాబ్దమువఱకు.)

ఏడవశతాబ్దారంభమునఁ జాళుక్యు లాంధ్రదేశముపై దండెత్తివచ్చి పల్లవరాజులను జయించి దేశమును స్వాధీనముపఱచుకొని నాఁటనుండి వేంగిదేశమును బరిపాలింపఁగడంగిరని పూర్వప్రకరణమునఁ దెలిపి యుంటిమి. "ఈ చాళుక్యులెవ్వరు? ఎచ్చటనుండి వచ్చినవారు? వీరియుదంత మేమి?" అని చదువరులు ప్రశ్నింపవచ్చును. కాఁబట్టి యాంధ్రచాళుక్యుల చరిత్రముం దెలిసికొనుటకుఁ బూర్వము వారి పూర్వుల రాజ్యక్రమము సంక్షిప్తముగా నిందు దెలుపుట యనావశ్యకముగాదు. చాళుక్యుల జన్మాదిక కథన మంతయుఁ గల్పిత గాథలలో నిమిడియున్నది. అయిన నవియె మనకు శరణ్యములుగానున్నవి. ఈకల్పిత గాథలు గ్రంథములలోనికిని శాసనములలోనికిని గూడ నెగఁబ్రాకినవి. బిల్హణకవి విరచితమైన విక్రమాంక దేవచరిత్రమునందు చాళుక్యుల జన్మకథనము కొంత వివరింపఁబడినది. ఒకప్పుడు బ్రహ్మదేవుఁడు ప్రాతఃకాల కృత్యంబుల నిర్వర్తించుచుండ నచ్చటికి నింద్రుఁడు చనుదెంచి ప్రపంచముననే మనుష్యుఁడును యజ్ఞయాగాదిక్రతువుల నాచరించి దేవతలకు; హవిర్భాగంబుల నొసంగకుండుటం జేసి పాపము వర్ధిల్లుచున్నదని మొఱవెట్టుకొని యెనఁట! అంతట బ్రహ్మదేవుఁ డర్ఘ్యమిడు నిమిత్తముదకమునకై పట్టి యుండిన తన చులుకము (పుడిసిలి) జేసి చూచెనఁట! అంతటాచులుకమునుండి మహాయోధుఁ డొకఁడు జనించి చాళుక్యవంశమునకుఁ గర్తయయ్యెనఁట! తరువాత మఱికొంతకాలమునకు నావంశమునందు హారితుఁడు మానవ్యుఁడు నను నిరువురు మహావీరులు జనించి జగద్విఖ్యాత కీర్తిఁ గాంచిరి. వీరి మొదటి రాజధాని అయోధ్యానగరముగా నుండె



నఁట! పిమ్మట నీవంశములో నొకశాఖవారు దక్షిణాపథమునకు వచ్చిరఁట! ఈవిక్రమాంక దేవచరిత్రము విక్రమాంక దేవుఁడను నామాంతరముగల పశ్చిమ చాళుక్య రాజయిన యాఱవ విక్రమాదిత్యుని చరిత్రమును దెలుపునదియై యున్నది. ఆంధ్రచాళుక్యులగు విమలాదిత్యుఁడు, రాజరాజనరేంద్రుఁడు, విక్రమచోడుఁడు మొదలగువారు ప్రకటించిన శాసనములలో నీగాథయె కొంతమార్పుతోఁ బ్రకటింపఁబడినది. విజయాదిత్యుఁ డయోధ్యానగరమునుండి దక్షిణాపథము మీఁద దాడివెడలివచ్చి యీదేశమును బరిపాలించుచుండిన త్రిలోచన పల్లవునితో యుద్ధముచేసి రణనిహతుఁడైనట్లును, పతివెంట వచ్చిన యాతనిపట్టమహిషి గర్భవతియై యుండి యా యాపత్సమయములోఁ బురోహితునిఁ గొందఱు పరిచారికలను వెంటఁగొని ముదివేమని యెడి యగ్రహారమునకుఁ దప్పించుకొని పోఁగా విష్ణుభట్ట సోమయాజియను బ్రాహ్మణుఁ డామె నాదరించి తన గృహమున నుంచుకొని తాను గన్నకూఁతునువలె జూచి యామె గర్భమునఁ బుట్టినమగపిల్లవానికి క్షత్రియోచితములయిన జాతకర్మాది సంస్కారములు నడిపి విష్ణువర్ధనుఁడని పేరుపెట్టి పెంచినట్లును, అతఁడు ప్రాయము వచ్చినవెనుక తన తల్లివలన సర్వవృత్తాంతమును దెలిసికొని చళుక్య పర్వతమునకుఁ బోయి తపస్సునేసి తనతండ్రి రాజ్యమును వహించి కదంబులను గాంగులను జయించి నర్మద మొదలుకొని సేతువువఱకు నున్న యేడుకోట్ల యేఁబదిలక్షల గ్రామములు గల దేశమునంతయును బరిపాలించినట్లును పైశాసనములలోఁ జెప్పఁబడియున్నది. నాఁటనుండియు చాళుక్యరాజులకు విష్ణువర్ధనుఁడను పేరు పరంపరగా వచ్చుచుండెను. చాళుక్యుల తామ్రశాసనములలో ; మొదట వీరు మానవ్యగోత్రులనియును, హారితి పుత్త్రులనియునుఁ దెలుపంబడియుండెను. వారలు సప్తమాతృకల రక్షణముగలిగి కార్త్తికేయానుగ్రహమున నభ్యుదయమును గాంచిరి. వారు నారాయణానుగ్రహముచే వరాహధ్వజమును బడసి యాధ్వజము నీడనుండి అనేకరాజులను వశపఱచుకొనిరి. ఆఱవశతాబ్దమున మొట్టమొదట జయసింహుఁడను రాజు రాష్ట్రకూట రాజయిన కృష్ణుని కుమారుఁడగు నింద్రుని నుక్కడంచి రాజ్యమును స్థాపించి చాళుక్యవంశ కర్తయయ్యెనని యేవూరు మిథా

శాసనములవలనఁ దెలియుచున్నది. [1] దక్షిణదేశములఁ బాలించిన చాళుక్యరాజులలో మొదటివాఁడు జయసింహుఁడు. విష్ణుశర్మచేత సంరక్షింపఁబడి చళుక్యపర్వతమున గౌరిని గూర్చి తపస్సుచేసి సేనలను గూర్చికొని వచ్చి దక్షిణహిందూస్థానమునంతను జయించెనని చెప్పఁబడిన విజయాదిత్యతనూభవుండగు విష్ణువర్ధనుఁడు తాను పొందిన జయములను బట్టి జయసింహుఁడను బిరుదు నామమును బొందినట్లు కనఁబడుచున్నది.

## ఒకచిత్రమైన సంబంధము.

ఆంధ్రసామ్రాజ్యమునకు లోఁబడి క్రీస్తుశకము రెండవశతాబ్దమున హారితిపుత్ర శాతకర్ణియను నాంధ్రరాజు కర్ణాటకమును బాలించుచుండెననియును వానికి వనవాసి (Banavasi) రాజధానిగ నుండెననియు నింతకుఁ బూర్వము దెలిసికొనియుంటిమి. తరువాత నాదేశము గాంగులకును పల్లవులకు నటుపిమ్మట కదంబులకును స్వాధీనమై నాలవశతాబ్దాంతము వఱకును వారలచేఁ బరిపాలింపఁబడియెను. ఈప్రాచీన కదంబులు జైనమతావలంబకులుగ నుండిరి. మఱియు వీరలు మానవ్యగోత్రుల మనియు హారితిపుత్రులమనియును జెప్పుకొనిరి, [1] కదంబులకుఁ దరువాత నుత్తర కర్ణాటకమునకు రాష్ట్రకూటులు ప్రభువులయిరి. ఆఱవశతాబ్దాదిని చాళుక్యుఁడయిన జయసింహుఁడు కర్ణాటకమును బాలించెడి రాష్ట్రకూట రాజయిన కృష్ణుని కుమారుఁడగు నింద్రుని నణఁచి రాజ్యమాక్రమించుకొనియెనని యేపూరు మిరాజుశాసనములు చాటుచున్నవని పైని జెప్పియుంటిమి. ఈచాళుక్యులును తాము మానవ్యగోత్రులమనియును హారితిపుత్రులమనియును జెప్పుకొనిరి. వీరిలోనుండి మఱియొకశాఖగాఁ జీలి యాంధ్రదేశమును బాలించిన పూర్వచాళుక్యులునుగూడ తాము హారితిపుత్రుల మనియును మానవ్యగోత్రులమనియును జెప్పుకొనిరి. చాళుక్యుల శాసనములలోని గాథలో హారితిపుత్రులను పేరెట్లు వచ్చినదియుఁ దెలుపఁబడి యుండలేదు. ఒకశాసనమునందు హారితిపుత్రియనునది హారితపుత్రియని పేర్కొనఁబడినది. విక్రమాంక దేవ

1 Jour. R. A. S., Vol. II., III. IV.; Ind. Ant., Vol. Vii. p. 12.



చరిత్రమునఁ జాళుక్యవంశమున హారితుఁడు మానవ్యుఁడునను వీరులు జనించి ప్రసిద్ధులయిరని పేర్కొనఁబడియుండెను. ఆంధ్రభృత్య వంశములోఁ జేరిన "గోతమిపుత్రిశాతకర్ణి, వాసిష్ఠిపుత్రిశాతకర్ణి, మాధారిపుత్రిశకసేనుఁడు" అనువారి పేరులరీతిగానే హారితిపుత్రి శాతకర్ణియను పేరులోని హారితిశబ్దము స్త్రీవాచకమైయుండెను. హారితిశబ్దము హారితశబ్దముగామార్చుట చిత్రముగానున్నది చాళుక్యు లుత్తరముననున్న కాలమునఁగూడ హారితపుత్రులను పేరుగలిగియున్నట్లుగ విజయవర్మయొక్క కైరాశాసనము చాటుచున్నది. అలహాబాదు ప్రాంతముననున్న రీవాలోని యొకశాసనము మహీపాలుని నామమో లేక మఱియొకవిడిమనుజుని పేరో తెలియదుగాని హారితిపుత్రి శౌనకుఁడని యొకనామమును పేర్కొనుచున్నది. ఈశాసనము క్రీస్తునకు పూర్వము రెండవ శతాబ్దములోనిదిగ నొకరు చెప్పియున్నారుగాని డాక్టరు బర్గెస్సుగారంత పూర్వపు శాసనముగాదని యభిప్రాయపడియున్నారు. [1] ఈచిత్రమైన సంబంధమునుబట్టి చూడఁగాఁ జాళుక్యులు గూడ దక్షిణాపథములోని వారేగాని యయోధ్యనుండివచ్చిన వారుగారనియు, ఆంధ్రపల్లవ సంయోగమువలన జనించిన పల్లవులనియెడు సంకీర్ణజాతివలెనె ఆంధ్రశకసంయోగమువలన జనించిన యొక సంకీర్ణజాతిగా నుండనోపుననియు, ఇట్లు హిందూమతావలంబకులయిన పల్లవులును చాళుక్యులును తాము సంకీర్ణజాతులవారమని తెలియఁబడకుండఁ దమజాతిశ్రేష్ఠత్వము నిరూపించుటకై యార్యక్షత్రియులమని పౌరాణిక క్షత్రియవంశములతోఁ దమవంశములను బంధించి చంద్రవంశజులమని చెప్పుకొనసాగిరని మాయభిప్రాయము. పదునొకండవ శతాబ్దమునందలి చాళుక్యుల శాసనములలో మాత్రమె పౌరాణిక వంశవృక్షము గల్పింపఁబడినదిగాని యంతకుఁ బూర్వపు శాసనములలోఁ గానరాదు. పూర్వచాళుక్య శాసనములలో రణస్థిపూడి, కోరుమిల్లి చెల్లూరుశాసనములలోఁ బౌరాణిక వంశము వివరముగా వర్ణింపఁబడినది. ఈశాసనములలో రణస్థిపూడి శాసనము విమలాదిత్యునిచే వ్రాయింపఁబడినదిగావునఁ దక్కినవానికంటెఁ బూర్వమునం దుండినది. ఈశాసనమున

(1) Dr. Fleet's Karnrtic Dynasties. p 9

వ్రాసినవాఁడు భీమన భట్టను బ్రాహ్మణుఁడు గావునఁ బౌరాణిక వంశవృక్షమును మొదట గల్పించినవాఁ డితఁడేయై యుండవలయునని కొందఱు తలంచుచున్నారు.

## చాళుక్యవంశము.

### జయసింహావల్లభమహారాజు.

ఇతఁడు విజయాదిత్యుని కుమారుఁడనియు విష్ణుభట్ట సోమయాజివలనఁ బెంపఁ బడి విష్ణువర్ధనుఁడను నామమును వహించి యుక్తవయస్సువచ్చిన తరువాత చళుక్యపర్వతమునకుఁబోయి గౌరినిగూర్చి తపస్సునేసివచ్చి కొంతసేనను గూర్చుకొనిపోయి కదంబులను గాంగులను, రాష్ట్రకూటులను యుద్ధములలో నోడించి రాష్ట్రకూటరాజయిన యింద్రుని నుక్కడించి వానిరాజ్యమును గైకొని వాతాపినగరము రాజధానిగాఁ బరిపాలనముచేయ నారంభించెనని యిదివఱకె దెలిపియుంటిమి. ఈజయములవలననే యీతనికి జయసింహుఁడను బిరుదునామముగలిగినది. ఈజయసింహుఁడు కాంచీపురాధీశ్వరుండయిన పల్లవరాజు కొమార్తెను వివాహముఁ జేసికొని యామెవలన విజయాదిత్యుఁడను కుమారునిఁ గాంచెను.

### రణరాగుఁడు.

ఈవిజయాదిత్యుఁడు బహుపరాక్రమవంతుఁడై పరరాజులతో యుద్ధము లొనలుపుచు రణరాగుఁడను బిరుదమును గాంచెను. వీనికిఁ బులకేశివల్లభుఁడను కుమారుఁడు కలిగెను.

### శ్రీపులకేశివల్లభ మహారాజు.

ఇతఁడశ్వమేధాది యాగములఁ బెక్కింటి నాచరించి విశేషకీర్తి సంపన్నుఁడయ్యెను. మఱియును వాతాపి నగరమును పునర్నిర్మాణముఁ గావించి రాజధానిగఁ జేసికొని పరిపాలించెను. ఈచాళుక్యవంశమునఁ బ్రఖ్యాతిఁగాంచిన వారిలో మొదటివాఁ డీతఁడేయని తోఁచుచున్నది. వీనితరువాతి శాసనములన్నియు వీనిపేరులో వంశము వర్ణించుటకుఁ బ్రారంభించుచు వచ్చినవి. సత్యాశ్రయ



శ్రీపులకేశి వల్లభ మహారాజనునది వీని సంపూర్ణమైన బిరుదునామముగా నున్నది. వీనికుమారుఁడు కీర్తివర్మ మహీపాలుఁడుగా నుండెను.

### శ్రీకీర్తివర్మవల్లభమహారాజు.

ఇతఁడుత్తరకొంకణమును బాలించెడిమౌర్యులును, ఉత్తరకర్ణాటములోని వనవాసిని బాలించెడి కదంబులను జయించి ఖ్యాతిఁగాంచెను. వీనికి ''పులకేశి జయసింహుఁడు, విష్ణువర్ధనుఁడు'' అనుముగ్గురు కుమారులుండిరికాని కీర్తివర్మ మరణానంతరము వానిపుత్త్రులు మిక్కిలి పసివాండ్రుగనుండుటచేత కీర్తివర్మసోదరుఁడు మంగళేశుఁడు రాజ్యభారమును వహించి పరిపాలనము సేయుచుండెను.

### మంగళేశుఁడు.

ఇతఁడు రాజ్యమునకు వచ్చినతరువాత త్రిపురమును రాజధానిగా చేదిదేశమును బాలించుచుండిన కాలచుర్య లనురాజులను జయించెను. ఇతఁడుతన దిగ్విజయయాత్రలను పూర్వపశ్చిమసముద్రములవఱకుఁ బఱపెనని చెప్పుదురు. పశ్చిమసముద్రతీరమునందలి రేవతీద్వీపము నితఁడు వశముఁజేసికొనియెను. ఇతఁడు విష్ణ్వాలయములను నిర్మించి భూములొసంగి బ్రాహ్మణుల కనేకదానధర్మములనుగావించి పేరుపొంది యిరువదినాలుగు సంవత్సరములు పరిపాలనము చేసియుండెను. వీనితరువాత రాజ్యమునకు వచ్చినవాఁడు కీర్తివర్మ జ్యేష్ఠకుమారుఁడయిన పులకేశి. మంగళేశుఁడు తన తరువాత తనకుమారుఁడే రాజ్యపాలనము చేయుటకై రహస్యముగాఁ బ్రయత్నములు చేయుచుండుటను గనిపెట్టి యుక్తవయస్సువచ్చి మిక్కిలి సామర్థ్యము గలిగియుండిన పులకేశి వానిప్రయత్నముల నన్నిటిని భగ్నముగావించి రాజ్యాధికారమునంతను దాను బూని పరిపాలించుచుండెను. మంగళేశుఁడు తనకుమారునికిఁ బట్టముగట్టవలెనని చేయుచుండిన ప్రయత్నములో దనప్రాణములను రాజ్యమునుగూడ గోల్పోయెను.

### శ్రీపృథ్వీవల్లభమహారాజు.

ఇతఁడు శాలివాహనశకము ౫౩౩నకు సరియైన క్రీస్తుశకము ౬౧౧వ సంవత్సరమున సింహాసనమునకు వచ్చెనని యొకశాసనముబట్టి దెలియుచున్నది.

మంగళేశుని మరణానంతరము నదివఱకు మంగళేశుని పరాక్రమమునకు వెఱచి యణఁగియుండిన శత్రురాజులందఱును విజృంభించి పులకేశిపై దండెత్తిరి. ఆయుద్ధములలోఁ బులకేశియు వానిసైన్యములు నసమానాద్భుతశౌర్యపరాక్రమశక్తులను జూపుటచేతఁ గొందఱు పలాయనులయిరి. అధికశౌర్యవంతుఁడును రాష్ట్రకూటరాజును నగు గోవిందరాజు పులకేశిని శరణువేడెను. పులకేశి వానిని మిత్రునిగాఁ జేకొనివానికి ననేకబహుమానము లొసంగెను. పిమ్మట నాతఁడు వనవాసిని ముట్టడించి కదంబులనుజయించి వశపఱచుకొనియెను. చేరదేశమును బాలించుగాంగులు వశులయిరి. తరువాత కొంకణదేశములోని మౌర్యులపైదాడివెడలి వారిని సులభముగా లోఁబఱచుకొనియెను. నూఱుయోడలతో బయలుదేఱి సముద్రలక్ష్మియని పిలువంబడుచుండిన సముద్రతీరమునందలి పూరియనుపట్టణమును ముట్టడించెను. ఇది పూర్వము మౌర్యులకును దరువాత శిల్హారరాజులకును రాజధానిగనుండెను. తరువాత లాటమాళవఘూర్జరరాజులు వానిచే జయింపఁబడి కప్పములు గట్టుచుండిరి. ఇక్కాలమున నుత్తరహిందూదేశమున గన్యాకుబ్జము రాజధానిగఁ జేసికొని యుత్తరహిందూదేశమునంతనుజయించి సార్వభౌముఁడై యుండిన హర్షవర్ధనుఁడు దక్షిణదిగ్విజయయాత్రకు బయలువెడలినప్పుడు పులకేశి యెదుర్కొని వానిని క్రిందికిరానీయక వానిమనోరథమును భగ్నముగావించెను. అంతటినుండి పులకేశి రాజపరమేశ్వరుఁడన్న బిరుదాభిదానమును వహించెను. వీనిసంపూర్ణమైననామము సత్యాశ్రయ శ్రీపృథ్వీవల్లభ మహారాజనునదిగానుండెను. ఇతఁడు మహారాష్ట్రికములనియెడు మూడురాజ్యములకు ప్రభువయ్యెను. సర్వవిధముల చేతను చాళుక్యులలో బహుసమర్థుఁడుగా నుండెను.

## పూర్వదిగ్విజయయాత్ర.

ఇతఁడాఱవశతాబ్దాదిని బహుసేనలంగూర్చుకొనిపోయి దక్షిణకోసలమునుజయించి కళింగవేంగిదేశములపైదండెత్తివచ్చి మొట్టమొదట పిష్ఠపురమును ముట్టడించెను. ఈతని దండయాత్రలో నీసత్యాశ్రయ పులకేశివల్లభునికిఁ గనిష్ఠసోదరుఁడును యోధవరుఁడునగు విష్ణువర్ధనుఁడుగూడ నుండెను. ఆకాలమునందు



పిష్ఠపుర (Pithapuram) దుర్గము శత్రువులకు దుస్సాధ్యమైనదిగ నుండెను. ఈచాళుక్యులు పిష్ఠపురదుర్గమును ముట్టడించి స్వాధీనముఁజేసికొనిరి. ఇట్లు కళింగమును వేంగిని వశపఱచుకొని శ్రీసత్యాశ్రయ పృథ్వీవల్లభమహారాజు పల్లవనాయకుని కాంచీపురదుర్గములోఁదలదాచుకొనునట్లు చేసెనని అయిహోలె శాసనమునం జెప్పఁబడినది.[1] ఈశాసనములోని వాక్యమునుబట్టి పిష్ఠపురమును బాలించుచుండినది పల్లవులని తేటపడుచున్నది. ఈపులకేశి రెండవతమ్ముఁడయిన విష్ణువర్ధనుని దనకుఁ బ్రతినిధిగానుండి కళింగవేంగిదేశములను బరిపాలనము చేయవలసినదిగా నియమించి తనదేశమునకు వెడలిపోయెను. ఈవిష్ణువర్ధనుఁడే తరువాత స్వతంత్రుఁడై మొదటివిష్ణువర్ధనుఁడనుపేరుతో వేంగిరాష్ట్రమును బరిపాలించి పూర్వచాళుక్య వంశస్థాపకుఁడయ్యెను.

## ఆంధ్రచాళుక్యులు.

### కుబ్జవిష్ణువర్ధనమహారాజు.

(క్రీ. శ. ౬౧౫ మొదలుకొని ౬౩౩ వఱకు.)

ఆంధ్రచాళుక్యులలో మొదటివాఁడయిన యీవిష్ణువర్ధనుఁడు మఱుగుజ్జుగ నుండుటచేతను గాఁబోలు నీతనిని కుబ్జవిష్ణువర్ధనుఁ డందురు. ఆంధ్రదేశమును బాలించిన విష్ణువర్ధనులలో నితఁడు మొదటివాఁడు. ఇతఁడు మఱుగుజ్జువాఁడయినను మిక్కిలి ప్రజ్ఞావంతుఁడయిన శూరుఁడు. ఇతఁడు మొదట యువరాజుగనుండి మహారాష్ట్రదేశములోని సతారా పంఢరపురమండలములను బరిపాలించుచుండెను. భీమరథీతటమున నొకగ్రామమును బ్రాహ్మణులకు దానముచేసెనని తెలిపెడి దానశాసనమొకటి సతారాలోఁ గాన్పించినది.[2]

సత్యాశ్రయుఁడు కళింగమును వేంగినిజయించిన తరువాత పరిపాలకుఁడుగా నియమింపఁబడి స్వతంత్రుఁడై ౬౧౫ వ సంవత్సరమున చైత్ర శుద్ధపూర్ణిమ తరువాత మహారాజ పదవినిగాంచి ౬౩౩ వ సంవత్సరమువఱకును పదునెని

(1) Ind. Ant, Vol viii., p. 245; (2) Jour. B. B. R.A. S., Vol. II.. p. 11.

మిది సంవత్సరములు రాజ్యముచేసెను. ఇతఁడు విషమంబులై దుస్సాధ్యములుగనుండిన దుర్గమంబులను సాధించి మనోరథసిద్ధిని గాంచినవాఁడు గావున విషమసిద్ధియను బిరుదమును వహించినవాఁడు. ఈబిరుదమును వహించిన వారిలో నితఁడే మొదటివాఁడు. ఇతఁడు పిష్ఠపురము రాజధానిగాఁ జేసికొని కళింగ వేంగిదేశములను బరిపాలించినవాఁడు. వీనికి పుష్ఠపురము రాజధానిగ నున్నట్లు విశాఖపట్టణ మండలమున సర్వసిద్ధి తాలూకాలోని తిమ్మాపుర శాసనమువలన బోధపడుచున్నది. [1] ఈశాసనములోని రాజముద్రికలో శ్రీవిషమసిద్ధి యను పేరు గానంబడుచున్నది. ఈశాసనముయొక్క భాష సంస్కృతము. లిపి వేంగిలిపిగా నున్నది. ఈశాసనముయొక్క వైఖరి కళింగ గాంగులయిన యింద్రవర్మయొక్క అచ్యుతాపుర శాసనమును, దేవేంద్ర వర్మయొక్క శ్రీకాకుళ శాసనమును బోలి యున్నది. ఈశాసనమునం దితఁడు సత్యాశ్రయ వల్లభ మహారాజుయొక్క (రెండవ పులకేశి) ప్రియానుజుఁడనియు, కీర్తివర్మయొక్క ప్రియసుతుఁడనియును, రణ విక్రముని :(మొదటి పులకేశి) పౌత్రుఁడనియు, రణరాగుని (విజయాదిత్యుఁడు) ప్రపౌత్రుఁడనియుఁ జెప్పబడియుండెను. ఇంతియగాక వీనిశాసనములు మఱిరెండు గానుపించుచున్నవి. అందొకటి విశాఖపట్టణ మండలములోని చీపురు పల్లిశాసనముగానున్నది. ఈవిష్ణువర్ధనుఁడు దిమిల సీమలోని కలవకొండ గ్రామమును తనరాజ్యకాలముయొక్క పదునెనిమిదవ సంవత్సరమున శాలివాహనశకము ౫౫౫ శ్రావణ శుద్ధపూర్ణిమనాఁటి (క్రీస్తుశకము ౬౩౨ వ సంవత్సరము జూలయి నెల ౭ వ తేది) చంద్రగ్రహణ కాలమున విష్ణుశర్మ మాధవశర్మలను బ్రాహ్మణులకు దానముచేసెనని చెప్పఁబడినది. ఈదాన శాసనము పూ(కి)లేక పక్కి (పక్షి) రాష్ట్రములోని చెఱుపూరునుండి (చీపురుపల్లి) ప్రకటింపఁబడినది. [2] విశాఖపట్టణ మండలములో సర్వసిద్ధి తాలూకాలోని యెల్లమంచిలిగ్రామమునకు రెండున్నర మైళ్లదూరమున దిమిలయను గ్రామము పూర్వము

(1) No 574, public, 17th July 1908, 60-61

(2) Ind, Ant, Vol XX., p. 15 and 69; J. A. S. B XXXIX, 153-8



మిక్కిలి ప్రఖ్యాతికెక్కినదిగఁ గానిపించుచున్నది. ఈదిమిల ప్రాంతప్రదేశము దిమిలిసీమగా నేర్పడినది. [1] ఈవిషమసిద్ధి విష్ణువర్ధనుని మఱియొక శాసనము గుంటూరుమండలములోని చెజ్జరాలయను గ్రామమునందుఁ గానుపించినది. [2] ఈశాసనముల నన్నిటిని బరిశోధించిచూచిన నీతనిరాజ్యము గంజాముజిల్లా మొదలుకొని నెల్లూరివఱకును వ్యాపించియుండినటులఁ గన్పట్టుచున్నది. వీనిరాజ్యమునకు నుత్తరమున కళింగగాంగులును దక్షిణమునఁ గాంచీపురపల్లవులును, ఆంధ్రచోడులును, ఆంధ్రబాణులును, పశ్చిమంబునఁ బశ్చిమ చాళుక్యులును రాష్ట్రకూటులును బరిపాలనము సేయుచుండిరి. కుబ్జవిష్ణువర్ధనునితో నీదేశమునకుఁ బట్టవర్ధన వంశజుఁడయిన కాలకంపుఁడనువాఁడు వెంబడించివచ్చెను. ఇతఁడు విష్ణువర్ధనునకు దళవాయిగనుండెను. ఇతఁడు జైనుఁడుగఁ గన్పట్టుచున్నాఁడు. ఈదళవాయి దద్దరయను రాజును జయించెను. వీనిసంతతివారు చాళుక్యులకడ మంత్రులుగను సేనాధిపతులుగనుండి సమ్మానములను గాంచుచుండిరి.

## జయసింహవల్లభ మహారాజు.

(౬౩౩ మొదలుకొని ౬౬౩ వఱకు)

కుబ్జవిష్ణువర్ధనుని తరువాత రాజ్యమునకు వచ్చినవాఁ డతని జ్యేష్ఠపుత్రుఁడగు జయసింహుఁడు. ఈజయసింహవల్లభ మహారాజు ౬౩౩ వ సంవత్సరము మొదలుకొని ౬౬౩ వ సంవత్సరమువఱకును ముప్పదేండ్లు రాజ్యపరిపాలనము చేసెను. వీనికోరికలన్నియును సిద్ధించినవి గావున వీనికి సర్వసిద్ధియను నామము గలిగెను. వీనికాలముననే దిమిలివిషయములో సర్వసిద్ధియను పట్టణము గట్టఁబడినదిగాఁ గాన్పించుచున్నది. ఇయ్యది పూర్వమొక ప్రఖ్యాతమైన పట్టణముగానుండెననుటకు సందియములేదు. ఇప్పుడిది విశాఖపట్టణమండలములోని యెల్లమంచిలికి నైదున్నర మైళ్లదూరములో నొకచిన్నగ్రామముగానున్నది. ఈగ్రామమునందు ౧౭౬౧ వ సంవత్సరము వఱకు తాలూకాకచేరియుండుటచేత

(1) The Vizagapatam District Gazetteer p. 309; (2) No 154 of Appendix A, Anual Report on Epigraphy of 1899.

నిప్పటికిని సర్వసిద్ధి తాలూకాయని వ్యవహరింపఁ బడుచున్నది.[1] వీనిపేరుగల శాసనమొకటి కృష్ణామండలములోని పెదమద్దాలి గ్రామమునందు దొరకినది. ఈశాసనములో గృద్రాహార విషయములోని (గుడివాడ విషయము) పెణుకపఱ్ఱు గ్రామమును బ్రాహ్మణులకు దానముచేసినట్లు చెప్పఁబడినది. ఇయ్యది జయసింహుని రాజ్యకాలముయొక్క పదునెనిమిదవ సంవత్సరముననుదయపురము నుండి ప్రకటింపఁబడినది.[2] ఉదయపుర మెక్కడిదో తెలియకున్నది. ఒకవేళ వేంగిపురమునకే యుదయపురమను పేరుకలదేమోయని సందియము కలుగుచున్నది. అట్లయినచో నితఁడు తండ్రివలె పిష్ఠపురమును రాజధానిగఁ జేసికొనక వేంగిపురమునే రాజధానిగఁ జేసికొని యుండవలయును. వీనికాలములోనే హూనుత్సాంగను చీనాయాత్రికుఁ డీదేశమును జూడవచ్చెను. అతఁడీదేశమును అంతాలో (An-to-lo) అనగా ఆంధ్రమనియును, వేంగిపురమును పింకిలో Pim-khi-lo) అనియునుఁ బేర్కొని యుండుటఁగూడ జయసింహుఁడు వేంగీపురముననుండెనని సూచించుచున్నది. అయిననింకను విచారింపవలసియున్నది. ఈదేశమున నాకాలమున జనసంఖ్య బహుస్వల్పముగనుండెనని హూనుత్సాంగు దెలిపియున్నాఁడు. ఒకప్రక్కనుండిగాంగులు మఱియొకప్రక్కనుండి కదంబులు నొకవైపునుండి చోడులు మఱియొకవైపునుండి రాష్ట్రకూటులు నింకొకచక్కనుండి, కళింగగాంగులు ముట్టడించుచుండఁగా నీదేశము వేడిమంగలము వలె వేఁగుచుండునపుడు జనసంఖ్య యెట్లభివృద్ధిగాంచగలదు? అయినను చాళుక్యరాజులు బహుసమర్థులును మిక్కిలి బలాఢ్యులునగుటవలన స్వరక్షణమందే మఱకయుండి రాజ్యమును గాపాడుకొనుచువచ్చిరి.

## ఇంద్రభట్టారకుఁడు.౬౬౩.

ఇతఁడు కుబ్జవిష్ణువర్ధనుని ద్వితీయపుత్త్రుఁడు; జయసింహునితమ్ముఁడు. ఈయింద్రభట్టారకుఁడు పట్టాభిషిక్తుఁడయిన వెంటనె సామంతరాజులును, శత్రురాజులును నేకమై వీనిని పదభ్రష్టునిగావింపవలయునని కుట్రచేయ నా

1 The Vizagapatam District Gazetteer p. 314; (2) Ind Ant, Vol Xiii, 137; Ibid, Vol XX, p. 97



రంభించిరి. ఈరాజద్రోహులకు నధిరాజేంద్రవర్మనాయకుఁడుగా నుండెనని ప్రభాకరమహారాజుకుమారుఁడగు పృథ్వీమూలునియొక్క గోదావరిమండలశాసనము దెలుపుచున్నది.[1] అధిరాజేంద్రుఁడు కళింగనగరమును రాజధానిగ నుత్తరకళింగమును నేలుచుండుగాంగవంశజుఁడయిన యింద్రవర్మమహారాజేగాని యన్యుఁడుగాఁడు.[2] వీనిరాజ్యము చాళుక్యరాజ్యమునకు నుత్తరముననున్నది. ఆ రాజులతో జరిగిన యుద్ధములో నింద్రభట్టారకుఁడు మృతినొందియుండును. ఆ కారణముచేత నాతనిరాజ్యపరిపాలన మేడుదినములలోనే ముగిసిపోయినది.

## రెండవవిష్ణువర్ధనుఁడు.

(కీ. శ. ౬౬౩ మొదలుకొని ౬౭౨ వఱకు)

ఇంద్రభట్టారకుని మరణానంతరము వానికొడుకు విష్ణువర్ధనుఁడు సింహాసనమెక్కెను. ఇతఁడు శత్రురాజులనుజయించి సర్వలోకాశ్రయుఁడనియు, విషమసిద్ధియనియు బిరుదు పేళ్లువహించెను. ఇతఁడు తొమ్మిదిసంవత్సరములు నిరంకుశముగఁ బరిపాలనముచేసెను. ఈసర్వలోకాశ్రయుఁడయిన రెండవవిష్ణువర్ధన మహారాజుచేసినయొక దానశాసనమునఁదు "ఆత్మవిజయరాజ్యపంచమే సంవత్సరఫాల్గుణమాసే అమవాస్యాం సూర్యగ్రహణనిమిత్తం" అనిశకసంవత్సరము ౫౭౦ ఫాల్గుణబహుళామావాస్యకు సరియైన ౬౬౯వసంవత్సరము ఫిబ్రవరి నెల౧౨ తేది వీనిరాజ్యకాలములో నైదవయేఁడని చెప్పఁబడియుండుటచేత వీనిరాజ్యపాలనము ౬౬౩వసంవత్సరము ఫాల్గుణబహుళములోఁ బ్రారంభమైనదని చెప్పవచ్చును. వీనిపేరుగల శాసనములు రెండుగానవచ్చుచున్నవి. అందొకటినెల్లూరుమండలములో నెచ్చటనో గాన్పించినది. కర్మరాష్ట్రములోని రేయూరుగ్రామము దానముచేయఁబడినట్లుగఁ దెలిపెడి శాసనమైయున్నది. కర్మ(కమ్మ) రాష్ట్రము ప్రస్తుతగుంటూరు మండలములోనిదని యిదివఱకె తెలిపియుంటిమి. ఈశాసనము వీనిపరిపాలనముయొక్క రెండవసంవత్సరమున చైత్రశుద్ధదశమి బు

(1) Jour. Bo. Br. R. As. Soc vol XVI, p. 119

(2) Ibid, Ind Ant, Vol XIII, pp 120-122 and Ibid XVI p. 132.

ధవానరంబునకు సరియైన ౬౬౪వసంవత్సరము మార్చి ౧౩వ తేదిని ఎట్టియకొడుకు వినాయకునిచే వ్రాయఁబడినది.[1] మొదటిశాసనము గృధ్రవాహారవిషయములోని (గుడివాడసీమ) పల్లివాడప్రజలకు నాజ్ఞ చేయఁబడినదిగనున్నది. ఈశాసనములోని విషయవివరము గానరాదు.[2]

## మంగియువరాజు.

(క్రీ. శ. ౬౭౨ మొదలు ౬౯౬ వఱకు)

ఈమంగియువరాజు రెండవవిష్ణువర్ధనుని కుమారుఁడు. ఇతఁడు ౬౭౨వ సంవత్సరము మొదలుకొని ౬౯౬ - వ సంవత్సరమువఱకును, ఇరువదియైదు సంవత్సరములు పరిపాలనము చేసెను. వీనికి సర్వలోకాశ్రయుఁడనియు, విజయసిద్ధియనియు బిరుదునామములుగలవు. వీనిపేరుతోఁ బ్రకటింపఁబడిన శాసనములు మూడు గాన్పించుచున్నవి. అందొకటి కర్మరాష్ట్రములో నూతులపట్టుగ్రామములోని కొన్ని భూములను బ్రాహ్మణులకు దానము చేయఁబడియెనని తెలుపునదియై యున్నది. నిస్సారాజ్ఞి దూతకుఁడని తెలుపంబడియెను. ఈశాసనము మంగియువరాజుపాలనముయొక్క యిరువదవ సంవత్సరమున నుత్తరాయణ సంక్రాంతి పుణ్యకాలమున దానముచేయఁబడినట్లుగ గూడ దెలుపుచున్నది.[3] గుంటూరుమండలములో వంగవోలు తాలూకాలోని చెందలూరు శాసనముగూడ మంగియువరాజు నామమును పేర్కొనుచున్నది. కమ్మరాష్ట్రములోని (కమ్మనాఁడు) చెందలూరుగ్రామమును బ్రాహ్మణులకు దానముచేయఁబడినట్లుగఁ జెప్పఁబడినది.[4] మంగియువరాజుయొక్క మఱియొకశాసనము విశాఖపట్టణ మండలములోని తిమ్మాపురమున నూతనముగాఁ గానంబడినది. ఆశాసనమింకను సంపూర్ణముగఁ బ్రకటింపఁబడి యుండలేదు.[5] ఇదియును దిమిలిసీమలోనిదిగానే గన్పట్టుచున్నది. ఈమంగి యువరాజుయొక్క చెందలూరు శాసనములో పల్లవరాజగు కుమారవిష్ణుని చెందలూరుశాసనములో వలెనె రాజకీయోద్యోగీయులకు నైయోగికులని పేరుపెట్టఁబడియెను. మంగియువరాజు రాజ్యముగూడ విశాఖపట్టణ మండలములోని చీపురుపల్లి మొదలుకొని నెల్లూరివఱకు వ్యాపించియున్నట్లు గానంబడుచున్నది.

## రెండవజయసింహుఁడు.

(౬౯౬ మొదలుకొని ౭౦౯ వఱకు)

ఇతఁడు మంగియువరాజుయొక్క ప్రథమ కళత్రమునకు జనించినవాఁడు. ఇతఁడు పదుమూడు సంవత్సరములు మాత్రము పరిపాలనము చేసెను. విప్పర్ల గ్రామములోని చెఱువుగట్టుమీఁది యొకఱాతిపలకపై నుండుశాసనములో జయసింహుని నామము గానంబడుచున్నది గాని యయ్యది సకలలోకాశ్రయ జయసింహవల్లభ మహారాజునకు సంబంధించినదిగాఁ గన్పట్టుచున్నది. ఈరెండవ జయసింహునకు నట్టిబిరుద మున్నట్టు గానంబడదు.

## కొక్కిలివిక్రమాదిత్య భట్టారకుఁడు. ౭౦౯

ఇతఁడు రెండవజయసింహుని సవతితమ్ముఁడు. మంగియువరాజునకు ద్వితీయ కళత్రమువలనజనించిన ద్వితీయపుత్రుఁడు. రెండవ జయసింహుని మరణానంతరము నక్రమముగా రాజ్య మాక్రమించుకొని తొమ్మిదినెలలు మాత్రము పరిపాలనము చేసినవాఁడు. వీనిశాసన మొకటి విశాఖపట్టణ మండలములో భోగపుర విషయములోని ముంజేఱుగ్రామమునఁ గానిపించినది.[1] తండ్రివహించిన విజయసిద్ధి బిరుదనామమునే యీతఁడును వహించెను. మంగియువరాజు కుమారుఁడును విష్ణువర్ధన మహారాజుయొక్క మనమఁడునునగు నీకొక్కిలి విక్ర

(1) Ind, Ant, Vol Vii, p. 185; ibid Vol viii p. 320
(2) Ibid Vol Vii p. 191
(3) Ind. Ant Vol XX. p. 105; (4) Ep. Ind Vol III, p. 236 (5) no 574, Public, 17th July 1908, paras 12-14

(1) కొక్కిలి విక్రమాదిత్యునియొక్కయు, వానికుమారుఁడు మంగియువరాజు యొక్కయు, దాన శాసనములు రెండును, కోకిలవర్మ మహారాజుయొక్క దానశాసనములు రెండును విశాఖపట్టణమండలములో భీమునిపట్టణముతాలూకాలోని ముంజేఱుగ్రామములో దొరకినవని మ॥ గురజాడ వేంకటప్పారావు పంతులుగారివలనఁ బంపబడినవి.

మాదిత్య భట్టారకుఁడు దేపూడిగ్రామ నివాసులయిన బ్రాహ్మణులకు భోగపుర విషయములోని ముంజేఱు గ్రామము నాతురకాలమున దానముచేసెనని చెప్పఁబడినది. ఆతురకాలమనఁగా మరణావస్థయందున్న కాలమని చెప్పఁదగును. ఈశాసనమును బట్టియు, వీనికుమారుని శాసనమునుబట్టియు నితనికి విక్రమాదిత్య భట్టారకుఁడనిపేరు గూడగలిగి యున్నట్టు గానంబడుచున్నది. మఱియు నితనికి మంగియువరాజను కుమారుఁడుగలఁడు. ఈమంగియువరాజుయొక్క దానశాసనముగూడ గలదు. కళింగదేశములో భోగపుర విషయములోని కోడుంకవిళంగవాడయను గ్రామమును చంద్రగ్రహణ సమయమున ముంజేఱు నివాసులగు ౧౦౩ బ్రాహ్మణులకును, శివాలయమునకును దానముచేసినట్లు తెలిపెడి తామ్రశాసనముగలదు. ఈమంగియువరాజు తనతాతతండ్రులవలెనె విజయ సిద్ధి యను బిరుదునామములను వహించియుండెను. ఈతండ్రికొడుకుల కిరువురకును ఎలమంచి వాసకమని వీరిశాసనములలో నుదాహరింపఁబడియుండెను. ఈయెలమంచి యెల్లమంచిలియను పేరునఁ బిలువంబడుచు విశాఖపట్టణ మండలములోని సర్వసిద్ధి తాలూకాలోనున్నది. ఇచ్చట కుబ్జవిష్ణు వర్ధనుని నాణెములు కొన్ని దొరకినవి.

## కోకిలవర్మ మహారాజు.

ఇతఁడు మంగివర్మమను మఁడుగను వినయాదిత్యవర్మ కుమారుఁడుగను చెప్పఁబడి యుండెను. వీనిశాసనములు రెండు భీముని పట్టణము తాలూకాలోని ముంజేఱుగ్రామమున దొరకినవి. పైనిజెప్పిన కొక్కిలిరాజు యొక్కయు, వానికొడుకు మంగియువరాజు యొక్కయు శాసనములు దొరకినచోటనే యివియును దొరకినవి. అంతమాత్రముచేత నీకోకిలవర్మయు, కొక్కిలియు నొక్కఁడేయని చెప్పరాదు. వేర్వేఱు తండ్రులను గలిగియుండుటచేత నొక్కరుగా రనుట నిర్వివాదాంశమనుటకు సందియములేదుగాని, యీకోకిలవర్మపేరు చాళుక్యులశాసనములం దెచ్చటను గానరాదు. ఈకోకిలవర్మ దానశాసనములు రెండింటిలో నొకదానియందు భోగపురవిషయము మధ్యమ కళింగములోనిదని పేర్కొనఁబడియుండెను. ఎలమంచి వీనికిని రాజధానిగ నుండెనని చెప్పఁబడినది.



చంద్రగుప్త చక్రవర్తి యాస్థానమందుండిన మేగాస్తనీ సనుయవనరాయబారిచేఁ బేర్కొనంబడిన "మోడో కళింగే" (Modo Calingae) యను నదియె యీమధ్యమ కళింగమని స్పష్టముగాఁ జెప్పవచ్చును. (Ind, Ant Vol Vi. R. 338) మధ్యమ కళింగమని కళింగదేశములోని యొకభాగము వ్యవహరింపఁబడినపుడు మఱియొకభాగము త్రికళింగమని వ్యవహరింపఁబడి యుండెననుట యబద్ధము కానేరదు. అట్లగుటంజేసి విశాఖపట్టణమండలము మధ్యమ కళింగముగాను, గోదావరి మండలము త్రికళింగముగాను, గంజాము మండలము త్తరకళింగముగాను, ఒకప్పుడు వ్యవహరింపఁబడినవని మనము విశ్వసింపవచ్చును. ఉత్తరకళింగము గంగానది వఱకు వ్యాపించి యుత్కలదేశమై యుండవచ్చును. త్రికళింగము కాంచీపురమువఱకు వ్యాపించి త్రిలింగదేశమై యుండవచ్చును. అనివారితశక్తిత్రయ సంపన్నుఁడని కోకిలవర్మయొక్క శాసనమునందుఁ బేర్కొనఁ బడియుండెను. చంద్రగ్రహణ సమయమున ముంజేఱుగ్రామ నివాసియగు బ్రాహ్మణున కొకనికి బొద్దేటి యనుగ్రామమును దానముచేసెను. చంద్రగ్రహణ సమయముననే ముంజేఱుగ్రామనివాసి యగు అశ్వశర్మ యను బ్రాహ్మణునకు వెట్టువాడయను గ్రామమును దానముచేసియుండెను. ఈ రెండుగ్రామములును భోగిపుర విషయములోనివే. ఈశాసనములలోని ముద్రికలలో "శ్రీఅనివారిత, శ్రీఅనివారితంబు" అను చిరునామాలుగలవు. ఈశాసనములలోని లేఖనము దోషభూయిష్ఠమై యుండెను. అయిన నీశాసనములు కుబ్జవిష్ణువర్ధనుని, జయసింహుని, రెండవ విష్ణువర్ధనుని శాసనములలోని లిపినిగలిగి వానిమార్గమునే కొంచెమించుమించుగా ననుసరించియున్నది. ఈయనివారిత బిరుదము పశ్చిమచాళుక్యరాజగు మొదటి విక్రమాదిత్యుఁడు వహించియుండెను. ఆబిరుదము నేయీతఁడవలంబించియుండెను. ఆతఁడే రాజవంశములోనివాఁడో స్పష్టముగాఁ దెలియరాదు. చాళుక్యులలో నొకరుతక్క మఱెవ్వరును వర్మయను పట్టపు పేరును ధరించియుండలేదు గాని చాళుక్యులకుఁ బూర్వమునందుండిన పల్లవులు ధరించుకొనియుండిరి. అయినను వీనిశాసనములు చాళుక్యులవి యగువరాహ ముద్రికలను గలిగియున్నవి.

ఇతఁడు చాళుక్యుఁడే యైనయెడల దేశపరిపాలనము సేయు రాజకుటుంబములోని వాఁడుగాక మఱియొక సామంతరాజకుటుంబములోని వాఁడై యుండవలయును. ఇతఁడు చాళుక్యుఁడుకాని యెడల చాళుక్యులీదేశ మాక్రమించుకొనుటకుఁ బూర్వము పరిపాలనము సేయుచుండిన పల్లవవంశములోని వాఁడు గాని గాంగవంశములోని వాఁడుగానియై యుండవలయును. అట్లు తలంచుటకును దృప్తికరమైన సాక్ష్యముగానరాదు. తొమ్మిదవశతాబ్దమధ్యము నందుండిన గణక విజయాదిత్యుఁడను చాళుక్య రాజు తన శత్రువగు నొకమంగిరాజును సంహరించి నట్లొకశాసనమునఁ జెప్పఁబడినది. ఆమంగిరాజితని వంశములోని వాఁడని యూహింపఁదగియున్నది.

## మూడవ విష్ణువర్ధనుఁడు.

(క్రీ. శ. ౭౦౯ మొదలుకొని ౭౪౬ వఱకు.)

ఇతఁడు కొక్కిలికి అనఁగా విక్రమాదిత్య భట్టారకునకు జ్యేష్ఠభ్రాత. రెండవ జయసింహునికి సవతితమ్ముఁడు. జయసింహుని మరణానంతరము రాజ్యము నక్రమముగా నాక్రమించుకొనిన తమ్ముని సింహాసన విహీనుని జేసి రాజ్యమాక్రమించుకొని ౭౦౯ మొదలుకొని ౭౪౬ వఱకును ముప్పదియేడుసంవత్సరములు నిరంకుశముగా దేశమును బరిపాలించెను. ఇతఁ డన్నిశాసనములందును విష్ణువర్ధనుఁడని పేర్కొనఁబడియుండఁగా నొకశాసనమునందు విష్ణురాజని పేర్కొనఁబడియెను.

## విజయాదిత్య భట్టారకుఁడు.

(క్రీ. శ. ౭౪౬ మొదలుకొని ౭౬౪ వఱకు.)

ఇతఁడు మూడవవిష్ణువర్ధనునికుమారుఁడు. విజయాదిత్య నామమును వహించిన పూర్వచాళుక్యులలో మొదటివాఁడుగ నుండెను. ఈవిజయాదిత్య భట్టారక మహారాజునకు విజయసిద్ధి, విక్రమరాముఁడని బిరుదములుగలవు. ఇతఁడు ౭౪౬ మొదలుకొని ౭౬౪ వఱకును పదునెనిమిది సంవత్సరములు వేంగిదేశమును బరిపాలించి ఖ్యాతిఁగాంచెను. వీని తరువాత వీనికుమారుఁడు రాజ్యమునకు వచ్చెను.



## నాలుగవవిష్ణువర్ధనుఁడు.

(క్రీ. శ. ౭౬౪ మొదలుకొని ౭౯౯ వఱకు)

ఈ విష్ణువర్ధనుఁడు మొదటి విజయాదిత్యుని కుమారుఁడు. విష్ణువర్ధన నామమును వహించిన చాళుక్యరాజులలో నితఁడు నాలుగవవాఁడు. ఇతఁడు ముప్పదియాఱు సంవత్సరములు పరిపాలనము చేసెనని మాత్రము దెలియుచున్నది గాని వీనిగుఱించి యేమియును దెలియరాదు.

## రెండవవిజయాదిత్యుఁడు.

(క్రీ. శ. ౭౯౯ మొదలుకొని ౮౪౩ వఱకు)

ఇతఁడు నాలుగవవిష్ణువర్ధనుని కుమారుఁడు. విజయాదిత్యుని మనుమఁడు. బహుసమర్థుఁడయిన యోధవరుఁడు. మహారాజాధిరాజనియు, సమస్తభువనాశ్రయుఁడనియు, చాళుక్యార్జునుఁడనియు రాజపరమేశ్వరుఁడనియు, శ్రీత్రిభువనాంకుశుఁ డనియు, నరేంద్ర మృగరాజనియు నింక ననేకములగు బిరుదు నామములను వహించి ౭౯౯ వ సంవత్సరము మొదలుకొని ౮౪౩ వ సంవత్సరము వఱకును నలువదినాలుగు సంవత్సరములు నిరాతంకముగా వేంగిరాష్ట్రమును బరిపాలించి కీర్తిగాంచెను. ఈరెండవ విజయాదిత్యుఁడు రాజ్యభారమును వహించి నిర్వక్ర పరాక్రమంబున రాజ్యములోని శత్రువర్గము నడంచి నిరంకుశముగఁ బరిపాలనము సేయుచుండ మహాజన సత్త్వసంపన్నులగు రాష్ట్రకూటులును గాంగులును బలుమాఱులు వేంగిరాష్ట్రముపై దండెత్తివచ్చి విజయాదిత్యునితోడ బహుయుద్ధములు చేసి పలాయనులగుచు వచ్చిరి. ఎన్నితడవలు దాడివెడలివచ్చినను నించుకయు జంకక సింహమువలె సుస్థిరచిత్తుఁడై నిలుచుండి శత్రువులకజేయుఁడై శత్రువర్గము నెల్లఁ దఱుముచువచ్చెను. అందుచేతనే చాళుక్యార్జునుఁడనియు నరేంద్రమృగరాజనియు బిరుదుపేరులు గలిగినవి. ఇతఁడు గాంగులతోడను రాష్ట్రకూటులతోడను! నూటయెనిమిది యుద్ధములను జేసి విజయమును గాంచినవాఁడగుటంజేసి నూటయెనిమిది శివాలయములను తనదేశమునందంతట జ్ఞాపకార్థముగఁ గట్టించెనని కొన్నిశాసనములు చాటుచున్నవి. వీనిశత్రువర్గములో ముఖ్యుఁడై నాయకత్వమును వహించి ఘోరయుద్ధములు సలి

పినవాఁడు సామాన్య రాజకుమారుఁడుగాక నిరుపమాన విక్రముండని ఖ్యాతిఁగన్నట్టి రాష్ట్రకూటుఁడయిన మూఁడవ గోవిందరాజు. ఇతఁడు మాల్యఖేతమును రాజధానిగ మహారాష్ట్రదేశమును బాలించినవాఁడు. ఆకాలమునాఁటి యోధవరులలో మేటియని చెప్పఁదగినవాఁడయినను, వేంగిరాష్ట్రమును స్వాధీనముఁ జేసికొనవలయునని దృఢసంకల్పుఁడై యెంతప్రయత్నించినను మన నరేంద్రమృగరాజుముంగట వానిప్రయత్నము లన్నియు భగ్నములైపోయెను. ఇట్లనేక యుద్ధములలోఁ దఱిమికొట్టఁబడియు రాష్ట్రకూట రాజయిన మూఁడవగోవిందరాజు తాను కాంచీపురమును జయించినతరువాత పూర్వచాళుక్యరాజునకు (నరేంద్రమృగరాజ బిరుదాంకితుఁడగు విజయాదిత్యుఁడు) కబురు పంపిన తోడనే యాతఁడుపోయి వానికి నౌకరువలె సేవసలిపెనని యబద్ధపు సంగతులు తనశాసనములందు వ్రాయించుకొనియెనే గాని యీచాళుక్యుఁ డెన్నఁడును గోవిందరాజునకు నూడిగము సలిపినవాఁడు కాఁడు. ఇతఁడు గాంగులను రాష్ట్రకూటులను మాత్రమెగాక శత్రువర్గములోఁ జేరియుండిన యొకనాగ రాజును గూడ నితఁడుజయించెను. వీనిపేరు తోడిశాసనములు రెండుగానంబడుచున్నవి.

అందొకటి కొఱ్ఱపఱ్ఱుశాసనము.[1] చంద్రగ్రహణసమయమున కొఱ్ఱపఱ్ఱు గ్రామమును వేదవేదాంగవిదులయిన యిరువదినలుగురు బ్రాహ్మణులకు దానము చేసినట్లుగ నాశాసనమునఁ జెప్పఁబడినది. కొఱ్ఱపఱ్ఱు కృష్ణామండలములోనిదిగఁ గన్పట్టుచున్నది. విజయాదిత్యుని సోదరుఁడును రాజకుమారుఁడు నైన నృపరుద్రుఁడు దూతకుఁడుగఁ జెప్పఁబడియెను. మఱియు హైహయవంశములోని వాఁడని పేర్కొనఁబడియుండెను గావున నితఁడు విజయాదిత్యునికి సవతితమ్ముఁడని తోఁచుచున్నది. వీని తండ్రియగు నాలుగవ విష్ణువర్ధనుఁడు త్రిపురాధీశ్వరుని (కాలచుర్యుని) కొమార్తెను వివాహముఁజేసికొన్నందున నామెకు జనించిన యీనృపరుద్రుఁడు హైహయవంశజుఁడని పేర్కొనఁబడియుండెను గాని మఱియొకటిగాదు. విజయవాడ నివాసియగు అక్షరలలితాచార్యునిచే నీశాసనము

1 South. Ind. Ins, Vol I, pp. 31. 36.



లిఖింపఁబడినది. విజయవాడయనునది బెజవాడకుఁ బూర్వనామము. బెజవాడ పూర్వచాళుక్యులశాసనముల విజయవాడ యనియు విజయవాటిక యనియుఁ బేర్కొనఁబడియున్నది. ఈరెండవ విజయాదిత్యమహారాజు మఱియొకప్పుడు సూర్యగ్రహణ సమయమున కాండేరువాడి విషయములోని కామరూపిరేయ గ్రామములోని పొలమును బ్రాహ్మణులకు దానముచేసినట్లు కృష్ణామండలములోని యీదరశాసనమువలన బోధపడుచున్నది. ఈశాసనమునందలి దూతకుఁడు బోలమ యనువాఁడుగ నుండెను.[1] ఈరాజకంఠీరవుఁడు నలువదినాలుగు సంవత్సరములు నిరాతంకముగా రాజ్యపరిపాలనముచేసి సుప్రసిద్ధమైన యశస్సునుగాంచెను.

## కలివిష్ణువర్ధనుఁడు.

(క్రీ. శ. ౮౪౩ మొదలుకొని ౮౪౪ వఱకు)

నరేంద్రమృగరాజునకు వెనుకఁ బూర్వచాళుక్యసింహాసన మధిరోహించినవాఁడు విష్ణువర్ధనుఁడు. విష్ణువర్ధననామమును వహించి రాజ్యపరిపాలనము చేసిన పూర్వచాళుక్యులలో నితఁడైదవవాఁడు. వీనిని కలివిష్ణువర్ధనుఁ డందురు. వీనికి సర్వలోకాశ్రయుఁడనియు విషమసిద్ధియనియు, పరమమహేశ్వరుఁడనియు బిరుదునామములు గలవు. ఇతఁడు రెండవవిజయాదిత్యుని కుమారుఁడు. ఇతఁడు తండ్రివలెనె శాసనములయందు వేంగినాథుఁ డని పేర్కొనఁ బడియెను. ఇతఁడు పదునెనిమిది నెలలుమాత్రమె రాజ్యపాలనము చేసెనని శాసనములు దెలుపుచున్నవి. వీనిపేరిటి శాసన మొకటి గన్పట్టుచున్నదిగాని యందలి శైలి కఠినమైనదగుటచేత శాసనపరిశోధకులు సరిగ భాషాంతరీకరింపరయిరి. పృథ్వీవల్లభపట్టణమని యొకపట్టణ ముదాహరింపఁబడినది. మఱియు నీశాసనమునందు కర్ణాటకమును బాలించుప్రభువునామ మొకటి పేర్కొనఁబడియెను. ఇంతియుగాక కాంచీపురము రామేశ్వరము గూడ నుదాహరింపఁబడినవి.[2]

1 Ind. Ant, Vol Xiii p. 55.

2 Ind Ant, Vol Xiii. p. 185

## గణకవిజయాదిత్యుఁడు.

(క్రీ. శ. ౮౪౪ మొదలుకొని ౮౮౮ వఱకు)

కలివిష్ణువర్ధనునికిఁ బిమ్మట సింహాసన మెక్కినవాఁడు వానిజ్యేష్ఠకుమారుఁ డయిన విజయాదిత్యుఁ డనువాఁడు. వేంగీదేశమును బరిపాలించిన విజయాదిత్య నామధారు లయినరాజులలో నితఁడు మూఁడవవాఁడు. ఇతఁడు గణితశాస్త్రమునందు పండితుఁడగుటచేత గణకవిజయాదిత్యుఁడని పిలువఁబడుచు వచ్చెను. ఇతఁడు (క్రీ. శ. ౮౪౪ మొదలుకొని ౮౮౮ వఱకు నలువదినాలుగు) సంవత్సరములు నిరంకుశముగా దేశమును బరిపాలించెను. వీనికి యువరాజవిక్రమాదిత్యుఁ డనియు, యుద్ధమల్లుఁ డనియు నిరువురు తమ్ములుండిరి. కొన్నిశాసనముల యందు గుణగాంకయనియు, గుణకనల్లయనియుఁ జెప్పఁబడియుండుట చేతఁ గొందఱు వీనిని గుణాంక విజయాదిత్యుఁ డని పేర్కొనుచున్నారుగాని "అంక కారః సాక్షాత్" అని గణిత శాస్త్రమునందుఁ బ్రజ్ఞావంతుఁడగుటచేత నితఁడు గణకవిజయాదిత్యుఁ డని ప్రసిద్ధిగాంచినట్లుగ అమ్మరాజ విజయాదిత్యుని కంచు మట్టుశాసనము స్పష్టముగఁ గారణముఁ జెప్పుచుండఁగా గుణాంక విజయాదిత్యుఁ డనుటకంటె గణకవిజయాదిత్యుఁ డని గ్రహించుటయె యొప్పిదముగా నుండును. ఈగణకవిజయాదిత్య మహారాజునకు సమస్త భువనాశ్రయుఁ డనుబిరుదు నామము మాత్రమెగాక మనుజప్రకారుఁడు, రణరంగశూద్రకుఁడు, విక్రమధవళుఁడు, పరచక్రరాముఁడు, నృపతి మార్తాండుఁడు, బిరుదాంకభీముఁడు మొదలగు బిరుదునామము లెన్నో గలవు. కలివిష్ణువర్ధనుని భార్యయు, గణకవిజయాదిత్యుని తల్లియు నగుశీలమహాదేవి రాష్ట్రకూటరాజకుటుంబములోని దైనను గణకవిజయాదిత్యుని కాలమున రాష్ట్రకూటులకును ఆంధ్ర చాళుక్యులకును గల స్నేహబంధములు త్రెంపి వేయఁబడినవి. రాష్ట్రకూటరాజయిన రెండవ కృష్ణుఁడు గణక విజయాదిత్యుని కయ్యమునకుఁ బిలుచుటవలన నించుకయుఁ గొంకక యాంధ్రసైన్యముతోడ రాష్ట్రకూటులపై దాడివెడలి వారలతో ఘోరయుద్ధము సలిపి యోడించి



వారల రాజధాని యగు మాల్యఖేతమును దగ్ధముగావించి కృష్ణపురదహన విఖ్యాతకీర్తి యని స్వజనంబుచేఁ బొగడ్తలఁ బొందెను. రాష్ట్రకూటులకు సామంతులుగ నుండిన గాంగులు దండెత్తివచ్చినప్పుడు ఘోరసంగ్రామమున వారలను జయించి తఱిమిగొట్టెను మంగిరాజనుశత్రు వధికసైన్యముతో వచ్చి పైఁబడినపుడు ధైర్యసాహసములు ముప్పిరి గొన వాని నెదుర్కొని సంకులసమరంబున నవలీల వానిశిరస్సును ఖండించెను. వీని పేరిటి శాసనము లనేకములు గలవు. గుద్రవార విషయములోని (గుడివాడ సీమ) త్రాండపట్టను గ్రామమును వినయాదిత్యశర్మకు చంద్రగ్రహణ సమయమున దానము చేసెను. ఈవినయాదిత్యశర్మ మంగిరాజుతో జరిగినయుద్ధమునందు గణకవిజయాదిత్యుని సైన్యాధిపతిగ నుండి యుద్ధము చేసినట్లుగఁ గానిపించుచున్నది.[1] వేదవేదాంగవిదులును సమస్తశాస్త్రజ్ఞులు నైన ౧౦౮ గురుబ్రాహ్మణులకు కోడముప్పట్టు, పోణంగి గ్రామములను దానము చేసినట్లుగ పోణంగి శాసనమువలన బోధపడుచున్నది.[2] గణక విజయాదిత్యునికి మంత్రిగను సైన్యాధిపతిగ నుండి గాంగులతోడను రాష్ట్రకూటులతోడను యుద్ధములు చేసి ప్రాణములఁ గోలుపోయిన పాండురంగని పేరు శాసనముల నుదాహరింపఁబడినది. ఇతఁడు కడియరాజ పుత్త్రుఁ డని పేర్కొనం బడియెను. ఈకడియరాజు పేరేమొ తెలియరాదు. కడియ యనునది రాజమహేంద్రవరమునకు నేడుమైళ్లదూరమున నుండిన కడియ మను గ్రామమై యుండవచ్చునని తోఁచుచున్నది. పాండురంగని పేరు నెల్లూరు శాసనములందును గూడఁ గానవచ్చుచున్నది. ఈపాండురంగని కుటుంబము వారు జైనమతావలంబకు లయినట్లుగఁ గన్పట్టుచున్నారు. గణక విజయాదిత్యుని యనంతరము వీనిసోదరులగు యువరాజ విక్రమాదిత్యుఁడును, యుద్ధమల్లుఁడును ప్రసిద్ధులయినను రాజ్యపదవిని బొందక విజయాదిత్యునికి వెనుక యువరాజవిక్రమాదిత్యునికొడుకు చాళుక్యభీముఁడు రాజ్యపదవిని వహించుటకుఁ గారణమేమొ తెలియరాదు.

---

(1) Ind. Ant. Vol xx, P. 102; (2) No. 538, Public, 28 th July 1909. para 58.

## మొదటిచాళుక్య భీమవిష్ణువర్ధనుఁడు.

(క్రీ. శ. ౮౯౨ మొదలుకొని ౯౨౨ వఱకు)

ఇతఁడు గణకవిజయాదిత్యుని సోదరుఁడగు యువరాజ విక్రమాదిత్యునికుమారుఁడు. తనపెద్దతండ్రియైన విజయాదిత్యుని పిమ్మట రాజ్యమునకు వచ్చెను. గణక విజయాదిత్యుని మరణానంతరము రాష్ట్రకూటరాజయిన రెండవ కృష్ణుఁడు పూర్వవైరమును మనస్సులోఁ బెట్టుకొని యున్నవాఁడుగాన వేంగిదేశముపై దండెత్తివచ్చి దేశమాక్రమించుకొనియెను. అప్పుడీ చాళుక్యభీముఁడు కృష్ణునితో యుద్ధముచేసి రాష్ట్రకూటులనుజయించి దేశమునుండి తఱిమివేసి దేశమునంతయు స్వాధీనపఱచుకొని నిశ్చింతగా ౮౯౨ మొదలుకొని ౯౨౨ వఱకు ముప్పదిసంవత్సరములు రాజ్యపరిపాలనము గావించెను.[1] వీనికిని కృష్ణునకును జరిగిన యుద్ధమునందు వీనిసవతితోఁబుట్టువు కుమారుఁ డగుమహాకాలుఁడనువాఁడు సైన్యాధిపతియై సైన్యముల నడిపించి విజయమునుగాంచెను. తన రాజ్యమునందంతట శాంతిని గలిగించుటకై మొదటనే దాయాదుల బలములనెల్ల నోడించి వారల నందఱ నడఁచిపట్టి కడవఱకు రాజ్యములోన శాంతిని నెలకొల్పి ప్రఖ్యాతుఁడయ్యెను. ఈచాళుక్య భీమునకు విష్ణువర్ధనుఁడను బిరుదునామము గూడగలదు. ఈవిషయములు నూతనముగాఁ గనిపెట్టఁబడిన ఖాశింకోటశాసనమువలనఁ దెలియుచున్నవి.[2] మఱియు నీ నూతనశాసనమునందు ఎలమంచికళింగదేశమును, దేవరాష్ట్రవిషయమును బేర్కొనఁబడినవి. ఈదేవరాష్ట్రము సముద్రగుప్తుని అలహాబాదు శాసనము పేర్కొనియున్నది.[3] దేవరాష్ట్రమనఁగా నవీనమహారాష్ట్రదేశమని విన్సెంటు స్మిత్తుగారు చెప్పినది పొరబాటు.[4] సముద్రగుప్తునిశాసనమును బట్టి నాలుగవశతాబ్దప్రారంభమునందు

(1)Ind. Ant. Vol xx, p. 103; (2) No 538, Public, 28 th July 1909 para 59; (3) Dr. Fleet's Corpus Inscriptianum Indicarum, Vol, III. p. 13; (4) The Early History of India p. 270.



విశాఖపట్టణమండలములోని దేవరాష్ట్రమును కుబేరవర్మ పరిపాలించుచుండెనని తేటపడుచున్నది. ఈచాళుక్య భీముని శాసనములో ఎలమంచికళింగదేశమనుట కర్థమేమని కొందఱకు సందియముకలుగవచ్చును. మూడుకళింగము లుండుటచేత ఎలమంచి ముఖ్యపట్టణముగాఁ గల కళింగమని సులభముగా గ్రహించుటకై యెలమంచికళింగదేశమని వ్రాయఁబడియుండునుగాని యంతకన్న మఱియొకఁ గారణముండఁబోదు. ఈయెలమంచి అనివారితకోకిలవర్మమహారాజునకు రాజధానిగ నుండెనని యింతకుఁ బూర్వము దెలిపియుంటిమి. మఱియు నీశాసనము నందొక్క విశేషముగలదు. మాలతీమాధవములోని భరతవాక్యమును దెలుపుశ్లోకము శాసనములోని ధ్యానశ్లోకములలో నొకటిగా లిఖింపఁబడి యుండుటచేత భవభూతి మహాకవి యీమొదటి చాళుక్యభీమవిష్ణువర్ధనునకుఁ బూర్వమున నున్నాఁడని స్పష్టముగ బోధపడుచున్నది.

## కొల్లభిగండభాస్కర విజయాదిత్యుఁడు.

(౯౨౨)

చాళుక్యభీమ విష్ణువర్ధనునకుఁ బిమ్మట సింహాసన మధిష్ఠించినవాఁడు వాని జ్యేష్ఠపుత్త్రుఁడగు విజయాదిత్యుఁడను వాఁడు. విజయాదిత్యనామ ధారులయిన పూర్వచాళుక్య రాజులలో నితఁడు నాలుగవ వాఁడు. కొల్లభిగండ భాస్కరుఁడను బిరుదాభిధానమును వహించినవాఁడు. ఇతఁడు కళింగదేశమును జయించి త్రికళింగాటవులతోఁ గూడ వేంగిమండలమును నాఱుమాసములు మాత్రమె పరిపాలనముచేసి దేహయాత్ర ముగించినవాఁడు. పట్టవర్ధనివంశములోని కాలకంపుని యన్వయమున జనించిన సోమాదిత్యుని పౌత్రుఁడును, కుంతాదిత్యుఁడను నామాంతర ప్రసిద్ధుఁడును నగు భండనాదిత్యుఁడు వీనికి మంత్రిగను సైన్యాధిపతిగను నుండెను.

## అమ్మరాజ విష్ణువర్ధనుఁడు.

(క్రీ. శ. ౯౨౨ మొదలుకొని ౯౨౯).

ఇతఁడు నాలవ విజయాదిత్యుని పెద్దకొడుకు. విష్ణువర్ధన నామమును వహించినవారిలో నీతఁ డాఱవవాఁడుగఁ గొందఱు వ్రాసియున్నారుగాని

మొదటి చాళుక్యభీమునకుఁ గూడ విష్ణువర్ధన నామముకలిగియుండుటచేత నితని నేడవ విష్ణువర్ధనునిగాఁ బరిగణింపవలసియుండును. వీనికి సర్వలోకాశ్రయుఁడనియు, రాజమహేంద్రుఁడనియు బిరుదునామముండుటచేత రాజమహేంద్రవరము రాజధానిగఁ జేసికొని మొదట పరిపాలించినవాఁడే రాజమహేంద్రుఁడనియు, నీతని మూలముననే యాపట్టణమున కాపేరు గలిగినదనియుఁ గొందఱు తలంచుచున్నారు. కోటలేని పట్టణ మాకాలమున రాజదానిగ నుండఁజాలదు. గావున నీతఁ డాపట్టణమును నిర్మించి కోటనుగట్టుటకుఁ బూర్వమె మృతినొందియుండునని మఱికొందఱు తలంచుచున్నారు. ఏది యెట్లైనను రాజమహేంద్రపురంబునకుం గల సంబంధమును సూచించుచున్నది. వీని శాసనములలోని ముద్రికలపై "శ్రీభువనాంకుశ" అను బిరుదనామము గానంబడుచున్నది. ఇతఁడు రాజ్యమునకువచ్చినప్పుడు వీని దాయాదులయిన బంధువులు కొందఱు చాళుక్యలకు శత్రువులయిన రాష్ట్రకూటులతోఁ జేరి కుట్రలుచేసి వీనిని సింహాసనభ్రష్టుని జేయఁజూచిరి గాని యుక్తకాలముననే మేల్కాని యీయమ్మరాజ విష్ణువర్ధనుఁడు వారిప్రయత్నములను భగ్నము చేసి స్వజనముచే మెప్పుగాంచెను. వీని పేరిటి శాసనములు రెండుగానంబడుచున్నవి. తనతండ్రియగు నాలవ విజయాదిత్యునకును దనకునుగూడ సైన్యాధిపతిగ నుండిన భండనాదిత్యునకు కాండేరువాడి విషయములోని గొంటూరు గ్రామమును చుట్టునుండు పండ్రెండుపల్లెలతోఁగూడ దానముచేసెను. [1] ఇంతియగాక మొదటి చాళుక్యభీముని దళవాయిగ నుండిన మహాకాలునకు పెన్నాటివాడి విషయములోని ద్రుజ్జూరు గ్రామమును దానముచేసినట్లుగ మఱియొకశాసనము దెలుపుచున్నది. [2] కటకరాజు దూతకుఁడుగ నుండెను. గొంటూరు ప్రస్తుతగుంటూరు మండలములోని గుంటూరనియు, [3] ద్రుజ్జూరు నందిగామ తాలూకాలోని జుజ్జూరనియును గొందఱు తలంచుచున్నారు.

(1) Ind. Ant, Vol xiii, p. Sou Ind. Ins, Vol I. p. 36.
(2) Ibid, Vol. viii, p. 76.
(3) Mr. R. Sewell: (Lists, Vol II, p. 26.)



## బేటవిజయాదిత్యుఁడు.

(౯౨౫.)

అమ్మరాజవిష్ణువర్ధనునకు వెనుక రాజవంశమున నంతఃకలహములు జనించి యధికములై పదిసంవత్సరములవఱకు శాంతిలేక రాజ్యపదవికై యొండొరులంజంపుకొనుచు రాజకుమారులు రాజ్య మాక్రమించుకొనఁ జూచుచుండిరి. అమ్మరాజు మరణానంతరము వాని జ్యేష్ఠకుమారుఁడగు విజయాదిత్యుఁడు రాజ్యమునకువచ్చెను. వీనికి బేటరాజను నామాంతరముగలదు. విజయాదిత్యులలో నితఁ డయిదవవాఁడుగ నుండెను. ఇతఁడు సింహాసన మధిష్ఠించిన పదునేనుదినములలోనే యుద్ధమల్లునికొడుకయిన తాళరాజు వీనిని సింహాసనవిహీనునిం గావించి చెఱసాలయందుఁ బెట్టించి రాజ్యమునువశముఁజేసికొని పరిపాలింప సాగెను.

## తాళరాజు.

(౯౨౫.)

యుద్ధమల్లుని కొడుకయిన యీతాళరాజు రాజ్యమాక్రమించుకొని ముప్పదిదినములు రాజ్యపాలనము చేసినతరువాత చాళుక్యభీముని ద్వితీయపుత్త్రుఁడును నాలవ విజయాదిత్యుని సోదరుఁడునైన విక్రమాదిత్యుఁ డీతనిని జంపి రాజ్య మాక్రమించుకొనియెను.

## విక్రమాదిత్యుఁడు.

(౯౨౫-౯౨౬.)

చాళుక్య భీమునికొడుకయిన యీరెండవ విక్రమాదిత్యుఁడు వేఁగి త్రికళింగదేశములను ౯౨౫, ౯౨౬ సంవత్సరములలో పదునొకొండు మాసములు పరిపాలించినపిమ్మట అమ్మరాజ విష్ణువర్ధనుని కొడుకగు భీముఁ డీతని రాజ్యపదచ్యుతిని గావించి రాజ్యము నాక్రమించుకొనియెను.

## భీముఁడు.

(౯౨౬-౯౨౭.)

అమ్మరాజ విష్ణువర్ధనుని తనూజుఁడును నయిదవ విజయాదిత్యుని తమ్ముఁడునైన యీమూడవ భీముఁడు విక్రమాదిత్యుని జయించి ౯౨౬-౯౨౭ సంవత్సర

ములలో నెనిమిది నెలలు పరిపాలించినతరువాత తాళరాజు కొడుకయిన యుద్ధమల్లుఁ డీతనిఁ జంపి రాజ్యమును గైకొనియెను.

## యుద్ధమల్లుఁడు.

(క్రీ. శ. ౯౨౭ మొదలుకొని ౯౩౪ వఱకు.)

ఈరెండవ యుద్ధమల్లుఁడు తాళరాజు కొడుకు. ఇతఁడు ౯౨౭ మొదలుకొని ౯౩౪ వ సంవత్సరమువఱకు నేడుసంవత్సరములు పరిపాలనము చేసిన తరువాత నాలవ విజయాదిత్యుని ద్వితీయపుత్త్రుఁడయిన చాళుక్య భీమునిచే జయింపఁబడి సింహాసనమునుండి దొలఁగింపఁబడియెను.

## రెండవ చాళుక్య భీమ విష్ణువర్ధనుఁడు.

(క్రీ. శ. ౯౩౪ మొదలుకొని ౯౪౫ వఱకు.)

ఇతఁడు నాలవ విజయాదిత్యుని ద్వితీయపుత్త్రుఁడు. అమ్మరాజవిష్ణువర్ధనుని సవతితమ్ముఁడు. వీనికి గండమహేంద్రుఁడు, రాజమార్తాండుఁడు నను బిరుదునామములుగలవు. చాళుక్య భీముఁడని పిలువంబడిన వారిలో రెండవవాఁడుగను, విష్ణువర్ధనుఁడని పిలువఁబడిన వారిలో నెనిమిదవవాఁడుగ నుండెను. ఇతఁడు తాళరాజు కొడుకగు రెండవ యుద్ధమల్లుని చోళరాజైన లోవబిక్కని, రాష్ట్రకూటరాజయిన యైదవ గోవిందరాజును జయించి ౯౩౪ మొదలుకొని ౯౪౫ వఱకు రాజ్యపరిపాలనము చేసెను. గోదావరిమండలములోని సామర్లకోటకుఁ జేరియుండిన భీమవర మీతని పేరటనే గట్టఁబడినందునఁ జాళుక్య భీమవరమని శాసనములందుఁ జెప్పఁబడినది. ఇతఁడు చోడులను రాష్ట్రకూటులను మాత్రమె గాక గాంగరాజగు ఎఱ్ఱపరాజుతో యుద్ధముచేసి గాంగులనుగూడ నోడించెను. వీని పేరిటి శాసనములు మూడుగానవచ్చుచున్నవి. పగుణవారవిషయములోని దిగ్గుఁబఱ్ఱు (దిగుమఱ్ఱు) గ్రామమును బ్రాహ్మణులకు దానముచేసెను. మఱియు నుత్తరాయన సంక్రాంతి సమయమున గుద్రవారవిషయములోని ఆకులమన్నాఁడు గ్రామములోని కొంతభూమిని దానము చేసినట్లు మఱియొక శాసనముగలదు.



తనకు సామంతుఁడగు పనార రాజకుమారుఁడగు వజ్జయుని కోరికను మన్నించి యీచాళుక్య భీమవిష్ణువర్ధనుఁడు ఆథరాద్వసుకాల్మాడి గ్రామనివాసియు, కేవశర్మ పౌత్రుఁడును, దేనీయార్యపుత్త్రుఁడును క్రమపాఠియు నగు కొమ్మన యనుబ్రాహ్మణునకు నుత్తరాయన పుణ్యకాలమున కాండేరువాటి విషయములోని కొడవాతల్లి గ్రామమును దానముచేసినట్లుగ బెజవాడ తాలూకాలోని కోలవెన్ను గ్రామములో దొరకినశాసనమునుబట్టి దెలియుచున్నది.[1]

## అమ్మరాజ విజయాదిత్యుఁడు.

(క్రీ. శ. ౯౪౫ మొదలుకొని ౯౭౦ వఱకు.)

అమ్మరాజులలో రెండవవాఁడును విజయాదిత్యులలో నాఱవవాఁడును నైన యితఁడు లోకమహాదేవివలన రెండవ చాళుక్యభీమునికి జనించిన చిన్నకొడుకు. వీనికి సమస్తభువనాశ్రయుఁడనియు, మహారాజాధిరాజనియు, రాజమహేంద్రుఁడనియు, పరమభట్టారకుఁడనియు బిరుదునామములుగలవు. రాజముద్రికలపై "శ్రీత్రిభువనాంకుశ" అని చిత్రింపఁబడియుండెను. ఇతఁడు సింహాసన మెక్కుటకు ముందు యుద్ధమల్లునితోఁ గొంత పెనఁగులాడినట్లు సూచనలు గనఁబట్టుచున్నవి గాని యితఁడు సింహాసనమధిష్ఠించినపిమ్మట నైదవ విజయాదిత్యుని కాలమునుండి తటస్థమగుచుండిన కుటుంబకలహములు నిలిచిపోయినట్లుగఁ గనఁబట్టుచున్నవి. పడకలూరుశాసనమున నితఁడు శాలివాహనశకము ౮౬౭ వ సంవత్సరము మార్గశిర బహుళత్రయోదశి శుక్రవారమునాఁడనఁగా క్రీస్తుశకము ౯౪౫ వ సంవత్సరము డిసెంబరునెల ౫ వ తేదిని పట్టాభిషిక్తుఁడయినట్టు చెప్పఁబడియున్నది. వీనిపేరిటి శాసనము లనేకములుగలవు.

(1) పెన్నతవాడివిషయములోని పడంకలూరు (పడకలూరు) గ్రామములోఁ గొంతభూమిని చంద్రగ్రహణకాలమున దానముచేసెను. ఈశాసన రచనము మాధవభట్టుచేఁ గూర్పఁబడి జొంటాచార్యునిచేత లిఖితమైనది. ఈశాసనమునందే అమ్మరాజ విజయాదిత్యుఁడు పట్టాభిషిక్తుఁడయిన తేది తెలుపఁబడినది.

(1) South Iudian Inscriptions, Vol, I, p. 44.

(2) గుద్రవార విషయములోని (గుడివాడ) పాంబఱ్ఱు (పామఱ్ఱు) గ్రామములోఁ గొన్నిభూములను పట్టవర్ధని వంశములోఁ జేరియుండి బొద్దియ యనునామాంతరముగల యువరాజ బల్లాల దేవ వేలాభటునకు దానముచేసెను. ఇందుఁ బేర్కొనఁబడిన పట్టవర్ధనివంశజులు కుబ్జవిష్ణు వర్ధనునికాలమునుండి యుఁ జాళుక్యులకడ మంత్రిత్వాది పదవుల వహించి శోభిల్లుచుండిరి.[1]

(3) వెలనాండు విషయములోని (వెలనాటి సీమ అనఁగా ప్రస్తుత గుంటూరుమండలములోని చందవోలు ప్రాంతదేశము) యెలవఱ్ఱు గ్రామము నుత్తరాయణ సంక్రాంతికాలమున ధారవోసెను. ఈశాసనము పోతన భట్టుచే విరచింపఁబడి జొంటాచార్యునిచే లిఖింపఁబడినది.[2]

(4) ఉత్తరాయణ సంక్రాంతికాలమున వేంగినాడు విషయములోని గుంటుగొలను (గుండుగొలను) గ్రామములోఁ గొంతభూదానము చేసియుండెను. అమ్మరాజ విజయాదిత్యుని మామయగు నృపకాముని యొక్కయు, అత్తయగు నయమాంబయొక్కయు కోరికమీఁద నీదానము చేయఁబడినదిగఁ జెప్పఁబడియెను.[3]

(5) అదివఱకు గుద్రవార విషయములో నొకగ్రామమునఁ గొంతభూమి కుల బ్రాహ్మణున కొకనికి దానముచేయఁబడి యేకారణము చేతనో మరలఁ గైకొనఁబడిన యాభూమినే రాజు పునర్దానముఁ జేసినట్లుగ నొకశాసనముఁ జెప్పుచున్నది.

(6) అడ్డకాలి గచ్ఛకు సంబంధించి వలహారిగణములోఁ జేరిన జైనశ్రావకియగు చామెకాంబగురు వయిన అర్హనంది యను జైనాచార్యునకు సర్వలోకాశ్రయజైనభవనముయొక్క భోజన శాలకొఱకు అత్తిలినాడు విషయములోని కంచుంబఱ్ఱు గ్రామమును (కంచుమఱ్ఱు) గ్రామమును దానముచేసెను. ఇందుదాహరింపఁబడిన చామెకాంబ పట్టవర్ధని కుటుంబములోనిదని దెలుపఁబడి

(1) Ind. Ant, Vol, viii, y. 73; (3) Ibid, Vol xii, p 91. (3) Ibid, Vol xiii, p. 248; (4) South, Ind. Ins VI, p. 46. No. 38.



నది. ఈమె రాజునకుంపుడుకత్తెగాఁ బేర్కొనఁబడియెను. ఈశాసనము భట్టదేవునిచే రచింపఁబడినది. ఇప్పటి కృష్ణామండలములోని తణుకు తాలూకాలోఁ దణుకు గ్రామమునకు నేడుమైళ్లదూరమున అత్తిలి గ్రామముగలదు. ఇది పూర్వమత్తిలినాడు విషయమునకు ముఖ్యపట్టణముగ నుండెను.[1]

(7) గణక విజయాదిత్యునికడ నుద్యోగిగా నుండిన పాండురంగని వంశములోని వాఁడును తనకడ నుద్యోగిగా నున్నవాఁడునునగు దుర్గరాజుచే విజయవాటిక (బెజవాడ) లో నిర్మింపఁబడిన జైనాలయమునకుఁ గూడ అత్తిలి నాడు విషయములో మల్లిపూడి గ్రామమును దానముచేసినట్లుగ మల్లిపూడి శాసనమువలన ద్యోతకమగుచున్నది.[2]

తన భృత్యవర్గములోఁ జేరి తనయెడఁగడు భక్తింగూర్చెడు కుప్పనామాత్యుండను వానిని సమ్మానించి దానధర్మములఁ దనిపెనని యమ్మరాజవిష్ణువర్ధనుని వాండ్రముశాసనము దెలుపుచున్నది.[3]

ఇతఁడిట్లనేక దానధర్మములుచేసి ప్రఖ్యాతిఁగాంచినవాఁడు. ఇతఁడు జైనులకుఁజేసిన దానధర్మములను బట్టిచూడఁగా జైనమతపోషకుఁడుగగూడ గన్పట్టుచున్నాఁడు. బ్రాహ్మణులను జైనులను సమానదృష్టితోఁ జూచియుండెను. ఇతఁడిరువదిసంవత్సరములు నిరాతంకముగా దేశపరిపాలనము గావించెను.

## రెండవతాళరాజ విష్ణువర్ధనుఁడు.

అమ్మరాజు విష్ణువర్ధనునకుఁ బిమ్మట రాజ్యమునకువచ్చిన బేటవిజయాదిత్యుని జంపి రాజ్యమాక్రమించుకొని యుద్ధమల్లునికొడుకు నెలదినములు పరిపాలనము చేసెనని యిదివఱకుఁ దెలిపియుంటిమి. ఈతాళరాజుకొడుకు రెండవయుద్ధమల్లుఁడు. ఈరెండవయుద్ధమల్లునకు మహారాజరాజపరమేశ్వర బాడబుండును, తాళరాజవిష్ణువర్ధనుఁడు ననునిరువురుకుమారులుండిరని యీరెండవతాళ

(1) Epi. Ind, Vol vii, pp. 177-192

(2) Ib:d. Vol IX. pp. 47-56.

(3) Ep. Ind, Vol IX, p. 152; (2) No 538, Public, 28 July 1909, para. 61

రాజవిష్ణువర్ధనుని శాసనమువలనఁ గానంబడుచున్నది. రాజ్యము చేయుచుండిన శాఖ వారిని ప్రతిఘటించి యీశాఖలోని వారనేక పర్యాయములు రాజమాక్రమించుకొనఁజూచిరి కాని వీరిప్రయత్నములన్నియు నిష్ఫలములయి పోయినవి. అయినను ఈరెండవతాళరాజు వెలనాటిసీమలోఁ గొంతభాగమాక్రమించుకొని గొంతకాలము పరిపాలనచేసినట్లు గానిపించుచున్నది. వెలనాడు విషయములో నొకగ్రామమును పల్లవమల్లునివంశములో జనించిన కవివర్మయను వానిమనుమఁడగు కుప్పనయ్యయనువానికి రెండవతాళరాజు దానముచేసినట్లు గుంటూరుశాసనమొకటి దెలుపుచున్నది.

పల్లవమల్లయనునది కాంచీపురమును బరిపాలించిన కడపటి పల్లవరాజగు నందివర్మయొక్క బిరుదునామమైయున్నది. ఆట్టినందవర్మపల్లవమల్లుని వంశములోనివాఁడగు కుప్పనామాత్యుఁడు తాళరాజునకు భృత్యుఁడై యాతని సేవించుచు నాతని కరుణకుఁ బాత్రుఁడై యొకగ్రామమును బడసినది చూడఁ గాంచీపురపల్లవరాజ వంశములోని యొకశాఖవారువచ్చి యిప్పటిగుంటూరు మండలములో స్థిరనివాస మేర్పఱచుకొనిరని చెప్పుటకు తాళరాజు శాసనము పరమప్రమాణముగానున్నది. అమ్మరాజ విజయాదిత్యునివలన జెప్పఁబడిన కుప్పనయ్యపల్లవమల్లుని వంశములోనివాఁడని చెప్పఁబడక పోయినను నిరువురొక్కఁడేయై యుండునని తోఁచుచున్నది. అయిన నీయంశము విచారణీయము. ఈకుప్పనయ్యన్యరాజ్యసమయమున తాళరాజునకు నధికసాహాయ్యము చేసినందున విశ్వాసపాత్రుఁడై తాళరాజువలన సమ్మానింపఁబడినట్లుగ నాశాసనమె చాటుచున్నది. చాళుక్యరాజుల ముద్రికలపై "శ్రీత్రిభువనాంకుశ" అను బిరుదునామము గన్పట్టుచుండగా తాలరాజు ముద్రికలపై "శ్రీత్రిభువనసింహ" యని గానంబడుచున్నది కాఁబట్టి యీ రెండవరాజు చాళుక్యసింహాసన మధిష్ఠించి వేగిరాష్ట్రమును బరిపాలించినవాఁడు కాఁడనియు, కొంతకాలముమాత్రము కొంతప్రదేశమాక్రమించుకొని పరిపాలించినవాఁడనిమాత్రము చెప్పవలసియున్నది. నిజముగా నితఁడు చాళుక్యసింహాసన మెక్కినవాఁడే యైనయెడలఁదనముద్రికలపైఁ దప్పక త్రిభువనాంకుశ నామమునే వహించియుండునుగాని తద్విరుద్ధమైన నామమును వహించియుండఁడు.



## దానార్ణవుఁడు.

(క్రీ. శ. ౯౭౦ మొదలు ౯౭౩ వఱకు)

అమ్మరాజ విజయాదిత్యునికిఁ బిమ్మట నతని సవతియన్నయు రెండవ చాళుక్యభీముని జ్యేష్ఠపుత్త్రుఁడు నగుదానార్ణవుఁడు ౯౭౦ దవ సంవత్సరమున రాజ్యభారమును వహించి ౯౭౩ వఱకు మూడుసంవత్సరములు రాజ్యపాలనము చేసెను. తరువాత ౨౭ సంవత్సరములు దేశ మరాజకమైనట్లు బహుశాసనముల వలనఁ దెలియుచున్నది. ఈకాలములో చోళులీదేశమునకు దండెత్తివచ్చినట్టును కొంతకాలము వేంగిదేశమును బాలించినట్టును కొందఱు వ్రాయుచున్నారుగాని యది విశ్వసింపఁదగినదికాదు. వేంగిదేశమును జయించినట్లు చెప్పకొనిన చోళరాజులలో మొదటివాఁడు రాజరాజ రాజకేసరి వర్మ యనునాతఁడు. ఈరాజ రాజకేసరి వర్మ క్రీ. శ ౯౮౫ దవ సంవత్సరమున చోళరాజ్యమునకుఁ బట్టాభిషిక్తుఁడయ్యెను. ఇతఁడు తన పదునాలుగవ పరిపాలన సంవత్సరమున వేంగిదేశమును జయించినట్లు శాసనములు దెలుపుచున్నవి. కాఁబట్టి యితఁడు వేంగిదేశమును జయించిన సంవత్సరము ౯౯౯ దవ సంవత్సరమగుచున్నది. చోళుల దండయాత్రవలన వేంగిదేశ మరాజకమైనదని చెప్పుట సత్యముగాదు. అరాజకమునకు వేఱుకారణములుండి యుండవలయును. వేంగిదేశ మిరువదిసంవత్సరములరాజకము పాలయి కడగండ్లఁ గుడుచుచున్న కాలమున ననఁగా ౯౯౮ దవ సంవత్సరములోనో ౯౯౯ దవ సంవత్సరములోనో చోళరాజగు రాజరాజ రాజకేసరివర్మ వేంగిదేశముపై దండెత్తివచ్చి కలహములనడంచి దానార్ణవుని కార్యమహాదేవివలన జనించిన పెద్దకొడుకగు శక్తివర్మను వేంగిరాజ్యమునకుఁ బట్టాభిషిక్తునిఁ గావించి స్వదేశమునకుఁ బోయినట్లుగఁ గానంబడుచున్నది. ఇంతకన్న నాకాలస్థితి చాళుక్యశాసనములవలనఁ గాని చోడులశాసనములవలనఁ గాని లేశమాత్రమును దెలియరాకున్నది.

## శక్తివర్మ.

(క్రీ. శ. ౯౯౯ మొదలుకొని ౧౦౧౧ వఱకు)

ఇతఁడు దానార్ణవుని జ్యేష్ఠపుత్రుఁడు. తంజాపురాధీశ్వరుండును చోడ రాజు నగు రాజరాజ రాజకేసరి వర్మతోడ్పాటుతో వేంగిరాష్ట్రమునకుఁ బట్టాభిషిక్తుడై శక్తివర్మ ౯౯౯ మొదలుకొని ౧౦౧౧ వ సంవత్సరమువఱకు పండ్రెండుసంవత్సరములు రాజ్యపరిపాలనముచేసి విశేషకీర్తి సంపాదించెను. వీనికి చాళుక్యచంద్రుఁ డన్నబిరుదునామముగలదు. వీనిబంగారునాణెములుకొన్ని అరకాను, సయాము మొదలగుప్రదేశములందుఁ గానిపించినవి. వాని బిరుదు నామము లానాణెములపై నుండుటచేత నయ్యవి శక్తివర్మకాలమునాటివిగా నిర్ధారణము చేయఁబడినవి. వీని బిరుదు పేరు గల బంగారునాణెము లాదేశములఁ గన్పట్టుటచేత వీనికాలమునం దాంధ్రదేశమునకును పైఁ జెప్పినదేశములకును వర్తకవ్యాపారములు జరుగుచుండి యుండవలయును. ఆంధ్రులు మొదటినుండియు సముద్రయానముఁ జేయుచు విదేశములతోడ వాణిజ్యాదివ్యాపారములు నడుపుచుండిరనుటకు లేశమాత్రమును సందియమును బొందవలసినపనిలేదు.



పదునాలుగవ ప్రకరణము.

# విమలాదిత్యుఁడు.

(క్రీ. శ. ౧౦౧౧ మొదలుకొని ౧౦౨౨ వఱకు)

ఈ విమలాదిత్యుఁడు దానార్ణవునికి నార్యమహాదేవివలన జనించిన ద్వితీయపుత్త్రుఁడు. శక్తివర్మతమ్ముఁడు. శక్తివర్మతరువాత నితఁడు ౧౦౧౮ వ సంవత్సరమున సింహాసనమునకువచ్చి ౧౦౨౨ వఱకు నేడుసంవత్సరములు మాత్రము పరిపాలనము చేసియుండెనని కొన్నిశాసనములు స్పష్టముగాఁ దెలుపుచున్నవి గాని విమలాదిత్యునిచేఁ బ్రకటింపఁబడిన రణస్థిపూడి శాసనము శాలివాహన శకము ౯౩౩ సంవత్సరము జ్యేష్ఠశుద్ధ పంచమీగురువాసరంబున పుష్యమీ నక్షత్ర సింహాలగ్నమునం దనగా క్రీస్తుశకము ౧౦౧౧ వ సంవత్సరము మేనెల ౧౦ వ తేదిని పట్టాభిషిక్తుఁడయి నటులఁ దెలుపుచున్నది.[1]

ఇట్టి భేదమునకుఁ గారణమేమో మనము దెలిసికొనవలసియున్నది. విజయనగరమునకు సమీపము నందుండిన రామతీర్థము కడనున్న కొండమీఁద లిఖింపఁబడిన యొకశాసనము చాలమట్టుకు శిథిలమై పోయినను ముమ్మడి భీముని పేరు కలిగియుండెను.[2] ముమ్మడిభీముఁడనునది విమలాదిత్యుని బిరుదునామములో నొక్కటియగుటచేత విమలాదిత్యుఁడు కళింగదేశమును జయించి యుండవచ్చునని కొందఱు తలంచుచున్నారు. పూర్వచాళుక్యులకును వెలనాటి చోడులకును లోఁబడి కోనమండలమేలిన హైహాయవంశజులలో ముమ్మడిభీముఁడను వాఁడొకఁడుండుటచేత కేవలమును పేరునుబట్టి యే యది విమలాదిత్యుని

(1) Ep. Ind, Vol. VI,pp. 347—367.

(2) No. 372 of 1905;

శాసనమని దెలుపుట సాహసకార్యమైనను మఱియొకహేతువుచేత నయ్యది విమలాదిత్యునిదే యై యుండవచ్చునని సంశయముకలుగుచున్నది. గంజాము మండలములోని మహేంద్రగిరి మీఁద రెండుశాసనములు రాజేంద్రచోడుఁడు విమలాదిత్యుని నోడించి యాపర్వతముమీఁద జయస్తంభము నెలకొల్పెనని తెలుపుచున్నవి.[1] అయినను రాజేంద్రచోడుని ద్రావిడశాసనములలో నెచ్చటను నిట్టివిషయమును దెల్పియుండక పోవుటచేత రాజేంద్రచోడునితండ్రి యైనరాజరాజ రాజకేసరివర్మ బ్రదికియున్నకాలమున రాజేంద్రచోడుఁడు యువరాజుగనుండి యీదండయాత్రను జరిపి యుండును గావునఁ దనశాసనములలో నతఁడీ వృత్తాంతమును జేర్కొనియుండక పోవచ్చునని కొందఱు తలంచుచున్నారు. ఇక్కడ నొకముఖ్యాంశమును చదువరులు జ్ఞప్తియందుంచుకొనవలయును. చోడ చక్రవర్తియగు రాజరాజ రాజకేసరివర్మకూఁతురును రాజేంద్రచోడునిగారాబుచెల్లెలునగు కుండవాంబాదేవి విమలాదిత్యునకు వివాహముచేయఁబడి యుండెను.[2] ఈవివాహ మెప్పుడు జరిగినదో తెలియరాదు. ఇంకొక విశేషము గన్పట్టుచున్నది. తంజాపురమునకు సమీపమునందున్న తిరువైయారు గ్రామములోని పంచనాదేశ్వర దేవాలయములో రాజరాజ రాజకేసరివర్మ ౨౯ దవ పరిపాలన సంవత్సరమున విష్ణువర్ధన విమలాదిత్యునిచే నొక దానశాసనము వ్రాయించఁబడియుండెను.

రాజరాజ చోడుఁడు క్రీస్తుశకము ౯౮౫ దవ సంవత్సరమున సింహాసన మెక్కినవాఁడు గావున విమలాదిత్యుని తిరువైయారు శాసనము ౧౦౧౩ లేక ౧౦౧౮ వ సంవత్సరమున లిఖింపఁబడి యుండును. అనఁగా నాకాలమున విమలాదిత్యుఁడు తంజాపురి యందత్తవారింటనుండి యుండవలయును. మహేంద్రగిరి శాసనమువలన బావమరిదియగు రాజేంద్ర చోడునిచే నోడింపఁబడినట్లుండుటయు,తిరువైయారు శాసనమువలన విమలాదిత్యుఁడు తంజాపురమునందుండి పంచనాదేశ్వర స్వామికి దానము సలిపి నట్లుండుటయు, గన్పట్టుచుండుట

(1) No 396 and 397 of 1896; (2)South. Ind. Ins. Vol. III, p. 126; (4) No 215¡of¦1894.



చేత డాక్టరు హుల్ట్జు మొదలగువారు రాజేంద్రచోడుఁడు విమలాదిత్యుని నోడించి దక్షిణదేశమునకుఁ జెఱగొనిపోయె ననియు,అచ్చటనున్నకాలమునఁ జోడరాజు కుండవాంబాదేవిని విమలాదిత్యునికిచ్చి వివాహముచేసి వేంగిదేశమును బరిపాలించుటకు మరలఁ బంపిరనియు, విమలాదిత్యుఁడు స్వదేశమునకువచ్చి ౧౦౧౫ దవ సంవత్సరమునుండి నిరంకుశముగా దేశమును బరిపాలించెననియును, విమలాదిత్యుఁడు దక్షిణదేశమున నున్నకాలమును విడిచి పూర్వచాళుక్యుల శాసనములు వాని రాజ్యపాలనకాలము ౧౦౧౫ వ సంవత్సరమునుండి మాత్రమె పరిగణించి యేడుసంవత్సరములని వక్కాణించినవనియు సమన్వయము చేయుచున్నారు గాని తక్కినవిషయములను బాటింపుచుండలేదు. విమలాదిత్యుని మామయగు రాజరాజ చోడుఁడు ౯౮౫ దవ సంవత్సరమున సింహాసనమునకువచ్చెను. తన పదునాలుగవ పరిపాలన సంవత్సరమున ననఁగా ౯౯౯ దవ సంవత్సరమున వేంగిదేశముపై దండెత్తివచ్చి జయించెనని వానిశాసనములే దెలుపుచున్నవి. శక్తివర్మ ౯౯౯ దవ సంవత్సరమునసింహాసన మెక్కినట్లు చాళుక్యులశాసనములు దెలుపుచున్నవి. అదివఱకరాజకముగనుండిన వేంగిదేశమునందలి కలహముల నడంచి రాజరాజు శక్తివర్మను బట్టాభిషిక్తుని గావించెనని సమన్వయించిరి. విమలాదిత్యుఁడు ౧౦౧౧ వ సంవత్సరమున సింహాసనమునకువచ్చినట్లు రణస్థిపూఁడిశాసనము చాటుచున్నది. ౧౦౧౮ గవ సంవత్సరమున విమలాదిత్యుఁడత్తవారింట విందులు గుడుచుచుండెను. ౧౦౧౧ వ సంవత్సరమునకును ౧౦౧౮ వ సంవత్సరమునకును నడుమ రాజేంద్రచోడునిచే నోడింపఁబడి చెఱఁగొనిపోఁబడుటయు నచట కుండవాంబాదేవిని వివాహమాడుటయు,పంచనాదేశ్వరస్వామికి విమలాదిత్యుఁడు దానశాసనము వ్రాయించుటయు జరిగియుండెనని చెప్పెదరు. మంచిది. విమలాదిత్యుని కుమారుఁడయిన రాజరాజు ౧౦౨౨ వ సంవత్సరమున సింహాసన మెక్కినట్లు రాజరాజనరేంద్రుని కోరుమిల్లి నందమపూడి శాసనములు విస్పష్టముగా వెల్లడించుచున్నవి. అట్లయినచో రాజనరేంద్రుఁడు, సింహాసన మధిష్ఠించునప్పటికి పదేండ్లకంటె నెక్కువవయస్సుండదని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును. రాజేంద్ర

చోడుఁడు విమలాదిత్యుని జయింపకపూర్వమే కుండవాంబను విమలాదిత్యునికిచ్చి వివాహము చేసియుండినయెడల రాజేంద్ర చోడుఁడు విమలాదిత్యునితోఁ బోరాడి యోడించి చెఱగొని పోవుట కంతవిరోధ కారణమేమి యుండఁగలదు ? రాజరాజనరేంద్రుఁడు సింహాసనమునకు వచ్చునప్పటికంత బాలుఁడని యెచ్చటను వర్ణింపఁబడి యుండలేదు. ఇయ్యది విచారణీయమైన విషయము. విమలాదిత్యుఁడు ౧౦౧౧ వ సంవత్సరము మొదలుకొని ౧౦౨౨ వ సంవత్సరమువఱకుఁ బదునొకొండు సంవత్సరములు పరిపాలనము చేసెను. విమలాదిత్యునకు బిరుదాంక భీముఁడనియు, ముమ్మడి భీముఁడనియు, త్రిభువనాంకుశుఁడనియు, భూపమహేంద్రుఁడనియు బిరుదునామములుగలవు. విమలాదిత్యుఁడు ప్రభుత్వము చేయుకాలమునందే తన కుమారునకు రాజ్యపదవి నిలుచునట్లు కట్టుదిట్టములు గావించి విశ్వాసపాత్రులయిన మంత్రులు మొదలగువారికి గ్రామాదుల నొసంగి తన యనంతరముగూడ తనపట్టున విశ్వాసముగలిగి తన కుమారుని పక్షమున నిలిచియుండునట్లు చేసికొనియెను. ప్రతాపశాలియైన నృపకాముఁడు దండనాయకుఁడుగ నుండెను. వజ్జియ యను నియోగి ప్రధానమంత్రిగనుండి అమాత్య శిఖామణి యనిపేరుగాంచెను. మిక్కిలి ప్రతాపవంతుఁడును బలశాలియునైన కుద్యవర్మ వీనికిలోఁబడిన సామంతుఁడుగనుండి వీని మిత్రవర్గములోఁ జేరియుండి వెలనాఁడున కధీశ్వరుఁడుగ నుండెను.

## విమలాదిత్యునిమంత్రి.

విమలాదిత్యుని మంత్రియగు వజ్జియ ప్రెగ్గడ రణస్థిపూడిశాసనమున విశేషముగా నభినందింపఁబడియుండెను. ఇతఁడు కారమచేడు గ్రామనివాసియు. [1] కౌండిన్య గోత్రుఁడునైన బ్రాహ్మణుఁడుగానుండెను. ఇతఁడు పరిశుద్ధమైనవాక్కును, పవిత్రమైన వర్తనమును గలిగి బ్రాహ్మణ కులమునకు భాస్కరునివలె నున్నవాఁడని గొనియాడఁబడియుండెను. ఈవజ్జియ ప్రెగ్గడ అమాత్యశిఖామణియనియు, బుధవజ్రప్రకారుఁడనియు, సౌజన్యరత్నాకరుఁడనియు

1 కారంచేడు గ్రామము గుంటూరు మండలమున బాపట్లకుఁ బడమటగా మైళ్లదూరమున నున్నది.



బిరుదునామములను వహించి యాంధ్రదేశమునం దంతటఁ బ్రఖ్యాతివహించెను. ఈబ్రాహ్మణప్రభువు మనోవాక్కాయ కర్మంబులఁ బరిశుద్ధుఁడయిన కుండిన ఋషీంద్రుని వంటివాఁడఁట. మఱియు శివభక్తుఁడు. యజ్ఞయాగాది క్రతువుల నాచరించినకర్మిష్ఠి. ఔదార్యచిత్తముగలవాఁడు. ఇతఁడు తనప్రజ్ఞావిశేషముచేత విమలాదిత్యుని పరిపాలనము జయప్రదమైనదిగాఁ జేయుటకు బహుకష్టపడినందున విమలాదిత్యుఁడు సంతోషించి వాని ప్రభుభక్తికి మెచ్చుకొని గుద్రవాడి విషయములోని పాఱువళి మనుగ్రామముతోఁ గూడ రణస్థిపూండిగ్రామము నగ్రహారముగా నేర్పాటుచేసి దానముచేసెను. ఈరణస్థిపూడిగ్రామముచుట్టును గ్రొంతకట్టు (మోడేకుట్టు) ఉల్ల (లొల్ల), సిరిపొడపూండి (పెదపూడి) చింతగుంట, పెంజెఱువు మొదలగు గ్రామములు పేర్కొనఁబడియుండుటచేత ఈరెండుగ్రామములు గోదావరిమండలములోనిఅమలాపురము తాలూకాలోనివిగాఁ గన్పట్టుచున్నవి. పాఱువళిగ్రామ మమలాపురము కాలువయొడ్డున నున్న పలివెల గ్రామముగానున్నది. ఈశాసనమును వ్రాసినవాఁడుభీమనభట్టు.

## రాజరాజవిష్ణువర్ధనుఁడు.

(క్రీ. శ. ౧౦౨౨ మొదలుకొని ౧౦౬౩ వఱకు)

ఆంధ్రదేశమును బరిపాలించిన పూర్వరాజులలో నీరాజరాజ విష్ణువర్ధనుఁడు మిక్కిలి యదృష్టవంతుఁడని చెప్పఁదగి యున్నవాఁడు. తమ భుజబల పరాక్రమముచేత దక్షిణ హిందూదేశమునంతను జయించి శత్రుజనభయంకరులై యుండిన చోడరాజులకు నితఁడు రక్తబంధువగుటంజేసి పరరాజు లెవ్వరును వీనినిగాని వీనిరాజ్యమునుగాని మార్కొన సాహసింపఁ జాలకుండిరి. అందువలన నాంధ్రదేశమునకు శాంతియును, వీనికి మనస్స్వాస్థ్యమును లభ్యములయ్యెను. వీని తండ్రియగు విమలాదిత్యుఁడు రాజరాజచోడునికూఁతురును, రాజేంద్రచోడుని చెల్లెలు నగుకూండవాంబాదేవిని వివాహమాడెనని యింతకుఁబూర్వముఁ దె

లిసికొని యుంటిమి.[1] విమలాదిత్యునికి కూండవాంబా దేవియందు జనించిన జ్యేష్ఠపుత్త్రుఁడే మన యీరాజరాజ విష్ణువర్ధనుఁడు. ఇతఁడు రాజరాజ చోడుని మనుమఁడగుటంజేసి వీనిని చోడులు రాజరాజని పిలుచుచుండిరి. చాళుక్యులు వీనిని విష్ణువర్ధనుఁ డనుచుండిరి. రాజరాజను పేరు వహించిన వేంగిరాజులలో నితఁడు మొదటివాఁడును విష్ణువర్ధన నామమును వహించిన వారిలో నితఁడు తొమ్మిదవవాఁడునై యుండెను. వీనికి విజయాదిత్యుఁడను తమ్ముఁడుగూడ గలఁడు.

ఈరాజనరేంద్రుఁడు శాలివాహనశకము ౯౪౪ వ సంవత్సరము శ్రావణ బహుళ ద్వితీయా గురువారము నాఁడుత్తరాభాద్ర నక్షత్రమున సింహాసన మెక్కినట్టు కోరుమల్లి నండమపూడి శాసనములవలన విస్పష్టమగుచున్నది.[2] ఈ కాలము లెక్కవేసిచూడఁగా క్రీస్తుశకము ౧౦౨౨ వ సంవత్సరము జూలయి నెల పంతొమ్మిదవ తేదితో సరియగుచున్నది. మఱియును రాజనరేంద్రుని మునుమఁడయినకులోత్తుంగ చోళదేవుఁడు గోదావరి మండలములోని కోరంగికి సమీపమున నుండు చెల్లూరు గ్రామము కొలను కాటమ నాయకున కిచ్చినట్టియు

(1) శ్లో. తస్మాచ్చాళుక్యచూడామణి రథవిమలాదిత్య దేవాన్మహీశా
చ్చోడక్ష్మాపాలలక్ష్మ్యా ఇవరచితతపోః కూండవాయాశ్చదేవ్యా
జాతశ్శ్రీరాజరాజోరజనికరకులశ్రీమ దంభోధిరాజో
రాజద్రాజన్యసేవ్యా మభృతభుజబలాద్రాజ్య లక్ష్మీంపృథివ్యామ్

అని రాజరాజ నరేంద్రునికోరుమల్లిశాసనమునం గూడ స్పష్టముగాఁ జెప్పఁబడినది.

(2) Ind. Aut. Vol XIV. p. 55; Ep, Ind. Vol IV. pp 300-309.

"వసంతితిలక. యోరక్షితుం వసుమతీమ్ శకవత్సరేషు
వేదాంబురాశినిధి వర్తిషుసింహగేర్కే
కృష్ణద్వితీయదివసోత్తర భాద్రికాయాం
వారేగురోర్వణిజలగ్నవరేభిషిక్తః."



కాలేరగ్రహారమును దాక్షారామ పీఠికాపుర సత్రములను జరుపుటకయి ముద్గల గోత్రుఁడును పోతనార్యుని పుత్త్రుఁడునయిన మేడమార్యుఁడను బ్రాహ్మణున కిచ్చినట్టియు దానశాసనములనుబట్టి రాజరాజ నరేంద్రుని కుమారుఁడయిన కులోత్తుంగ చోడదేవుఁడు శాలివాహనశకము ౯౮౫ వ సంవత్సరమనఁగా క్రీస్తుశకము ౧౦౬3 వ సంవత్సరమున రాజ్యమునకు వచ్చినట్టు చెప్పఁబడియున్నదిగనుక రాజగాజ నరేంద్రుఁడు ౧౦౨౨ వ సంవత్సరము మొదలుకొని ౧౦౬3 వ సంవత్సరమువఱకును ౪౧ సంవత్సరములు నిరాతంకముగా రాజ్యపరిపాలనము చేసినట్లు సిద్ధాంత మగుచున్నది.[1]

విమలాదిత్యుఁడు రాజేంద్రచోడునిచేఁ జెఱఁగొని పోఁబడి తంజాపురియందుండిన కాలమున కూండవాంబాదేవిని వివాహమాడినది వాస్తవమగునేని రాజనరేంద్రుఁడు ౧౦౧౧ వ సంవత్సరమునకును ౧౦౧౪ వ సంవత్సరమునకును నడుమజనించి యుండవలయునుగావున సింహాసన మెక్కునప్పటికిఁ బదిపంౘెండు సంవత్సరముల బాలుఁడైయుండవలయును. అటుగాక ౯౯౯దవ సంవత్సరమున విమలాదిత్యునియన్న యగుశక్తివర్మ సింహాసనమునకు వచ్చినతరువాత కూండవాంబను విమలాదిత్యుఁడు వివాహమాడి పుత్రజననమును గాంచినను రాజనరేంద్రుఁడు సింహాసన మెక్కునప్పటికి నిరువదియేండ్లలోపలి వయస్సుగలవాఁడై యుండును. శాసనములను జక్కఁగాఁ బరిశోధించి చూచినపక్షమున మొదటివృత్తాంతమె నమ్మఁదగియున్నది. ఈరాజరాజ నరేంద్రుఁడు సింహాసనమెక్కినతరువాత యుక్తవయస్సువచ్చినతోడనే మేనమామయు చోడచక్రవర్తియునగు గంగయికొండ రాజేంద్ర చోడునికూఁతురగు అమ్మంగదేవిని వివాహమాడెను. ఈవివాహ మెప్పుడు జరిగినదియుఁ దెలియరాదుగాని రాజనరేంద్రుఁ

(1) "శ్లో. తత్తనయోనయశాలీ జయలక్ష్మీధామ రాజరాజనరేంద్రః
చత్వారింశత (మ) బ్దానేకంచ పునర్మహీమపాలయ దఖిలామ్."
"తదనుజో విమలాదిత్యస్సప్త, తత్పుత్రో రాజరాజదేవ ఏకచత్వారింశత్. తత్పుత్ర శ్రీకులోత్తుంగ చోడదేవ ఏకోనపంచాశత్ ...... రాజ్యం ప్రశాసతి."

డు సింహాసనమెక్కిన తరువాతనె జరిగినదనుట మాత్రము వాస్తవమనుటకు సందియములేదు. రాజనరేంద్రుని పరిపాలనకాల మీయాంధ్రదేశమునకు మిక్కిలి మంచికాలమని చెప్పుటకు సంశయింపబనిలేదు. ఇంతకుఁ బూర్వమనేకపర్యాయములు రాజోపద్రవములచేఁ బీడింపఁబడు చుండినయీయాంధ్రదేశ మీపరగండ భైరవుండగు రాజరాజ నరేంద్రునికాలములో స్వస్థతనుఁ గాంచి దివ్యసుఖములను గాంచెను. ఇతఁడింత దీర్ఘకాలమునిష్కంటకముగా దేశపాలనముఁ జేయుటకుఁ గారణము బలాఢ్యులయినచోడులయొక్క సహాయమేగాని యన్యముగాదన్నియు, వారిసహాయములేనియెడల నిట్టిస్వాస్త్యము గలుగనేరదనియుఁ గొందఱు తలంపవచ్చునుగాని పరాక్రమంబున రాజనరేంద్రుఁడు పూర్వరాజుల కెంతమాత్రమును దీసిపోయిన వాఁడుకాఁడు.

## రాజనరేంద్రుని బిరుదునామములు.

సత్యాశ్రయకులశేఖరుఁడు, సర్వలోకాశ్రయుఁడు, రాజకంఠీరవుఁడు, త్రిభువనాంకుశుఁడు, సమస్తభువనాశ్రయుఁడు, బిరుదాంకభీముఁడు, రాజమహేంద్రుఁడు, రాజమార్తాండుఁడు, పరగండభైరవుఁడు, రాజపరమేశ్వరుఁడు మొదలగు బిరుదునామము లెన్నోవహించి రాజరాజ నరేంద్రుఁడు సుప్రఖ్యాతిఁ గాంచినవాఁడని నన్నయభట్టనేకబిరుదునామములతో నభివర్ణించుటయేగాక.

"ఉ. రాజకులైకభూషణుఁడు రాజమనోహరుఁ డన్యరాజతే
జోజయశాలి శౌర్యుఁడు విశుద్ధయశశ్శరదిందుచంద్రికా
రాజితసర్వలోకుఁ డపరాజితభూరిభుజాకృపాణధా
రాజలశాంతశాత్రవపరాగుఁడు రాజమహేంద్రుఁడున్నతిన్
అనియు,

వసంతతిలకము.

"వీరావతారనుకవిస్తుతనిత్యధర్మ
ప్రారంభశిష్టపరిపాలనశక్తరాజా



నారాయణాఖ్య కరుణారసపూర్ణవీర
శ్రీరమ్యరాజకుల శేఖరవిష్ణుమూర్తీ.

అని రాజనరేంద్రుని "నారాయణాఖ్యుఁ" డనియు, "విష్ణుమూర్తి" యనియుఁ బొగడియున్నాఁడు.

కాఁబట్టి తావికిఁ బరిమళమబ్బినట్లుగ నిట్టిరాజనరేంద్రునకుఁ బలపరాక్రమవంతులయిన చోడులతోడ బాంధవ్య మబ్బుటవలనగూడ వీనిపరిపాలనము వేయివిధంబులఁ బరిశోభించి ప్రశంసనీయమయ్యెను. దేశోపద్రవకరములైన విషయంబులేవియును దటస్థింపక దేశమంతయు సుభిక్షముగా నున్నందునఁగాఁ బోలుఁదనకుఁగల దానితోఁ దృప్తినొంది పరరాజులతోడఁ గయ్యమునకు డీకొనక తనకాలమును విద్యావ్యాసంగములతోడ గడిపి యుండెను.

## రాజమహేంద్రవరము.

రాజమహేంద్రపురము రాజమహేంద్రుఁడని బిరుదుగాంచిన అమ్మరాజవిష్ణువర్ధనుని కాలముననో యీరాజరాజ విష్ణువర్ధనునికాలముననో గట్టఁబడియుండును. ఎవరిచేతఁ గట్టఁబడినను రాజరాజనరేంద్రునకు రాజధానిగనుండెననుట వాస్తవము. ఈరాజమహేంద్రపురము వేగీరాజ్యములో మధ్యమభాగమున నుండుటచేత రాజనరేంద్రుఁ డిం దొకకోటనుగట్టి తనకు రాజధానిగఁ జేసికొని చిరకాలము రాజ్యపాలనము చేసెను. రాజమహేంద్రపురము వేగీదేశంబునకు నాయకరత్నంబని నన్నయభట్టు మహాభారతమునఁ జెప్పియున్నాఁడు. ఈపట్టణమునకుఁ గలిగినప్రఖ్యాతి రాజనరేంద్రుని మూలమున గలిగినదేగాని మఱియొకరి మూలమునఁ గలిగినదికాదు. అందుచేతనే విన్నకోట పెద్దన్న యనుకవి తనకావ్యాలంకారచూడామణిలో తనకృతికర్తయగు విశ్వేశ్వరమహారాజువంశమును వర్ణించునపుడు

"సీ. శ్రీకంఠచూడాగ్ర శృంగారకరణమే
రాజున కన్వయారంభగురుఁడు

చాళుక్యవంశభూషణము శ్రీవిష్ణువ
ర్ధనుఁ డేమహీశు తాతలకుఁ దాత
భృతకుమారారామ భీముండు చాళుక్య
భీముఁ డే నృపకులాబ్ధివిధుండు
రాజమహేంద్రవరస్థాతరాజన
రేంద్రుఁ డెక్కువ తాత యేవిభునకు
వంద్యదళదానవోపేంద్రుఁ డగు నుపేంద్ర
ధరణీవల్లభుఁ డేరాజు తండ్రితాత
ఘనుఁడుపేంద్రాఖ్యుఁ డెవ్వని కన్నతండ్రి
యతఁడు విశ్వేశ్వరుడు లక్కమాంబసుతుఁడు."

అనుపద్యములో రాజనరేంద్రుని రాజమహేంద్రవరస్థాతయని యొక మహాద్విషయముగఁ జెప్పినదానినిబట్టిచూడ రాజనరేంద్రునకును రాజమహేంద్రపురవరమునకును విశేషసంబంధము గలదనియును, రాజమహేంద్రపురంబునందుండి రాజ్యపరిపాలనముచేసిన మొదటిచళుక్య ప్రభువు రాజనరేంద్రుఁడే యని సూచించుచున్నట్టు గన్పట్టఁగలదు.

## రాజరాజనరేంద్ర భోజరాజులు సమకాలీనులు.

రాజమహేంద్రపరము రాజధానిగా నాంధ్రదేశ మేలినరాజరాజనరేంద్రుఁడును ధారాపురము రాజధానిగా మాళవదేశము నేలినభోజమహారాజును సమకాలీనులగుట మాత్రమెగాక సమానలక్షణములనుగూడ గొన్నిటినిగలిగియుండిరని తెలిసికొనినప్పు డెంతయానందము కలుగుచున్నది. భోజరాజు ౧౦౧౮ వ సంవత్సరము మొదలుకొని ౧౦౬౦దవ సంవత్సరమువఱకును నలువది సంవత్సరములకుఁబైగా రాజ్యపాలనము చేసియుండెను. భోజమహారాజు సంస్కృతపండితులను, సంస్కృతకవుల నాదరించి సంస్కృతభాష నుద్ధరించెను. మన యీరాజరాజనరేంద్రుఁడు సంస్కృతభాషాకవులను మాత్రమెగాక దేశభాషాకవుల కగ్రహారములు మొదలగునవి యిచ్చిపోషించి దేశభాషల నుద్ధరించెను.



భోజమహారాజు సరిహద్దులనుండు రాజులతోడను గజినీమామూదు సైన్యములతోడనుబోరాడవలసివచ్చి యతనిమనస్స్వాస్థ్యమునకుఁ గొంతభంగము కలుగుచువచ్చెనుగాని మనయీరాజరాజనరేంద్రునకట్లు చేయఁదగిన యుద్ధములేవియును లేక మనంబు నిశ్శంకముగ నుండెను. అయిన నిరువురకును విద్యావ్యాసంగముల నభిరుచి మెండుగ నుండెను. భోజరాజు సంస్కృతపండితులచే సంస్కృతభాషలోనే బహుగ్రంథములను రచింపించియు, సంస్కృత కలాశాలను స్థాపించినవాఁడగుటచేత భరతఖండమునందంతటఁ బ్రఖ్యాతిఁగాంచుటకుఁ గారణమయ్యెను. రాజనరేంద్రుఁడు తనదేశభాషనుద్ధరించి తరింపఁజేయుకొఱకే విశేషకృషి సల్పినవాఁడగుటచేత నొక్కయాంధ్రదేశముననే ప్రసిద్ధికెక్కియాంధ్రమహాజనులకృతజ్ఞతకు మాత్రమె పాత్రుఁడయ్యెను. భోజమహారాజు వీరమరణమైనను శత్రుజనమధ్యమునఁ బ్రాణములు విడువవలసినవాఁడయ్యెను. రాజనరేంద్రుని కట్టిది సంభవింపలేదు. రాజనరేంద్రునికాలము సుఖతరంబుగ నడిచెను. రాజనరేంద్రుఁడు భోజరాజుకంటె నదృష్టవంతుఁడని చెప్పవలయును.

## రాజనరేంద్రుఁడు కావ్యగీతి ప్రియుఁడు.

రాజరాజు సరసుఁడును గావ్యగీతిప్రియుఁడునని నన్నయభట్టు మహాభారతమునందుఁ జెప్పియున్నాఁడు. అందుచేతనే యాతని కొల్వుకూట మెప్పుడును బహుభాషాపండితులచే నలంకరింపఁబడుచుండెను. వీనికెప్పుడును భారతమును వినుటయం దభిరుచి మెండుగాఁగలదు. బహుభాషలలో బహువిధముల బహుజనులచేఁ జెప్పంబడుచుండిన మహాభారతకథను వినుచుండియు దృప్తినొందఁజాలక తెనుంగుబాసలోఁగూడ వినవలయునని యాతనికెంతో యభిలాషము గలదు.

## నన్నయభట్టు.

ఒకనాఁడు రాజరాజవిష్ణువర్ధనుఁడు విద్వజ్జనంబులచేఁ బరివేష్టింపఁబడి నిండుకొలువున్నకాలమున మంత్రి పురోహిత సేనాపతి యువరాజ దౌవారిక ప్రధానసమక్షంబునఁ దనకులబ్రాహ్మణుండును, అనురక్తుండును, [illegible]జపహోమతత్పరుండును, విపులశబ్దశాసనుండును, సంహితాభ్యా[illegible] బ్రహ్మాండాది

నానాపురాణవిజ్ఞాననిరతుండును, ఆపస్తంబసూత్రుండును, ముద్గలగోత్రజాతుండును, సద్వినుతావదాతచరితుండును, లోకజ్ఞుండును, ఉభయభాషాకావ్యరచనాభిశోభితుండును, సత్ప్రతిభాభియోగ్యుండును, మత్యమరాధిపాచార్యుండును, సుజనుండును నగునన్నపార్యునింజూచి యిట్లనియెను.

చ. విమలమతిన్ బురాణములు వింటి ననేకము లర్థధర్మశా
స్త్రముల తెఱంగెఱింగితి నుదాత్తరసాన్విత కావ్యనాటక
క్రమములు పెక్కుచూచితి జగత్పరిపూజ్యములైన యీశ్వరా
గమములయందునిల్పితిఁ బ్రకాశముగా హృదయంబు భక్తి
తోన్.

మ. ఇవి యేనున్ సతతంబు నా యెడఁగరంభిష్టంబులై యుండుఁ బా
యవు భూదేవకులాభితర్పణమహీయఃప్రీతియున్ భారత
శ్రవణాసక్తియుఁ బార్వతీపతిపదాబ్జధ్యానపూజామహో
త్సవమున్ సంతతదానశీలతయు శశ్వత్సాధుసాంగత్యమున్
మఱియు నదియునుంగాక.

చ. హిమకరుఁదొట్టి పూరుభరతేశకురుప్రభుపాండుభూపతుల్
క్రమమున వంశకర్తలనఁగా మహినొప్పిన యస్మదీయవం
శమునఁ బ్రసిద్ధులై విమలసద్గుణశోభితులైన పాండవో
త్తముల చరిత్ర నాకు సతతంబువినంగనభీష్టమెంతయున్"

ఈపైని చెప్పఁబడినపద్యములలోని భావములనుబట్టి శైవమతాభిమానముఁ గలవాఁడనియు, అనవరతంబును శ్రీమహాభారతమునందలి యభిప్రాయమును విననభిలాషగలవాఁడనియు స్పష్టముగఁ దేటపడుచున్నది. కనుక నే రాజమహేంద్రుఁడు.

"జననుత కృష్ణద్వైపా
యనముని వృషభాభిహితమహాభారతబ
ద్ధనిరూపితార్థమేర్పడఁ
దెనుఁగున రచియింపు మధికధీయుక్తిమెయిన్."



అని మహాభారతమును దెనుఁగున రచియింపుమని నన్నపార్యునిఁగోరెను. హిమకరపూరుభరతేశకురుప్రభుపాండుభూపతులవంశమునందుఁ దాను జనించెనని తనపూర్వులును తన్నాశ్రయించుకొనియుండు పురోహితులు మొదలగువారును జెప్పెడుగాథలను విశ్వసించినవాఁడగుటచేతఁగూడ తనపూర్వులయిన పాండవులచరిత్రమును వినం గుతూహల మాతనికి స్వాభావికముగా నగ్గలమై యుండవచ్చును. కావున నట్లు మహారాజాధిరాజుచేఁ బ్రేరేపింపఁబడి విద్వత్కవిశిరోమణియు బుద్ధియందు బృహస్పతియునగు నన్నయార్యుఁడు వాఙ్మయదురంధరుండయిన నారాయణభట్టు సహాయముతో మహాభారతములోని మొదటి రెండుపర్వములను మూడవపర్వములోని కొంతభాగమును మాత్రముఁ దెలిగించెను.

## నన్నయభట్టాది కవిగాఁడు.

## ఆంధ్రభారతము ప్రథమాంధ్రకావ్యముగాదు.

నన్నయభట్టునకుఁ బూర్వమునఁ గవులెవ్వరును, ఆంధ్రభారతమునకుఁ బూర్వమున నాంధ్రగ్రంథము లెవ్వియును వినంబడకుండుటయుఁ గానరాకుండుటయుంజేసి నన్నయభట్టే ప్రథమాంధ్రకవియనియు, ఆంధ్రభారతమె ప్రథమాంధ్రగ్రంథమనియుఁ గొందఱియభిప్రాయమై యున్నదిగాని వారివాదమును మేము విశ్వసింపఁ జాలకున్నారము. ఏతద్విషయమై గావింపఁబడిన చర్చలను సంపూర్ణముగా వినియుంటిమి. తత్పక్షమున వ్రాయంబడిన నన్నయభట్టారకచరిత్రమాదిగాఁగల గ్రంథములను, ఆగ్రంథములలోనియుక్తులను, మేము సాంతముగఁ జదివియుంటిమి. అవి యేవియును మావిశ్వాసమును మరలింపఁ జాలకున్నవి. మహాభారతమును దెనుఁగున రచింపుమని రాజరాజనరేంద్రుఁడు నన్నయభట్టును గోరునప్పటికే నన్నయ ఉభయభాషాకావ్యరచనాభిశోభితుండని రాజనరేంద్రునిచేఁ బేర్కొనంబడియెనని నన్నయ్య మహాభారతమునందు

స్పష్టముగాఁ జెప్పియుండుటయె నన్నయభట్టారక చరిత్రమునందలి యుక్తులన్నియు గాలికి దూదిపింజె లెగిరిపోవునట్లెగిరి పోవుచున్నవి. నన్నయకాలమునందే యాంధ్రకవులనేకులు ప్రసిద్ధికెక్కియున్నారు. వారిలో నారాయణభట్టొకఁడుగ నున్నాఁడు. నారాయణభట్టు తనకీకార్యమునందుఁ దోడ్పడినట్లుగా నీక్రిందిపద్యమున నన్నయభట్టె చెప్పియున్నాఁడు.

ఉ. "పాయక పాకశాసనికి భారతఘోరరణంబునందు నా
రాయణునట్లు, తానును ధరామరవిభూషణుండు నా
రాయణభట్టు వాఙ్మయధురంధరుఁడుం దన కిష్టుఁడు న్సహా
ధ్యాయుఁడు నైన వాఁడభిమతంబుగఁదోడయి నిర్వహింపగన్

నారాయణభట్టు.

నందమపూడి శాసనము.

"నన్నయలిఖితమైన యొక శాసనమున నారాయణభట్టు కర్ణాటకభాషయందుఁ బండితుఁడని తెలుపఁబడియున్నదిగావున నీకన్నడపండితుని సహాయముచే శబ్దమణిదర్పణపద్ధతిని మనయాంధ్రమును భట్టారకులవారు శాసించి"రని నన్నయ భట్టారకచరిత్రమునందలి కల్పితవాక్య మాంధ్రప్రపంచముయొక్క సంపూర్ణవిశ్వాసమును పెడత్రోవను బట్టించుచున్నది గనుక దానినెంతమాత్రమును విశ్వసింపరాదు. ఒక్క కర్ణాటకపండితుఁడని మాత్రము నన్నయలిఖితమైన శాసనమునందుఁ దెలుపంబడియుండలేదు. నన్నయలిఖితమని చెప్పఁబడుశాసనము నందమపూండి (నందంపూడి-ఇది ప్రస్తుత పుకృష్ణామండలములో తణుకుతాలూకాలోని సెట్టిపేటకు సమీపమున నెట్టికాలువయొద్దనున్నది) శాసనమేగాని మఱియొకటిగాదు.[1] సింధుయుగమంతర దేశమను నామాంతరముగల రెండేఱులవాడి విషయములోని యీనందమపూండిగ్రామమును చంద్రగ్రహణ పుణ్యకాలమున రాజరాజనరేంద్రుఁడు తన ముప్పదిరెండవ పరిపాలన సంవత్సరము నఁగా (బహుళః) శాలివాహనశకము ౯౭౫ వసంవత్సర మార్గశిరశుద్ధ ౧౫ భానువారమునకుసరియైన క్రీస్తుశకము ౧౦౫౩ వ సంవత్సరము నవంబరునెల ౧౬ తేదిని మంత్రిపురోహిత సేనాపతియువరాజదౌవారికప్రధానసమక్షంబున నారాయణభట్టునకు నగ్రహారముగా ననుభవింప ధారపోసెను. ఈనారాయణభట్టు సంస్కృతకర్ణాటప్రాకృతపైశాచికాంధ్రభాషాసుకవిరాజశేఖరుండనియు కవీభవజ్రాంకుశుండనియును, అష్టాదశావధారణచక్రవర్తియనియు నందుఁ బేర్కొనంబడి యుండెను. మఱియు హారితగోత్రుండు నాపస్తంబసూత్రుండు నైన కాంచనసోమయాజిప్రపౌత్రుండును, కాంచనార్యుని పౌత్రుండును శౌచాంజనేయుని పుత్త్రుండుననియుంగూడ పేర్కొనఁబడియుండెను. ఈనారాయణభట్టుతండ్రి యగుశౌచాంజనేయునకు అకలంకాశాంకనామాత్యుఁడను నామాంతరము గలదు. ఈయమాత్యవరునకు సామికాంబవలన జనించినవాఁడె మననారాయణభట్టు. ఈకవిరాజశేఖరునిసహాయముతో మననన్నయభట్టమహాకవి మహాభారతమును దెలిగింపఁబూనెను. మహాభారతమును నన్నయభట్టు సాంతముగాఁ దెలిగింపక యారణ్యపర్వము నడుమనే విడిచిపెట్టుటకుఁ గారణము రాజనరేంద్రుని మరణమేకాని వేఱొండుగానేరదు. కావున భారతము రాజనరేంద్రుని పరిపాలనావసానదశయందుఁ బ్రారంభింపఁబడియుండును. అట్లుగాక రాజనరేంద్రునికాలముననే నన్నయభట్టు మరణము నొంది యుండుటగాని లోకాపవాదము ప్రకారము నన్నయభట్టునకు మతిభ్రమణము కలిగియుండుటగాని జరిగి తన్మూలమున భారతము తెలిగింపఁబడక నిలిచి యుండునేని అంతటి యభిమానముగలరాజనరేంద్రుఁ డంతటికవిరాజశేఖరుండయిననారాయణభట్టుచేఁ బూర్తిచేయింపఁకుండె ననుమాట విశ్వసింపఁదగినది కాదు. కాఁబట్టి యాంధ్రభారతరచనము జరుగుచున్నకాలమునందు రాజనరేంద్రుఁడు మరణమునొంది యుండవలయును. రాజనరేంద్రుని మరణానంతరము నేడుసంవత్సరములవఱకు రాజనరేంద్రునికుమారుఁడగు రాజేంద్రచోడుఁడు సింహాసనమునకు రాకపోవుటయు, రాజనరేంద్రునికిఁ బిమ్మట రాజనరేంద్రుని తమ్ముఁడగు విజయాదిత్యుఁడు రాజ్యమాక్రమించుకొనుటయు సంభవించినదిగావునఁ గొంతవఱకు దేశోపద్రవము సంభవించి మనకవివరులచేఁ బ్రారంభింపఁ

1. Ep. ind Vol. IV, pp. 300-309. No. 43.

డీన భారతరచనము మూలఁబడియుండవచ్చును. కాఁబట్టి మహాభారతరచనము నకుముందే ఉభయభాషాకావ్యరచనాభిశోభితుండై నన్నయభట్టును, సంస్కృతప్రాకృతకర్ణాటపైశాచికాంధ్రభాషాకవిరాజశేఖరుండై నారాయణభట్టును, ప్రసిద్ధిఁ జెందియుండ నన్నయభట్టే యాదికవియనియు, ఆంధ్రభారతమే మొదటి గ్రంథమనియు, ఆంధ్రకవితాసతి నన్నయభట్టునకే జనించినదని చెప్పెడివారి వాదము నెంతమాత్రమును మేము విశ్వసింపఁ జాలకున్నారము.

## పావులూరి మల్లనకవి.

ఇతఁడు తెనుఁగున గణితశాస్త్రమును రచించినమహాకవి. ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; శివ్వన్నపుత్త్రుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; గార్గ్యగోత్రోద్భవుఁడు; కమ్మనాడులోని పావులూరుగ్రామమునకుఁ గరణమైయున్నాఁడు. ఈకవి తనకు రాజనరేంద్రుఁడు పిఠాపురసమీపమున నున్న నవఖండవాడ యనుగ్రామము నిచ్చినట్లుగా నీక్రిందిపద్యమునం జెప్పుకొని యున్నాఁడు.

"ఉ. శ్రీలల నేశుఁ డాంధ్రనృపశేఖరుఁడై చనురాజరాజభూ
పాలకుచేతఁ బీఠపురిపార్శ్వమున న్నవఖండవాడ యన్
ప్రోలు విభూతితోఁ బడసి భూరిజనస్తుతుఁడై నసత్కళా
శీలుఁడ రాజపూజితుఁడ శివ్వనపుత్రుఁడ మల్లనాఖ్యుఁడన్.

దీనినిబట్టి యీపావులూరి మల్లనకవియు రాజనరేంద్రునికాలమునం దున్నవాఁడని స్పష్టపడుచున్నది. ఇట్లు నన్నయభట్టు నారాయణభట్టు, పావులూరిమల్లన ఆంధ్రగ్రంథరచనయందు నిపుణులయినట్టు గానంబడుచుండఁగా నాంధ్ర కవితాసతి అప్పుడే యవతరించినదని చెప్పెడిమాట యెట్లు విశ్వసింపవచ్చును. భాషయెన్నఁడు నొక్కసారిగ సంస్కరింపఁబడునదికాదు, ఆంధ్రభాషాసంస్కరణము నన్నయకు బహుకాలమునకుముందే ప్రారంభమయి యుండునుగాని యొక్కసారిగ సంపూర్ణస్థితికిఁ దేఁబడెననుటయు విశ్వసింపఁ దగినదికాదు.



## కోరుమల్లి శాసనము.

రాజరాజవిష్ణువర్ధనమహీపాలుఁడు సంస్కృతకర్ణాటపైశాచికాంధ్రభాషాకవిరాజశేఖరుం డగునారాయణభట్టునకు నందమపూడి గ్రామమును, మహాకవి యగుపావులూరిమల్లనామాత్యునకు నవఖండవాడ యనుగ్రామమును, దానము చేసినట్లుగా నందమపూడిశాసనమువలనను, పావులూరి మల్లనకవివిరచితమైన గణితశాస్త్రమువలనను దెలిసికొంటిమిగదా. ఇట్లేయాపస్తంబసూత్రుఁడును భారద్వాజగోత్రుఁడు నగుచీదమార్యుఁ డనుబ్రాహ్మణునకు కోరుమల్లి నామగ్రామమును చంద్రగ్రహణపుణ్యకాలమున దానముచేసి యుండెను. [1] ఇట్టి కవులను బండితులను నాదరించి యగ్రహారములు మొదలగునవి యిచ్చి భాషాపోషణము మొదలగుసత్కార్యము లాచరించిన వాఁడగుటచేతనే నన్నయభట్టు తనభారతమునందు రాజనరేంద్రుని

"సీ. నిజమహీమండలప్రజఁ బ్రీతిఁ బెంచుచుఁ
బరమండలములధరణిపతుల
నదిమి కప్పంబుల ముదముతోఁ గొనుచును
బలిమి నీయనిభూమివలయపతుల
ను క్కడఁగించుచు దిక్కులఁ దనయాజ్ఞ
వెలిగించుచును విప్రకులము నెల్లఁ
బ్రోచుచు శరణన్నఁ గాచుచు భీతుల
నగ్రజన్ములకు ననుగ్రహమునఁ
జారుతరమహాగ్రహారంబు లిచ్చుచు
దేవభోగముల మహావిభూతిఁ
దనరఁ జేయు చిట్లు మనుమార్గుఁ డగువిష్ణు
వర్ధనుండు వంశవర్ధనుండు."

1. Ind. Ant. Vol XIX, p. 129; ఈకోరుమల్లి గోదావరిమండలములో రామచంద్రపురము తాలూకాలో నున్నది.

అని యభివర్ణించియున్నాఁడు. కాఁబట్టి భూదేవకులాభితర్పణమహీయఃప్రీతియును, భారతశ్రవణాసక్తియును, పార్వతీపతిపదాబ్జధ్యానపూజామహోత్సవమును, సంతతదానశీలతయును, శశ్వత్సాధుసాంగత్యమును, తనకుఁ గరం బిష్టంబులై యుండునని రాజనరేంద్రుఁడు చెప్పుకొన్న దానిలో నసత్యము గాని యతిశయోక్తిగాని లవమాత్రమును గానరాదు.

## కృతఘ్నాపవాదములు.

నన్నయభట్టంతటివిద్వత్కవి రాజసింహునిచే.

“క. విమలాదిత్యతనూజుఁడు
విమలవిచారుఁడుఁ గుమారవిద్యాధరుఁ డు
త్తమచాళుక్యుఁడు వివిధా
గమవిహితశ్రముఁడు తుహినకరుఁ డురుకాంతిన్.”

చ. ఘనదురితానుబంధకలికాలజదోషతుషారసంహతిన్
దనయుదయప్రభావమున దవ్వుగఁ జోపి జగజ్జనానురం
జనముగ రాజ్యసంతతవసంతనితాంతవిభూతి నెంతయుం
దనరుఁ జళుక్యమన్మథుఁడు ధర్మదయార్ద్రని బద్ధబుద్ధియై

ఉ. ఆశ్రితపోషణంబున ననంతవిలాసమునన్ మనీషివి
ద్యాశ్రమతత్త్వవిత్త్వమున దానగుణాభిరతిన్ సమస్తవ
ర్ణాశ్రమధర్మరక్షణమహామహిమన్ మహినొప్పు సర్వలో
కాశ్రయుఁ డాదిరాజవిభుఁ డత్యకలంకచరిత్రసంపదన్.

అని నన్నూతులను గాంచి “రాజమహేంద్రకవీంద్రసమాజసురత్నాజ” యని సంబోధింపఁబడినవాఁడును, “సకలభువనలక్ష్మీవిలాస నివాసంబయిన రమ్యహర్మ్యతలంబున మంత్రిపురోహితసేనాపతిదండనాయక దౌవారికమహాప్రధానానంతసామంతపరివృతుండై అపారశబ్దశాస్త్రపారగులైనవైయాకరణులును భారతరామాయణాద్యనేకరచనావిశారదులయినమహాకవులును



వివిధతర్కవిగాహిత సమస్తశాస్త్రసాగరగరీయఃప్రతిభులయినతార్కికులును నాదిగాగల్గు విద్వజ్జనంబులు పరివేష్టించికొలువ నిరంతరము విద్యావిలాసగోష్ఠీ సుఖోపవిష్టుండయి యిష్టకథావినోదంబులఁ బ్రొద్దుపుచ్చువాఁడునునైన యాంధ్రభారతకృతిపతితలకుఁ దలయుందోకయులేని చిత్రాంగిసారంగధరులకథను కనకాంబచరిత్రమును ముడివెట్టియు, నన్నయభట్టుతలకు నతండనూయాపిశాచగ్రస్తుండని దెలుపు నసందర్భము లయినగాథలను ముడివెట్టియుఁ జరిత్రజ్ఞానము లవలేశమును లేక కూపస్థమండూకములవలె నున్నకుకవిరాజమండలము పామరప్రపంచమును పెడదారిని బట్టించుట కృతఘ్నాపవాదములే కారణములుగదా.

## కులోత్తుంగ చోళదేవుఁడు.

(క్రీ. శ. ౧౦౭౦ మొదలుకొని ౧౧౧౮ వఱకు.)

రాజనరేంద్రునికాలమున నాంధ్రదేశమునకుం గలిగినస్వాస్థ్యమునకు రాజనరేంద్రునిమరణానంతరము భంగము గలిగినది. రాజనరేంద్రునికిఁ బిమ్మట నాతనికుమారుఁడగు కులోత్తుంగ చోళదేవుఁడు సింహాసన మెక్కవలసియుండఁ గులోత్తుంగ చోళదేవునకు బదులుగా విమలాదిత్యుని రెండవకుమారుఁడును రాజనరేంద్రునితమ్ముఁడు నైనవిజయాదిత్యుఁడు సింహాసన మాక్రమించుకొని యాంధ్రదేశమును బాలించినట్లు గానంబడుచున్నది. విమలాదిత్యుని కుమారుఁడగు రాజరాజనరేంద్రునకు రాజేంద్రచోడునికూఁతురగు అమ్మంగదేవికి జనించినవాఁడు రాజేంద్ర చోడదేవుఁడు. విమలాదిత్యుఁడు రాజరాజ చోడునికూఁతురగు కుందవాదేవిని వివాహమాడి యామెయందుఁ గన్న తన కుమారునకు రాజరాజని తనమామ పేరు పెట్టెను. ఈరాజరాజ నరేంద్రుఁడు తన మేనమామయగు రాజేంద్ర చోడునికూతురగు అమ్మంగదేవిని పెండ్లియాడి యామెవలనఁ గాంచిన కుమారునకు రాజేంద్ర చోడుఁడని తన మేనమామ పేరు పెట్టెను. ఈరాజేంద్ర చోడుఁడు మాతామహునిరాజ్య మగుచోడరాజ్యమును వశపఱచుకొన్నతరువాత కులోత్తుంగ చోళదేవుఁ డనునామమును వహించెను. రాజరాజ నరేంద్రుని కుమారుఁడగు రాజేంద్ర చోడుఁడు యువరాజుగనుండినపుడె

యుత్తరదేశములపై దండెత్తిపోయి మధ్యమాగాణములలోని వాయిరాగరమను ప్రదేశమున ననేకగజయూధములను ముట్టడించి వశపఱచుకొని సింధువంశపురాజగు ధారావర్షునిచేఁ బరిపాలింపఁబడుచుండిన చక్రకోట్యమునుముట్టడించి వశపఱుచుకొనియెను.[1] ఈదండయాత్ర యెందుకొఱకు సంభవించెనో దెలియరాదు. భారతకృతిపతి యైనరాజరాజవిష్ణువర్ధనునిమరణానంతరము చోడదేశమును బాలించు చుండినవీరరాజేంద్రునిసహాయముతో రాజరాజ విష్ణువర్ధనునితమ్ముఁ డగువిజయాదిత్యుఁడు రాజరాజ విష్ణువర్ధనుని(రాజరాజ నరేంద్రుఁడు) కుమారుఁ డగురాజేంద్రచోడుని వెడలఁగొట్టి వేంగిరాజ్యమును దానే యాక్రమించుకొని పరిపాలింప నారంభించెను. వీని పరిపాలనకాలమున నాహవమల్లుని రెండవకుమారుఁ డగు నాఱవవిక్రమాదిత్యుఁ డనుపశ్చిమచాళుక్యరాజు వేఁగిదేశముపై దండెత్తివచ్చి కలవరపెట్ట నారంభించెను. రాష్ట్రకూటులప్రభ యడంగి పశ్చిమచాళుక్యరాజ్యము పునరుద్ధారణ కాఁబడినతరువాత నాహవమల్లునిరెండవకుమారుఁ డగునీయాఱవవిక్రమాదిత్యుఁడు నిర్వక్రపరాక్రముండై విజృంభించిదిగ్విజయములు సలుపుచున్నవాఁడగుటం జేసి యెట్లయిన నాంధ్రదేశమును మ్రింగివేయవలెనని దండయాత్ర వెడలి వచ్చెను. ఈయాఱవ విక్రమాదిత్యుఁడు బహుపరాక్రమవంతుఁడగుటచేత వీని నెదుర్కొనుపాటి రణశూరుఁడు దక్షిణహిందూస్థానమునందుఁ గానరాకుండెను. చోడరాజగు వీరరాజేంద్రుఁడు వీని దోర్దర్పమునకు భయపడి విక్రమాదిత్యునికిఁ దనకూఁతు నిచ్చి వివాహముఁజేసి వానితో మైత్రి నెఱపవలసినవాఁడయ్యెను. అట్టి ప్రబలశత్రువుదేశముపై దండెత్తివచ్చినపుడు పౌరుషశాలియైన రణశూరుఁ డెట్లూరకుండఁగలఁడు? విజయాదిత్యుఁ డసమర్థుఁడై యేమియుఁ జేయఁజాలకుండుట జూచి రాజరాజనరేంద్రునితనయుండగు రాజేంద్ర చోడుఁడు ధైర్యసాహసములు ముప్పిరిగొన స్వసైన్యముతో శత్రువుని మార్కొని తిరిగి చూడకుండఁ

1. Ep. Ind. Vol IX, p. 178; No. 538, Public, 28th July 1909 para 66. చక్రకోట్యము (చక్రకోట) బస్తరురాజ్యములోనిది.



దఱిమిగొట్టెను. అంతట నూరకొనక యావాడిమగం డాంధ్రదేశంబునఁ దన యధికారమును స్థాపించి తన పినతండ్రి తనకుఁ జేసినయపకారమును మన్నించి యావిజయాదిత్యునే వేఁగిరాజ్యమునకు రాజప్రతినిధిగఁ బునరభిషిక్తునిగావించి తనమాతామహునిదైన చోడరాజ్యమును స్వాధీనపఱచుకొనవలయునని ప్రయత్నించుచుండెను. అంతట చోడరాజ్యమును బాలించుచుండిన వీరరాజేంద్రుఁడుమరణము నొందెను. రాజ్యాధిపత్యముకొఱకు దేశమునఁ బెద్దకల్లోలము జనించెను. ఈసమాచారమును దెలిసికొన్నవాఁడై వీరరాజేంద్రునియల్లుఁడును కుంతలరాజు నగునాఱవవిక్రమాదిత్యుఁడు కాంచీపురముపై దాడివెడలి వచ్చి తన భార్యతోఁబుట్టు వగుపరకేసరివర్మకుఁ బట్టముఁగట్టి యొకమాసముపఱ కచ్చట నుండి కలహములనడచి మరల రాష్ట్రమునకుఁ బోయెను. అతఁడు మరలిపోయినవెనుక శీఘ్రకాలములోనే రాజ్యమున మరలఁ గల్లోలము ప్రారంభమయ్యెను. తనమాతామహుని రాజ్య మాక్రమించుకొనఁగోరి రాజరాజనరేంద్రునితనయుం డగురాజేంద్రచోడుఁడు వీరరాజేంద్రతనయుండగుపరకేసరివర్మను జంపి రాజ్య మాక్రమించుకొని కులోత్తుంగ చోళదేవుఁ డను పేరుతోఁ బట్టాభిషిక్తుఁడయ్యెను. ఇతఁడు క్రీస్తుశకము ౧౦౭౦ దవ సంవత్సరము మొదలుకొని ౧౧౧౮ వఱకుఁ గొంచెముతక్కువగ నేఁబదిసంవత్సరములు కళింగవేంగి చోడరాజ్యములను నిరాతంకముగాఁ బరిపాలనముచేసెను. ఇతఁడు తన బావమఱిదిని జంపి చోడరాజ్యమును వశపఱచుకొనుటఁ జూచి సహింపఁజాలక కుంతలరాజగు విక్రమాదిత్యుఁడు దండెత్తివచ్చెను గాని మధ్యమార్గమునఁ గులోత్తుంగునిచే నెదుర్కొనఁబడి యుద్ధముఁజేసి యపజయమును గాంచి మరలిపోయెను. బిల్హణకవివిరచితమై విక్రమాదిత్యుని కంకితము చేయఁబడిన విక్రమాంకదేవచరిత్రమునందును విక్రమాదిత్యునిశాసనములయందు కులోత్తుంగుఁడే యోడిపోయినట్లు చెప్పియున్నను.కులోత్తుంగునిశాసనములు కులోత్తుంగునికే జయముగలిగినట్లుగఁ జాటుచున్నవి. కులోత్తుంగదేవుఁడే యోడుటసంభవించెనేని విక్రమాదిత్యుఁడు వేంగిచోడదేశములను మ్రింగివేసియుండును. అట్లుజరిగియుండక పోవుటయె విక్రమాదిత్యునికి సంపూర్ణ విజయములు కలిగియుండ లేదనుటకు నిదర్శనము

గా నున్నది. కొన్ని యుద్ధములయం దొకవేళ విక్రమాదిత్యునికి విజయములుగలిగి యుండినను కడపటివిజయము మాత్రము కులోత్తుంగ దేవునిదేయని చెప్పఁదగినది కాని కేవలము విక్రమాంక దేవచరిత్రములోనివాక్యముల నే విశ్వసించి భాండార్కరుగారు తమదక్షిణాపథప్రాచీనచరిత్రమునందుఁ జెప్పినట్లు విక్రమాదిత్యునిది కాదు. విక్రమాంక దేవచరిత్రము విక్రమాదిత్యునివిజయములను ప్రకటించుచుండఁగాఁ గళింగట్టుపారణి యనుద్రవిడ కావ్యము కులోత్తుంగునివిజయములను బ్రకటించుచున్నది.

## కులోత్తుంగ దేవునివిజయములు.

ఇతఁడు రాజ్యాధిపత్యము వహించినరెండవ సంవత్సరమున ననఁగా క్రీ. శ. ౧౦౭౧-౭౨ వ సంవత్సరమున వ్రాయించిన శాసనములు పులియూరునాడు, ఎళుమూరునాడు (ఎళంబూరు-Egmore) పాలయనూరునాడు మొదలగునవి స్వాధీనములో నున్నటులఁ జాటిచెప్పుచున్నవి. ఇయ్యవి యిప్పటి చెంగలుపట్టు, ఉత్తరార్కాడు మండలములలోనివిగా నున్నవి.[1] ఇతఁడు కేరళపాండ్యకుంతలదేశములను జయించినట్లు వీరచోడుని చెల్లూరుశాసనముంబట్టి దెలియుచున్నది.[2] కళింగట్టుపారణి యనుద్రవిడకావ్యమునందు కళింగముమీఁద వెడలిన దండయాత్ర వర్ణింపఁబడినది. మఱియు నందు కుంతలము నేలుబిరుదరాజును (విక్రమాదిత్యుని) జయించినట్టుగూడ చెప్పఁబడినది.[3] వీని పదునొకండవ పరిపాలన సంవత్సరములోని యొకశాసన మితఁడు విక్రమాదిత్యుని కోలారు మండలములోని నాంగిలినుండి మానలూరు మార్గముగా తుంగభద్రానదివఱకుఁ దఱిమినట్లును, గంగమండలమును సింగాణమును (మైసూరు దేశములోనివి) జయించినట్లునుజాటుచున్నది.తరువాత నొకశాసనము మానలూరునకు బదులుగా ఆలట్టిని సింగాణమునకు బదులుగా కొంకణమును చేర్కొనుచున్నది. మఱియొకశాసనము విక్రమాదిత్యుఁడును వానిసోదరుఁ డయినజయసింహుఁడును కులో-

(1) Sou. Ind. Ins. Vol III, part II, Ins. Nos 64 to 66.
(2) Ind. Ant. Vol I, No. 39, Verse 10 f
(3) Canto IV, Verse 6 and Canto X verse 25



త్తుంగుని ప్రతాపమునుంగట నిలువంజాలక పశ్చిమసముద్రమును శరణుచొచ్చిరని చెప్పఁబడినది. విక్రమాదిత్యజయసింహులతోడిపోరాటములో నవిలై యను ప్రదేశమున శూరులయిన దండనాయకులచే సంరక్షింపఁబడుచుండిన వేయియేనుంగులను ముట్టడించి పట్టుకొనియెనని చాటిచెప్పుచున్నది నవిలైయనునది మైసూరురాజ్యములోనినవిలెనాడు లోనిది. వీని పదునాలుగవ పరిపాలన సంవత్సరములోని యొకశాసన మితఁడు పాండ్యులనైదుగురిని జయించుటమాత్రమే గాక మన్నారుజలసంధి, పొడియిల్ కొండ, కన్యాకుమారి, కొట్టారు మొదలగు ప్రదేశములను వశపఱచికొనియెనని చెప్పఁబడియెను. పాండ్యదేశమునకు హద్దు లేర్పాటు గావించెను. పాండ్యదేశముతోఁగూడ కుడమలైనాడును (మలబారులోని పశ్చిమభాగము) గూడ జయించెను. ఇప్పటినాయరులపూర్వికులయినయాదేశములోనిరణశూరులు తమస్వాతంత్ర్యసంరక్షణమునం దందఱును ప్రాణములర్పించుకొని నాశముంజెందిరి. చేరరాజుయొక్క నావికాసైన్యమును నోడలును రెండుమాఱులు నాశము గావించెను.[1] ఇరువదియాఱవ పరిపాలనసంవత్సరమునకు లోపలనే అనఁగా ౧౦౯౫-౯౬ వ సంవత్సరమునఁ గళింగమును జయించెను.[2] ఇదియె వివరముగా కళింగట్టుపారణి యనుగ్రంథమున వర్ణింపఁబడినది.

## కులోత్తుంగ చోడదేవునిబిరుదునామములు,

ఈరెండవ రాజేంద్ర చోడదేవునకు రాజకేసరి వర్మ యనుబిరుదునామముగలదు. చెల్లూరు పిఠాపురము శాసనములో నీతనికి రాజనారాయణ బిరుదముండినటులఁ జెప్పఁబడియుండెను.[3] ఈబిరుదునామమునుబట్టియే గోదావరి మండలములోనిదగు భీమవరములోనియొకదేవాలయమునకు రాజనారాయణ

1 Ind. Ant. Vol XXII, p. 142; (2) Ep. Ind. Vol V. Appendix, p. 51, No. 358, add p. 52, No. 363.

(3) Ep. Ind. Vol I, No. 39, Verse 12, and Ep. Ind. Vol V. No. 10 Verse 11

దేవాలయమని పేరుగలిగినది. [1] కొన్ని నాణెములపైని చోళనారాయణనామము గన్పట్టుచుండుటచేత నయ్యవి వీనివేయని యూహింపఁబడుచున్నవి.[3] కళింగట్టుపారణి యనుకావ్యము వీనిని కులోత్తుంగ చోళుఁడనియు, కరికాలచోళుఁడనియు, బిరుదరాజభయంకరుఁడనియు, అభయుఁడనియు, జయధరుఁడనియుఁ బేర్కొనుచున్నది. ఇతఁడు తుదకు చక్రవర్తి, త్రిభువనచక్రవర్తి యనుబిరుదులనుగూడ వహించెను.

## కులోత్తుంగునిరాజధాని.

కులోత్తుంగునిరాజధాని గంగాపురి. ఇయ్యది గంగకుండపురమనియు, గంగయికొండచోళపురమనియుఁగూడ పిలువఁబడుచుండెను. ఈపట్టణము మొదట కులోత్తుంగచోడదేవుని మాతామహుఁడగురాజేంద్రచోడునిచే నిర్మింపఁబడినది. ఆరాజేంద్ర చోళునకు గంగయికొండ చోళుఁడని నామాంతరము గలదు. ఈపట్టణమునకుఁ దరువాత రెండవముఖ్యపట్టణము కాంచీపురముగ నుండెను.

## కులోత్తుంగునిరాణులు.

ఇతఁడు రాజేంద్రదేవుని కూఁతురగు మధురాంతకదేవిని వివాహమాడి యామెయందు రాజరాజచోడగంగును, రాజరాజముమ్మిడిచోడుని, వీరచోడుని, విక్రమచోడుని, మఱిముగ్గురిని మొత్తమున నేడుగురుపుత్త్రులను రాజసుందరియను కూఁతురిని గాంచెను. మఱియును దీనచింతామణి ఎళిశైవల్లభి, త్యాగవల్లియను మఱిముగ్గురురాణులుగలరు. దీనచింతామణి చనిపోయినతరువాత నామెస్థానమును త్యాగవల్లి వహించెనఁట! ఈత్యాగవల్లి రాజుతో సమానమునయధికారమును నెఱపుచుండెనని కళింగట్టుపారణియను కావ్యమునందుఁ జెప్పఁబడియుండెను. కులోత్తుంగదేవుని కూఁతు రగురాజసుందరి కళింగరాజయిన రాజరాజునకిచ్చి వివాహము చేయఁబడియెను.

(1) Ep. Ind. Vol IV. p. 230



## కళింగదండయాత్ర.

విశాఖపట్టణము లేక కులోత్తుంగచోడపట్టణము.

కులోత్తుంగుఁడు కళింగదేశముపై రెండుమాఱులు దండువెడలియుండెను. మొదటియాత్ర తనరాజ్యకాలములో నిరువదియాఱవసంవత్సర మనఁగా ౧౦౯౫-౯౬వ సంవత్సరమునకుఁ బూర్వమె జరిగియుండును. రెండవది తనపరిపాలనావసానదశయందు జరిగియుండును. అదియె కళింగట్టుపారణి యనుకావ్యమునందు వర్ణింపఁబడినది. మొదటి దండయాత్ర దక్షిణకళింగముపై మాత్రమె నెఱపఁబడినది. ఉత్తరకళింగమును బాలించుచుండిన అనంతవర్మ చోడగంగు ఈదండయాత్రయం దంతగాఁ దానుసంబంధము కలిగించుకొని యుండలేదుగాని రెండవదండయాత్రయందు కులోత్తుంగదేవునికిఁ దోడ్పడియెను. ఈయనంతవర్మ చోడగంగుకులోత్తుంగచోడుని కూఁతురగు రాజసుందరికి కళింగరాజగురాజరాజువలన జనించినవాఁడు గావునఁ గులోత్తుంగునకు దౌహిత్రుఁడు. అనంతవర్మ చోడగంగునకు లోఁబడియుండిన యేడుగురు కాళింగులు తిరుగఁబడినందున వారలను వశపఱచుకొనుటకై కులోత్తుంగుఁడు దండెత్తివచ్చెను. క్రీ. శ. ౧౦౭౮ వ సంవత్సరములో కళింగసింహాసన మెక్కినఅనంతవర్మదేవుని శాసనమొకటి విశాఖపట్టణమునగలదు. ఆశాసనములో విశాఖపట్టణమునకు కులోత్తుంగచోడపట్టణమని నామాంతరమున్నట్టు చెప్పఁబడియెను. ఈమొదటి కులోత్తుంగచోడదేవుని పేరేయీపట్టణమునకుఁ బెట్టఁబడినదని నిశ్చయముగాఁ జెప్పవచ్చును. ఈమొదటి దండయాత్రలో నితఁడు సింహాచలపర్యంతమును బోయినట్లుగానంబడుచున్నది. సింహాచలములో నీతని పేరిఁటి శాసనమొకటి యిప్పటికిని నిలిచియున్నది. ఒకవేళ నీదండయాత్రయుగూడ తనమనుమఁడయిన అనంతవర్మదేవునిపక్షముననే జరిపియుండవచ్చును. విశాఖపట్టణములోనిశాసనము ద్రావిడభాషలోనికి భాషాంతరీకరింపఁ బడినది. (No 90 of 1909) ఈశాసనములోని దానప్రతిగ్రహీత మాలమండలము (Malabar) లోని యొకవర్తకుఁడు. తిన యనుచరులయిన దక్షిణదేశీయులను గొందఱినితనమనుమనిదైన దక్షిణకళింగములో నిలుపుటయె యీప్రథమకళింగదండయాత్రయొక్క ముఖ్యోద్దేశమని మన

మూహింపవచ్చును. ఇట్లు కొందఱు దక్షిణదేశీయులు వచ్చి యిచ్చటస్థిరవాసము లేర్పఱచుకొనుట కళింగగంగవంశజుఁడగు మొదటినరసింహుని కాలమువఱకు జరుగుచుండెనని వీరనరసింహదేవుని పదునేనవసంవత్సర మనఁగా శాలివాహనశకము ౧౧౭౨ వ సంవత్సరములో విశాఖపట్టణమున లిఖింపఁబడిన మఱియొక శాసనముంబట్టి దెలియుచున్నది. పాండలాయనికొల్లము గ్రామవాసియొకఁడు విశాఖపట్టణములోనికరుమాణిక్యాళ్వారుదేవాలయమునకు దానముచేసినట్లు చెప్పఁబడియున్నది. ఈపాంపలాయనికొల్లమను గ్రామము క్విలాండికి నుత్తరముననున్నది.[1]

## వేఁగి దేశపాలకులు.

కులోత్తుంగ చోడదేవుని కాలమున వేఁగిదేశమునకు రాజప్రతినిధిగ నియమింపఁబడినవాఁడు రాజరాజ నరేంద్రునిసోదరుఁడును కులోత్తుంగ చోడదేవునిపినతండ్రియు నగువిజయాదిత్యుఁడు మొదటివాఁడని చెప్పియుంటిమి. ఈ విజయాదిత్యుఁడు ౧౦౭౭ వ సంవత్సరమువఱకును వేఁగిదేశమును బాలించి మృతినొందఁగాఁ గులోత్తుంగదేవుఁడు తన రెండవకుమారుఁ డయినరాజరాజును రాజప్రతినిధిగా నియమించెను. ఇతఁ డీపదవని వహించినతరువాత వీనికి సుఖమును సురక్షణయు లేకపోయెను. వీనికి గురుపాద సేవవలనఁ గలిగెడియానందమువంటి యానంద మీరాజ్యపాలనాధికార మీయునందున రోసి వేఁగిదేశము నొక్కసంవత్సరము మాత్రము పరిపాలించి తనతల్లిదండ్రులకడకు వెడలిపోయెను.[2] తరువాత ౧౦౭౮ దవ సంవత్సరమున వానితమ్ముఁ డయినవీరచోడుఁడు రాజప్రతినిధిగ నియమింపఁ బడియెను. ఇతఁడు బాహుబలము గలిగినమహారణశూరుఁడు. ఇతఁడు ౧౦౮౪ వఱకును వేగిదేశమును బాలించినతరువాత రాజధానికి రప్పించుకొనఁబడి కులోత్తుంగునిజ్యేష్ఠపుత్రుఁ డగురాజరాజచోడగంగు రాజప్రతినిధిగ నియమింపఁబడియెను గాని ౧౦౮౮-౮౯ దవసంవత్సరమున చోడగంగునకు బదులుగా మరల వీరచోడుఁడే రాజప్రతినిధిగనియమింపఁబడియెను.

1 Malabar Gazetteer p. 36

2. Sou. Ind. Ins., i. 60.



ఇతఁడు ౧౦౯౨-౯౩ వ సంవత్సరమువఱకుఁ బరిపాలించినతరువాత వీనిస్థానమునకు వీరచోడునితమ్ముఁ డగువిక్రమచోడుఁడు నియమింపఁబడియెను. ఇతఁడు ౧౧౧౮ వఱకును వేఁగిదేశమును బాలించెను. తరువాతగొంత కాలము వెలనాటి చోడులు రాజప్రతినిధులుగ వేఁగిదేశమును బరిపాలించిరి.

## వీరచోడుఁడు

కులోత్తుంగుని మూడవకుమారుఁ డయినవీరచోడుఁడు విష్ణువర్ధనుఁడను నామముతో వేంగిదేశమును ౧౦౭౮ మొదలుకొని ౧౦౮౪ వ వఱకును, ౧౦౮౮-౮౯ మొదలుకొని ౧౦౯౨-౯౩ వఱకును బరిపాలనముఁజేసినటుల ఱేకి, పిఠాపురము శాసనములనుబట్టి నిర్ణయింపవచ్చును. ఇతఁడు వేగిదేశమునకు రాజప్రతినిధిగ నున్నకాలమున వెలనాటిప్రభువయిన మొదటి చోడగొంకరాజుయొక్క సోదరపుత్త్రుఁడయిన రెండవ విదురుఁడు మంత్రిగనుండెను. ఈవిదురరాజు తన యాజ్ఞప్రకారము పాండ్యరాజు నొకని జయించుటచేత మెచ్చుకొని తన రాజ్యములోని యర్ధభాగ మగుసింధుయుగ మంతరదేశమును(కృష్ణాగోదావరుల మధ్యదేశమును) వీరచోడుఁడు బహుమానముగ నొసంగెనఁట. వీరచోడుని శాసనము లనేకములు గలవు.

## మేడమార్యుఁడు.

ఈ మేడమార్యుఁ డను బ్రాహ్మణోత్తముఁడు వీరచోడునియొక్క ముఖ్యసేనాధిపతిగనుండెను. ఇతఁడు ముద్గలగోత్రజాతుఁ డయినపోతనార్యునికి కన్నమాంబయందుజనించినపుత్త్రరత్నము. పోతనార్యునియందుఁగల గుణాధిక్యతచేత రాజరాజు వానిని బ్రాహ్మ మహారాజని పిలుచుచుండెనఁట. అందుచేత జనులు వానిని రాజరాజ బ్రహ్మ మహారాజను బిరుదునామముతో సమ్మానించుచుండిరట. మేడమార్యుఁడు తనయొక్క సుగుణములచేతను బుద్ధివిశేషముచేతను రాజానుగ్రహమును బడసి మహోన్నతపదవికి వచ్చెను. ఇతఁడు వేదవేదాంగవేదియగుటయేగాక ధనుర్వేదపారంగతుఁడు, భుజబల పరాక్రమ సంపన్నుఁడు. రాజనీతివేత్తయు నగుటచేత వీరచోడుఁడు వీనికి సేనాధిపత్యము నొసంగెను.

ఇతఁడనేక యుద్ధములయందు వీరచోడునకు జయమును సమకూర్చెను. వీరిరువురనడుమఁ బ్రేమ మగ్గలముగ నుండెను. ఈ మేడమార్యుఁడు వైష్ణవభక్తాగ్రేసరుఁ డయినట్టు గన్పట్టుచున్నాఁడు. ఇతఁడు మిక్కిలి గుణవంతుఁ డగుటచేత గుణరత్నభూషణుఁడనెడు బిరుదునామమును బొందెను. ఇతఁడు పెద్దలను బొడఁగన్న భృత్యునికైవడి వినయమును జూపునఁట. బాంధవులయెడ గౌరవముసూపునఁట. బీదలయినసజ్జనులకు దానధర్మములు చేయుచుండునఁట. మఱియు నితఁడు పిఠాపురము దాక్షారామములయందు రెండుసత్రములు నిర్మించి బ్రాహ్మణులకు నిరతాన్నప్రదానము సలుపుచుండెను. ఇతఁడు చెల్లూరుగ్రామములో నొకవిష్ణ్వాలయమును నిర్మించి యొకకోనేరును ద్రవ్వించెను. ఆవిష్ణ్వాలయమునకే వీరచోడ విష్ణువర్ధన మహారాజు కాలేరగ్రహారమును దానము చేసియుండెను. ఇటీవల మహారాష్ట్రరాజులకడ పేష్వాలుగ నుండినమహారాష్ట్ర బ్రాహ్మణులవలెనే యాంధ్ర బ్రాహ్మణులుగూడ చాళుక్య రాజులకడఁ బురోహితులుగను మంత్రులుగను ఆస్థానకవులుగను, మాత్రమె గాక ఖడ్గమును జేతఁబట్టి శౌర్యప్రతాపములు జూపి యుద్ధముసేయునట్టి రణకౌశలు లయినసేనాధిపతులుగఁగూడ నుండిరి. ఈ మేడమార్యుఁడు కాక తీయాంధ్ర ప్రభువయిన మొదటిప్రతాపరుద్రునితో యుద్ధముచేసి యోడిపోయినట్టు గన్పట్టుచున్నది.

## రాజరాజచోడగంగు.

(క్రీ శ. ౧౦౭౮ మొదలుకొని ౧౦౭౭-౭౯ వఱకు)

ఇతఁడు కులోత్తుంగ చోడదేవునకు మధురాంతకదేవియందు జనించిన జ్యేష్ఠకుమారుఁడు. గోదావరిమండలములో రామచంద్రపురము తాలూకాలోని టేకిగ్రామమునందు రాజరాజచోడగంగునిశాసనము బయలుపడకపూర్వము చరిత్రకారు లెల్లరును రాజరాజచోడగంగుని మూఁడవతమ్ముఁడయిన విక్రమ చోడుఁడే కులోత్తుంగ చోడదేవునిజ్యేష్ఠకుమారుఁడని వ్రాసియుండిరి. టేకిశాసనము చోడగంగు జ్యేష్ఠకుమారుఁడని దెలిపి చరిత్రకారులఁ బూర్వపువ్రాఁతలనన్నిటిని తాఱుమాఱు చేసినది. ఇతఁడు శాలివాహన శకము ౧౦౦౬ వ సంవత్సరము జ్యేష్ఠశుద్ధపూర్ణిమాగురువాసరమునాఁ డనఁగా క్రీస్తుశకము ౧౦౭౮ గవ సంవత్సరము మేనెల ౨౨ వ తేదిని గాంబోలు వేంగిసింహాసన మధిష్ఠించెనని చెప్పఁబడియెను. చెల్లూరు పిఠాపురము శాసనములు వీరచోడుని కిరువురన్న లుండిరని చెప్పియుండుటచేత నాయిరువురు చోడగంగు, ముమ్మడిచోడుఁడని యిప్పుడు స్పష్టమైనదిగనుక విక్రమచోడుఁడు వీరచోడునితమ్ముఁడని సిద్ధాంతముచేయవచ్చును. చెల్లూరుపిఠాపురము శాసనములలోఁ జివరనీయఁబడిన తేదులు అనఁగా రాజ్యకాలముయొక్క ౨౧, ౨౩ వ సంవత్సరములని చెప్పినవి వీరచోడుని పరిపాలనమున కన్వయింపవలసినవిగావు. అదే రీతిగ టేకిశాసనము తుదను నీయఁబడిన చోడగంగుయొక్క రాజ్యకాలములోని పదునేడవ సంవత్సరము ౧౦౭౮-౧౬-౧౭-౧౧౦౦-౦౧ వ సంవత్సరముతో సరియగుచున్నది గనుకను, వీరచోడుని చెల్లూరుశాసనము తుదనుగలతేదులు ౧౦౮౭+౨౦-౨౧ = ౧౦౯౭ ౯౯ దవ సంవత్సరముతో సరియగుచున్నవి గనుకను వీరచోడునిశాసనములు రాజరాజచోడగంగు రాజప్రతినిధిగ నుండుకాలమున వీరచోడునిచే లిఖింపఁబడినవిగానె నిశ్చయింపవలసియున్నది. వీరచోడుఁడు రాజప్రతినిధిగ నున్నకాలమునఁ దండ్రిచే రప్పించుకొనఁబడి యైదవయేట మరలఁ బంపఁబడియె నని పిఠాపురము శాసనము చాటుచున్నది. ఆనడుమకాలముననే చోడగంగు రాజప్రతినిధిగ నుండి వేఁగిదేశమును బరిపాలించెను. చెల్లూరు శాసనమునందు చోడగంగు పాలకత్వమును విస్మరించుటయు, పిఠాపురము శాసనమున చోడగంగు పేరెత్తక పాలకత్వము నుదాహరించుటయుఁ బరిశీలించిన పక్షమున చోడగంగు పాలనము తండ్రికిఁ దృప్తిఁ గలిగింపఁజాలక పోయెననియు, చోడగంగునకును వీరచోడునకును పొందిక లేదనియు, పొడకట్టకమానదు. వీనికి సర్వలోకాశ్రయుఁడనియు, విష్ణువర్ధనుఁడనియు బిరుదునామములు గలవు. ఇతఁడును వీరచోడునివలెనే జననాథనగరిని రాజధానిగఁ జేసికొని యందే నివసించియుండెనని శాసనములు చాటుచున్నవి. ఈ జననాథనగరము రాజమహేంద్రవరముయొక్క మాఱుపేరని కొందఱు తలంచుచున్నారు. రాబర్టుస్వామియలుగారు కాకినాడకుఁ జేరియుండినజగన్నాథపుర మని యూహించుచున్నారుగాని రాజమహేంద్రనగరమని చెప్పుటయె సముచితముగానుండును.

రాజరాజ చోడగంగదేవుని టేకిశాసన మితరశాసనములవలె భూదానమును గూర్చినదికాదు. ఈశాసనమునందలి యాజ్ఞ మన్నేఱునకును మహేంద్రగిరికిని నడుమ నుండుయావద్దేశమునకు వర్తించునదిగానున్నది. మహేంద్రగిరి గంజాము మండలములో నుత్తరభాగముననున్నది. మన్నేఱు నెల్లూరుమండలములోనికందుకూరు తాలూకాలో సింగరాయకొండ సమీపమునఁ బ్రవహించుచున్నది. ఈహద్దులమధ్య నుండుదేశమె యాకాలమున వేంగిరాజ్యముగనుండెను. ఆంధ్రదేశమంతయు నిందిమిడి యుండలేదు. ఈటేకిశాసనము తైలికు లనియెడి తెలికతెగవారికి సంఘమునందు గౌరవనీయములయిన హక్కుల నొసంగునదిగానున్నది

## తెలిక తెగవారు.

ఈతెలికకుటుంబమువారు సహస్రశాఖాన్వయగోత్రులుగా విభాగింపఁబడియుండిరఁటగాని పది తెగలవారు మాత్రమె పేర్కొనఁబడియుండిరి. ఈ పది తెగలవారును తరతరములుగా చాళుక్యరాజకుటుంబమునకు సేవకులుగనుండి యీ దేశమునకు వచ్చి విజయవాటిక (బెజవాడ) యందు స్థిరనివాసము లేర్పఱచుకొన్నట్టు వీరలు విశ్వసించుచున్నారు. గుంటూరు మండలములోని బాపట్ల గ్రామములోనున్న భావ నారాయణస్వామి దేవాలయములోని రెండు శాసనములం దీతెగవారిదానములనుగూర్చి ప్రశంసింపఁబడియుండెను. ముసునూళ్లగోత్రజాతుఁడొకఁడును వెలందనూళ్ల గోత్రజాతుఁడొకఁడును గలిసి శాలివాహన శకము ౧౦౭౬ అనఁగా క్రీస్తుశకము ౧౧౫౪ వ సంవత్సరమున దానశాసనములు వ్రాయించి యుండిరి. ఈ వెలందనూళ్ల తెగవారును టేకిశాసనమునందు నుదాహరింపఁబడిన వెలమనూళ్ల తెగవారు నొక్కరేయని తోఁచుచున్నది. అం దొకశాసనమునందు.

"స్వస్తియమనియమధర్మపరాయణ బ్రహ్మసంభవమను వంశాది సకలశాస్త్రవిశారదులం, గణకపురాయ అయోధ్యాపురగజపురాధినాయకులం, సత్యశౌచాభిమానులు గురుదేవపదారాధికులు పౌలస్తభాగవతీస్థాన ప్రతిష్ఠితులు సహస్రశాఖాన్వయగోత్రులయిన శ్రీమద్భుజవాళశాసనులయిన తెలికి వేవురాయుండు వెలందనూళ్ల గోత్రుండు ఐననూరిసెట్టి" అని వ్రాయఁబడియుండుట



చేత నీతెలిక తెగవారు అయోధ్యను బెజవాడనుగూడ పాలించిన వారమని చెప్పుకొనుచున్నట్టు గాన్పించుచున్నది. ఇటులె టేకిశాసనముగూడ సూచించుచున్నది.[1]

"వెలమనూళ్లు, పత్తిపాలు, నరియూళ్లు, కముదాళ్లు, మజ్జూళ్లు, పావండ్లు, శ్రావకులు, ఉంద్రూళ్లు, అనుమగొండలు, అడ్డనూళ్లు," అను తెలికతెగవారిలోని దశవిధశాఖలును టేకిశాసనమునఁ బేర్కొనఁ బడినవి. ఈతెగవారికింగల రాజభక్తిని మెచ్చుకొని రాజరాజచోడగంగు తెలిక తెగవారిలోని వివాహదంపతులు గుఱ్ఱముపైనెక్కి యూరేగవచ్చుననియు, వివాహమహోత్సవానంతరము వివాహదంపతులు రాజునుదర్శించి విలువగలిగిన నూతనవస్త్రములరెంటినిదెచ్చి రాజుపాదములకడఁ గానుకగాఁబెట్టి సాష్టాంగదండ ప్రణామం బాచరింపవలెననియు,అప్పుడానూతనదంపతులకు తాంబూల మీయఁబడుననియు గౌరవనీయమైన క్రొత్తహక్కును గలుగఁజేసినట్లుగ టేకిశాసనము చాటుచున్నది. ఈశాసనమును విద్యాభట్టు విరచించెను ఆకాలమునందలి చాళుక్యచోడుల శాసనములఁ బెక్కింటిని విద్యాభట్టు వ్రాసియుండెను. ఇతఁడు నన్నయభట్టుకుటుంబములోనివాఁ డయియుండునని యూహాపోహము చున్నదిగాని ప్రబల ప్రమాణములేనిదే విశ్వసింపరాదు. ఈశాసనమునుబట్టి తెలికతెగవారిలోనంతకుఁ బూర్వమిట్టి హక్కు వారికిలేదని స్పష్టముగాఁ జెప్పవచ్చును. చోడగంగు ౧౦౮౯ దవ సంవత్సరమున రాజప్రతినిధి పదవినుండి తొలగింపఁబడి తండ్రిచే స్వస్థానమునకుఁ బిలుపించుకొనఁబడియెను. వీనిసోదరుఁడయిన వీరచోడుఁడే మరల రాజప్రతినిధిగాఁ బంపఁబడియెను. వీరచోడుఁడు ౧౦౯౩ వ సంవత్సరమువఱకుఁ బరిపాలనము చేసినతరువాత నీస్థానమునకు వీనితమ్ముఁడయిన విక్రమచోడుఁడు నియమింపఁ బడియెను.

## విక్రమచోడుఁడు.

కులోత్తుంగ చోడదేవుని నాలుగవ కుమారుఁడయిన యీవిక్రమచోడుఁ

1 Nos. 189, 192 of 1897, see Report on Epigraphy.
2 Ep. Ind, Vol VI, p. 334

డు ౧౧౧౮ వ సంవత్సరము వఱకు వేంగిదేశమునకు రాజప్రతినిధిగనుండి తరువాత తండ్రిమరణానంతరము చోడరాజ్యమునకుఁ బట్టాభిషిక్తుఁడయి. ౧౧౩౫ వఱకును రాజ్యపరిపాలనముచేసినట్లు గన్పట్టుచున్నది. మల్లపదేవుని పిఠాపురము శాసనము విక్రమచోడునకు త్యాగసముద్రుఁడన్న బిరుదునామము గలదనియు విక్రమచోడుఁడు చోడదేశమును బరిపాలించుటకై వేఁగిదేశమునువిడిచిపోయిన తరువాత వేఁగిదేశము కొంతకాలము పాలకుఁడులేకయె యుండెననియుఁ దెలియఁజేసి యుండుటచేతను, విక్కిరాన్ చోలన్ ఉలయను ద్రావిడకావ్యము యొక్క కథానాయకునకు త్యాగసముద్రుఁడన్న బిరుదునామము గన్పట్టుచుండుటచేతను అతఁడు నితఁడు నొక్కఁడేయని చెప్పవచ్చును. విక్రమచోడుని ద్రావిడశాసనములు విక్రమచోడుఁడు కొంతకాలము వేఁగిదేశములోనుండి చోడదేశమును బాలించుటకు వేఁగిదేశమును విడిచివచ్చెనని దెలుపుచున్నవి. చెల్లూరు పిఠాపురము తామ్రశాసనముల రెండింటియందును మధురాంతకదేవినామము పేర్కొనఁబడియుండినను విక్రమచోడుని నామము పేర్కొనఁబడి యుండక పోవుటచేత నతఁడు మధురాంతకదేవియొక్క తనయుఁడగునో కాదో యని సందియము దోఁచుచున్నది. అయినను మధురాంతకదేవికి నేడుగురు పుత్త్రులుగలరని చెప్పఁబడి యుండుటచేత విక్రమచోడుఁడుంగూడ ఆమెపుత్త్రుఁడనియె నిర్ధారణము సేయవచ్చును.

ఈశాసనములనుబట్టి డాక్టర్ కీల్ హారన్ గారుచేసిన పరిగణన ప్రకారము క్రీస్తుశకము ౧౧౧౮ దవ సంవత్సరము జూను ౨౯ వ తేదికిఁ గొంచెమీవలనో కొంచెమావలనో విక్రమచోడుఁడు చోళరాజ్యమునకుఁ బట్టాభిషిక్తుఁడయ్యెనని చెప్పవచ్చును. ఈశాసనములనుబట్టి విక్రమచోడుని కాలమును మూఁడుయుగములుగా విభాగింపవచ్చును. ఈశాసనములలో నితఁడు కళింగదేశముపై దండెత్తిపోయెనని చెప్పఁబడినది మొదటియుగముగానుండెను. ఇది వేఁగిదేశములో నుండుటకుఁ బూర్వమె జరిగియున్నదిగావున నితఁడు కులోత్తుంగ చోడదేవుని కళింగదండయాత్రలోఁగూడ నుండియుండెనని చెప్పవచ్చును. ఆసమయమునం దితఁడు సారసిపురాధ్యక్షుఁడయిన (Ellore) తెలుంగుభీ



ముని జయించెను. రెండవకులోత్తుంగ చోడదేవునికి సంబంధించిన కులోత్తుంగచోలన్ ఉలయను కావ్యమునందు విక్రమచోడుఁడు కళింగట్టుపారణియనుకావ్యమును గ్రంథకర్తనుండి యంకితముగాంచినట్టు చెప్పఁబడియుండెను. విక్రమచోడునికాలములో రెండవయుగము శాసనములలోఁ జెప్పఁబడినప్రకారము కొంతకాలము వేంగిదేశములోనుండి యుత్తరదేశమును జయించుటగానున్నది. మల్లపదేవుని పిఠాపురము శాసనము చోడదేశమును బాలించుటకై వెళ్లుటకుఁ బూర్వము విక్రమచోడుఁడు వేంగిదేశమును బాలించుచుండెనని చెప్పుచున్నది. కాఁబట్టి వీరచోడునికిఁ బిమ్మట రాజప్రతినిధిగానుండి యితఁడు ౧౧౧౮వ సంవత్సరమునఁ బిలువంబడు నంతవఱకు వేఁగిదేశమును బరిపాలించుచుండెననియె నిర్ధారణము సేయవచ్చును. ఇతఁడు చోడదేశమునకుఁ బోయినతరువాత వేఁగిదేశమున రాజులేఁడని మల్లపదేవుని పిఠాపురము శాసనము చెప్పియుండుటవలన నాకాలమున దేశమునకేవియో కష్టములు సంప్రాప్తములయ్యెనని భావింపవలసియున్నది. పృథ్వీశ్వరుని పిఠాపురము శాసనములో కులోత్తుంగ చోడదేవుఁడు పదునాఱువేల గ్రామములు గలిగిన వేంగిరాజ్యమును తనకుదత్తపుత్త్రుఁడయిన వెలనాటి చోడునకు దానముచేసెనని చెప్పఁబడియున్నది. ఈవెలనాటిచోడునియొక్క దాక్షారామములోని యొకశాసనములో నతఁడు క్రీస్తుశకము ౧౧౨౦-౨౧వసంవత్సరమునఁ బశ్చిమచాళుక్యరాజగు నాఱవవిక్రమాదిత్యునకు లోఁబడిన యొకసామంతుఁడుగ నున్నట్టు చెప్పఁబడియుండెను. కాఁబట్టి పై శాసనములలోని వాక్యములను మనమిట్లు సమన్వయముచేసికొనవచ్చును. విక్రమచోడుఁడు వేంగిదేశమునువిడిచి దక్షిణమునకు వెళ్ళినతరువాత కులోత్తుంగ చోడదేవుఁడు తనపుత్త్రులతో సమానముగాఁ జూచుకొనుచుండిన వెలనాటి చోడునకు వేంగిరాజ్యాధిపత్యము నొసంగెననియు, విక్రమచోడుఁడు దేశమును విడిచిపోవుటయు,పిమ్మట కులోత్తుంగ చోడదేవుఁడు మరణముఁజెందుటయుఁ జూచి యదియు మంచిసమయముగానూహించి పశ్చిమచాళుక్యుఁడగు విక్రమాదిత్యుఁడు దండెత్తివచ్చి వేఁగిదేశమునుజయించి రాజప్రతినిధిగ వెలనాటిచోడునే నియమించిపోయెనని యూహింపవచ్చును. ఈయాఱవవిక్రమాదిత్యుని శాసనము

లు ౧౧౨౧-౨౨ మొదలుకొని ౧౩-౨౪వఱకును దాక్షారామమునందుఁ గాన్పించుచుండుటచేత నంతపర్యంతము, నాతనివంశమునందే వేఁగిదేశముండినదని భావింపవలయును. అయినను విక్రమచోడునిచేబ్రోలుశాసనము ౧౧౨౭వత్సరమునాఁటిదిగను, నిడుబ్రోలుశాసనము ౧౧౩౫వసంవత్సరము నాఁటిదిగనుండుటచేత విక్రమచోడుఁడు ౧౧౨౫దవసంవత్సరముననే విక్రమాదిత్యుని వేఁగిదేశమునుండి సాగనంపెనని మనము నిశ్చయింపకతప్పదు. విక్రమచోడుఁడు వృద్ధుఁడయిన తనతండ్రి కులోత్తుంగ చోడదేవుఁడు మృతినొందుట కొకసంవత్సరమునకుఁబూర్వమె అనఁగా౧౧౧౮వసంవత్సరములోఁ బట్టాభిషిక్తుఁడైనట్లు గానంబడుచున్నది. కులోత్తుంగుఁడు ౧౧౧౮దవ సంవత్సరమున మరణముఁజెందియుండును. కులోత్తుంగుఁడు కొంచెమించుమించుగ నేఁబదిసంవత్సరములు రాజ్యభారమునువహించి పరిపాలనము చేసియుండెను. విక్రమచోడుఁడు ౧౧౧౮ మొదలుకొని ౧౧౪౩వఱకుఁ బరిపాలించెను. వీనికాలమున వేఁగిదేశము వెలనాటి చోడులవలనఁ బరిపాలింపఁబడుచుండెను.

## రెండవకులోత్తుంగ చోడదేవుఁడు

ఈ రెండవకులోత్తుంగుఁడు విక్రమ చోడునికొడుకు; విక్రమచోడునకుఁ బిమ్మటరాజ్యమునకువచ్చి౧౧౫౦వఱకును బరిపాలనము చేసెను. వీనికొడుకు రాజేంద్రచోడుఁడు పంద్రెండవశతాబ్దాంతమువఱకును, వీనికొడుకు రాజరాజచోడుఁడు లేక మూడవకులోత్తుంగ చోడదేవుఁడు ౧౨౩౨వఱకును చోడరాజ్యమును పరిపాలించిరిగాని వేంగిదేశము రెండవకులోత్తుంగ చోడదేవునికాలములోనె యన్యులవశమైపోయెను. ఈ రెండవకులోత్తుంగ చోడదేవుని యధికారముక్రింద వెలనాటిచోడులు కొంతకాలమును మఱికొంతకాలము వేఱొకశాఖవారయిన చాళుక్యులును, అటుపిమ్మట కాకతీయులును వేగిదేశమునకుఁ బ్రభువులైరి.

---





15 విజయాదిత్యుఁడు (918)

19 విక్రమాదిత్యుఁడు తాళరాజు (925-926)

16 అమ్మరాజవిషువర్ధనుఁడు (918-925)

చాళుక్యభీముఁడు

17 బేటవిజయాదిత్యుఁడు (925)

20 భీముఁడు (926-927)

24 దానార్ణవుఁడు (970-973)

23 అమ్మరాజ విజయాదిత్యుఁడు. 945-970

సత్యాశ్రయుఁడు

విజయాదిత్యుఁడు

విష్ణువర్ధనుఁడు

మల్లప్పదేవుఁడు

విజయాదిత్యుఁడు

మల్లవిష్ణువర్ధనుఁడు (1202)

25 శక్తివర్మ (799-1011)

26 విమలాదిత్యుఁడు (1011-1022)

విజయాదిత్యుఁడు

27 రాజరాజు (1022-1063)

28 కులోత్తుంగచోడదేవుఁడు (1063-1118)

రాజరాజచోడగంగు

రాజరాజు

వీరచోడుఁడు

29 విక్రమచోడుఁడు (1118-1143)

30 కులోత్తుంగ చోడదేవుఁడు (1158)



పంజాబి

నేపాళి

హిందీ

గుజరాతి

గోండి

మరాఠి

తెలుఁగు

కన్నడము

మళయాళము

అరవము

భాషలను దెలుపు పటము. (4-వ పేజీ చూడుఁడు.)

*

## పదునైదవప్రకరణము.

# వెలనాటి చోడులు.

వెలనాఁడనునది గుంటూరుమండలములోని చందవోలు ప్రాంతదేశమునకు మొదట వర్తించుచుఁ దరువాత విస్తరించినది. వెలనాడు మండలమునకు చందవోలు రాజధానిగనుండెను. ఇయ్యది రేపల్లె తాలూకాలోనున్నది.[1] కాకతీయగణపతిదేవునియొక్క గణపేశ్వరము శాసనములో వెలనాడు రెండుమాఱు లుదాహరింపఁబడినది. అమ్మరాజ విజయాదిత్యుని యెలవఱ్ఱు శాసనములో ఎలవఱ్ఱు వెలనాడు విషయములోనిదని చెప్పఁబడినది.[2] ఈయెలవఱ్ఱు రేపల్లె తాలూకాలో చందవోలున కుత్తరమున నున్నది. దాక్షారామములోని యొక శాసనములో కులోత్తుంగ మనుమ గొంకరాజు (మూడవగొంకరాజు) వెలనాడులోని సనదప్రోలు పట్టణమున నివసించుచున్నట్టు చెప్పఁబడినది.[3] కాఁబట్టి యిప్పటి చందవోలె పూర్వము సనదప్రోలని పిలుపఁబడియుండెను. బ్రాహ్మణులలో వెలినాడు వారను నొకతెగ బ్రాహ్మణులుకలరు. వెలినాడనునది వెలనాడెగాని యన్యముగాదు. వెలనాడులో నివసించుబ్రాహ్మణు లన్యవిషయములకుఁ బోయినపుడు వెలనాడు లేక వెలినాడు బ్రాహ్మణులని పిలువంబడుచుండిరి. తరువాత నీవెలనాటి వారు బ్రాహ్మణులలో నొకశాఖవారుగా నేర్పడిరి. వెలనాడునకుఁ బ్రభువులుగనుండిన చోడులు చాళుక్య చోడుల యధికారము కిందను వారలకుఁ బ్రతినిధులుగ నుండి వేఁగిదేశమును బరిపాలించి మిక్కిలి ప్రసిద్ధిగాంచిన వారుగనుండిరి. పేరునకు మాత్రము చాళుక్యచోడులు రాజులుగ నున్నను పరిపాలన భారమంతయును వీరే వహించియుండిరని చెప్పవచ్చును.

(1) Ep. Ind. IV, 33 and Manual of the Kistna District, 214; (2) Ind. Ant. Vol XII, p. 91; (3) No. 268 of 1893 in Annual Report for 1793-94.



ఈ వెలనాటి ప్రభువులు తాము చతుర్థాన్వయకులులమని చెప్పుకొని యుండుటచేత వీరలు క్షత్రియులుగారనియు, శూద్రులనియుఁ దేటపడుచున్నది. వీరు శూద్రులయినను క్షాత్రమున క్షత్రియులకుఁ దీసిపోయిన వారు కారు. వీరలును దాముచంద్రకులులమనియు, ఇంద్రసేన వంశజులమనియుఁ జెప్పుకొనుచున్నారు. యుధిష్ఠిర మహారాజుయొక్క దత్తపుత్త్రుఁడయిన యింద్రసేనుఁడు మధ్యదేశమును కీర్తిపురము రాజధానిగాఁ బరిపాలించుచుండెనఁట. వాని వంశమునందు కీర్తివర్మయను రాజు జనించెనఁట. వానివంశమునందు మల్లివర్మ పుట్టెను; వానికి రణదుర్జయుఁడు జనించెను; వానికి కీర్తివర్మ, వానికి రణదుర్జయుఁడు, వానికి కీర్తివర్మ పుట్టిరఁట. కీర్తిపుర మెచ్చటను గానరాదు, కీర్తివర్మ నామము చాళుక్యుల వంశవృక్షమునుండి గ్రహించినట్టు గానంబడుచున్నది. రణదుర్జయుఁడనునది బిరుదునామముగా గానంబడుచున్నది గాని నిజమైన పేరుగఁ గానంబడదు.

ఈవెలనాటి చోడవంశమునకు మూలపురుషుఁడయిన మల్లవర్మ త్రినేత్ర పల్లవుని సహాయమునుబొంది దక్షిణాపథముపై దాడివెడలి షట్సహస్ర దేశమును (ఆఱువేల నాడును)వశపఱుచుకొనియెనఁట. త్రినేత్ర పల్లవునితోడి మైత్రియు, దక్షిణాపథ దండయాత్రయును విజయాదిత్యుఁడు అయోధ్యనుండి వచ్చి త్రిలోచన పల్లవునితో యుద్ధముచేసెనని చెప్పెడు పూర్వచాళుక్యుల శాసనములలోని గాథలను జూచి కల్పించినగాథలుగఁ గన్పట్టుచున్నవి కాని నిజమైనవిగఁ గన్పట్టవు. విజయాదిత్యునికిని త్రిలోచన పల్లవునకును చాళుక్యులగాథల విరోధముగలదని చెప్పియుండ నిచ్చట మల్లవర్మకు త్రినయన పల్లవునకు మైత్రి చెప్పఁబడియెను.

### ఆఱువేలనాడు.

(షట్సహస్రదేశము.)

షట్సహస్రదేశమను సంస్కృతనామమునకు తెలుఁగులో ఆఱువేలనాడనియర్థము. ఈదేశము కృష్ణకుఁ దక్షిణముననున్నదనియు దీనికి ధనదపురము రాజధానియనియుఁ జెప్పఁబడియున్నది. మొదట నీదేశము వెలనాటిచోడులక

వంశకర్తయైన మల్లివర్మ త్రినేత్రపల్లవుని సహాయముతో నాక్రమించెనని పైని జెప్పఁబడియెనుగదా. ఇది నిజమైనను గాకపోయినను వెలనాటి చోడులకు షట్సహస్రదేశములోని ధనదపురము రాజధానిగనుండెను. వెలనాటి ప్రభువులలో రెండవ గొంకరాజు త్రిశతోత్తర షట్సహస్రావనీనాథుఁడని దాక్షారామములోని యొకశాసనమునఁ బేర్కొనంబడియుండుటయెగాక ధనదపురమును నివాసస్థలముగా నేర్పఱచుకొనియెనని చెప్పఁబడియుండెను. ఇట్లనే ప్రసిద్ధికెక్కిన త్రినయన పల్లవుని యనుగ్రహమునఁ దమపూర్వులీషట్సహస్ర దేశమును సంపాదించిరనియును, తామును గూడ షట్సహస్రావనీనాథులమనియు, అమరావతిని బాలించినకోట వంశజులు చెప్పుకొనియుండిరి.[1] ఇంతియగాక కృష్ణామండలములోని నూజవీడు తాలూకాలోనున్న యెనమదల గ్రామములోని యొకశాసనములో కొన్నతవాడి విషయమును షట్సహస్రదేశమును నొక్కటియే యనియు, దానికి రాజధాని ధాన్యాంకపురమనియుఁ జెప్పఁబడియున్నది. ధాన్యాంకపురమనునది అమరావతియొక్క నామాంతరమైయున్నది.

కాఁబట్టి యెనమదల శాసనమునకును పిఠాపురము శాసనమునకు ఏకీభావము గన్పట్టుచున్నందున ధనదపురమనునది ధాన్యాంకపురముయొక్క నవీన నామమని తేటపడుచున్నది. ఆంధ్రబౌద్ధుల కాలమున ధనదపురము ధాన్యకటకమను పేరఁబరగు చుండెనని మనమెఱుంగుదుము. కనుక షట్సహస్ర దేశమనియెడి యీయాఱువేల నాడు వెలనాడులో నంతర్భాగమైన గుంటూరు మండలమునకును అందుముఖ్యముగా గుంటూరు నర్సారావుపేట, సత్తెనపల్లి, వినుకొండ, పల్నాడు తాలూకాలకు వర్తింపఁగలదని చెప్పవచ్చును.

## ఆఱువేలనియోగులు.

ఆంధ్రబ్రాహ్మణులలో నియోగులలో నాఱువేల ¦ వారనియెడు శాఖయొకటిగలదు. ఈశాఖవారు మహమ్మదీయ ప్రభుత్వకాలములో దొరతనము వారి కొలువులోఁ బ్రవేశించినపుడు వీరిసంఘములో నాఱువేలకుటుంబములవారుండుటచేత వీరు తా మాఱువేలవారమని చెప్పుకొనుచుండిరని జనప్రతీతియొ

1 Ep. Ind. Vol. III. p. 95.



కటి వ్యాపించియుండెను. వీరినిగూర్చి పెక్కుగాథలు చెప్పఁబడుచున్నవి. అవన్నియు వట్టికల్పనలుగాని సత్యములుగావు. ఆఱువేలనియోగులను నామము తక్కినవారివలెనె దేశభేదమునుబట్టి కలిగినదేగాని మఱియొకటిగాదు. ఈశాఖవారి జన్మస్థాన మీయాఱువేలనాడు. మొదట వీరీప్రదేశమునుండి యన్యభాగములకుఁ బోయినపుడు వెలనాటివారు, వేగినాటివారు, మొదలగువారివలెనే వీరును ఆఱువేల నాటివారమని చెప్పుకొనుచుండిరి. వీరునియోగిశాఖవారగుటచేత నాఱువేలనాటి నియోగులని పిలువంబడుచు రాఁగా రాఁగా నాడుపదము విడిచిపెట్టఁబడి ఆఱువేల నియోగులనిమాత్రము వ్యవహరింపఁబడుచువచ్చిరి. మఱికొంతకాలమునకు నియోగులన్నపదముగూడ విడిచిపెట్టఁబడి యాఱ్వేలవారనియె పిలువంబడుచున్నారు. ఆఱ్వేలవారని యెప్పుడు ప్రారంభమైనదో అప్పటినుండి యాఱ్వేలసంఖ్యనుగూర్చి కల్పనాకథ లెన్నో పేర్కొనఁబడుచున్నవి. వానితో మనకిప్పుడు నిమిత్తములేదు. వెలనాడు నుండి వచ్చినవారు వెలనాటి వారైరి. వేఁగినాడునుండి వచ్చినవారు వేఁగినాటివారైరి. ములికినాడు నుండి వచ్చినవారు ములికినాటివారయిరి. తెలుఁగునాడు నుండి వచ్చినవారు తెలగాణ్యులయిరి. కోసలనాడునుండి (దక్షిణకోసలము) వచ్చినవారు కానలనాటివారైరి. ఆఱువేల నాడునుండి వచ్చినవారాఱ్వేల వారయిరి. ఇట్లు తమతమ నాడులనుండి పెఱనాడుల నివసింపఁబోయినప్పుడు వారివారి నాడులను బేర్కొనుచువచ్చిరి. తుదకవి బ్రాహ్మణులలో శాఖాభేదములుగాఁ బరిణమించినవి. ఈనాడీ భేదము లొక్కమాఱుగ నేర్పడినవికావు. పూర్వకాలమునందీ నాడులన్నియు నొక్కప్రభుత్వము క్రిందివిగాక యొకచోటనున్నవిగాక యొకకాలమునందేర్పడినవిగాక వేర్వేఱు రాజులచేఁ బరిపాలింపఁబడుచు, ఒకదాని కొకటి బహుదూరమున నుండుచు, భిన్నకాలముల యందేర్పడినవగుటచేతను, ఆకాలమునందు రాకపోకలు సులభసాధ్యములుగాకుండుటచేతను, ఒక నాడులోని బ్రాహ్మణులు మఱియొక నాడులోని బ్రాహ్మణులతో సంబంధములు చేసికొనుటవలనఁ జిక్కులు పెక్కులుండుటచేత సంబంధ బాంధవ్యములు మానుకొనుచు సర్వసాధారణముగాఁ దమతమ నాడులలోనే పిల్లల

నిచ్చి పుచ్చుకొనుచుండిరి. అందుచేత నొకనాటివారితో మఱియొకనాటివారికి సంబంధ బాంధవ్యములు లేకపోయినవి. అయినను భోజనప్రతిభోజనముల కభ్యంతరము లేకయుండెను. అవియును గూడ శైవ వైష్ణవ స్మార్తద్వైతమత భేదములు ముదిరిన తరువాత గట్టువడినవి.

ఆఱువేలనాడు పదునొకొండవ శతాబ్దమున వ్యవహారములోనికి వచ్చినదగుటచేత నంతకుఁ బూర్వము నియోగులులేరనిగాని ఉన్నను వారు వేఱని వీరు వేఱనిగాని యెంతమాత్రము భావింపరాదు. పల్లవుల కాలముననే రాజకీయోద్యోగములను బడసియుండిన బ్రాహ్మణులు నియోగులని వ్యవహరింపఁబడుచుండిరని కుమారవిష్ణుని శాసనము నిదర్శనముగఁ జూపియుంటిమి. అయినను పదియవశతాబ్దమునకుఁ బూర్వముండిన రాజులవృత్తాంతములుగాని మంత్రులవృత్తాంతములుగాని మనకు సంపూర్ణముగ లభింపనందున నాకాలపు నియోగుల చరిత్రము మనకుఁ దెలియరాకున్నదిగాని పదునొకొండవశతాబ్దమునుండి యాంధ్రదేశచరిత్రమంతయు నీనియోగులతోనే గూడియున్నది. కృష్ణదేవరాయల కాలమునాటికి నియోగులలో మఱికొన్ని శాఖాభేదము లేర్పడియుండుటచేత నీయార్వేలవారంతకుఁ బూర్వము విశేషప్రఖ్యాతి వహించి యప్పటికి మహోన్నతపదవులకు వచ్చియుండిరి గావున వీరిని నార్వేలవారని పేర్కొనుచుండిరి. తరువాత వారు సహితము తమ గొప్పతనమును దెలుపుకొనుటకై యార్వేలవారమని చెప్పుకొనుచుండిరి. విమలాదిత్యుని మంత్రియగు పజ్జియప్రెగ్గడ మొదలుకొని కృష్ణదేవరాయని మంత్రియగు సాళువతిమ్మరాజు వఱకుఁగల నియోగులలో విశేషప్రఖ్యాతి వహించినవారెల్లరు నొక్కకూటమిలోనివారేగాని భిన్నులుగారు. కృష్ణదేవరాయచక్రవర్తి మొదలుకొని యొకచిన్నసంస్థానాధిపతివఱకుగల యెల్లప్రభువులకడ మంత్రులుగనుండి రాజ్యతంత్రజ్ఞులయి ప్రభుత్వముల బంతులాడించి నట్లాడించి యాంధ్రదేశ నాటకరంగమునఁ బ్రఖ్యాతపాత్రములఁ బ్రదర్శింపఁజేసిన వారీశాఖా బ్రాహ్మణులే. ఆంధ్రభాషా కోవిదులై యుత్కృష్ట గ్రంథరచనము గావించి కవిబ్రహ్మలై కవి సార్వభౌములై తమకుఁ దామె సాటియన చొప్పి కీర్తిశేషులై చన్నవారీశాఖాబ్రాహ్మణులే. ఇట్లు రాజ్యపాలనా సా



మర్థ్యము, గ్రంథరచనాకౌశల్యము మాత్రమెగాక పరరాజులు దండెత్తివచ్చినప్పుడుగాని పరరాజులపై దాడి వెడలవలసివచ్చినప్పుడుగాని వెనుదీయక నడుమునకుఁగత్తికట్టుకొని సేనాధిపతులై సేనలనునడిపించియుద్ధములరణశూరులై పోరాడి పౌరుషము నెఱపినవారీ శాఖాబ్రాహ్మణులే. కాఁబట్టి రాజ్యతంత్రము, కవితాసతియు వీరియధీనమైయుండుటచేత వీరిని మఱచి యాంధ్రదేశచరిత్రము వ్రాయుటసాధ్యముగాదు. ఒకవేళ సాధ్యమైనను శిరములేని మొండెమువలెనుండును. సారములేని పిప్పివలెను, ఉప్పులేని కూరవలెనుండును. వీరి యందింకొక విశేషము గలదు. అభివృద్ధియందపేక్షగలిగి దురభిమానమంతగా లేక సంస్కరణాభిలాషులై యేయెండ కాగొడుగుపట్టుచు దేశకాల పాత్రస్థితుల ననుసరించి సంచరించినవారిలో వీరగ్రగణ్యులుగా నున్నారు.

## రెండవకుడ్యవర్మ.

షట్సహస్రదేశమును జయించి సంపాదించిన మల్లవర్మ సంతతిలో నైదవతరము వాఁడగు రెండవ కుడ్యవర్మ చాళుక్యరాజగు విమలాదిత్యునికి లోఁబడిన మాండలిక సామంతుఁడుగనుండి యాతనివలన గుద్రవారవిషయ పాలకత్వమును వహించి పరిపాలించిన ప్రసిద్ధవీరుఁడుగనుండెను. కాఁబట్టి యితఁడు క్రీ. శ. ౧౦౧౧-౧౦౨౨ సంవత్సరముల నడుమనున్న వాఁడని నిశ్చయింపవచ్చును.

## మొదటిగొంకరాజు.

కుడ్యవర్మ మునిమనుమఁడగు గొంకరాజు విమలాదిత్యుని మనుమఁడగు కులోత్తుంగ చోడదేవుని కాలమున వానికి లోఁబడిన మాండలిక సామంతుఁడై యాంధ్రమండలములో నొకభాగమును బాలించుచుండెను. ఈవెలనాటి గొంకరాజు మంచన కవి విరచితమైన కేయూర బాహుచరిత్రమునందిట్లు వర్ణింపఁబడియున్నాఁడు.

“శా. ప్రాగ్దేశాపర దక్షిణోత్తరదిశా భాగప్రసిద్ధక్షమా
భుగ్దర్పాంతకుఁడేలె గొంకవిభుఁడీ భూచక్రమక్రూరతన్

వాగ్దేవీస్తనహారనిర్మలయశో వాల్లభ్యసంసిద్ధితో
దిగ్దంతిశ్రవణానిలోజ్జ్వలరటత్తీవ్రప్రతాపాఢ్యుఁడై ".

ఈవెలనాటి గొంకరాజునకు కౌశికగోత్రుండగు నందూరిగోవిందామాత్యుఁడను నియోగి మంత్రిగనుండి ప్రసిద్ధిగాంచినవాఁడు. ఈగోవిందామాత్యుఁడుగూడ కేయూరబాహు చరిత్రమునందే యిట్లువర్ణింపఁబడియున్నాఁడు.

"మ. విహితాస్థానమునందుఁ జూపుఁదగ గోవిందాభిధానప్రభుం
డహితోర్వీధర వజ్రిగొంకవిభు రాజ్యాధిష్ఠుఁడై సంధివి
గ్రహముఖ్యోచితకార్యసంఘటనతంత్రప్రౌఢియున్ బాధస
న్నహనోదగ్రరిపుక్షితీశబహు సైన్యధ్వంసనాటోపమున్."

## రెండవవిదురరాజు.

ఈమొదటి గొంకరాజున కన్నకొడుకగు రెండవవిదురవర్మ వేఁగీరాజప్రతినిధియగు వీరచోడ భూపాలునకు మంత్రియు సేనాధిపతియునై యాతని యాజ్ఞానుసారముగ పాండ్యభూమిపతిని యుద్ధములోనోడించి విజయముగాంచి తనప్రభువుచే సింధుయుగమంతర దేశపాలకత్వమునువహించి పరిపాలనము చేసి ఖ్యాతిఁగాంచెను.

## కులోత్తుంగరాజేంద్రచోడుఁడు.

వెలనాటి గొంకరాజు పుత్త్రుఁడయిన యీచోడుని చాళుక్యచోడుఁడు పెంచుకొని పదునాఱువేల గ్రామములుగలిగి యుండిన వేఁగిదేశమునకు రాజప్రతినిధిగ నియమించెను. కులోత్తుంగచోడదేవుని నాలుగవ కుమారుఁడయిన విక్రమచోడుఁడు చోడరాజ్యమును బాలించుటకై ౧౧౧౮ వ సంవత్సరమున వేఁగిదేశమును విడిచిపోయినపుడు వేఁగిదేశమున రాజులేనికాలమున కులోత్తుంగ చోడదేవుఁడు వీనిని రాజప్రతినిధిగా నియమించియుండును. ఈవెలనాటి కులోత్తుంగ రాజేంద్ర చోడునకు గొంకరాజు మంత్రియైన నందూరి గోవిందన్న కుమారుఁడు కొమ్మనమంత్రిగనుండెను. వీ రిరువురును గూడ కేయూరబాహుచరిత్రమునం దిట్లు వర్ణింపఁబడియున్నారు.



"సీ. నవకోటి పరిమితద్రవిణ మేభూపతి
భండారమున నెపుఁడుఁ బాయకుండు
నేకోనశతదంతు లేరాజు ఘనశాల
నీలమేఘంబులై లీలఁగ్రాలు
బలవేగరేఖ నల్వదివేల తురగంబు
లేనరేంద్రుని పాగ నెపుడు నిలుచుఁ
బ్రతివాసరంబు డెబ్బదియేనుపుట్ల నే
యేవిభుమందల నెపుడుఁగలుగు
నట్టిసమధిక విభుఁడగు కులోత్తుంగ రా
జేంద్ర చోళవిభుని కిష్టసచివ
తంత్రముఖ్యుఁడగుచు మంత్రి గోవిందనం
దనుఁడు కొమ్మన ప్రధానుఁడొప్పె".

ఈనందూరి కొమ్మనమంత్రి యనేక తటాక దేవాలయ మహాగ్రహారములు నిర్మించి కీర్తి ప్రతిష్ఠలు గాంచినట్లుపై గ్రంథములోని యీక్రిందిపద్యము చాటుచున్నది.

"చ. ఇల వెలనాటిచోడమనుజేంద్రునమాత్యతయానవాలుగాఁ
గులతిలకంబుగా మనినకొమ్మన ప్రెగ్గడ కీర్తిమాటలన్
దెలుపఁగ నేల తత్క్రియఁ బ్రతిష్ఠితమైన తటాకదేవతా
నిలయమహాగ్రహారములు నేడును నెల్లెడఁ దామ చెప్పఁగన్."

## రెండవగొంకరాజు.

వెలనాటిచోడుని మరణానంతరము వేఁగిదేశము పశ్చిమచాళుక్యరాజగు విక్రమాదిత్యునిచే జయింపఁబడియెను. విక్రమాదిత్యుఁడు వెలనాటిచోడుని కుమారుఁడగు మహామండలేశ్వర వెలనాటి గొంకయను (రెండవగొంకరాజు) రాజప్రతినిధిగ నియమించెను. విక్రమాదిత్యుని శాసనములు ౧౧౨౦-౨౪ సంవ

త్సరములనడుమవి గొన్ని దాక్షారామమునఁ గన్పట్టుచున్నవి. శాలివాహనశకము ౧౦౬౩ వ సంవత్సరములోని వెలనాటిగొంకయ దానశాసన మొకటి దాక్షారామములోను వానిభార్య సబ్బాంబిక యొక్క దానశాసన మొకటి నాదెండ్లలోను గానంబడుచున్నవి. దాక్షారామ శాసనములో "చాళుక్యరాజ భవనమూల స్తంభుఁ" డని గొంకరాజునకు బిరుదునామముగాఁ జేర్కొనఁబడియెను. కాఁబట్టి యితఁడు ౧౧౩౩ వ సంవత్సరమువఱకు పశ్చిమచాళుక్యులకు రాజప్రతినిధిగనుండి మహేంద్రపర్వతము మొదలుకొని కాళహస్తివఱకుఁగల యాంధ్రదేశమును బరిపాలించినట్టు గన్పట్టుచున్నది. తరువాత విక్రమచోడుని శాసనములు చేబ్రోలు, నిడుబ్రోలు గ్రామములందు ౧౧౩౪-౩౫ సంవత్సరములలోనివిగన్పట్టుచుండుటచేత విక్రమచోడునిచే వేగిదేశము మరల స్వాధీనముఁ జేసికొనఁబడియెనని యూహింపఁబడుచున్నది

## వెలనాటివీరరాజేంద్రచోడుఁడు,

తరువాత రెండవగొంకరాజునకు సబ్బాంబికయందు జనించిన వీరరాజేంద్రచోడుఁడు రాజ్యభారమును బూనెను. సారసిపురాధ్యక్షుండయిన తెలుంగు భీమనాయకుఁడు చోడుని యధికారమును ధిక్కరించి కొల్లేరుకోటలో దాగానియుండ నితఁడు గండె త్తిపోయి వానితో యుద్ధముఁజేసి కోటధ్వంసముచేసి వానిని జంపెను. ఇప్పటి కృష్ణామండలములోని యేలూరు పట్టణ మాకాలమున సారసిపురమనియు, కమలాకర పురమనియు, కొలను పురమనియుఁ బిలువంబడుచుండెను. ఈపట్టణమిప్పుడు కొల్లేరుసరస్సునకు నైదు మైళ్లదూరమున నున్నను ఆకాలమునందింకను కొల్లేరు సమీపముగనుండుటచేత నీపట్టణమును సారసిపురమనుచుండిరి. తెలుఁగునాయకులు దీనిని పాలించుచుండిరి. వీరు స్వసంరక్షణార్థము కొల్లేరులో నొకకోటను గట్టుకొనియుండిరి. అదియిప్పుడు శిథిలమయిపోయినను ఆ ప్రదేశమిప్పటికిని కొల్లేరుకోట యనునామముతోఁ బిలువంబడుచున్నది. ఈభీమనాయకునకు ముందుండిన మఱియొకభీమనాయకుఁడు విక్రమచోడునిచేఁ జంపఁబడియెను. [1] వీరలు వెలనాటిచోడులకు లోఁబడి పరిపాల

(1) Son. Ind: Ins. Vol II. p. 308.



నముచేయుచుండెడివారు. వీరిలోఁ గడపటివాఁడైన కాటమనాయకుఁడు రెండవకులోత్తుంగచోడదేవునకు సేనాధిపతిగనుండి యాతనిచే మెప్పుగాంచి గోదావరి మండలములోని చెల్లూరు గ్రామమును బహుమానముగఁ బొందెను. [1] మఱియునితఁడు అత్తిలినాడులోని పాందువ్వ (భీమవరము తాలూకాలోనిది) గ్రామవాసియగు నొక బ్రాహ్మణునకు మంతెదొట్టి (మందపట్టు భీమవరము తాలూకాలో గణపవరమునకు సమీపముననున్నది) గ్రామమును దానముచేసియుండెను. వీనిశాసనములుకొన్ని యేలూరు మొదలగు ప్రదేశములంఁ గానంబడుచున్నవి.

## వెలనాటి మనుమగొంకరాజు.

ఇతఁడు వీరరాజేంద్రచోడునకు అక్కాంబికయందు జనించినవాఁడు. ఈమూడవగొంకరాజు గిరిపశ్చిమశాసనులయిన కోనబుద్ధరాజు వంశమునందు జనించిన జయాంబికను వివాహమయ్యెను. ఇతఁడు రెండవకులోత్తుంగ చోడదేవునకు మాండలిక సామంతుఁడుగ నుండెను. వెలనాటి కులోత్తుంగ చోడగాంగేయ గొంకరాజనునది వీనిసంపూర్ణనామము. వీనిశాసనములు క్రీ. శ. ౧౧౩౭ మొదలుకొని ౧౧౫౬ వఱకును గాన్పించుచున్నవి. వీనిభార్య జయాంబిక పిఠాపురములోని కుంతీమాధవ స్వామిదేవాలయమును గట్టించుటయెగాక సింహాచలములోని నృసింహుని విగ్రహమును సువర్ణముతోఁ గప్పెను.

## పృథ్వీశ్వరరాజు.

వెలనాటిచోడరాజులలోఁ గడపటివాఁడు పృథ్వీశ్వరరాజు. ఇతఁడు మనుమగొంకరాజునకు జయాంబికయందు జనించినవాఁడు వీనిశాసనములు. క్రీ.శ. ౧౧౬౩ మొదలుకొని ౧౧౮౦ వఱకును గానిపించుచున్నవి. ఇతఁడు రాజరాజ చోడునకు సామంతుఁడుగనుండెను. వీనికాలమున వీనితల్లియగు జయాంబిక క్రీ. శ. ౧౧౮౬-౮౭ వ సంవత్సరమును పిఠాపురములోని కుంతీమాధవస్వామి యాలయమునకు గంగయికొండ చోడవలనాడులోని యంతర్భాగమగు ప్రోలనాడులోనున్న నవఖండవాడ (పిఠాపురమునకు దగ్గిరనున్నది) యను గ్రామమును దానముచేసియుండెను. అది యిప్పటికిని నాదేవునిక్రిందనే యుండెనని తెలియుచున్నది. ఈపృథ్వీశ్వరరాజు విక్రమ సింహపురమును బాలించుచుండిన మనుమసిద్ధిరాజు తండ్రియగు చోడతిక్క నృపాలునిచే యుద్ధరంగమునఁ జంపఁబడియెను.

(1) Ind. Ant. Vol XIV. p. 55.

## వెలనాటిచోడవంశము,






## బేటవిజయాదిత్యవంశము.

ఈ వంశమునకు మూలపురుషుఁడయిన బేటవిజయాదిత్యుఁడు వేఁగిదేశమును క్రీ. శ-౯౧౮ మొదలుకొని ౯౨౫ వఱకును బరిపాలించిన పూర్వచాళుక్యరాజగు అమ్మరాజ విష్ణువర్ధనుని జ్యేష్ఠకుమారుఁడుగనుండి తండ్రియనంతరము పట్టాభిషిక్తుఁడై యుద్ధమల్లునికుమారుఁడగు మొదటి తాళరాజుచే జయింపఁబడి పదభ్రష్టుఁడయ్యెను. వీని కాఱవతరమువాఁడగు విజయాదిత్యుఁడు రెండవకులోత్తుంగచోడుని కాలములోననఁగాఁ బండ్రెండవశతాబ్దాంతమున వెలనాటిచోడులకుఁ బిమ్మట వేఁగిదేశమును స్వాధీనముఁ జేసికొని పరిపాలించినట్లు పిఠాపురములోని మల్లపదేవుని శాసనమువలనఁ దెలియుచున్నది. ఈ శాసనమునందు బేటవిజయాదిత్యుని కాఱవతరమువాఁడగు మూడవ విజయాదిత్యుని కుమారుఁడు మల్లవిష్ణువర్ధనుఁడు శాలివాహన శకము ౧౧౨౪-వ సంవత్సరము జ్యేష్ఠబహుళ ౧౦ భానువారమశ్వినీనక్షత్ర సింహలగ్నమునందు శ్రీ పిఠాపురములోని కుంతీమాధవస్వామి దేవాలయములోఁ బట్టాభిషిక్తుఁడయ్యెనని దెలుపంబడినది. ఈ తెలుగుతిథికి సరియైన యింగ్లీషుతేది (కీల్‌హారన్ పండితునిగణన ప్రకారము.) క్రీ.శ. ౧౨౦౨-వ సంవత్సరము జూను నెల ౨౦-దవ తేది యగుచున్నది. ఈ శాసనమునందే మల్లవిష్ణువర్ధనుని తండ్రియగు మూడవ విజయాదిత్యుఁడు శాలివాహన శకము ౧౦౭౯-దవ సంవత్సరమునకు సరియైన క్రీ. శ. ౧౧౫౮-దవ సంవత్సరము పదునొకొండవ జనవరి తేదిని సింహాసన మెక్కినట్లుగఁ గూడఁ దెలుపఁబడినది. క్రీ. శ. ౧౨౨౮-దవ సంవత్సరమున వేఁగిదేశమంతయు గణపతిరాజులయధీనమైనది గనుక మల్లవిష్ణువర్ధనునితో నీ వంశమువారి పరిపాలనము తుదముట్టినది. ఈ మల్లవిష్ణువర్ధనుని శాసనములో విశేషచరిత్రాంశము లేవియుఁగానరావు. ఈ శాసనములో నీ వంశములోని రాజులనామములు మాత్రమె గాక వారిరాణుల నామములు గూడ పేర్కొనఁబడినవి. బేట విజయాదిత్యుని కొడుకు నుత్తమచాళుక్య బిరుదాంకితుండగు సత్యాశ్రయుఁడు గాంగవంశజురాలయిన గౌరీదేవిని

వివాహమయ్యెను. ఈమె క్రీ. శ. ౧౦౭౮ మొదలుకొని ౧౧౪౭-దవ సంవత్సరము వఱకుఁ గళింగనగరము రాజధానిగాఁ జేసికొని కళింగదేశమును బరిపాలించిన అనంతవర్మచోడగంగదేవునికి బంధువురాలయి యుండునని తోఁచుచున్నది. సత్యాశ్రయుని కొడుకయిన విజయాదిత్యుఁడు సూర్యవంశమున జనించిన విజయదేవిని వివాహమయ్యెను. ఈమె చోడరాజపుత్త్రికయగునని తోఁచుచున్నది. ఈ విజయాదిత్యుని ద్వితీయపుత్త్రుఁడగు మల్లపదేవుఁడు సాగర విషయాధిపతియు, హైహయవంశజుఁడునగు నొకబ్రాహ్మణుని కూఁతురగు చందలదేవిని వివాహమయ్యెను. ఈ సాగరవిషయాధి పతియగు హైహయుఁడును కోనమండల మేలిన హైహయులు నొక్కవంశములోని వారే యై యుండవచ్చును. ఈ మల్లపదేవుని కొడుకగు విజయాదిత్యుఁడు అరదవాడ రాజపుత్త్రికను వివాహమయ్యెను. అరదవాడ యెక్కడిదో దెలియరాదు.

ఈవంశములోని కడపటివాఁడయిన మూఁడవమల్లపదేవునకు విష్ణువర్ధనమహారాజనియును, మల్లపదేవ చక్రవర్తియనియును బిరుదునామములుగలవు. ఇతఁడు పట్టాభిషేకముఁ బొందినదినముననే ప్రోలనాడులోని గుడివాడగ్రామమును శ్రీపీఠాపురములోని కుంతీమాధవస్వామి దేవాలయమునకు ధారపోసెను. వెలనాటిచోడుఁడయిన పృథ్వీశ్వరుని పిఠాపురశాసనమునుబట్టియు, సర్పవరములోని శాసనములనుబట్టియు సర్పవరము సమీపమునందుండిన నవఖండవాడగూడ ప్రోలనాడులోనిదేయని తెలిసికొనియే యుంటిమి. శకటమంతినినాడులోని చాళుక్యభీమవరములోనున్న రాజనారాయణస్వామి దేవాలయములో మల్లపదేవుని శాసనములు రెండుగలవు. ఆరెండు శాసనములలోను మల్లవిష్ణువర్ధనుఁడు శాలివాహనశకము ౧౧౨౪-దవ సంవత్సరమనగా క్రీ.శ.౧౨౦౨వ సంవత్సరముననే సింహాసన మెక్కినట్లు దెలుపఁబడినది. ఈభీమవరము శాసనములను పిఠాపురము శాసనములతో సమన్వయించుట కష్టసాధ్యముగనున్నది. పైరాజనారాయణ దేవాలయములోనే శాలివాహనశకము ౧౧౨౦-దవ సంవత్సరములో మల్లపదేవుని సవతితమ్ముఁడయిన నరేంద్రుఁడు చేసినదానశాసన మొకటిగూడ గానవచ్చుచున్నది. ఈనరేంద్రుఁడు విజయాదిత్యునికి లక్ష్మీదేవి వలనజనించినపుత్త్రుఁడని మఱియొకశాసనమునుబట్టికూడఁ దెలియుచున్నది. కాఁబట్టి యింతకన్న వీరినిగూర్చి మఱియేమియును దెలియరాదు.





## హైహాయవంశము.

### కోనసీమరాజులు.

చాళుక్య చోడులకును వెలనాటి చోడులకును లోఁబడి కోనమండల మేలిన రాజవంశమునకు హైహాయ వంశమని పేరు. ఇప్పటి గోదావరి డెల్టా భూమియంతయు నప్పుడు కోనమండలముగానుండెను. ఇప్పటికిని అమలాపురము తాలూకాకు కోనసీమయను పేరు నిలిచియున్నది. ఈకోనసీమ రాజుల శాసనములు ౧౧౨౭ మొదలుకొని ౧౨౦౬ వ సంవత్సరము వఱకు గానంబడు చున్నవి. ఇటీవల వారు కొందఱు కాకతీయగణపతులకుగూడ సామంతులుగనుండిరి. ఈరాజులు తమశాసనములలోఁ దాము యదువంశజుఁ డయిన హారియొక్క మునిమనుమఁడగు హైహాయుని మనుమఁడగు కార్తవీర్యుని వంశములోని వారమని తమశాసనములలోఁ జెప్పుకొనిరి. ఈవంశమునకు మూలపురుషుఁడయిన ముమ్మడి భీమరాజు మహారాజాధిరాజగు రాజేంద్రచోడదేవునిచే వేంగిదేశ రాజప్రతిని ధిత్వముఁ బడసెనని యొకశాసనమునఁ జెప్పఁబడినది. రాజేంద్రచోడుఁ డనుసీమొదటికులోత్తుంగ రాజదేవుఁడు రాజప్రతినిధిత్వము మొదట తన పినతండ్రియగు విజయాదిత్యునకును తరువాత రాజరాజు, వీరచోడుఁడు, చోడగంగు'' అనుతనముగ్గురు కొడుకులకును పిమ్మట వెలనాటి చోడునకును నొసంగెనని మనమెఱుంగుదుము. ఈకోనసీమరాజులు రాజప్రతినిధులకులోఁబడి పరిపాలనము చేసినవారుగానుండిరి. ఈవంశములో మూడవవాఁడయిన రాజపఋఁడు కోనమండలాధిపతియని యొకశాసనమునం బేర్కొనంబడియెను. ఈకోనశబ్దము వీనినామమునకు మాత్రమె గాక మఱికొందఱినామములకును బూర్వమునఁ గానంబడుచుండుటచేత కోనమండలరాజులని పిలుచుటకు సంశయింపఁబనిలేదు. ఈవంశములో నైదవరాజయిన రాజేంద్రచోడరాజు తనప్రపితామహుఁడయిన ముమ్మడిభీమరాజున కొసంగఁబడిన వేంగిరాజ్యమున కభిషిక్తుఁడనైతినని చెప్పుకొనియున్నాఁడు. వీనికి విక్రమరుద్రుఁడు హైహాయాదిత్యుఁడు, మొదలగు బిరుదునామములుగలవు. ఇతఁడు, దాక్షారామములోని భీమనాథాలయములో నొకమండపమును గట్టించెను. వీనిమరణానంతరము వీనిసోదరులగు రెండవభీమరాజు మొదటిసత్యరాజు గలిసి పరిపాలనముచేసిరి. వారి తరువాత వారికొడుకులు లోకమహీపాలుఁడును మూడవభీముఁడును గలిసి పరిపాలనముచేసిరి. వారికిఁ బిమ్మట రాజేంద్రచోడునికొడుకు మల్లిదేవుఁడును రెండవరాజపఋఁడుకొడుకు వల్లభరాజును గలిసి పరిపాలనము చేసిరి. వల్లభరాజు ౧౮సంవత్సరములు పరిపాలనము చేసినతరువాత మరణము నొందఁగా వానికొడుకు రెండవమనుమసత్యరాజు వానిస్థానమునకువచ్చెను. ఈ మల్లిదేవుఁడును మనుమసత్యరాజునుగలిసి గుద్దవాడివిషయములోని ఒడియూరను గ్రామమును శాలివాహనశకము ౧౧౧౮వ సంవత్సరములో మేషసంక్రాంతినాడు శ్రీపిఠాపురములోని కుంతీమాధవస్వామి దేవాలయమునకు ధారపోసి యొకశాసనమును వ్రాయించిరి. ఈయొడియూరునకుఁ దూర్పున వేలంగయు దక్షిణమున సిరిపురమున్నవని చెప్పుటచేతను, ఇప్పటి ఓదూరు అనిపిలువంబడు గ్రామమునకుఁ దూర్పున వేలంగిగ్రామమును దక్షిణమున సిరిపురగ్రామమునుండుటచేతను ఒడియూరే ఓదూరయినదని తలంపఁబడుచున్నది ఈశాసనములో జయమాంబను బొగడునట్టి రెండుశ్లోకములు గానంబడుచున్నవి. ఈజయమాంబ వెలనాటిచోడుఁడయిన మనుమగొంకరాజుయొక్క భార్యయు, కులోత్తుంగ పృథ్వీశ్వరుని తల్లియునైయుండెను. పృథ్వీశ్వరుని పిఠాపురము శాసనములో నీమెంగూర్చి తెలిసికొనియుంటిమి. ఈశాసనమునందీమె పొగడఁబడియుండుటచేత ౧౧౦౭ దవ శకసంవత్సరములోనుండిన జయమాంబ౧౧౧౮లోగూడ జీవించియున్నదనియు కోనమండలరాజులు వెలనాటిచోడులకులోఁబడిన సామంతప్రభువులనియుఁ దేటపడుచున్నది. ఈరాజులచరిత్రమును దెలిపెడివి పిఠాపురశాసనము మాత్రమెగాక మఱికొన్ని శిలాశాసనములు దాక్షారామభీమేశ్వరుని యాలయములోను, పాలకొలను(పాలకొల్లు)గ్రామములోని శ్రీరామదేవుని యాలయములోనుగలవు. మాహిష్మతీపురంబున కలంకారభూతుఁడును, కోనమండలాధిపతియు హైహాయవంశజుఁడునగు రాజపఋఁడు కుమారుఁడును విక్రమరుద్ర బిరుదాంకితుఁడునైన రాజేంద్రచోడుని శాసనము పైఁజెప్పిన

శాసనములలో బురాతనమైనదిగనున్నది. ఇందుఁ జెప్పఁబడిన మహిష్మతీనగరము కార్తవీర్యునివంశములోనివాఁడగు ప్రతీపునికిరాజధానియై రేవానదీతటంబుననున్నదని రఘువంశమునందుఁ జెప్పఁబడినది. నర్మదానదీతటంబున నున్న మండ్లయను గ్రామమే పూర్వము మహిష్మతీనగరముగానుండెనని జనరల్ కన్నిఙ్హామ్‌గారు వ్రాయుచున్నారు.[1] మాహిష్మతీనగరము నర్మదాతీరము నందున్నదని డాక్టరు భాండార్‌కర్ గారుకూడ వ్రాయుచున్నారు.[2] కోనముమ్మడిరాజుయొక్క రాణియగు రాజుదేవి శాలివాహనశకము ౧౦౫౪వ సంవత్సరములోఁ జేసిన దానశాసనము మఱియొకటిగలదు. ఈముమ్మడిరాజు రాజేంద్రచోడునికి బెద్దన్నయగు రెండవముమ్మడి భీమరాజుగనుండెను. మఱియును వీనితోఁగూడి పరిపాలనముచేసిన మొదటిసత్యరాజుయొక్క శాసనముగూడ గలదు. ఈసత్యరాజుకోనరాజపఱేడునకు తొండాంబికయందు జనించినవాఁడును రాజేంద్రచోడునకుఁ దమ్ముడునై యుండెను.

ఈ మొదటి సత్యరాజునకుఁ దరువాత రాజ్యాధిపత్యమును వహించినవాని కొడుకు మూడవభీమరాజు వేఁగీ విషయాధీశ్వరుఁడయినరాజరాజునకుఁ లోఁబడిన సామంతుఁడుగ నుండెనని రాజరాజదేవుని రాజ్యకాలము లోని తొమ్మిదవ సంవత్సరమున ననఁగా శాలివాహన శకము ౧౦౪౫ - దవ సంవత్సరములో కోనసత్యరాజు యొక్క కుమారుఁడును మహామండలేశ్వరుండు నైన భీమరాజుచే వ్రాయించఁబడిన శాసనమును బట్టి దెలియుచున్నది.

మఱియును కోనమల్లి దేవరాజు రాణియగు గంగాదేవి వలన శాలివాహన శకము ౧౦౪౪-వ సంవత్సరములో నొకదీపము దానము చేయఁబడినట్లుగాఁ దెలిపెడి శాశనమొకటియు కోనమల్లిదేవరాజుతోఁ గలిసి పరిపాలనముచేసిన రెండవమనుమ సత్యరాజుమంత్రి గూడనొకదీపమును దానము చేసెనని దెలిపెడి దానశాసన మొకటియు నా దేవాలయమునందే గానవచ్చుచున్నవి.

---

1. Ancient geography of india. p. 488.

2. Dr. Bhandarkar's Early History of Deccan. p.7.



ఇంతియగాక పాలకొలను గ్రామములోని శ్రీరారామేశ్వరుని దేవాలయములో నిటీవలవ్రాయఁబడిన శాసనములు కొన్ని యీవంశములోని మఱియిద్దఱు రాజులపేరులను బేర్కొనుచున్నవి. వారినామములకు ముందు కోనశబ్దము ప్రయోగింపఁ బడియుండుటచేత నీ యిరువురు గూడ కోనసీమరాజులలోని వారేయని నిశ్చయింపఁ బడియెను. అందొకరు కోనగణపదేవమహారాజనువారు మఱియొకరు కోనభీమవల్లభరాజనువారు. వీరిలో మహామండలేశ్వర గణపదేవ మహారాజుగారి దేవియగు నుదయమహాదేవి చాళుక్య వంశజుఁడును, విష్ణువర్ధన మహారాజబిరుదాంకితుండును, నిడుదప్రోలు (నిడదవోలు రాజమహేంద్రవరమునకుఁ బడమట ౧౦ మైళ్ల దూరమున నున్నది.) పురాధీశ్వరుండు నైన మహాదేవ చక్రవర్తికొమార్తెయై యుండెను. ఈ మహాదేవ చక్రవర్తి శాసనములు శాలివాహన శకము ౧౨౧౭వ మొదలు కొని ౧౦౨౨ వఱకును- వానియల్లుఁడగు గణపతిదేవ మహారాజుయొక్క శాసనములు శాలివాహన శకము ౧౧౭౮ మొదలుకొని ౧౦౨౨ వఱకును, గానిపించుచున్నవి. భీమవల్లభరాజుయొక్క దానశాసనములు రెండింటిలో నొకటి శాలివాహన శకము ౧౨౮౦-దవ సంవత్సరమున వ్రాయఁబడినది. కాఁబట్టి వీరలిరువురును కాకతీయులైన గణపతిరాజులకు సామంతులుగ నుండి కోనసీమరాజ్యమును బరిపాలించిరని చెప్పవచ్చును.





## పదునాఱవ ప్రకరణము.

# ఆంధ్రచోడులు.

---

ఏడవశతాబ్ద ప్రారంభమున హ్యూనుత్సాంగు హిందూదేశంబునందలి బౌద్ధాశ్రమములను జూడవచ్చి దక్షిణ యాత్రచేయునపు డాంధ్రదేశమునకు వచ్చి యచ్చటి బౌద్ధక్షేత్రములను సందర్శించి పిమ్మట ధాన్యకటకమునకు నైఋతి దిక్కునందు చులియ (Chu li-ya) దేశమునకు వెళ్లినని చెప్పఁబడియెను. చులియ చోళకు నామంబగుటం జేసి కావేరీతీరమునందున్న చోళదేశమిచ్చటికెట్లు వచ్చెనని చరిత్రకారు లాశ్చర్యపడుచుండిరి. హ్యూనుత్సాంగు పరదేశీయుఁ డగుటవలనఁ దెలియక యేదోతప్పుగ వ్రాసెనని యూహించిరి కాని యా కాలమునం దాంధ్రదేశమునఁ జోడులమని చెప్పుకొను నొకతెగవారు పరిపాలనము చేయుచుండినది యెవ్వరికిని దెలియకపోయెను. హ్యూనుత్సాంగు చూడవచ్చిన కాలమనఁగా క్రీ. శ. ౬౪౦-దవ సంవత్సరమున నీయాంధ్రదేశములోని యీచోళరాజ్యము నాలుగైదువందల మైళ్లవిస్తీర్ణము మాత్రము గలిగియుండెను. రెండుమైళ్లుమాత్రమె పరివర్తనము గల యొకచిన్న పట్టణము రాజధానిగనుండెను. దేశమంతయు ననారోగ్యకరంబులగు నడవులతోడను, సారహీనములయిన భూములతోడను, క్రూరకృత్యములచే భయంకరులై మోటుగనుండు ప్రజలతోడను గూడియుండెను. ఎక్కడచూచినను దారిదొంగల గుంపులతోఁ గూడియుండెను. బౌద్ధాశ్రమములు కొన్ని మాత్రమె యుండినవిగాని యవియు శిథిలములై యుండినవి. వానివలెనె యిందు నివసించు సన్న్యాసులు గూడ నపరిశుద్ధులుగ నుండిరి. దేశమునందంతటను జైనమతము ప్రచారమునందుండెను. అచ్చటచ్చట బ్రాహ్మణాలయము లత్యల్పసంఖ్యగలవి మాత్రముండినవి. ఈ రాజ్యము ధాన్యకటకమునకు (అమరా

వతి ధరణికోట) రెండువందల మైళ్లకు లోపుగనుండు దూరమున మాత్రముం డెను. కాఁబట్టి యీరాజ్యము కడపమండలము లోనిదని చెప్పవచ్చును. హూను త్సాంగువర్ణించిన లక్షణములన్నియుఁ గడపమండలమునకు వర్తించుచున్నవి. క్రీ. శ. ౧౮౦౦ సంవత్సరమున బ్రిటీషువారీమండలమును స్వాధీనముఁ జేసికొను పర్యంతము దారిదోపిడి కాండ్రగుంపులచే నిండియుండి ఘోరకృత్యముల కాటపట్టయి యుండెను. ఈ దేశమును వర్ణించిన యాత్రికుఁడు చోళదేశమని పేర్కొనియెనే గాని రాజ్యపాలనము సేయుచుండిన రాజునైన నుదాహరించిన వాఁడు కాఁడు. ఈచోళరాజు స్వతంత్రుఁడో లేక కాంచీపురాధీశ్వరుండయిన నరసింహవర్మయను పల్లవరాజునకు లోఁబడినవాఁడో హూనుత్సాంగు దెలిపియుండిన వాఁడుకాఁడు. ఇటీవలనా ప్రాంతములఁ గనుంగొనంబడిన కొన్ని పురాతన శిలాశాసనములను బట్టి హూనుత్సాంగు చెప్పిన చోళరాజ్యము స్థిరపడుచున్నది. ఎనిమిదవ శతాబ్దమునకుఁ బూర్వమునందు వాడుకలోనుండు లిపులను గలిగియుండిన యీచోళరాజుల శాసనములు సంశయముల నన్నిటని నివారించుచున్నవి. 1903-4-వ సంవత్సరములో నీ రాజులయొక్క శిలాశాసనము లాఱును మఱియొక తామ్రశాసనమును గన్పట్టఁబడినవి. ఈతామ్రశాసనములో మొదటకరికాలచోళుఁడనురాజు పేర్కొనఁబడియెను. ఇతఁడు కావేరి నదియొక్క వెల్లువలు దేశముపైఁ బొర్లిపాఱకుండ గట్లు వోయించెననియు, పాండ్యచోళచేర రాజ్యంబులయొక్క యాధిపత్యమును వహించెననియును జెప్పఁబడియుండెను. వీనివంశమునందు నందివర్మజనించెను. ఇతఁడు కాశ్యపగోత్రుఁడు. వీనికిసింహవిష్ణువు, సుందరానందుఁడు, ధనుంజయ వర్మయను మూవురు పుత్త్రులుండిరి. ధనుంజయవర్మకు చోళమహారాజు, వానికి నవరాముఁడు, వానికి మహేంద్రవిక్రమవర్మ వానికి ముదితశిలాంకురుఁడు కలిగెను. ఇతఁడు పాండ్యచోళ కేరళరాజ్యముల కధిపతియని చెప్పఁబడియెను. వీనికి గుణముదితుఁడు' పోర్ముఖరాముఁడు జనించిరి. పోర్ముఖరామునకు పురుష

1 No 519, Public 18th July 1905 (Rehort on Epiguply)



శార్దూలుఁడు వానికి పుణ్యకుమారుఁడు జనించిరి. ఈపోర్ముఖరామపుణ్యకుమారుఁడు క్షోణి కుల్దరాజుయొక్క కోరికనువిశ్వసించి తనపరిపాలనకాలములో నైదవసంవత్సరమున హిరణ్యరాష్ట్రమండలములో సుప్రయోగనదియొక్క దక్షిణపుటొడ్డుననున్న బిరిపాఱు (విరిపాడు) గ్రామమునకుఁ గొంతభూదానము చేసెను. (ఇయ్యది పల్లవయువ మహారాజు విష్ణుగోపుని యుఱవపల్లి శాసనమునఁగూడ నుదాహరింపఁబడినది). ఈపుణ్యకుమారుని పూర్వికులయిన నందివర్మ సింహవిష్ణువుల నామములు పల్లవరాజులచేఁగూడ వహింపఁబడియెను. మఱియును సుందరానందుఁడు నవరాముఁడు చోళనాయకుఁడయిన శ్రీకంఠుని పూర్వులుగా నుదాహరింపఁబడిరి.[1]

శిలాశాసనములలో నొకటి పోర్ముఖరామ పుణ్యకుమారునకును (no. 384 of1904), మూడుచోళమహారాజునకును (nos.405 406, 408of1904)ఒకటి విక్రమాదిత్య చోళమహారాజునకును (no.400of 1904)మఱియొకటి శక్తివర్మ విక్రమాదిత్యుని కుమారుఁడగు చోళమహారాజాధిరాజసత్యాదిత్యునకును (No. 393of1904) సంబంధించినవిగనున్నవి. ఇవన్నియును గడపమండలములోని ప్రొద్దుటూరు, జమ్ములమడుగు తాలూకాలలోఁ గానుపించినవి గావున వీరి రాజ్యముగూడ నచ్చటిదైయుండునని యూహింపఁబడుచున్నది. ఈశాసనములలో నుదాహరింపఁబడినరాజులలో చోళమహారాజు సూర్యకులుఁ డనియు, కాశ్యపగోత్రుఁ డనియు,కరికాలచోడవంశజుఁ డనియుఁ బేర్కొనఁబడియుండెను. వీరు వహించిన బిరుదునామములం జూడ స్వతంత్రులుగఁ గన్పట్టుచున్నారు. వీరి శిలాశాసనములు గాని తామ్రశాసనములు గాని వీరేకాలమున నున్నదియుఁ దెల్పుచుండలేదు. వీరిశాసనములలోని లిపిని బట్టిచూడఁగ ౧౦వ శతాబ్దమునకుఁ బూర్వమున నున్నవారని తేటపడుచున్నది.

ఇంతియగాక ౧౯౦౪వ సంవత్సరములో కడపమండలములోని పెద్దముడియ (ముదివేము) మనుగ్రామంబున చోళమహారాజుపాలనములోని శాసన

1. Ep. Ind. vol VI. p. 123 note.

మొకటి గానిపించినది. (No. 352of 1905) చిప్పిలిగ్రామమునఁ గన్పట్టఁ డినశాసనములో (No.299of1905) పుణ్యకుమారుని పేరు గానంబడుచున్నది. ఆత్యనచోళుని శాసన మొకటి గానిపించుచున్నదిగాని (No. 350of1905)యితఁడు పశ్చిమచాళుక్యరాజగు నాలవవిక్రమాదిత్యునకు లోఁబడిన మండలేశ్వరుఁడుగాని స్వతంత్రుఁడుగాఁడు. అయిన నితఁడు పైచోడవంశములోని వాఁడుగానుండెను. ౧౯౦౭వ సంవత్సరములోనీచోడులశాసనములు మఱి మూఁడు గన్పట్టఁబడినవి. ఒకటి ముట్టుకూరులోను, ఒకటిప్రొద్దుటూరులోను, మఱియొకటి నల్లచెఱువుపల్లెలోను గనుఁగొనంబడినవి. ఈగ్రామములన్నియుఁ గడప మండలములోనివే. మొదటిరెండును చోళమహారాజు కాలములోనివి. ఎలచోళ మహారాజు ముత్తరాజునను నిరువురు మూడవశాసనమునం బేర్కొనఁబడియుండిరి. శ్రీకంఠుని తామ్రశాసనములో ఎలచోళుఁడు శ్రీకంఠుని పూర్వికులలోని వాఁడుగా నుదాహరింపఁబడియుండెను. హేమవతి, నిడుగల్లు ప్రాంతదేశమును బాలించెడు చోళరాజులను గొందఱిని రైసుదొరగారు తుముకూరు శాసనముల సంపుటములో నుదాహరించియున్నారు. [1] వీరిలో ధనుంజయ యొల చోళరాజు గాంగూల పల్లవరాజునకు లోఁబడిన మండలేశ్వరుఁడుగ నుండి ఆల్వాడిదేశమును, చోళికముత్తరాజు కండకోటను పాలించుచుండిరి. వీరలు క్రీ. శ. ౭౫౦ దవ సంవత్సరములో నున్నారని రైసుదొరగారు కాలనిర్ణయము చేసియున్నారు.

కడప మండలములోని చోడులు ౭౦౦౦ లు గ్రామములు గలిగిన రేనాడును బాలించుచుఁ దాము కరికాల చోడవంశజులమని చెప్పుకొని యున్నారు. హేమవతి నిడుగల్లుచోడు లట్టివిషయముల నేమియుఁ జెప్పుకొని యుండలేదు.

## రేనాటిచోడులు ద్రావిడచోడులుగారు.

ఈ రేనాటిచోడులు ద్రావిడభాషా వాఙ్మయములో వర్ణింపఁబడిన కరికాలచోడుని వంశములోని వారమని తమశాసనములలో గొప్పగాఁ జెప్పుకొని

[1] Ep. Car, Vol Vii, Introduction. p. 7



యున్నను తక్కిన రాజవంశముల వారివలెనె వీరును పోకలుపోయియుందురు గాని నిజముగా నీచోడులకు నాచోడులకు సంబంధమేమియును గానరాదు. రు కరికాల చోడవంశజులమని చెప్పుకొన్నంత మాత్రముచేత నాచోడులిచ్చటికివచ్చి పరిపాలించినవారని భ్రమింపరాదు. విక్రమ సింహపురమనియెడు నెల్లూరును బాలించిన మనుమసిద్ధిరాజును వానిపూర్వికులునుగూడ తాముకరికాల చోడవంశజులమని చెప్పుకొని యుండిరి. ఇట్లనేకులు తాముకరికాల చోడవంశజులమని చెప్పుకొనియున్నను వీరెవ్వరును పెట్టుచోడులెగాని పుట్టుచోడులుగారు. ముఖ్యముగా విచారింపవలసినది మఱియొక్కటికలదు. వస్తర (బస్తరు) రాజ్యములోని చక్రకోట్యమును బాలించు సింధువంశజుఁడయిన ధారావర్షునికి లోఁబడిన సామంతుఁడుగనుండి వానికిమంత్రిగను సైన్యాధిపతిగనుండిన చంద్రాదిత్యుఁడను నాతఁడు తానుకరికాల చోడవంశజుఁడ ననియు కాశ్యపగోత్రుఁడననియుఁ జెప్పుకొనియుండుటచేత నతఁడీచోడవంశములోని వాఁడుగ గుర్తింపఁబడియెను. వీనిశాసనములపైన సింహలాంఛనము గలదు. శాసనపరిశోధకులు వీనిశాసనములం బరిశీలించి రేనాటిచోడులు వ్యాఘ్రలాంఛనముగలవారని వారికిని తంజాపురి, తిరుచునాపల్లి చోళులకును సంబంధము గలదని యభిప్రాయపడిన తమ మొదటి యభిప్రాయమును మార్చుకొని రేనాటిరెడ్లుగూడ సింహలాంఛనముగలవారేయనియుఁ గాఁబట్టి రేనాటిచోడులు వేఱనియు, తంజాపురి చోడులు వేఱనియు నభిప్రాయపడి యున్నారు. కనుక రేనాటిచోడులను మేమాంధ్రచోడులనుగానే పరిగణించుచున్నారము. తక్కినచోడులనుగూర్చి ద్వితీయసంపుటమునందు వివరముగా వ్రాయఁదలంచి చోడులచరిత్రమిచ్చట ముగించినారము. వీరినిగూర్చిన చరిత్రము పరిశోధనల వలన భావికాలమునఁ దెలిసికొన వలసినదేగాని యింతవఱకు మనకేమియును దెలియరాకున్నయది.

## మహాబాణవంశము.

దక్షిణాపథ దేశమునుబాలించిన భూపతులలో సూర్యకులులమని కొందఱును చంద్రకులులమని కొందఱును, బ్రహ్మకులులమని కొందఱును, క్షాత్త్రవి

ర్యకులులమని కొందఱును పెక్కండ్రు పెక్కురీతులుగాఁ దమవంశోత్పత్తులను గూర్చి చెప్పుకొనిరేగాని యీమహాబాణులవలె రాక్షసుల సంతతివారమని వారెవ్వరును చెప్పుకొని యుండలేదు. వీరలు తాముదానవాగ్రణియగు బలిచక్రవర్తియొక్క కొడుకయిన మహాబాణుని వంశములోని వారమని చెప్పుకొని యుండిరి. మాచదువరులు భాగవత విష్ణుపురాణములలోని బలిచక్రవర్తియొక్కయు, బాణాసురునియొక్కయు కథలను జదివియు వినియునుందురు. వామనమూర్తియైవచ్చిన విష్ణువునకు భూవలయమంతయు ధారపోసి సర్వస్వమును గోల్పోయి పాతాళమున కణఁగఁ ద్రొక్కఁబడినవాడు బలిచక్రవర్తి. శ్రీకృష్ణుని మనుమఁడనిరుద్ధుఁడు తనకూఁతురయిన యుషాకన్యతో నంతఃపురమందిరమున నుండుటఁగాంచి మహోదగ్రుఁడై యనిరుద్ధుంబట్టి బంధించి యాకారణమున శివకేశవులకుఁ బోరాటము పెట్టి తుదకు శ్రీకృష్ణునిచే ముప్పుగాంచినవాఁడు బాణాసురుఁడు. వానివంశమున జనించితిమని చెప్పుకొనువారే యీమహాబాణులు. వీరు శైవమతావలంబకులు. నల్లని టెక్కెము గలవారు. వృషభలాంఛనులు. నందీశ్వరుని భక్తులు. వీనికి మొదట మైసూరురాజ్యములోనున్న కోలారుమండలములోని ఆవణ్యానగరము (Avani) రాజధానిగనున్నట్లు గన్పట్టెడిని. తరువాత నుత్తరార్కాడు మండలములోని తిరువల్లము రాజధానిగ నుండెను.

ఇది పాలేఱున కుపశాఖయగు నీవానదియొక్క పడమటియొడ్డున నున్నది. అనేకశాసనములందు తిరువల్లము బాణపురమని పేర్కొనఁబడియున్నది. ఈమండలము పేరంబాణప్పాడి (మహాబాణదేశము) అని పిలువంబడుచుండెను. బాణపురమునకు సమీపమునందొకపాలెము బాణసముద్రమని పిలువంబడుచుండెను. మఱియొక గ్రామము •బాణులకాలమునుండి బాణవరమను పేరఁబరగుచు షోళింఘురునకు (చోళంగివరము) (Railway Station) సమీపమున నున్నది. బాణపురమనియెడి యీతిరువల్లము చోడుల శాసనములయందు తీక్కాలివల్లమని గూడ పేర్కొనఁబడినది. అప్పుడిది జయంకొండ శచోమండలములోని భాగమగు పాడువూరు కొట్టములోఁజేరియుండెను. ఈపాడువూరు కొట్టమొకప్పుడు త్యాగాభరణ వలనాడను పేరనొప్పియుండెను. కొన్నిశాసనములలో తిరువల్లము పేరంబాణప్పాడిలోని మీయాఱునాడు లోనిదనియు, మఱికొన్నిశాసనములలో కరైబలినాడు లోనిదనియుఁ బేర్కొనఁబడియుండెను. మహాబాణుల ప్రాచీనశాసనములందు పరివీపురముగూడ రాజధానిగనుండినట్లు పేర్కొనఁబడినదిగాని అదియెక్కడనుండెనో దెలియరాదు. కొందఱు చరిత్రకారులు రాయవేలూరునకు దక్షిణభాగముననున్న పడైవీడు పరివీపురమని చెప్పుచున్నారుగాని యింకను స్థిరపడి యుండలేదు. ఈమహాబాణుల రాజ్యమాంధ్రపథమునకుఁ (వడుగావళికి) బడమటనున్నదని కొన్నిశాసనములు దెలుపుచున్నవి. ఆంధ్రమండలములోని ౧౨౦౦౦ గ్రామములు వీరిరాజ్యములోఁ జేరియుండినవి. ఈబాణరాజులు స్వతంత్రులుగాక పల్లవరాజులకు గాంగపల్లవరాజులకు లోఁబడిన మాండలికులై ప్రఖ్యాతిఁగాంచినవారుగఁ గన్పట్టుచున్నారు. విద్యానాథపండితుఁడు బాణవంశమునుగూర్చి ప్రతాపరుద్రీయమునందు ప్రశంసించియున్నాఁడు. ౧౯౦౩ వ సంవత్సరమునఁ బ్రకటింపఁబడిన బాణుల శాసనములైదింటిలోను మూడు (Nos 226, 228, 229 of 1903) పల్లవులు గాంగపల్లవులు బాణులకు ప్రభువులని పేర్కొనియున్నవిగాని రెండుశాసనములు మాత్రమట్లు పేర్కొనియుండలేదు. ఆరెండును విజయాదిత్య బాణరాయని కాలములోనివై శక సంవత్సరములు ౭౨౦,౭౨౧ వ సంవత్సరములకు సరియైన క్రీస్తుశకము ౭౯౮ - ౭౯౯ దవ సంవత్సరములలో వ్రాయఁబడినవిగానున్నవి. [1] ఈరెండింటిలోను మొదటిది విజయాదిత్యుని బాణవిద్యాధరుని కొడుకని నుడువుచున్నది. గాంగపల్లవుఁడగు నృపతుంగుని శాసనములో (No 228 of 1903) నుదాహరింపఁబడిన బాణవిద్యాధరుఁడు నితఁడు నొక్కఁడే యని చెప్పవచ్చును. ఈనృపతుంగ మహారాజు తొమ్మిదవ శతాబ్దములోని కడపటి కాలము నందుండినవాఁడు. గాంగపల్లవరాజగు దంతివిక్రమవర్మకు మాండలిక సామంతుఁడయిన విజయాదిత్యుని కన్నను పల్లవరాజగునంది పోతవర్మకాలములో నాంధ్రపథమునకుఁ బడమటఁ బరిపాలనము సేయుచుండిన విక్రమాదిత్యుఁడు పూర్వుఁడయి యుండును. ఈవిక్రమాదిత్యుఁడు గాంగపల్లవుఁడగు విజ

1 No 678, 679, Public 12 th August 1904

యనంది విక్రమవర్మ పరిపాలనముయొక్క ౧౪ వ సంవత్సరములో వ్రాయఁబడిన తిరువళ్లము శాసనములో నుదాహరింపఁబడిన విక్రమాదిత్యునకంటె భిన్నుఁడనియె భావింపవలయును. [1]

వధూవల్లభ మల్లదేవ నందివిక్రమవర్మముడయనూరుశాసనములోఁ దావాంధ్రమండలములోని ౧౨౦౦౦ గ్రామముల కధిపతినని చెప్పికొనియున్న విషయము నిదివఱకు తెలిపియుంటిమి. ౧౯౦౭ వ సంవత్సరములో పుంగనూరు జమిందారిలో ౮ శాసనము లీబాణమాండలికరాజులకు సంబంధించినవి ప్రతులెత్తఁబడినవి. వానిలోనాలుగు (Nos 543, 555, 570, 584 of 1906) మహాబలి బాణరాజుకాలములోనివిగ నున్నవి. వీనిలో మొదటిది శూరమతివద్దను జరిగిన యుద్ధమును ప్రశంసించుచున్నది. పెర్మనాడి రాజుకొఱకు మహాబలి బాణరాజు వైదుంబరాజగు గండత్రినేత్రునితోఁ గలిసి నలంబరాజును రాచమల్లుని మయిందాడిని నెదుర్కొని ఘోరయుద్ధముచేసెను. కోలారుమండలములోని బంగవాడి శిలాశాసనముగూడ పైయుద్ధమును ప్రశంసించుచున్నది. గాంగపల్లవ రాజయిన విజయవిక్రమ నరసింహవర్మ కాలములోని యొకశాసనముగూడ శూరమతి యుద్ధమునుగూర్చి ప్రశంసించియున్నది. పైశాసనములలో నుదాహరింపఁబడిన రాచమల్లుఁడు గాంగవంశజుఁ డయినయెడల నతఁడు సత్యకుమార కొంగునివర్మ పెర్మనాడి రాజమల్లుఁడై యుండవలయును. అతఁడే యని నిశ్చయమైనయెడల నతఁడురాజ్యము చేసిన కడపటికాలము క్రీ.శ. ౮౭౦-౧ సంవత్సరమగుచున్నది. [3] కాఁబట్టి మహాబలి బాణరాజు యొక్క కాలమించుమించుగాఁ దొమ్మిదవశతాబ్ద మధ్యమయి యుండునని చెప్పవచ్చును.

తక్కినశాసనములునాలుగునుమహాబలిబాణరాజవిక్రమాదిత్య బాణకందర్పజయమేరుని యొక్కయు, (No 569 of1906) మహాబలిబాణరాజబాణవిద్యాధరునియొక్కయు, (571 of 1606) మహాబలిబాణరాజవిజయాదిత్యవర

1 South Indian Inscriptions, Vol. III, no 43

2 Ind Ant Vol XV. p. 175

3 Ep. Iud. Vol VI p. 59



చూడామణి ప్రభుమేరునియొక్కయు (No 542 of 1906)కాలములలోనివై యున్నవి. వీనిలోఁగడపటిది కాడువెట్టిముత్తరాజు కోయటూరుపైఁబడి దోపిడిగావించుటను ప్రశంసించుచు బాణరాజు వడుగావళి(ఆంధ్రపథము)లో౧౨౦౦౦ గ్రామములను మన్నెలో ౩౦౦గ్రామములను బరిపాలించుచుండెనని దెలుపుచున్నది. కడపటిచోడుల శాసనములలో పేరంబాణప్పాడిదేశము (బాణదేశము) పడమట పుంగనూరువఱకును వ్యాపించియుండెనని దెలియఁజేయుచున్నవి. ఈబాణరాజ్యము తూర్పునఁగాళహస్తివఱకును వ్యాపించియుండెను. కాఁబట్టి పాలేఱునదికి నుత్తరముననున్న యిప్పటియుత్తరార్కాడు మండలమంతయు బాణరాజ్యములోనిదని చెప్పుట కెంతమాత్రమును సందియములేదు. క్రీ. శ. ౮౯౨-౯౩ సంవత్సరప్రాంతమున నలంబరాజగు మహేంద్రాధిరాజనలంబుఁడు బాణవంశమును నిర్మూలముచేసితినని గొప్పగాఁ జెప్పుకొనియుండెను, క్రీ. శ. ౯౦౭ మొదలుకొని ౯౪౭ వఱకుఁ బరిపాలనముచేసిన తంజాపురచోళరాజగు మొదటిపరాంతకుఁ డిరువురు బాణరాజులను నిర్మూలముచేసి వారలదేశమును గాంగుఁడైన రెండవ పృథ్వీపతికి బహుమానముఁ జేసెను. [1]

పృథివేంద్రవర్మకు లోఁబడియుండిన అలగమయ్యయను బాణరాజొకసామాన్యప్రభువై యుండెను. ఇట్లు చోళరాజగు పరాంతకునిచేఁ బదభ్రష్టులైన కతంబున బాణులలో నొకకుటుంబము వారాంధ్రదేశములో నుత్తరభాగమునకు వచ్చినట్లు గాన్పించుచున్నది. బాణవంశజుఁడగు శూరబలిరాజుయొక్క పండ్రెండవశతాబ్దములోని శాసనమొకటి గుంటూరు మండలములో కొణిదెనగ్రామములోఁ గానంబడుచున్నది. [2]

## వైదుంబవంశము.

వైదుంబులు తొమ్మిదవ పదవశతాబ్దములలో రాష్ట్రకూటులకును నలం

1 Annual Report on Epigraphy for 1900-01, para. 11

(2) South Indian Inscriptions Vol. II, pp. 387, 388

3 Annual Report on Epigraphy for 1899-00 paragraph 85.

బులకును చోడులకును లోఁబడినవారలై యాంధ్రకర్ణాటకదేశములలోని కొంత భాగమును బరిపాలించినవారుగా నుండిరి. వీరిశాసనములు కడపమండలములోను మైసూరురాజ్యములోని కోలారుమండలములోను గానుపించుచున్నవి. కడపమండలములోని యొకశాసనము గండత్రినేత్రుఁడను వైదుంబరాజు కాలములోనిదైయుండెను. ఈగండత్రినేత్రుఁడను వైదుంబరాజు మహాబలిబాణరాజుతోఁగలిసి సుప్రయోగనదీతటంబుననుండిసశూరమతి యనుప్రదేశమున నలంబాధిరాజుదాడిగతోడను రాచమల్లునితోను యుద్ధముఁజేసెను. ఈవిషయము నేయీగండత్రినేత్రుని కాలములోనిదగు మదనపల్లిశాసనమువలనఁగూడ (No295 of1906) స్పష్టపడుచున్నది. రైసుగారు తమకోలారుశాసనముల సంపుటములో వైదుంబరాజులవి రెండుశాసనముల నుదాహరించియున్నారు. వానిలో నొకటి గండత్రినేత్రునికాలములోనిదైయున్నది. ఈ గండత్రినేత్రుఁడును కడపశాసనములలో నుదాహరింపఁబడిన గండత్రినేత్రుఁడును నొక్కఁడేగాని భిన్నులుగారు. ఈశాసనములు రెండును క్రీ. శ. ౯౦౦ సంవత్సరములోనివిగా రైసుగారు నిర్ణయించియున్నారు.[1] విక్రమాదిత్యుడను వైదుంబరాజు రాష్ట్రకూటరాజయినమూడవకృష్ణునకు సామంతమాండలికుఁడుగనుండి మాలాడు, బాణగొప్పాడి, సింగపురనాడు, వెంకుంద్రకొట్టము మొదలగువానిఁ బరిపాలించుచున్నట్లొ కశాసనమునఁ దెలుపఁబడినది.

తిరుకోయిలూరునకు సమీపముననుండు కీలూరుశాసనములు మూడు రాష్ట్రకూటరాజగు మూడవకృష్ణునకు లోఁబడిన సామంతమాండలికుఁడును వైదుంబుఁడునగు చందయ తిరువయ్యయనువానిఁ బేర్కొనుచున్నవి[3] ఈశాసనములు మూడును క్రీ. శ. ౯౬౦దవ సంవత్సరమునకును ౯౬౪గవ సంవత్సరమునకును నడుమ వ్రాయఁబడినవిగనున్నవి. ఆఱువేలగ్రామములను గలిగియుండిన గంగవాడి దేశమును బాలించుచుండి నలంబరాజగు దిలీపయ్యకులోఁబడిన సామంతమాండలికుఁడుగ నుండిన వైదుంబవిక్రమాదిత్య తిరువయ్యయనువాని పేరు నుదా

1. Ep. Car. Vol· X. introduction p. XXII.

2. Annual Report on Epigraphy for 1904-05. para 28



హరించి యితఁడు క్రీ. శ. ౯౬౧-౬౬ ప్రాంతములనున్నవాఁడని రైసుగారు దెలుపుచున్నారు. ఈవిక్రమాదిత్య తిరువయ్య ౯౫౦దవ సంవత్సరమున నొకచెఱువును బాగుపఱిపించి యున్నవాఁడుగావున నితఁడును కీలూరుశాసనములలో నుదాహరింపఁబడిన చందయతిరువయ్యయు నొక్కఁడేయై యుందురని యూహింపవచ్చును. విక్రమాదిత్యుఁడను పేరు చందయయొక్క బిరుదునామమై యుండవచ్చును. విక్రమాదిత్య తిరువయ్య తనకొడుకునకు చంద్రశేఖరుఁడని పేరు పెట్టియుండుటచేతఁ దండ్రిపేరు కొడుకునకుఁ బెట్టినట్లుగ నూహింపఁదగియున్నది. ఈపైనిజెప్పిన యూహాలు సరియైనవేని రాష్ట్రకూటరాజగు మూడవకృష్ణుఁడు తక్కోల యుద్ధమయినతరువాత తొండైమండలములోని యొక భాగమును బరిపాలించుటకై యీవైదుంబ విక్రమాదిత్యుని నియోగించియుండునని తలంపవచ్చును. ఇందుచేతనే మొట్టమొదట నాంధ్రకర్ణాటకదేశములలో రాజ్యపాలనము చేయుచుండిన వైదుంబులు తొండైమండలములో స్థిరపడి తరువాత నచ్చటనే చోడరాజులగు మొదటరాజరాజునకును, మొదటిరాజేంద్రునకును లోఁబడిన సామంతమాండలికులుగనుండి పరిపాలనముఁజేయఁ గారణమైనట్లు గన్పట్టుచున్నది. [1] మదనపల్లి, పెదతిప్పసముద్రము శాసనములలో నుదాహరింపఁబడిన గండత్రినేత్రుఁడే వైదుంబులలో స్వతంత్రుఁడైన కడపటివాఁడుగా నుండెను. వానికిఁ బిమ్మట వైదుంబులు చోడరాజగు మొదటిపరాంతకునిచే జయింపఁబడిరి.[2] కళింగదేశమును బాలించుచుండిన గాంగవంశజుఁడగు మూడవ వజ్రహస్తుని పట్టమహిషియగు వినయమహాదేవి యీవైదుంబ రాజవంశములోనిదేయని తెలియుచున్నది.[3]

1. Ep. car. vol intro. p. XX.

1. South Indian Inscriptions vol III. pp. 104. 107.

(2) Ibid. vol II. p 379.

(3) Ind. Ant. vol XVIII. pp. 164 and 175 and Ep. Ind vol. IV. p. 186.

## నలంబరాజవంశము.

ఈనలంబులు త్రినయనపల్లవుని వంశములోని వారమనియు, ఈశ్వరవంశజులమనియుఁ జెప్పుకొని యున్నారని వీరిచరిత్రమును గొంతపల్లవులంగూర్చి వ్రాయఁబడిన ప్రకరణమునఁ దెలిపియున్నారము. వీరిరాజ్య మనఁగా నలంబవాడిరాజ్యము బళ్లారి, కడప, కందనోలు, మైసూరుమండలములలోఁ జేరియున్నది. వీరికి బళ్లారిమండలములోని ఉత్సంగిదుర్గము రాజధానిగనుండెను. ఈనలంబవాడి రాజ్యము క్రీ. శ. ౭వ శతాబ్దము మొదలుకొని ౧౦శతాబ్దమువఱకు వర్ధిల్లినదిగాని యీరాజులచరిత్రమంతయెక్కువగాఁ దెలియరాదు. వీరు రాష్ట్రకూటులకులోఁబడిన సామంతులనితోఁచుచున్నది. ఆంధ్రచోడులకును, నలంబులకును, వైదుంబులకును బూర్వము నలంబవాడి,మహారాజవాడి,రేనాడు దేశములను బరిపాలించినవారి చరిత్రమును సంగ్రహముగాఁ దెలిసికొనవలసియున్నది. ఈమూడుభూభాగములిప్పుడు అనంతపురము,కడప,కర్నూలు,బళ్లారి జిల్లాలని పిలువంబడుచున్నవి. ఈమండలములుగల ప్రదేశమంతయును తొమ్మిదవ పదవశతాబ్దములలో నాంధ్రచోడులు, నలంబులు, వైదుంబులు పరిపాలించిరి. వీరికిఁ బూర్వమీప్రదేశముల నెవ్వరెవ్వరు పాలించిరో కొంచెముగాఁ దెలిసికొనవలసియున్నది. ఈదేశమంతయుఁ గ్రీస్తుశకము రెండవశతాబ్దాంతమువఱకు నాంధ్రభృత్యుల పరిపాలనమునందుండెను. ఇదంతయుఁ గర్ణాటముగనుండెను. ఈగర్ణాటమును శాలివాహనవంశజుండును నాంధ్రుఁడు నగుహారితిపుత్త్రశాతకర్ణి రాజ ప్రతినిధిగనుండి పరిపాలనము చేసెను. వీని శాసనములు మైసూరురాజ్యములో షిమొగమండలములోని షికార్పూరుతాలూకాలోస్థానకుందూరుకడనున్నవి.[1] ఆంధ్రచక్రవర్తియైన గోతమిపుత్త్రిశాతకర్ణికుమారుఁడయిన పులమాయియొక్కనాణెములు మైసూరుమండలములోని చిత్రదుర్గముకడగానిపించినవి. ఆంధ్రరాజులయిన శాతకర్ణులచే జయింపఁబడి పరిపాలింపఁబడినదగుటచేతనే యీభాగమున కంతకును గర్ణాటమనుపేరు వచ్చినది. ఆంధ్రులకుఁ దరువాత నీ

(1) ఈ చరిత్రములోని ౨౨౫వ పుటచూడుఁడు.

2. Mysore, II. 428; (3) Mysore. II. 51



దేశము కదంబుల వశమయ్యెను. ఈప్రాచీనకదంబులు జైనమతావలంబకులు. ఉత్తరకర్ణాటములోని వనవాసిగాక ఇప్పటి బళ్లారి మండలములో హార్పనహళ్లి తాలూకాలోనున్న ఉత్సంగి దుర్గమొక ప్రధానపట్టణముగానుండెను. దీనికి నాలుగుమైళ్లదూరమున మైసూరు సరిహద్దులోనున్న అనాజియను ప్రదేశమున నాలుగవశతాబ్దములోని దైకదంబులకును కాంచీపురపల్లవులకును జరిగినయుద్ధమును దెలిపెడిశాసనమొకటి గానిపించినది.[1] హీరాహడగల్లియను ప్రదేశమున శివస్కందవర్మయను పల్లవుని శాసనమొకటి గన్పట్టుటచేత నాకాలమునందతఁడీ ప్రదేశమును జయించి పరిపాలించెనని చెప్పఁదగును. ఆఱవశతాబ్దమునందు చాళుక్యులీదేశమునకుఁ బ్రభువులయిరి. రెండవపులకేశివల్లభునిశాసనమొకటి బళ్లారిమండలములోని కురుగోడుగ్రామముకడనున్నది. చాళుక్యులీప్రదేశమును జయించినపుడు కదంబులకులోఁబడి యీదేశములోఁ గొంతభాగమును బరిపాలించుచుండిన నలరాజులను కీర్తివర్మమహారాజు నాశముఁజేసెను. తరువాత మొదటివిక్రమాదిత్యుడు అనంతపురమండలములో మడకసిరతాలూకాలో నున్నరత్నగిరి గ్రామములోని కొంతభూమి నొకబ్రాహ్మణునకు దానముచేసి శాసనము వ్రాయించెను. ఆశాసనములో నీప్రదేశము నలవాడివిషయములోనిదని పేర్కొనఁబడియుండెను. చాళుక్యులు మొట్టమొదట జైనమతావలంబకులుగ నుండిరి. తరువాత పౌరాణిక మతమవలంబించిరి. క్రీ.శ. ౭౫౭ వ సంవత్సరప్రాంతమున రాష్ట్రకూటులు చాళుక్యులు సామంతులయిరి. ఈచాళుక్యులలో నొక కొందఱు బళ్లారిమండలములోని కోగలినాడు (హడగల్లి హార్పనహళ్లితాలూకాలు) పాలించుచుండిరి. ఆకాలమునందే కొంతభాగము నలంబులనియెడు పల్లవులవశమయ్యెను. దీనినే నలంబపాడియని పిలిచిరని పైనిజెప్పియుంటిమి. ఈనలంబులు రాష్ట్రకూటులకు లోఁబడియుండిరి. ఆంధ్రచోడులాఱవశతాబ్దమునుండి స్వతంత్రులై పదవశతాబ్దమువఱకును బాలించిరిగాని కడపటిభాగమునందు రాష్ట్రకూటులకు లోఁబడిన సామంతమాండలికులుగ నున్నట్లే గన్పట్టుచున్నది. వైదుంబరాజులును గొంతకాలము రాష్ట్రకూటులకును దరువాత చోడులకును లోఁ

(1) Mysore. I of 492.

బడియుండిరి. బాణరాజులు గాంగపల్లవులకు లోఁబడియుండిరి. మైసూరులోని తలకాడు రాజధానిగ గాంగవాడిదేశమును బరిపాలనము సేయుచుండిన మారసింహుఁడను పశ్చిమగాంగరాజు నలంబకులమును నిర్మూలముఁజేసి నలంబకులాంతకుఁడని పేరు పొందెనఁట[1] ఈపశ్చిమగాంగులుకూడ నాకాలమున రాష్ట్రకూటులకు లోఁబడినవారుగానేయుండిరి. పదవశతాబ్దాంతమునందు రాష్ట్రకూటులనుజయించి త్రైలోక్యమల్లుఁడనుపశ్చిమచాళుక్యుఁడు మరల దేశమును స్వవశముఁ జేసికొనియెను. చోడులు పశ్చిమగాంగులను జయించి వారియధికారమును నిర్మూలముఁజేసిరి.

తరువాత రెండుశతాబ్దములకాలము పశ్చిమచాళుక్యులకును చోడులకును వశమై యుభయపక్షముల వారికిని రణరంగభూమియై యొప్పుచుండెను.

## విష్ణుకుండినవంశము.

విష్ణుకుండినులమని చెప్పుకొనిన రాజులశాసనములు రెండుమూడు మాత్రము గానంబడుచుండినవిగాని వీరియుదంతమేమో యెచ్చటనుండివచ్చినవారో యేకాలమునందున్నవారో స్పష్టముగాఁ దెలియరాదు. పూర్వచాళుక్యులు వేంగికళింగదేశములను జయించుటకుఁ బూర్వమీ విష్ణుకుండినులు కళింగదేశములో నేభాగముననో పరిపాలనము సేయుచుండినవారని తోఁచుచున్నది. ఈవిష్ణుకుండినవంశమునకు మూలపురుషుఁడు మాధవవర్మయని పేర్కొనంబడియెను. ఈవిష్ణుకుండిన మహారాజగు మాధవవర్మకును వాకటకరాణికిని జనించినవాఁడు విక్రమేంద్రవర్మ. వాకటకులు చేదిదేశమును (Central Provinces) బరిపాలించుచుండిన యొకతెగరాజులుగనుండిరి. వీరిలోఁ బ్రవరసేనుఁడు ప్రఖ్యాతుఁడు. విష్ణుకుండినుఁడయిన మాధవవర్మయు బహుప్రసిద్ధిగలవాఁడుగఁ గన్పట్టుచున్నాఁడు. ఇతఁ డశ్వమేధాదియాగములను మాత్రమెగాక పురుషమేధములనుగూడఁ జేసినట్లుగఁ జెప్ప బడియెను. తండ్రి విష్ణుకుండినవంశములోనివాఁడును తల్లి వాకటకవంశములోనిదియు నగుటచేత విక్రమేంద్రవర్మ యుభయకులాభరణుఁడని పిలువంబడియెను. విష్ణుకుండినులలో విక్రమేంద్రవర్మ

1. Mysore. I, 307.



యను పేరు వహించినవారిలోఁ నితఁడే మొదటివాఁడు. ఇంద్రవర్మయనియెడి యింద్రభట్టారకుఁడు వీనికొడుకు. పైఁజెప్పినశాసనములలో రెండు వీనివిగానున్నవి. ఇయ్యవి విజయనగరమునకు సమీపమునందుండిన యొకపండితకుటుంబమువారినుండి గైకొనఁబడినవి గనుక పరిశుద్ధమైనవిగానున్నవి.[1]

ఈయింద్రభట్టారకుఁడు నిర్వక్రపరాక్రముండయిన మహాయోధుఁడని యభివర్ణింపఁబడియుండెను. విష్ణుకుండినులు సింహముద్రికయును సింహధ్వజమును గలవారుగనుండిరి. శ్రీపర్వతేశ్వరపాదారాధభక్తులమని విష్ణుకుండినులు చెప్పుకొనిరి. శ్రీపర్వతము శ్రీశైలమే యనియు, వీరలు శైవమతావలంబకులనియును డాక్టరు కీల్‌హారన్ గారు నుడువుచున్నారు. ఇంతియగాక విష్ణుకుండినుల శాసనములువ్రాసినవారియొక్క స్వభాష తెలుగగుటంజేసియు శ్రీపర్వతేశ్వరుని పాదారాధకులమని చెప్పుకొనియుండుటంజేసియు విష్ణుకుండిశబ్దము వినుకొండశబ్దమూలమున ధ్వనించుచుండుటఁజేసియు, విష్ణుకుండినులకు మొదట గుంటూరుమండలములోని వినుకొండ రాజధానిగనుండెనని తాము దృఢముగా విశ్వసించుచున్నామని కీల్‌హారన్ గారు నుడువుచున్నారుగాని యింకను విచారణీయము. ఇంద్రభట్టారకుఁడనియెడి యీయింద్రవర్మ తనపరిపాలనముయొక్క ౨౭వ సంవత్సరమున పూ (కి) రాష్ట్రములోని పేరువాటక (పేరువాడ) యను గ్రామమును దానముచేసియుండెను. ఈపూ (కి) రాష్ట్రము కుబ్జవిష్ణువర్ధన మహారాజుయొక్క చీపురుపల్లి శాసనమునగూడ నుదాహరింపఁబడినది గనుక నిది విశాఖపట్టణమండలములోనిదిగాని యన్యముగాదు. కాఁబట్టి వీరిరాజ్యము మొదట విశాఖపట్టణమండలములోనిదై యుండవలయునుగాని గుంటూరు మండలములోనిది గాదు. ఇంద్రవర్మ తననివాసపురము పురణిసంగమని తెలిపియుండెను. ఇది యెక్కడిదో గుర్తింపనలవిగాకయున్నది. ఇంకను మఱొక చిక్కు గన్పట్టుచున్నది. ప్రభాకరమహారాజకుమారుఁడగు పృథ్వీమూలునియొక్క గోదావరిశాసనము

1. ఇయ్యవి బ్రహ్మశ్రీ గురుజాడ అప్పారావు పంతులుగారివలన సంగ్రహింపఁబడి దొరతనమువారి పరిశోధనాధికారికిఁ బంపఁబడినవి.

Annnul Report on Epigraphy 1909 para 62

లో ఇంద్రభట్టారకునిపదభ్రష్టుని జేయుటకై అధిరాజేంద్రవర్మ కొందఱు రాజులను గూర్చుకొని తాను నాయకుఁడుగా నేర్పడి కుట్రచేయఁ బ్రయత్నించెనని చెప్పఁబడియుండెను.

కుబ్జవిష్ణువర్ధన మహారాజుయొక్క ద్వితీయపుత్త్రుఁడును జయసింహవల్లభమహారాజుయొక్క తమ్ముడునునైన ఇంద్రభట్టారకుఁడు క్రీ. శ. ౬౬౩వసంవత్సరమున రాజ్యమునకువచ్చి ౭మాసములు మాత్రము పరిపాలనముచేసెను. డాక్టరుఫ్లీటుగారు పృథ్వీమూలునిశాసనములోఁ బేర్కొనఁబడిన యింద్రభట్టారకుఁడితఁడేయనియు, అధిరాజేంద్రవర్మగంగవంశజుఁడై కళింగనగరము రాజధానిగాఁ గళింగదేశము నేలిన యింద్రవర్మమహారాజనియు, వీరికి జరిగిన యుద్ధములో ఇంద్రభట్టారకుఁడు మరణమునొంది యుండవచ్చుననియు, ఆకారణముచేత నతనిపరిపాలనమాఱుమాసములలోనే ముగిసిపోయినదనియు డాక్టరుఫ్లీటుగారు వ్రాసియున్నారు. అట్లూహించుటకొక కారణమునుగూడ నుడివియున్నారు. ఇంద్రభట్టారకునికుముదము సుప్రతీకముపై నధిష్ఠించియుండిన యొకానొకయింద్రాధిరాజుచేఁ గొట్టఁబడెనని చెప్పఁబడియుండుటంజేసియు, నైరుతిదిక్కునందలి యేనుగునకు కుముదమనియు, ఈశాన్యదిక్కునందలి యేనుగునకు సుప్రతీకమనియు, నామములుండుటంజేసియు, చాళుక్యులు నైఋతిదిక్కునందలివారును, గాంగులీశాన్యదిక్కునందలివారు నగుటంజేసియు డాక్టరుఫ్లీటుగారు ఇంద్రభట్టారకుఁడు చాళుక్యరాజనియు, అధిరాజేంద్రవర్మకళింగనగరాధిపతియనియుగుర్తించుచున్నారు. డాక్టరుకీల్‌హారన్ గారివాదమునేగైకొనియింద్రభట్టారకుఁడు విష్ణుకుండినుఁడయిన యింద్రభట్టారకవర్మమహారాజేయని సిద్ధాంతముచేసియున్నారు. ఎందుకన విష్ణుకుండినుఁడయిన యింద్రభట్టారకుఁడు తనయేనుఁగులబలముచే నితరచతుర్దంతములను జయించినవాఁడని తనశాసనమునందుఁ గొనియాడంబడియుండెను. ప్రాక్దిశాధిపతియగు నింద్రునియైరావతమునకు చతుర్దంతములేక చవుదంతియను నామముగలదు. సామాన్యముగానీనామమె తూర్పుదిక్కునందలి యేనుఁగులకన్నిటికిని వర్తించును. గనుక నీచతుర్దంతముల కథిపతియైన కళింగనగరాధిపతియైన అధిరాజేంద్రవర్మను జయించినవాఁడీ విష్ణు



కుండినుఁడయినయింద్రభట్టారకుఁడేయని చెప్పుచున్నారు. ఇందేదిసత్యమో యేదియసత్యమో నిర్ధారణ చేయఁజాలకున్నారము.

ఈ యింద్రభట్టారకవర్మకొడుకు విక్రమేంద్రవర్మ, ఇతఁడీ పేరుగలవారిలో రెండవవాఁడు. ఈరెండవవిక్రమేంద్రవర్మశాసనమొకటి గోదావరిమండలములోని తునిజమీందారిలోనున్న చిక్కుళ్లయను గ్రామమునందు దొరకినది.[1] వీనిశాసనము లెందులూరు (దెందులూరు) నుండి ప్రకటింపఁబడినది. ఈదెందులూరు గ్రామమిప్పటి యేలూరుపట్టణమునకు మూడుమైళ్లదూరమునయున్నది. ఇది పూర్వము వేంగిపురములోని యొకభాగముగానుండెను. ఇతఁడును తనతండ్రివలెనే శ్రీపర్వతేశ్వరపాదారాధకుఁడనని చెప్పుకొనియుండెను. తనపరిపాలనముయొక్క పదవసంవత్సరమున గ్రీష్మఋతువులోని యొనిమిదవపక్షమున పంచమీతిథియందు నేత్రపాటివిషయములోఁ గృష్ణానదీతటంబున రావిరేవ గ్రామమునకు నాగ్నేయమూలనున్న రేగొండ్రగ్రామమును సోమగిరీశ్వరనాథుని దేవాలయమునకు ధారపోసెను. విక్రమేంద్రవర్మకు దెందులూరు రాజధాని యని చెప్పియుండుటయు, కృష్ణానదీతటంబుననుండిన గ్రామమును దానమును జేయుటయుఁజూడఁగ గోదావరికృష్ణానదులకు నడుమనుండిన వేంగిదేశమున కధిపతియని స్పష్టపడుచున్నది. చాళుక్యులు ౭వ శతాబ్దము మొదలుకొని యాప్రదేశమును జయించి పరిపాలించుచుండినవారని మన మెఱుంగుదుము. కాఁబట్టి విష్ణుకుండినులంతకుఁ బూర్వమీదేశమును బరిపాలించుచుండిన వారయియుండక తప్పదు. అట్లు కాదేనివిక్రమేంద్రవర్మ చాళుక్యులకులోఁబడిన యొకమాండలికుఁడైయుండవలయును. భావిపరిశోధనముల వలనంగాని నిజముదేటపడదు.

## కళింగముయొక్క పూర్వచరిత్రము.

గాంగులనుగూర్చి తెలుపుటకుముందు పూర్వచరిత్రమునుగూర్చి కొంచెము చెప్పవలయును. భరతఖండమునంగల దేశములలో నెల్లఁగళింగదేశము బహుపురాతన ప్రసిద్ధిగలదిగఁ గన్పట్టుచున్నది. బ్రాహ్మణుల వాఙ్మయమునందును బౌద్ధులవాఙ్మయమునందును కళింగదేశము ప్రశంసింపఁబడినది. రామా

1. Ep. Ind vol. IV. pp. 193, 194, 195.

యణ మహాభారతములు కళింగదేశమును బేర్కొనియున్నవి. పాణిని తనవ్యాకరణసూత్రములయందు గళింగము నుదాహరించియున్నాఁడు. రఘువంశాది కావ్యములలో గళింగ మభివర్ణింపఁబడినది. కళింగాంధ్రములు రెండును నేఁడు గలిసియున్నను పురాతనకాలమున వేఱ్వేఱుగ నుండినవి. అయిన నన్యోన్యమైత్రియు అన్యోన్యసంబంధ బాంధవ్యములను గలిగి వఱలుచుండినవి. దక్షిణాపథమునకు వచ్చుటకు ముందార్యు లీదేశమునకు వచ్చియుండిరికాని యాకళింగార్యులను భ్రష్టులనుగా భావించియుండిరి. కళింగదేశము బుద్ధునికాలమునందే బుద్ధధర్మమును స్వీకరించి బుద్ధునికడుగులు మడుగులొగ్గుచుండినట్లుగఁ గన్పట్టుచున్నది. ఆర్యులాంధ్ర ద్రావిడమహారాష్ట్రదేశములవలెనె కళింగదేశమును భ్రష్టమైనదిగాను మ్లేచ్ఛదేశముగాను భావించుచుండిరి. సుప్రసిద్ధమైన మహేంద్రపర్వత మీదేశమునను న్నది. ఈదేశము దంతావళములకుఁ బ్రసిద్ధికెక్కియున్నది. పూర్వకాలంబున కళింగదేశము ప్రసిద్ధములయిన రేవుపట్టణమును గలిగియుండుటచేత దీనికిని విదేశములకును వర్తకవ్యాపారములు విరివిగా జరుగుచుండెను. కళింగరాజులకును సింహళరాజులకును సంబంధబాంధవ్యములు నన్యోన్యమైత్రియుఁ గలవని బౌద్ధులచరిత్రములు వేనోళ్లఘోషించుచున్నవి. కాఁబట్టి కళింగదేశముయొక్క ప్రాచీనస్థితి ప్రఖ్యాతమైనదనుటకు సందియము లేదు.

అడవియేనుఁగులను మచ్చిక చేసికొనుటయందును తత్త్వశాస్త్రపఠనమునందును కాళింగులు బహునిపుణులనియును నాగరికులనియును క్రీ. పూ. ౩౦౨ వ సంవత్సరప్రాంతమున మౌర్యచక్రవర్తియగు చంద్రగుప్తుని యాస్థానమందుండిన మెగాస్తనీసను యవనరాయబారి వ్రాసియున్నాఁడు. 'మఱియు నఱువదివేల కాల్బలమును, ఒకవేయి యాశ్వికబలమును, ఏనూఱులు దంతావళములు రాజునకు రక్షకసైన్యముగ నుండెననియుం జెప్పియున్నాఁడు. క్రీ. పూ ౨౬౦ దవ సంవత్సరమున చంద్రగుప్తుని మనుమఁడగు అశోకవర్ధనమహాచక్రవర్తి కళింగదేశముపై దండెత్తివచ్చి కళింగమునుజయించెను. కాళింగులు వెనుదీయక మహాపౌరుషముతో నెదుర్కొని వానితో యుద్ధముఁజేసి లక్షలకొలది రణభూమి



కిఁ బ్రాణములర్పించుకొనిరి. లక్షలకొలది కాళింగులు మాగధులచేఁబట్టువడిరి. క్రూరసంహారమునంతయుఁ గన్నులారఁ జూచిన యీమహాచక్రవర్తి తరువాత తలపోసికొని నిరపరాధులును నాగరికులునయిన సాధుజనులకు నిష్కారణముగా విపత్తు ఘటింపఁజేసితినిగదా యని పశ్చాత్తప్తుఁడై మిక్కిలి దుఃఖించి ‘‘అహింసాపరమోధర్మ’’ మను బుద్ధునివాక్యమును జ్ఞప్తికిఁ దెచ్చుకొని యాబుద్ధధర్మము నవలంబించి బౌద్ధుఁడై తరువాత బౌద్ధమతమును ప్రపంచమునందంతట బ్రకటింపఁ జేసెను. క్రీస్తునకుఁ బూర్వము రెండవశతాబ్దమధ్యమున ఖారవేలుఁడను కళింగరాజు శాతకర్ణియను నాంధ్రరాజుతోడ్పాటుతో మగధరాజగు పుష్యమిత్రుని నోడించి యుత్కలములోని ఖండగిరియందు శాసనమువ్రాయించెను. ప్లీని మొదలగు చరిత్రకారులుగూడ కళింగమును బ్రశంసించియున్నారు.

తరువాత నీకళింగమాంధ్రచక్రవరుల రాజ్యమునకు వశమయ్యెను. ఆంధ్రులకుఁ బిమ్మట పల్లవుల పాలఁబడియెనని తోఁచుచున్నది. క్రీస్తుశకము నాలుగవశతాబ్దమధ్యమున గుప్తచక్రవర్తియగు సముద్రగుప్తుఁడు కళింగముపై దండెత్తివచ్చినప్పుడు కళింగము పెక్కుభాగములుగ విడిపోయి పెక్కండ్రు రాజులచేఁ బాలింపఁబడుచుండెను. కొత్తూరుదుర్గమును స్వామిదత్తుఁడును, ఈరండపల్లను (ఈరదవిషయము) దమనుఁడును బాలించుచుండిరి. (ఇవి రెండును గంజాముజిల్లాలోనివి.) దేవరాష్ట్రమును కుబేరుఁడును, అవముక్తసీమను నీలరాజును బాలించుచుండిరి. (ఇవి రెండును విశాఖపట్టణ మండలములోనివి.) పిష్టపురము మహేంద్రవర్మ పరిపాలించుచుండెను. (ఇది గోదావరిమండలములోనిది) కాఁబట్టి యివన్నియును గళింగములోనివి. మఱియును బల్లవులలో చండవర్మ నందప్రభంజనవర్మయను రాజులీ కళింగదేశమును బాలించిరని పల్లవులనుగూర్చిన ప్రకరణమునం దెలిపియుంటిమి. ఏడవశతాబ్దమునఁ గళింగము గాంగులవశమయ్యెనని గన్పట్టుచున్నది. అయినను పులిందులీదేశమును గొంత కాలము బాలించినట్లు గాన్పించుచున్నది.

## పులిందులపాలనము.

### మాధవవర్మ.

కళింగదేశ నివాసియగు పులిందసేనుఁడనువాఁడు బహుపరాక్రమ వంతుఁ

డయ్యెను స్వప్రయోజనపరుఁడుగాక దేశమును బాలించుటకుం దగినప్రభువు ననుగ్రహింపుమని బ్రహ్మనుగూర్చి తపస్సుచేసెను. బ్రహ్మ వానితపస్సునకు మెచ్చి శైలోద్భవునిఁ బుట్టించెను. ఇతఁడు శైలములోనుండి పుట్టినవాఁడు గనుక వీనికి శైలోద్భవుఁడని పేరు పెట్టెను. ఈశైలోద్భవుఁడు కళింగమును బాలించెను. వీనికి రణభీతుఁడు పుట్టెను. రణభీతునకు సైన్యభీతుఁడు పుట్టెను. సైన్యభీతునకు మాధవవర్మ జనించెను. ఈరాజేంద్ర మాధవేంద్రుఁడు శివభక్తుఁడు, ఇతఁడు హారితగోత్రుఁడును తైత్తిరీయశాఖా బ్రాహ్మణుఁడును వామనభట్టు మనుమఁడును ఆదిత్యదేవుని కుమారుఁడునగు భట్టవామనునకుగుడ్డవిషయములోని పుష్యాపినగ్రామమును సూర్యగ్రహణసమయమున దానముచేసెను. ఈమాధవవర్మ నివాసము కయింగోడయనునది. కుండభోగికుమారుఁడగు ఉపేంద్రసింహునిచే నీశాసనము వ్రాయఁబడినది. మాధవవర్మ యేకాలమునందలివాఁడో వీనియుదంతమేమో యింతకన్న మనకేమియునుఁ దెలియరాకయున్నది.

## హూనుత్సాంగు.

ఏడవశతాబ్దమధ్యమునందు హూనుత్సాంగు కళింగమును జూడవచ్చి యప్పటిదేశస్థితి యిట్లు దెలిపియున్నాఁడు.

ప్రాచీనకళింగముయొక్క రాజధానీనగరము ౫ మైళ్ల వైశాల్యముగలిగియున్నది. భూమి సారవంతమై క్రమముగా వ్యవసాయము చేయఁబడుచున్నదిగాని యేనుఁగులతోఁగూడిన యడవులనేకములుగలవు. జనులు మోటుగ నాగరికులుగనుండి భయంకరముగనున్నను మాట దప్పనివారుగను విశ్వాసపాత్రులుగనుండిరి. పూర్వకాలమునందు కళింగమొండొరుల బుజములు రాపాడునంతటి జనసమ్మర్దముగలిగి యుండెను. అప్పటికిఁ గళింగదేశముయొక్క పూర్వవైభవమంతయుఁ బోయినది.

## కళింగగాంగవంశము.

ఏడవశతాబ్దమునందే కళింగదేశము గాంగులవశమయ్యెను. బ్రహ్మయొక్క నాలవతరము వానికి గంగాదేవి యనుగ్రహించినందున నొక్కకుమారుఁడు గలిగెను. వాని సంతతివారు గాంగులయిరి. వీరు మొదట మైసూరు



రాజ్యములోని తలకాడు రాజధానిగ గంగవాడిదేశమును బాలించుచుండిరి. తరువాతవారిలో నొకశాఖవారు కళింగదేశమునకువచ్చి మహేంద్రగిరిని జయించి యీదేశము నాక్రమించుకొని పరిపాలింపసాగిరి. ఈకాలమునందే దక్షిణకళింగమును కుబ్జవిష్ణువర్ధనుఁడు జయించెను. తరువాత నాభాగము పూర్వచాళుక్యులచేఁ బరిపాలింపఁబడుచుండెనని విశాఖపట్టణమండలములోని చాళుక్యుల శాసనములే వేనోళ్ల ఘోషించుచున్నవి. కనుక గాంగులు కళింగదేశముయొక్క యుత్తరభాగమునుమాత్రమె పరిపాలింపుచుండిరి. అన్యోన్యసంబంధమేమియుఁ గానరాకయుండిన మొదటి గాంగులయొక్క నామములును వారి దానశాసనములును, గంజాము, విశాఖపట్టణ మండలములలోఁ బెక్కుతావులఁ గానంబడుచున్నవి. ఇంద్రవర్మ, దేవేంద్రవర్మ, అనంతవర్మ, గుణార్ణవవర్మ మొదలగు వారిశాసనము లనేకములు గానంబడుచున్నవి. వీరలు మహేంద్రగిరిపైనుండు గోకర్ణస్వామి పాదారాధకులుగ నుండిరి.

## కళింగనగరము.

కళింగనగరము వీరికి రాజధానీనగరముగనుండెను. కొందఱు తలంచునట్లు గంజాము మండలములో సముద్రతీరమునందుండిన కళింగపట్టణము కళింగనగరముగాదు. ఈకళింగనగరము పర్లాకిమిడికి నిరువది మైళ్లదూరమున వంశధారయొడ్డుననున్నది. అది యిప్పుడు ముఖలింగమను పుణ్యక్షేత్రముగానున్నది. ఇక్కడ మధుకేశ్వరాలయము, అణ్యాంక భీమేశ్వరాలయము, సోమేశ్వరాలయములను మూడు ప్రసిద్ధములయిన శివాలయములున్నవి. ఈశివాలయములలో గాంగులయొక్క శాసనము లనేకములుగలవు. ఈక్షేత్రమునకు దక్షిణమున రెండు మైళ్లదూరమున నగరికటకమను గ్రామముగలదు. ఈగ్రామములనడుమశాసనలంగలిగియుండిన రాతిపలక లనేకములుగలవు. శిథిలమయిపోయిన పురాతనభవనములయొక్క చిహ్నము లిప్పటికిని గానంబడుచున్నవి. అచ్చటి శివాలయములలోని శాసనములలో నాపట్టణము కళింగనగరమనియె పేర్కొనంబడియున్నది.

